



రెండవ ముద్రణ



గ్రంథకర్త

శ్రీ పడాల రామారావు

చందానారాయణ శ్రేష్ఠి
విద్యావిషయక ప్రకాశకులు
సికింద్రాబాదు, హైద్రాబాదు, వరంగల్.

1962 .... వెల రూ. 5-00

# అంకితం

'అమరుడు'

అనుమర్లపూడి సీతారామరావుకు

---

చిన్నారి పొన్నారి చిరుత కూకటి నాడు
భూస్వామిచే తండ్రి హత్యకాగ
నూనూగు మీసాల నూత్నయౌవనమున
రైతునాయకునిగా రాటుదేరి,
చౌకళించెను నిండు జవ్వనావేశాన
జాతీయ రణమున జాగిలముగ,
ప్రౌఢ నిర్భర వయఃపరిపాకమందున
తెల్లదొరల చెరసాల మ్రగ్గి,
ప్రాయముడిగిన వెనుక స్వారాజ్యవేళ
మరల చెరబెట్టి మననల్లదొరలు నెవని
జాలిలేకుండ నక్కడే చంపినపుడు
పలవరించితి నెవరికై పక్షివోలె!

"ఏ సాధనం వల్ల
తెల్ల దొరలు
మన జాతిని
పారతంత్ర్యంలో
అణచి వుంచారో
ఆ సాధనం వల్లనే
మనం
స్వాతంత్ర్యాన్ని
సాధించుకోవాలి."

- అల్లూరి సీతారామరాజు

# కృతజ్ఞత

*శ్రీ నందమూరి తారక రామరావు,
త్రివిక్రమరావుగార్లకు.

ఒకరు అసిధారులు కళాభిరంగమందు,
ఒకరు అసములు నిర్మాణరంగమందు,
చూడ నిరువురు రసికులు, సాహసికులు,
గాక నెవ్వరి తరము నాకథను తీయ?



* నా 'సీతారామరాజు' కథను 10 లక్షలు ఖర్చుపెట్టి, అనేక కష్టనష్టాల నెదుర్కొంటూ, చిత్రంగా నిర్మిస్తున్న సోదర ద్వయం.

" విప్లవం నా జన్మ హక్కు "

—అల్లూరి సీతారామరాజు.

# ఉపక్రమణిక



శతాధిక గ్రంథకర్తల గ్రంథాల్లో ఏదో ఒక్క గ్రంథానికే ప్రసిద్ధి వస్తుందని పెద్దలంటారు. అది నిజమేమో అనిపిస్తూంటుంది.

కారణం —

నా రచన లిప్పటికి 64 ముద్రించబడ్డాయ్, యీ ఏడాదిలో ముద్రించబడేవి 8 ఉన్నాయ్. వీటన్నిటిలో నాకు ప్రఖ్యాతిని తెచ్చి పెట్టినది - సీతారామరాజు చరిత్రమే !

నా "సీతారామరాజు పితూరీ" నాటకం అయిదు ముద్రణలు చూచింది. ఆంధ్రశ్రీ — ఇప్పుడు మీరు చూస్తున్నది. రెండవ ముద్రణ భాగ్యాన్ని పొందింది.

ఎవడైతే తన కవోష్ణ రుధిరం చిందించి, దారి పొడుగునా గుండెనెత్తురులు తర్పణ చేసి, భారతమాత కరనిగళయుగ దానిస బంధనాల్ని త్రెంచడానికి తనువు త్యజించాడో ఆ అచ్చపు తెలుగు బిడ్డ పవిత్రగాథను అనేకమందికి వినిపించాను.

కంటిపై కునుకునీ, ఆకలితో అరచే ప్రేగుల్నీ అణచుకొని ఆవేశంతో గుండెను క్రొవ్వత్తిలా కరిగించి, ఆ వెలుతురులో నేను చేసిన అన్వేషణ ఫలించింది.

అందుకే నే నెంతగానో గర్విస్తుంటాను.

"కష్టే ఫలే !" అన్నారు పెద్దలు. ఆరేండ్లు చారిత్రక పరిశోధనలో, తెలుగులోనున్న కొద్ది గ్రంథాలూ, ప్రభుత్వంవద్ద ఇంగ్లీషులో నున్న కొద్ది డాక్యుమెంట్లు, రిపోర్టులూ అధ్యయనం చేసి, మన్యం అంతా మూడేండ్లు తిరిగి, రాజు మాతృమూర్తినీ, సోదరుణ్ణీ, బంధువుల్నీ, ఆయన వీరసహచరుల్నీ కలుసుకొని, నేను చేసిన యీ కృషి

సార్థక మైంది. తెలుగు ప్రజలు యీ "ఆంధ్రశ్రీ"కి విశేషాదరణను కలుగజేసారు. వా రందరికీ నా హృదయపూర్వక అభివందనాలు.

అయితే, మొదటి ముద్రణము చదివిన పాఠక మహాశయులు అనేకమంది అనేక సూచనలను చేశారు. వాటి ననుసరించి యీ రెండవ ముద్రణలో సవరణ చేద్దామనుకున్నాను. కాని, సమయం చిక్కనందుకు ఎంతైనా చింతిస్తున్నాను. సవరణ చేయక 2-వ పేజీ యందు..."తండ్రి (కణ్వమహర్షి) శకుంతలను ఆశ్రమంనుండి గెంటి వేశాడు"...లాంటి పెద్దతప్పులు అలాగే వుండిపోయాయి.

అంతేకాదు, యీ నవల ముద్రణసమయంలో నేను దగ్గర లే నందువలన తప్పులు ఎక్కువగా దొర్లాయి. వీటన్నిటికీ నేను మిమ్మ క్షమాపణ వేడుకుంటున్నాను. ఎట్టి పరిస్థితిల్లో నైనా సరే, మూడవ ముద్రణలో వీటిని నేను సవరించుకుంటానని మనవి చేస్తున్నాను.

నా కోరిక :—

వేదాంత కోవిదుడైన శ్రీ సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు అన్నారు : "ఎవరైతే ఇహంలో ఎదుటివాని బాధను తన బాధగా గుర్తించి, ఒక కన్నీటిబిందువును రాల్చగలుగుతారో వాళ్లు పరంలో వజ్రకిరీటధారణకు అర్హులు" అని.

ఈ నవల ఆద్యంతమూ చదివి, ఒక ఉత్తమ దేశభక్తుని ఆత్మ శాంతికోసం, అలా ఒక కన్నీటిబిందువును విడువగలిగిన కరుణాహృదయు లందరికీ నేను సదా కృతజ్ఞుడనై యుంటాను.

ఇక చదవండి ! తమ అమూల్యాభిప్రాయాలను తప్పకుండా పంపించండి !

— పడాల రామారావు.



# 1

"ఏదే దేశం?" అని మీ రడిగితే,

"మహాభారతం" అని గర్వంగా చెప్పుకుంటా.

"ఆ పేరెలా వచ్చింది?" అని వెంటనే మీ రడగొచ్చు.

అదిగో! అక్కడే వుందో పరమరహస్యం.

వినండి!

పుణ్యం పాపంనుండే వుద్భవిస్తుంది. కాని అజరామరమై ఖండ ఖండాంతర ఖ్యాతి నార్జిస్తుంది. పద్మం పంకిలంనుండే ఆవిర్భవిస్తుంది. కాని పవిత్రమై మధుర మకరంద సుగంధ సౌరభాతిశయంతో విశ్వతోముఖమై విరాజిల్లుతుంది.

అలాగే

తుచ్ఛ సంభోగంకోసం తపోధన విసర్జనకే సిద్ధపడ్డ విశ్వామిత్రునికీ, తపోభంగంకోసం శరీరాన్నే అమ్ముడుపోయిన తైతక్కలాడి మేనకకూ మధ్య జరిగిన రతిలో జనించింది శాకుంతల.

కాని—

ఒకరోజు వినోదార్థమై వేటకై వచ్చి, కణ్వాశ్రమంలో ప్రవేశించిన కామాంధుడైన దుష్యంత చక్రవర్తి మాయమాటలలో, విషపు చూపులలో, వాడి చేతులలో, ఆ ఆశ్రమంలో కణ్వమహర్షి పెంపున పెరుగుతున్న అతి సుందర సుకుమారి శాకుంతల-అనాఘ్రాణిత పుష్పం నలిగిపోయింది...

పొత్తికడుపు వొచ్చిందా పూబోడికి, మూడు నెలలు భరించింది.

కాని—

మందగించిన నడక వికసించిన కోరికలు, పాలిపోతున్న చెక్కుటద్దాలు, మట్టివాసన కొడుతున్న పెదవులు ఆమెకు శత్రువులయ్యాయ్. ఆ రహస్యాన్ని బయలుపెట్టాయ్. ఛాదస్తానికి, మూర్ఖత్వానికి బానిసైన పెంపుడు తండ్రి శాకుంతలను చీదరించాడు. ఆశ్రమంనుండి గెంటివేసాడు. ఇక ఆ హైందవకన్యకు 'దిక్కెవరు? పెండ్లికాని పిల్లనైనా లోకం కనికరిస్తుంది కాని పెండ్లికాని తల్లిని కనికరించలేదు. పైగా కన్నెర్ర చేస్తుంది. పాపమా, గాయపడ్డ లేహృదయాన్ని ఎవ్వడోదార్చగలడు?

"పతియే ప్రత్యక్షదైవం!" అని హైందవ సాంప్రదాయం చెబుతోంది. తండ్రి కాదన్నా, భర్త కాదనలేడనే విశ్వాసం ఆమెకు కనిపించి వెంటనే ఆశ్రమం వొదిలిపెట్టి దుష్యంత చక్రవర్తి దర్బారుకొచ్చింది.

కాని—

కామతృష్ణ తీర్చుకున్న దుష్యంతుడు, అధికార దురహంకారంతో, ధనమదాంధకారంతో, ఒక పవిత్ర భారత స్త్రీమూర్తిని నిండు కొలువుకూటంలో నిర్లక్ష్యించి, తన పశుబలంతో, గెంటించివేశాడు. అందుకే అధునాతన కాలగర్భంలో చక్రవర్తులు శాశ్వతంగా కలిసిపోయారు.

పాపం శాకుంతలపై సమస్తం పగబూనింది.

చలించలేదు—శాకుంతల.

త్రిమూర్తులనే పసిపిల్లలుగా చేయగలిగిన భారతస్త్రీ ఆమెలో నూతనోద్రేకాన్ని నూరిపోసింది. ఆమె విషాదవదనం వికసించింది.

దీక్షతో, పట్టుదలతో, ఆ సామాన్య పావన స్త్రీమూర్తి ఒక సుముహూర్తాన, చక్రవర్తులనే తలదన్నిన, బిడ్డడ్ని కన్నది.

తూరుపుకొండలు జేవురించాయ్. లోకం ఎర్రబారింది. చిరుత ప్రాయంలోనే. సింహం జూలుపట్టి చెరలాటలాడగలిగిన మొనగా డయ్యాడు బిడ్డడు - ఆ బిడ్డడే భరతుడు—

ఆ భరతుని పేరుతోనే, నా దేశం మూడు పువ్వు లారు కాయ లుగా దినదిన ప్రవర్ధమానమై పరిఢవిల్లింది.

అయితే నా దేశం "మహాభారతం! అని ఎందుకన్నానంటూరా?

నా దేశానికి స్వరూపంలో హద్దులున్నాయ్ గాని స్వభావంలో లేవు. నా మహాభారత—హృదయం! - నిరంతరరాగరంజితమైంది. కుంటుతున్న మేకపిల్లను చూచి జాలిపడి, తన భుజస్కంధాలపై మోసుకొని వెళ్ళగలిగిన శాక్యముని హృదయాన్ని సంతరించుకు న్నట్టిది. ఇట్టే కరిగిపోయే స్వభావం దానిది.

మేధస్సు, తాత్వికుల కతీతం. సర్వకాల సర్వావస్థలను కొలిచి పడిగట్టగల గౌతముని న్యాయదర్శనాన్ని ఆకళింప చేసుకున్న ధర్మ కాటా అది.

శీలం, త్యాగపరాయణం మానవునికోసమే, గాక ఆపదలలో నున్న పక్షినైనా రక్షించడానికి, శరీరాన్ని ముక్క ముక్కలుగా కోసి, ఫణమొడ్డిన శిబిచక్రవర్తి త్యాగశీలతను జీర్ణించుకున్నట్టి దది.

ప్రాణం-విశ్వమానవకోటి సుఖ శాంతులు, స్వేచ్ఛా సౌభా గ్యాలు వూపిరిని పోసుకొని జీవించడమే దాని ప్రాణం మృత్యువును కూడా జయించగల శక్తివంతమైనది.

నైజం, రాత్రింబవళ్ళు ఎనభైకోట్ల చేతులతో యంత్రం లా కష్టించి, పనిచేసి, తన నలభైకోట్ల పొట్టలను మాత్రమే నింపుకొని, మిగిలిన సంపదను, ఫలాపేక్షారహితంగా, దానం చేయగల శ్రామిక జాతి ధర్మ బుద్ధిని మేళవించుకున్నట్టిది.

దాని నాడి నొక్కరా?

'బుద్ధం శరణం గచ్ఛామి!'
"ధర్మం శరణం గచ్ఛామి!"
"సంఘం శరణం గచ్ఛామి!"

అంటూ కొట్టుకొంటుంది.

"ఎక్కడ దరిద్రముంటుందో అక్కడ దేముడే లేడు" అని ఘోషిస్తుంది.

ఎవడైనా దురాగతానికి తలపడ్డాడా ?

"పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే !"

అంటూ, ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో పాంచజన్యం పూరిస్తుంది.

ఇదీ దాని వేదాంత చింతన.

దాని నైసర్గిక స్వరూపం భయంకరం. మిన్నంటిన మహోన్నత హిమాలయ శ్రేణులు; కంచుకోటల్లా, నిత్యం దాని వుత్తర హద్దులను కాపాడుతుంటయ్. శత్రుదుర్భేద్యమైనవి. ఇక తూర్పు, దక్షిణ, పడమర హద్దుల్ని లోతైన, గంభీరమైన మూడు సముద్రాలు రక్షిస్తుంటయ్. ఎటువంటి బలవత్తర దుష్టశక్తినైనా అవి పొంగి, పోశెత్తి ముంచెయ్యగల శక్తి సమన్వితాలు.

పైన పర్వతాలూ, చుట్టూ అపార పారావారం ఆక లనక, కునుకనక, రాత్రింబగళ్లు అలా దేనికోసం పహారా ఇస్తున్నాయని మీ సందేహమా ?

మనం బయటికెడితే, ఇంటికి తాళం వేస్తాం—

కారణం. ఇంటిలో సామానులున్నాయి కాబట్టి తాళం లేకపోతే అవి పోతాయి కాబట్టి,

అయితే నా దేశానికి తాళాల్లేవు. అవి నిత్యం బాహాటంగా తెరిచే వుంటాయ్.

కాని లోన పెన్నిధిలున్నాయ్. అందుకే ఆ కాపలా, ఆ రక్షణ.

సస్యశ్యామలమైన భూములున్నాయ్. ఆ భూముల చేతులకు నరాలు లేవు. రెండుచేతులతో నిత్యం దానం చేస్తుంటాయ్. నలభై కోట్ల నోళ్ళకు నిత్యం అన్నం అందిస్తుంటాయ్. మానవుని కెంతో విన

ప్రమమై వుంటాయ్. పండి, తలలు వొంచి, మా కృషీవలుల హస్తా లలో పొదిగిపోతాయ్.

ఆ భూముల్లో పసిడి పాతరలున్నాయ్. కాశ్మిక్ కిరణాలను మాత్రమే తినగలిగిన మా వృక్షసంతతి తను తినగా మిగిలిన, కిర ణాలను తన వ్రేళ్ళగుండా భూమిలోకి పంపి, బంగారాన్ని సైతం సృజిస్తుంటాయ్,

అందుకే, అదెంతటి విలువైన భవంతైనా, ఒక వృక్షానికి అడ్డువచ్చిందా? వృక్షం తలగాక, అహంతో నిలచిన భవంతి తలే ఎగిరిపోతుంది.

అంతటి ప్రకృతి సౌందర్యోపాసన మా భారతీయుల సొత్తు.

ఎటు చూచినా, మీకు నవ్వుతున్న ముఖాలూ, వికసిస్తున్న పుష్పాలూ కనబడతాయి.

అది మానవత్వాన్ని పొంగించుకున్న అమృతసంచయం—దాని సౌందర్యం అజంతా, ఎల్లోరా, సాంచీ, నాగార్జున, లుంబినీ, పర్వత కుడ్యాల్లోనూ, కొండగుహల్లోనూ వుంది.

అచటి కళానిక్షేపాలూ, శిల్ప ఖజానాలు, నా జాతి సంస్కృతీ చిహ్నాలు. నాజాతి జీవనాడులకు నెత్తు రక్కడనుండే అందుతుంది.

ఆ నెత్తురుతోనే నా దేశంలో వీరులు పుట్టారు.

అందుకే దాని చరిత్ర వింటే రోమాలు నిక్కబొడుస్తాయ్. శరీరం జలదరిస్తుంది, మేను పులకరిస్తుంది.

"బానిసగా చచ్చి వీరులుగా పుట్టండ"ని వీరసందేశమిచ్చి సాధించగలిగిన ఉత్తరాన పురుషోత్తముడు లగాయతు, దక్షిణాన వీరపాండ్యన్ వరకూ దానిబిడ్డలే.

"స్వతంత్రం మా జన్మహక్కు"ని తిరుగబడగలిగిన ఝాన్సీ రాణి లగాయతు, సీతారామరాజు వరకూ దాని ముద్దుబిడ్డలే.

అలా అని 'శాంతి' కోసం సర్వస్వం ఒడ్డగలిగిన క్షాత్ర తేజ స్వులు లేరనుకోకండి!

ప్రపంచానికంతటికి, కంచుదివ్వె చూపి, తొలిసారిగా 'శాంతి' అని గర్జించగలిగిన మహాచక్రవర్తి అశోకుని లగాయతూ బ్రహ్మ నాయన వరకూ నా జాతివారే.

ప్రాక్పశ్చిమాలు రెండూ, యీ నాడు 'శాంతి' 'శాంతి' అని ఘోషించడానికి వూపిరి నిచ్చింది—నాజాతివారు కావడం, నా వంశంవారు కావడం నా కెంత గర్వం.

మహాగర్వం సుమండీ!

ఇన్ని స్వర్ణ చరితలూ, జీవ సంస్కృతులు, సప్తసంపదలున్న దేశం మరొకటి లేదేమో ననిపిస్తుంది.

కాని లాభమేంటి ?

నడుమంతరంలో దానికి నిత్య దరిద్రం దాపురించింది - నడు మంతరంలో ఏదొచ్చినా నిలవదంటారు కదండీ - మీబోటి పెద్దలు! పోనివ్వండి! కానున్నది కాలమే తీర్చి తీరుతుంది

ఇది స్థూలంగా నా మహాభారత స్వరూపం, స్వభావం.

అటువంటి మహాభారతానికి మణిపూస తెలుగుదేశం.

ఇది తెలుగుబిడ్డల మాతృగడ్డ.

బ్రిటిషు కీచకులు పెట్టిన కృత్రిమ హద్దులను భేదించుటకు పోతేనేగాని మీరా తెలుగుగడ్డ త్రొక్కలేరు. చూడండి! నా మహాభారతానికి దక్షిణంగా వుంది. చెన్నరాష్ట్రం - నిజానికి చెన్నరాష్ట్రు లనే జాతివారెవరూ యిక్కడ లేనప్పటికీ - జాతితో నిమిత్తంలేని ధృతరాష్ట్రులు దీనిని సృష్టించారు. ఇందులోనే ఆంధ్ర, తమిళ, కేరళ జాతులు బంధించబడ్డాయి.

ఈ చెన్నరాష్ట్రంలో మీరు పాదం పెట్టగానే, మీకు ముందే తగులుతుంది - ఆంధ్రదేశం - సర్వ సంపదలూ దాని సొత్తు. ఇంచు మించు యింగ్లండు దేశమంతటి జనాభాను యింగ్లీషు దొరలు యిక్కడే వుక్కుగొలుసులతో బంధించారు.

కాని, ధైర్య సాహస పరాక్రమ విక్రమాలకు పుట్టినిల్లయిన ఆంధ్రదేశం వుక్కుగొలుసులను త్రెంచుకోడానికి వుప్పెనలా పొంగిం

దొక రోజున. మహాభారత చరిత్రలోనే, ఒక జాతి, యింతటి ఘన చరిత్రను సాధించి వుండలేదు. భారతదేశం అనేక మహోద్యమాలు నడిపింది. బెంగాలు విభజనోద్యమం, ఖిలాఫతు వుద్యమం, విదేశ వస్తు బహిష్కరణోద్యమం, శాసనాల్లోంఘనోద్యమం, ఆఖరికి ఆగష్టు విప్లవోద్యమాలుకూడా, ఆంధ్ర మహోద్యమానికి సాటి రావు.

ఆనాడు, ఒక్కొక్క ఆంధ్రుడు ఒక్కొక్క పోటెత్తిన మహా సముద్రమైపోయాడు. సీతాకోక చిలుకల్లా తయారైన శృంగార యువతులు కూడా, పూలశయ్యలపై, హంస నడకలతో, వేసే అడుగులకే నలిగిపోయే పాదాలతో కదంత్రొక్కి, ఆంధ్రోద్యమ కదన రంగంలో ప్రథమశ్రేణిలో నిలబడి, సన్ననిగొంతుల్ని విప్లవావేశంతో పెకల్చి, చెవులు చిల్లులుపడేలా రొదెత్తి, ఎలుగెత్తి చాటారు.

పిండితే పాలుగారే, పసికందులుకూడా, పోలీసు లారీలను ఎక్కడికక్కడే ఆపుచేసి, 'జై ఆంధ్ర' అనిపించి మరీ పోనిచ్చారు. భారత చరిత్రలోనే తొలిసారిగా, పోలీసుల వుక్కుటోపీలను తీయించి, శిరస్సు మోడ్పించిన ఘనత తెలుగు బాలురదే అయిపోయింది.

ఆనాడు రాజ్యాంగ యంత్రమే స్తంభించిపోయింది. తుప్పు పట్టిన, బ్రిటిషు దొరలు బంధించిన సంకెళ్ళు పట పటా పగిలిపోయాయి. మహాంధ్రోదయమైంది. చెన్నరాష్ట్రం పేరు భారతదేశ పఠంలో చిరస్థాయిగా చెరిపేశారు - ఆంధ్రులు. ఇప్పుడు ఆంధ్రజాతి ముక్కోటి బిడ్డల పసిడిగడ్డ.

రండి! మీరు చూడాల్సిందీ, వినాల్సిందీ యీ పసిడిగడ్డలోనే వుంది. అదిగో, అటు ఒరిస్సారాష్ట్రాన్ని, మధ్యపరగణాలకు మధ్య ఇటు విశాఖ, వుభయ గోదావరీల కానుకొని గుండెకాయలా వుంది - చూసారూ ?

# 2

ఇదిగో! ఇదే మన్యం. పై కిదెంత నవనీతమో - లోనంత బడబాగ్ని. నిజానికిది తెలుగుదేశానికో నందనవనమే. ఇదెంత మనోహర సుందర ప్రదేశమో చూడండి.

స్వేచ్ఛా వసంతమారుతం ప్రత్యూషపుటంచులను తాకుతోంది. నదీనగ పుష్ప ఫలవృక్ష సముదాయమైన ఆ మన్యపు నందనవన వర్చస్సు సర్వతోముఖ శోభతో తొణికిసలాడుతోంది. నవ ప్రఫుల్ల పూరితమైన ఆ నందనవన మేనిపై అప్పుడప్పుడే ప్రసరిస్తున్న వసంతభానుని నులువెచ్చని వేడికిరణాలు పడి చక్కిలిగింతలు పెడుతున్నాయి. ఆ సువర్ణ కాంతులకు, చెట్ల నూగిసలాడుతున్న పండ్ల గుత్తులు దగధగా మెరుస్తున్నాయి. ఆ వసంతవనాలకు పసందుగా పగిలి, పసిడిఛాయలు గుప్పిస్తున్న పనసతొనలు మధురాతిమధురములైన నవ్యరుచుల నెగజిమ్ముతూ నోరూరింపచేస్తున్నాయి. మంచి గంధపు తరువులు హృదయోల్లాస సువాసనలను వ్యాపింప చేస్తున్నాయి. ఆహా! ఇవన్నీ మీకో ప్రమోదమైన మధురానుభూతిని స్మృతిపథంలోకి తేవడం లేదూ?

ఆనాడు ఆ వనదేవత సర్వాభరణాలంకృతయై చిలకాకు పచ్చని చీర ధరించి, నవ యౌవ్వనంతో మురిసిపోతున్నట్టుంది కదూ? స్వభావాన్ని పరిశీలించడానికి ఇంద్రనీలాల్లా కాంతి పుంజాలను వెదజల్లుతున్న నేరేడుపండ్లే చాలు. ఆ పండ్లపై పూత ఆ వనదేవత ముఖ విషాద చిహ్నాలను చూపే నలుపుపూత కాదు. శాంతిని సూచించే పై నీలకాంతీ, క్రాంతిని సూచించే లో అరుణచ్ఛాయలూ ఆ వన దేవత శాంతి, క్రాంతి స్వభావాల్ని మాత్రం వుద్దీపింప చేస్తున్నాయి.

రెమ్మ రెమ్మనా, ఆకు ఆకునా, పండు పండునా పడివున్న హిమబిందువులు, ఆ సువర్ణ కిరణ ప్రసరణకు నవరత్నాల్లా మెరిసిపోతున్నాయి. వెలగఫలాల పైనున్న హిమబిందువులు వజ్ర వైఢూర్యాల్లాగనూ, నేరేడుపండ్ల పైనున్నవి ఇంద్రనీలాల్లాగనూ, గులాబీల

పై నున్నవి మాణిక్యాల్లాగానూ, పనసపండ్ల మేనిపై నున్నవి మర కతాల్లాగానూ, దాని విచ్చిన తొనలపై నున్నవి గోమేధికల్లాగానూ తళ తళ లాడుతూ తరింపచేస్తున్నాయి.

ఆ నందనవనంలో విహరిస్తున్న గండు తుమ్మెదల ఝుంకా రాలు వీణారావాల్లా మ్రోత పెడుతున్నాయి. వాలినవాటిపై వాలకుండా, ప్రతి పుష్ప మకరందాన్నీ గ్రోలుచున్న ఆ తుమ్మెదలు భరత నాట్యం కూడా చేస్తున్నట్టున్నాయి. కాని అవి సంపంగి సుమ ముల చేరువకైనా చేరడం లేదు. పైగా వాటినిచూచి చీకటిలా పారిపోతున్నాయి, అలా ఎందుకు పారిపోతున్నాయంటారా ? వాటికవి ఎర్రగా దీప శిఖల్లా కనబడి చావును గుర్తుకు తెస్తూ వుం డొచ్చు. ఎరుపును చూచి, పరశ్రమాధారులైన మానవులే హడలెత్తి పోతోంటే, ఇవి భయపడ్డం ఓ లెక్కంటారా ?

ఆ పసిడిపాతరలాంటి నందన వన మధుర . ఫలాల నాస్వా దిస్తూ మహదానందంతో ఒక కోకిల రెక్కలు రెప రెప లాడిస్తూ, మోర పై కెత్తి 'కో...కో...!' అని స్వాగత గీతాలు పాడుతోంది. దాని స్వాగత గీతాలు, క్రింద పొలాల్లో రక్త స్వేదాలను ధార పోస్తూ కృషిస్తున్న శ్రమ జీవులను వెక్కిరిస్తున్నట్టున్నాయి. సరిగ్గా చూడండి ! ఆ శ్రమజీవులు, తమ తలలు పైకెత్తి, చూపుడువ్రేళ్లతో స్వేదాన్ని విదల్చి ఏదో అంటున్నారు. మీరు అవధాన విద్య వచ్చి వుంటే, చెప్పండి ! ఆ వారి పెదవుల కదలికను బట్టి ఏమనుకుంటుం డొచ్చో ?...ఏం చెప్పలేరూ ?

'నీ తస్సాదియ్యా ! నీవు పుట్టుకనుండీ పరభృతానివే. నిన్ను రెక్కలొచ్చేవరకూ పోషించిన కాకులను రెక్కలు రాగానే కాల దన్నావు. తల్లిపాలు త్రాగి, తల్లి రొమ్ముసే గ్రుద్దిన నీవు, ఇప్పుడు మళ్ళీ మా రొమ్ముపాలు త్రాగడానికి వచ్చావా ? నంగనాచీ ! అనేవాళ్ళంటుంటారు. అవును శ్రమజీవులు ఆ కోకిల గురించి అలా అనుకోవడం సహజమే.

పాపం ! ఆ కోకిలకు తెలియదు. నవనవలాడే తన యీ వసంత కాలం మూణ్నాళ్లేననీ, తరువాత తరుముకు వచ్చే గ్రీష్మఋతు కిరణాలకు సొమ్మసిల్లి పోవలసి వస్తుందనీ దానిని దాటితే హేమంతపు హిమంలో శవంలా బిగుసుకు పోవలసి వస్తుందనీ, నేడు మహదానందంతో పాడుతున్న తాను మళ్ళీ కాలానుగుణమైన పాట పాడవలసి వస్తుందనిన్నీ.

అరెరె ! చూడండి ! ఆ చెట్టును. ఆ నేరేడుపండు రక్తపు ముద్దలా ఎలాగ కనబడుతోందో ! ఆ పండును పొడుచుకు తింటున్న ఆ చిలక చూడండి ! రక్తంతో తడిసినట్టున్న ఆ ఎర్రటి ముక్కుతో 'క్రిష్ణ ! క్రిష్ణ !' అంటూ ఆ తిన్నది అరగడానికి గుటక వేస్తోంది. నిజంగా ఆ దృశ్యం చూస్తే దేముని పేరు చెప్పి పేదల రక్తమాంసాలను తినే దేవురుగొట్టు ముఖాలు గుర్తుకు రావడంలేదూ ?

"మూన్నాళ్ళ ముచ్చటకు
మురిసేవు, తరిసేవు
ముందుగతి కానవే - చిలుకా !"

అంటూ ఆ కొండల మధ్య నదీ స్రవంతి విరుచుకు మీద పడుతోంది. మీకు తెలుసా ! అదే గౌతమీ గోదావరి - వెనుకెప్పుడో ద్వాదశ వర్ష మహాక్షామం వచ్చినప్పుడు అన్నార్తుల కోసం గౌతముడు సృష్టించాడంటారు. ఇదొట్టి కట్టుకథే అనుకోండి. అయితే మనకేం ? యిప్పుడు యీ నదీ జలం మన కుపయోగపడుతున్నది - అటువంటి క్షామ నివారణకేగా ! యీ నది పడమర బొంబాయి రాష్ట్రంలో నాసిక్ వద్ద పుట్టి, దక్కను పీఠభూములగుండా అసలది మన్యంలోకి ప్రవహిస్తోంది.

స్వేచ్ఛా సంచారానికి అలవాటుపడ్డ దాని అలలు ఆ పాపి కొండల మధ్య బంధించబడ్డా, నిరంతరం పోరాడుతూ ముందుకు విజృంభిస్తూనే వున్నాయి. ఆ నదీ స్రవంతీ తుషారాలు ఆ కొండల మధ్య వేరుకున్న నిశీథాన్ని వేటాడుతున్నాయి. వసంతం తిరిగి

వర్షర్తువు వచ్చిందా ? రత్నకంబళి పరచినట్టున్న పచ్చని కొండలు ఆ అలల శిఖరాలను ఎక్కి త్రొక్కినా, ఆ నదీ తరంగాలు నురగలు గ్రక్కుతూ 'స్వేచ్ఛా శక్తికే అవరోధమా ?' అంటూ పళ్ళు పటపట కొరుకుతూ ప్రళయఘోషలు పెడుతూ తమ నిర్బంధాన్ని గూర్చి ఆందోళనతో హోరెత్తి మరీ పోరాటం చేస్తాయి. దూరానికి చూస్తే యిప్పుడే ఆ నదీ స్రవంతుల శక్తివంతమైన వెన్నుపోటులకు చుట్టూ వున్న కొండలు కరిగిపోయి, మెల్ల మెల్లగా కూలిపోతున్నట్టు కనపడుతున్నాయి కదూ ?

ఇక వర్షఋతువులో చెప్పాలా ?—ఆ ఆందోళనా తీవ్రతకు వెన్నుపోటులకు ముక్క ముక్కలుగా కూలిపోతున్న కొండలను చూచి, సూర్యుడుకూడా విరగబడి నవ్వుతాడు. అవును మరి ! తన కిరణ ప్రసరణకు కూడా అవరోధం కలిగిస్తున్న ఆ కొండలు కూలిపోతున్నాయంటే, ఆ సూర్యునికి మాత్రం ఆనందం కాదంటారా ?

ఆ దృశ్యం నిద్రితమానవకోటి వెన్నుచరిచి లేపి ఒక చారిత్రక సత్యాన్ని మన కళ్ళముందుకు ప్రత్యక్షం చేస్తోంది. చూడండి! మానవుడు సుఖజీవితంకోసం తనకు ఆటంకాలుగా వున్న ప్రకృతి శక్తులకు వ్యతిరేకంగా పోరాటధ్వజం ఎత్తాడు. విజయ పరంపరలు చేబట్టాడు. లోకంలో తన్ను పీడించి, పీల్చి, పిప్పిచేస్తున్న శక్తులను నాశనం చేయడానికి తన మహోష్ణ హృదయాన్ని మండించి,కవోష్ణ రుధిరాన్ని చిందిస్తున్నాడు. ఈ నూతన పోరాటంలో సంపూర్ణ విజయాన్ని చేబట్టి, పాత కొత్తల మేలు కలయికతో ప్రతి సృష్టిని చేసే రోజు దగ్గరపడుతోందనేదే - ఆ సత్యం.

ఆ సత్యాన్ని సాధ్యమైనంత శక్తివంతంగా చిత్రించడానికి ఆకలితో అరచే ప్రేగుల్ని అణచుకొని, కనులపై కునుకు మరచిపోయి, మెదడులోని వాడితో, ఆవేశపు వేడితో గుండెను క్రొవ్వొత్తిలా కరిగించి ఆ వెలుతురులో అన్వేషణ చేస్తున్నాడో రచయిత.

అదుగో ! చూడండి ! చీకటి పడిపోతుందని, వెనుదిరగకండి - రండి ! చీకటిలోనే, నిశాంత ప్రశాంతంలోనే, మనకు కావ

లసిందల్లా దొరుకుతుంది. పగటిలో, దొరికేవల్లా నీ మనస్సును, హృదయాన్ని చీకాకుపరిచే నిత్యజీవిత సమస్యలే.

చరిత్ర సత్యంలోని ధగద్ధగాయమాన ధీరోదాత్త ప్రభల్ని వెలికి తీయడానికి ఆ సత్యం మహా సాగరమైనా, ఆ సాగర లోలో తులకంటూపోయి వెతికి దాన్ని పట్టుకోడానికి ఎంత తంటాలు పడుతున్నాడో ఆ రచయిత చూడండి !

మంటని కారుచీకటి క్రమ్ముతుంది. మింట నక్షత్ర కాంతులు మాత్రం మిల మిల మెరుస్తున్నాయి, అదిగో ! ఆ దూరంగా, సునక్షత్ర కాంతులు పడి ఓ పర్ణకుటీరం రజితఛత్రంలా మెరిసిపోతోంది. ఆ కుటీరకాంతుల నాస్వాదిస్తూ చుట్టూవున్న లతానికుంజాలు చిరునగవులు చిందుతున్నయి.

ఆ కుటీరంలో ఓ మూల గదిలో ఓ టేబిలు కనబడుతోంది. దానిపై ప్రక్కనే ఓ డూమ్‌లైటు,ఇంకో ప్రక్క బిగ్ బెన్ వున్నాయి. మధ్య లైటు వెలుతురులో కొట్టివేతలలో నిండిన కాగితాలున్నాయి. ఆ కాగితాలపై రాస్తూ రాస్తూ వున్న ఓ కలం నడక ఆగింది.రాస్తున్నవాడు - రచయిత. ఎంత తీవ్రంగా ఆలోచిస్తున్నాడో చూడండి! బిగ్ బెన్ "టక్...టక్..."మని కొట్టుకుంటూ, ఆతని మెదదులోని సంఘర్షణను ఒంటిగంట పైకి వచ్చినట్టు చూపుతోంది.

చేరువనే ఓ స్తంభానికి, ఆ రచయిత భార్య, చుట్టుకుంటూ సోలిపోయివుంది. పాప మామె, తన ప్రియునితోపాటు,అలా జాగారాలు, నిరాహారాలు చేస్తూనే గడిపేస్తోంది. ఆమె కందులోనే ఓ ఆనందంలా కనబడుతోంది. ఏమైనా ఆమె శరీరం నిప్పులావుండి తీరుతుంది. ఆమె ఏకాగ్రతలోనున్న చూపులన్నీ, తన ప్రియుని, కలం నడకపైనే లగ్నమై వున్నాయి.

రచయిత చేతిలోని కలం నడక ఆగిపోయింది. ఆతని కన్నుల నుండి ఓ కన్నీటికణం, ఆతనికి తెలియకుండానే, ఆ కలం పాళీనుండి కాగితంపైకి పాదరసంలా చర్రున జారిపోయింది.

ఆమెకు హృదయం ద్రవించిపోయింది. సహనాన్ని కోల్పోయింది. అదిగో ! వినండి ! అశ్రురుద్ధ కంఠంతో, ఆ ప్రశాంతానికి అంతరాయం కలుగకుండా ఏమంటోందో ? ఆమె మాత్రం తన ప్రియుని వుద్దేశించి అనడంలేదు. స్వగతంగానే—

"ఎందుకో యీ కవిత్వం ? సద్దణిగిపోయిన యీ నడిరాతిరి, ఆకలితో, తలపగిలే తలపులతో, పద్మవ్యూహం ఛేదించిన అభిమన్యుని లోని ఆవేశంతో, ప్రళయతాండవ నృత్యం చేసిన నిటలాక్షుని ధమరుపు ధ్వనితో, మసలను కనికరించని, కసాయి గుండెలకోసం, మన నెత్తుటిని, కన్నీటిని, గుండెను, అంతటినీ... ఆహుతి చేయడం ఎందుకో..." అని ఏవేవో అనేస్తోంది. ఆ మాటలు ఆమెకు తెలియకుండా తన ముఖద్వారాన్ని దాటిపోతూ, రచయిత చెవులపడ్డాయి.

రచయిత బాధపడ్డాడు.

"శశీ ! " అని ఒక్కసారిగా వురిమాడు.

శశి త్రుళ్ళి బొమ్మయి పోయింది.

రచయిత జాలిగా అన్నాడు—

పోనీలే! మన గుండెల బలిదానం జగత్కల్యాణానికో పచ్చని తోరణం కాగలిగితే సంతోషిద్దాం. మన నెత్తుటి కన్నీరు, పదిమంది సుఖంకోసం వెచ్చని పన్నీరై పొరలితే ఇక మనకు కావలసిందేమిటి? పిచ్చిదానా ? అందరి బాధనూ తన గొంతులో నిలిపి, ఆలపించ గలిగితేనే మహానందం. యిక నిద్రపో ! " అంటూ, శశి నడుముకు తన చేతుల్ని చుట్టి, బుజ్జగిస్తూ మంచంపై పరుండబెట్టి, కాళ్ళవద్ద నున్న దుప్పటిని కంఠంవరకూ కప్పి, తల నిమిరి నుదురు ముద్దు పెట్టుకొని వచ్చి, మరల కుర్చీలో కూలబడ్డాడు. కాని రాయ లేక పోయాడు. కన్నులు మూత పడ్డాయి.

ఆకాశంలో మేఘాలు గుమిగూడాయి.

రచయిత రామం, ప్రియురాలు శశి గాఢంగా నిద్రిస్తూనే వున్నారు.

గుమిగూడిన మేఘాలు ఒక్కసారిగా వురిమాయి. ఆ వురుములు రామంను మాత్రం కదిలించలేవు. శశి కాస్త కదిలింది.

వురుములతోపాటు విపరీతమైన గాలి తుఫానా అన్నట్టు హోరు మని వీచింది.

వురిమే మేఘమే వర్షించాలి - న్యాయంగా. కాని అలాజరగలేదు. అది వసంతఋతు మహిమనుకుంటా. కాని గాలి మాత్రం తుఫానులా విరుచుకుపడి, ఇంటి తలుపులను "ధనా !" మని తన్నివేయడం...టేబిలుపై నున్న రాసిన కాగితాలపై ప్రక్కనేవున్న లాంతరు "టపీ" మని పడి గప్పున వెలుగురావడం, శశి "కెవ్వున" కేకేసి, భగ్గుమన్న వెలుగుపై చేతులేయడం వక్కసారిగా జరిగాయి.

ఈ ధ్వనులకు రామం మెదడు ఝూడించి లేచి, శశి రెండు చేతులూ పట్టుకొని వుద్రేకంతో అన్నాడు—

"శశీ! కరుడుగట్టిన మొరటు సామ్రాజ్యంపై కత్తికట్టి నిప్పులు కురిపించిన మహామొనగాని చరిత్రకావ్యాన్ని కాపాడావ్!"అన్నాడు

ఇంతకీ, కాగితాలు మాత్రం తగులడలేదు. పడిన లాంతరు నుండి వొత్తి దూరంగాపడి భగ్గుమన్న దంతే. ఇక తీరా చూసుకునే సరికి, తను చేతులేసి ఆర్పినది లైటు వొత్తి. కాగితాలే భగ్గుమన్నాయని నిద్రకళ్ళతో వూహించిందంతే.

వెంటనే శశి ఉత్కంఠతో అడిగింది—

"ఎవరా మహామొనగాడు ?"

రామం గోడనున్న ఓ బొమ్మను చూపించి—

"అదిగో ! చూడు. నీ విప్పుడన్నావే, నిటాలాక్షుని ఢమరపు ధ్వని, అభిమన్యుని ఆవేశం అని...అటువంటి ఆవేశాలూ, ప్రళయ తాండవాలూ, ఎన్నెన్నో ఆయనలో వున్నాయి."

శశి నివ్వెరపోయింది. ఆ చిత్రంలోని మూర్తి నిజంగా అంతటివాడు కాకపోతే, రామం ఎందుకంత అహర్నిశలూ శ్రమించి,

జీవితమధనంలోని హాలాహలాన్ని తాను త్రాగి, అమృతాన్ని అంద రికీ అందివ్వాలని ప్రయత్నం చేస్తాడు ?

ఈ ప్రశ్న ఆమెను ఆ చిత్రంవైపు మరింతగా దృష్టి సారింప చేసింది. శశి కన్నులు విరిసాయి. వెంటనే అడిగింది—

" రామరాజా ?" అని.

" కాదు. కిరీటంగల కసాయిరాజును కొండలా ఢీకొన్న కిరీ టంలేని రాజీయన...కాని..." అంటూ రామం గద్గదంగా యింకా ఏదో అనబోతుండగా శశి ఆతురతతో మధ్యలోనే ప్రశ్నించింది - రామం భుజాలు నొక్కిపట్టి—

" కానీ..."

" తల పగులగొట్టుకుంటున్నా, ఆ మహనీయుని చరిత్ర రచ నకు నా వేగం, నాశక్తి చాలటంలేదు శశీ !" అంటూ ఆవేదన పడ్డాడు - రామం,

చేస్తున్నవానికి తట్టనివి, చూస్తున్నవానికి తడతాయి కదండీ ! అందులో స్త్రీబుద్ధి అతి సునిశితం.

వెంటనే అంది - శశి—

"మీరే అనేవారుగా, మన్యంలో రాజుపేరు చెబితే చాలు. గాలిలో గడ్డిపరకలు కూడా పోట్లాడుతాయనీ, ఆయన కధలు చెప్పుకునే టప్పుడు కోయలు తిండే మరచిపోతారని..."

గ్రుడ్డివానికి ఆపరేషను చేసి, కట్టుకట్టి అది విప్పినరోజునఅంత వరకూ చూడని ప్రపంచం ఒక్కసారిగా కనబడినవాడిలా - రామం ఒక్కసారిగా పొంగిపోయాడు.

అమాంతంగా శశిని కౌగిలించుకున్నాడు—

" బాగా జ్ఞాపకంచేసావ్ - శశీ ! నిజంగా నా భావాలగనివి. అవును. అక్కడికే వెళ్ళి నేనీ చరిత్ర రాస్తా !" అని వెంటనే పైకి లేచాడు.

మీరడగొచ్చు ! 'కోయవాళ్ల నడిగి చరిత్ర రాసేదేమిటని ?'

అదే మీ ప్రశ్న అయివుంటే చాలా పొరపాటుపడతారు. అసలా పొరపాటుకు కారణం మీరు కాదనుకోండి. చరిత్రనేది ఏ నవాబులదో, రాజులదో, చక్రవర్తులదో అని ఆ నవాబుల్ని, రాజుల్ని, చక్రవర్తుల్ని గద్దెదించిన ధైర్య సాహస పరాక్రములైన ప్రజలది కాదని, కాగితాలు ఖరాబుచేసి, మీ హృదయాలను మలినంచేసి, మీ బుర్రలకు మసిపూసి మారేడుకాయ చేసిన చరిత్రకారులననాలి.

కాని యథార్థం గుర్తించగలిగినవాడే ప్రగతిశీలి. ఆ కోవకు చెందినవాడా రచయిత కాబట్టి నేరుగా వర్రిజలవద్దకే బోవ నుంకించాడు. రామం లేచాడో లేదో, శశి—

"నేనూ వస్తా !" అంటూ రామంచేయి పట్టుకొని లేచింది.

"వద్దు మన్యం ! కీకరారణ్యం !" అని భయపెట్టాడు.

"మీ నీడలోనా నాకు భయం?" అని ఎదురు ప్రశ్నించింది శశి.

కాదని యింకా ఏవేవో పులి, పుట్ర, పాము, పురుగు కథలు చెప్పి ఆపుచేయాలనుకున్నాడు రామం.

"నేను మీకూడా లేకపోతే మీ భావాలేగనిలోంచి తీస్తారు?"

అన్న విచిత్రప్రశ్నకు రామం నవ్వి లొంగిపోయాడు. త్రోవ చూపుతున్న నక్షత్రి కాంతిలో ఆ సతీపతులు పయనమయ్యారు.

ఇక చూడండి - ఆ సతీపతుల సత్యాన్వేషణ.

వారినో దివ్యశక్తి నడుపుతోంది. ఒక మహాకాంతి త్రోవచూపుతోంది. వారిని నడిపే శక్తిగాని, త్రోవచూపే కాంతిగాని, మీకూ నాకూ కనబడదు.

పొదలను, గుట్టలను దాటి, ఒక కూడలి చేరారు. కాని వారి ప్రయాణం గడుమన్యానికి. మన్యంలోనే, మరీ మారుమూల వెనుకబడిన ప్రాంతాన్ని గడుమన్య మంటారులెండి. కొత్తవాడు వెళ్ళాడా? మలేరియా నిలువునా తినేస్తుంది. గ్రీష్మంలోనే అక్కడ మంచు కురుస్తుంది. ఏ గుంటలోనో, ఏ సెలవలోనే చేయిపెట్టామా? బదరీనాథ్ వెళ్ళిన మన పెద్దలు చెప్పినట్టు, చేయి శిలైపోతుంది - అంటే అంత చలి.

3)

# 3

రామం, శశిలు కూడలిచేరి గమ్యాన్నిచేరే బాటకోసం నిరీక్షిస్తు న్నారు. వాళ్ళ భుజాన్ని రెండుమూటలున్నాయి. చలి కొరుక్కు తింటోంది. అదిగాక కారుచీకటి. చీమ చిటుక్కుమనడం లేదు. పైగా కీకరారణ్యం. ఈలోపులో ప్రక్క పుంతలోనుండి, ఓ రెండెడ్ల బండి ఆ కూడలి చేరింది. వాళ్ళకు ప్రాణాలు లేచివచ్చినట్ల యింది. వాళ్ళకంటే ముందే బండివాడు ప్రశ్నించాడు—

'ఏ వాడ పోతారు బా?'

'కృష్ణదేవుపేట !'

'రండి బా ! నా బండిపోతది!' అని బండివా డనగానే, వాళ్ళ ఆనందానికి మేరలేదు.

శశీ రామంలు ఆ ఆనందంతో ఒకరి మొఖం ఒకరు చూచు కున్నారు.

'అలా చూస్తురేం బా! పాపం ఏడనుండో కటిక చీకటిలో వత్తుంన్రు ! ఇంత రేతిరికాడ ఏడపోతారుబా ! నా బండి కాళీగా పోతుందిగా బా!' అన్నాడా బండివా డాప్యాయంగా.

రామం కళ్ళలో పువ్వులు, శశి కళ్ళలో వెన్నెలా విరిసింది.

రామం, శశితో విరిసిన కళ్ళతోనే అన్నాడు—

'చూసావా! శశీ! కల్లాకపటం లేని ఆ కోయదొర హృదయం!'

బండివాడందుకొని—

'ఇదేం భాగ్గింభా! నా బండి ఎట్లాగూ పోతది. అయ్యోరి నందాకా ఎక్కిస్తేనే భాగ్గిం పోతదా బా!' అంటూ, బండిదిగి, వారిని చేజేతులా బండెక్కించి, 'థిర్, బస్సప్పా!' అని ఖంచా విదళించే టప్పటిక్కి ఎడ్లు దౌడుతీసాయి.

ఆకాశంలో మబ్బులు కూడా చెదరిపోయి, మార్గాన్ని తేట తెల్లం చేసాయి. బండి వెడుతోంటే, రోడ్డు వెనక్కి పరుగెడుతోంది, మానవుని పురోగమనధాటికి, ముసలికాలం వెనక్కి పారిపోతున్నట్టు.

బండిలోనున్న శశికి, ఆ చలిగాలి, చెవులను చిల్లులు పొడుస్తున్నట్టుగా వుంది. అసలే అతి మృదువైన శరీరం. లంగాపై చుట్టు తిరిగిన వాణీ వీపువైపు వ్రేలాడుతూ, గాలిలో రెపరెపలాడుతోంది. ముందురులు పిట్ట రెక్కల్లా ముఖానికి కొట్టుకుంటున్నాయి.

బండ సాగిపోతోంది.

రాను రానూ లోకం తెల్లవారుతోంది.

యౌవ్వనంలోనున్న ప్రకృతి కాంత. వొళ్ళు విరుచుకుంటూ, సూర్యోదయాన్ని ఎదురుచూస్తోంది. సూర్యుడామె వన్నెల చెలికాడు. సూర్యదర్శనంతో ఆ కాంత నవనవోన్మేష వుత్సాహ తరంగ డోలికల నోలలాడుతుంది. తన చెలితో సయ్యాటలాడుతున్నట్టు సూర్యుడింకా కొండలచాటున నక్కాడు. ఎంత సూర్యుడు కొండల చాటున నక్కినా, ప్రకృతికాంత పసిగట్టింది. అతని సప్తరంగుల, సహస్రకిరణ కాంతుల వెలుగులు ఆమెపై బడ్డాయి. వెంటనే వువ్వెత్తుగా లేచి, ఆ కిరణ కరాలను పట్టుకుంది. గత్యంతరం లేక, సూర్యుడు చిందులు త్రొక్కుతూ. ఆ ప్రకృతికాంతముందు బాలుడై, ప్రాగ్మండలాన్ని ప్రత్యక్షమయ్యాడు.

తన్మయానందంలో రామం శశితో—

"చూచావా, శశీ! ఇక్కడ ప్రకృతి సౌందర్యం కళ్ళకుకట్టినట్లెలా తొణికిసలాడుతోందో?" అంటూ ఆనందంగా, శశిని లేవనెత్తి, బండి కొయ్యలు పట్టుకొని, ప్రకృతిశోభను చూపుతున్నాడు.

ఆనాడు ప్రకృతిలోని శక్తులన్నీ పరవశం చెందినట్టున్నాయి. బాటగుండా నిటారుకొండలు ఎంతో మనోనిబ్బరంగా, దృఢంగా, సగర్వంగా ఆకాశాన్ని చుంబిస్తూ నిలబడి, ఆ బండిపై వస్తున్న ఆ ఆగంతకులకు సౌహార్ద్రపూరితమైన స్వాగతాన్నిస్తున్నట్టున్నాయి.

బండి రెండు కొండల బారుల మధ్యనుండి ఓ వంతెన దాటి, పల్లంలోనుండి, దడదడలాడుతూ పరుగులెడుతూంటే, ప్రక్కనే నాట్యంచేస్తూ ప్రవహిస్తున్న నిర్ఝరులు పోటీపడుతున్నట్టున్నాయి. ఓ ఎత్తయిన కొండపైనుండి ఆ దృశ్యం చూస్తోంటే, పరమశివుని

కంఠంలో, కటిపై, సర్వాంగసుందరంగా ఎగబ్రాకుతూ సయ్యాట లాడుకునే నాగేంద్రాల్లా కనబడుతున్నాయి. ఆ నిర్ఝర ప్రవాహానికి ముందు, ఆ బండి, నాగభూషణుని ప్రియమైన నాగేంద్ర శిరములా గిర్రున పరుగులెడుతున్నట్టుంది. ఆ బండిపై బండివాడు, రామం, శశిలు ఆ నాగేంద్రుని శిరస్సులోనున్న మూడు మణుల్లా ప్రకాశిస్తున్నారు.

ఆ బండి, తన హృదయ కవాటాలు అరమరిక లేకుండా విప్పారించిన మన్యం మహాసౌధంలోనికి నేరుగా, నిరాటంకంగా సాగిపోతోంది.

ఆ సాగిపోతున్న బండిని చూస్తూ దారిప్రక్కనే, ఓ పల్లె వికసించిన వదనారవిందంతో వీక్షిస్తోంది. ఆ పల్లెనుండి శృంగార గ్రామిక కృషీధ్వనులు, జయధ్వానాలు చేస్తూ, ఆ బండిని సాగనంపుతున్నట్టున్నాయి. ఆ ధ్వనుల్లో, సర్వమానవ ప్రపంచానికి, వస్త్రదస్త్రాల నందించి, సొగసుగత్తెలకు చీని చీనాంబరాల నందించే, మగ్గం పగ్గం లాగుతున్న చేనేతగానిముందు పలకలో, కోలాహలంగా గంతులేస్తూ, నాట్యంచేసే నాడికదముల గజ్జెల చప్పుడూ, లోకాల కన్నదానము చేస్తున్న అన్నదాతల అర్ధాంగులు, ఆరుబయట 'సువ్వా! సువ్వా!' సంగీతం తీస్తూ నవధాన్యాలు దంచుతున్న రోకటి ధ్వనులూ, కృషీవలుల కేరింతాలలో, వ్యవసాయానికి సాగుతున్న గోగణ సముదాయం గంగడోలుల నూగిసలాడుతూన్న గంటల గణగణారావాలూ అన్నీ మిళితమై వున్నాయి.

రామం శశితో మహా సంబరంగా అన్నాడు—

'చూడు, శశీ! నిజంగా మన్యం ప్రేమలుపూసే ఆనంద సంధాయకమైన మహోద్యానవనంలా లేదూ?' అంటూ, శశి అందాన్నంతటినీ పుణికిపుచ్చుకొని, ఆమె చుబుకానికి, చెక్కిళ్ళకూ మధ్య నిలిచిన పుట్టుమచ్చపై జాలుగా చేయి విసిరాడు.

చటుక్కున బండి, ఓ గుంటలో గతుక్కున పడింది. శశి రామం వక్షంపై పడింది.

క్రమేణా బండి, ఒక కొండలబారుకు ఆనుకొనివున్న ఓ పెద్ద కారడవి, కాలిబాటలా కనబడుతున్న పుంతలో ప్రవేశించింది.

సూర్యభగవానుడు తన గమనంలో మూడవవంతు నప్పుడే అతిక్రమించాడు. అనూరుడు 'చక్' మని కంఘా ఝళిపించగానే, ఆ సహస్రాశ్వ సమేతమైన సూర్యరథం తన పరుగును తీవ్రతరం చేసింది. వాడి, వేడి హెచ్చింది. అయినప్పటికీ, దట్టమైన ఆ కీకరారణ్యంలో ఆ వేడి, ఆ బండికి సోకడమేలేదు.

భీతావహం కలిగించే ఆ క్రూరమృగ నివాసభూయిష్టమైన కీకరారణ్యంలో చొర శక్యంగాని పొదలను చీల్చుకుంటూ డప్పుల చప్పుడు వినబడుతోంది.

బితుకు బితుకుమంటున్న శశి గుండెలు ఆ చప్పుడుకు కాస్త కుదుటపడ్డాయి. ఆ చప్పుడు ఒక కొండ నంటిపెట్టుకునే ఆ కొండ దిగువనుండి, కొండపైకి ఓంకారధ్వనిలా ఎగబ్రాకుతూ వస్తోంది.

ఖంగారుపడుతున్న ఆ జంటతో, బండివాడన్నాడు—

'ఇది మా కోయోళ్ళ వేటలేబా! మాసర్దాగా వుంటదిబా!' అని. దానితో మరీ నిబ్బరంచెందాయి వారి గుండెంలు.

ఆ రోజు, ఓ గ్రామస్తులు సమిష్ఠి వేటకెళ్ళారు.

'సమిష్ఠి వేట సాముదాయక సమాజలక్షణమేకదా! అయినప్పుడు యీ మన్యంలో సంపదంతా ఏ కొద్దిమంది చేతుల్లోనో వుండిపోయిందనీ, ఆర్థికంగా ప్రజలనెత్తిన బరువుమాత్రం అధికమైందనీ, ఏదేదో... వేడినెత్తురు పొంగే యువకులంటారుకదా? అది శుద్ధ తప్పన్నమాట?' అని మీరనొచ్చు.

అదీ ఒకదశలో నిజమే, నేడీమన్యం భూస్వామిక నిరంకుశ పాలనలో సతమతమవుతున్నా, ఆభూస్వామిక యుగానికి పూర్వపు లక్షణాలైన సముదాయక చిహ్నాలింకా మిగిలేవున్నాయి. చూడండి! మీరు మీ యింటిలో ఓ నూతనమార్పును ప్రవేశపెట్టారనుకోండి. అంతమాత్రాన మీ పూర్వాచారాలన్నీ ఒక్కసారిగా మంట గలిసి

పోతాయా మరి! సాధారణంగా, ఒక భవిష్యత్కాలపు సమాజం. వర్తమాన గర్భంలోనే పెరుగుతుంది. అలాగే భూతకాలపు సమాజ లక్షణాలు వర్తమానంలో అణిగిమణిగి, చోటు చేసుకొని వుంటాయని మీరెందుకు గుర్తించరూ? వర్తమానం కాలంకూడా, భూతకాల గర్భంలోంచి జనించిందేకదా? కార్తీకమాసం వచ్చిందంటే, మీరు సుష్టుగా భోజనం చేసే వనసంతర్పణాలు కూడా మన పూర్వపు 'సమిష్టి' భోజన లక్షణాలే అని మరచిపోకండి.

నిజంగా నేడు యీ మన్యంలోని 'సమిష్టి' వేటలక్షణం, పరాన్న భుక్కులకు చెప్పుదెబ్బ. ఎందుకంటారా? ఒక్కొక్కడు కూలీలచే అడ్డమైన వెట్టిచాకిరీ రాత్రింబవళ్ళు చేయించుకొని కూలికోసం నానా బాధలు పెడుతూ "ఇదంతా నీ ఖర్మంరా!" అని వాడేదో పెట్టిపుట్టినట్టు చీదరించుకుంటాడు కూలీల్ని, ఈ ఖర్మ మధ్యకాలంలోనే వచ్చిందని, పూర్వజన్మ సుకృతం కాదని, పూర్వం మానవుడు, విశృంఖల విహారి అని యీ "సమిష్టి" వేట లక్షణం మరోసారి కంచు కాగడాతో స్పష్టంగా చాటుతోందా సత్యాన్ని, ఇంగువకట్టిన గుడ్డకు వాసన పోదుగదా! మధ్యకాలంలో వచ్చింది మధ్యలోనే నశిస్తుంది. ఆదిలోనున్న యీ "సమిష్టి" పెత్తనం ఆఖరువరకూ నిలిచి తీరుతుంది. ఏమంటారు?

ఇక చూడండా మన్యవీరుల వేట.

డప్పుల ధ్వని మరీ తీవ్రమైంది.

ఆ ధ్వనిలోని ఓంకారనాదం - ఆ కొండ తుప్పల్లో చిక్కుకున్న క్రూరమృగాన్ని కార్చిచ్చులా దహించేసింది. ఆ ధాటికాగలేక ఆ మృగం కొండ శిఖరంపైకి వచ్చేసింది. దాని వెన్నంటే, కొండ చుట్టూ పైకి ఎగబ్రాకి, పద్మవ్యూహం పన్నినట్టున్న ఆ మన్య వీరుల్లో ఓ యువకుడు—

"ఆ! మామా! అవిగో పచ్చబిగ్గీలు. చిరుతపులి కాదది - పెద్దపులే!" అని అరిచాడు—

ఆ పెద్దపులి ఒక్కసారిగా ఘాంౘడించింది. శశి "కెవ్వు"మంది రామం గుండె కందుకున్నాడామెను.

'బెదరుతుంౘడేమిటి ?' అన్నాడు బండివాడు.

"ఇక డప్పులు పడేసి బాణాలు వేయండ హే !" అన్నాడో వేటగాళ్ళ పెద్ద.

"ఊఁ! కానివ్వండహే !" అని యింకొకడు వత్తాసిచ్చాడు.

వెనువెంటనే ఝూంకారాలు మిన్నుముట్టాయి. అందరూ ఒక్కమారుగా, ధనస్సుల కమ్ములుధరించి, చెవులకంటా నారులులాగి నలువైపులనుంచి తిన్నగా, ఆ పెద్దపులి ఎదురొమ్ముల పైకి గురిపెట్టి వొదిలారు.

మీ రెప్పుడైనా చూచారా ? - జగన్నాధం !

జగన్నాధ రథం కదిలించగానే, ఒక్కమారుగా 'హరహరా!' అంటూ అరటిపండ్లవర్షం కురుస్తుంది - అలాగే జరిగింది.

ఆ అమ్ములన్నీ నేరుగా దాని ఎదురురొమ్ముల్లోకి దూసుకుపోయాయ్.

నిశీథసమయంలో గ్రామంలో చొరబడి అనేక గోవుల్ని ఎత్తుకుపోయి, ఆ కోమల పశుసంపద నంతట్నీ, తన వాడికోరలతో నమలి మింగుతున్న ఆ వ్యాఘ్రిం 'కాంౘదు డాంౘదు'మని ఘాంౘడిస్తూ కూలిపోయింది.

నలువైపులా తమ దృక్కులు నిగిడ్చి స్వరక్షణార్థం తమ వెనుక భాగాలన్నింటినీ ఒకచోట జేర్చి, గుసగుస లాడుకుంటున్న లేళ్ళ సముదాయం ఆ ఘాంౘడిపులకు దద్దరిల్లిపోయి, తలొకద్రోవా పట్టి, చెంగు చెంగున దుముకుతున్నాయి. కొమ్ములు మెలిదిరిగిన దుప్పులు పక్కప్రక్క పొదల్లో కొమ్మలు చిక్కుపడ్డంవల్ల, వచ్చే ప్రాణహానికి గింజుకుపోతున్నాయి.

పక్షులన్నీ, గుప్పున చెట్లపైనుండి లేచిపోయి కంగారుగా అరుస్తున్నాయి.

'అదిగో మామా ! తీతుకపిట్టరుస్తోంది. కీడుకొస్తేలా వుంది.' అన్నాడో మధ్యవయస్కుడు. అతని ముఖలక్షణాలు చూస్తే ఆ వెనుకబడిన మన్యంలోని మూఢనమ్మకాలన్నీ గుర్తుకొస్తాయి.

"కీడూ గీడూ లేదు. తగిల్తే ఆ మొఖానికే తగుల్తుంది. ఇంకా తోకాడిస్తుంది. ఇంకో దెబ్బెయ్యండహే!" అన్నాడొక ఆరిందా వేటగాడు.

అంతే. వెంటనే ఆ యువకుడు మరల నారి చెవికంటాలాగి, "రయ్" మని వొదిలిపెట్టాడు - బాణం.

దెబ్బతో ఇక గింజుకోకుండా చచ్చిపోయింది - పులి.

"నూరుగొడ్లను తిన్న మెఖం ఒక దెబ్బకు సఫా! అంటూ ఎగిరి గంతేసాడా యువకుడు.

శశి "అమ్మయ్యా!" అంటూ నిట్టూర్చింది.

"చూశావా? శశీ! వాళ్ళ కలిసికట్టు! అంతపెద్ద వ్యాఘ్రాన్ని తృటిలో కూల్చగలిగారు!"

"రవి గ్రుంకని బ్రిటిషుసామ్రాజ్యమేలే దొరలనే కూల్చిన వాళ్ళకి పెద్దపులొక లెక్కా?"

"అబ్బ! ఎంత ధైర్యమొచ్చింది - మా శశికి!" అంటూ, గిలిగింతలు పెట్టాడు - రామం.

"కిల కిల" లాడుతూ, శశి రామం వొడిలో పడింది.

బండి "చర్రున" మలుపు తిరిగింది.

"తిర్ బస్సప్పా!" అంటూ, ఎల్లెద్దును లోదొడల్లో తన్నాడు బండోడు.

అంతే.

"చక్" మని లాగాయి - ఎడ్లు.

మబ్బులుతొలగిన సూర్యుడు, ఆకాశంపై అకస్మాత్తుగా ప్రత్యక్షమై పరుగుపెడుతున్నట్టు, ఆ ఎడ్లు, దట్టమైన ఆ అడవి పుంత విడిచి, సమతలంగా వున్న ఓ బీడు బాటపైకి ఎగిరి గంతేసి, చక్రాలను దొర్లించుకుంటూ పోతున్నాయి.

ఆ సమతలంగానున్న బీడుచుట్టూ, మొగిలిరేకులనుంచి సుగంధం గుభాళిస్తోంది.

సంధ్యాసమయం కావస్తోంది.

చక్కని దక్షిణ పవనాలు విసురుతున్నాయి. బండి సాగుతోంది. ఎదురుగా, ఆ బీడుకు వేయబడ్డ కంచెవద్ద-ఘర్షణ జరుగుతోంది. ఆ కంచెప్రక్క బాటలోకి బండికూడా వచ్చింది.

బండివాని నడిగాడు - రామం?

"ఏమిటా గొడవ?"

"ఏముందిబా! యీ వూరు ముఠాదారుకు పోగాలమొచ్చి, బీడుకు కంచేయించిండు. ఈ గుంటలు ధిక్కరిత్తుండ్రు!" అన్నాడు.

'ఇంకా మన్యంలో ముఠాదార్ల దౌర్జన్యాలు సాగుతున్నాయన్న మాట!' అన్నాడు రామం.

'ఇంకేం సాగునులేబా! కుర్రకారు తెలివిమీరింది!'

అనగానే—

ఆ బీడులో కంచెవేసిన ముఠాదారుని ధిక్కరించి, గేదెలపై వచ్చిన పిల్లలు గేదెలు దిగి, కంచె తొలగించి,

'ఓ! నెగనెగవో-మామొనగాడివి బయలుదేరినావ్?'

అంటూ, గేదెలను బీడులోకి తోలి ఆ గేదెలపై నెక్కి పిల్లనగ్రోవుల నూదుతూ, ఏడిపించారు.

ఆ ముఠాదారు ఆ పిల్లలవద్ద తన పప్పులుడగక కొర్రగేదిలా ముక్కు చీదరించి అలాగే నిలుచుండిపోయాడు. ఇంతట్లోకే విసిరిన మన్యంగాలి వాడి జుట్టుపట్టి, పడాలున దవుడ చెళ్లుమనేలా కొట్టింది అలాగే దొంగముఖం పెట్టుకొని...

చూసారూ!

రాత్రులు, తన అరుపులద్వారా కునుకుతీస్తున్న పక్షులను బెదరగొట్టి, చెదరగొట్టి పొడుచుకుతినడానికి గ్రుడ్లప్పగించుకు కూర్చున్న గుడ్లగూబలా వుందనుకోండి! చూడ్డానికి వాడు కురూపికూడాను

స్ఫోటకం పడ్డం వల్లకోసం, చెదపురుగులు దొలిచేస్తే గుంటలు పడ్డట్టు వుందా ముఖం.

ఆ ముఖాన్ని చూస్తూ మరీ వెక్కిరిస్తూ పోతున్నారు పిల్ల కాయలు.

రామం తన్మయంలో అన్నాడు.

'శశీ! పెద్దన్నగారి మనుచరిత్ర చదివావా?'

'ఏం ?'

'ఆ ! ఆ ! చదివావా?'

'లేదు. ఏం?'

'ఆయన దృష్టిలో ఇటువంటి పిల్లకాయల్నికూడా చూచాడను కుంటాను?'

'ఎలా !'

లేకపోతే 'నిచటబుట్టిన చిగురుకొమ్మైన జేవ!' నవెందుకంటాడు?

'అదా?' అని భ్రుకుటి లలాటానికి తాకించి—

'అన్నిటికీ కవిత్వమె వల్లిస్తున్నావే?' అంది శశి.

యీ మనోహరమైన మన్యం చూస్తుంటేనే, కవిత్వం దానికది పొంగుతోంది శశీ!' అంటూ, చల్లగావీస్తున్న ఆ గాలిలో శశితొడలపై తల పెట్టాడు.

ఆ తలను కొనవ్రేళ్ళతో శశి దువ్వుతోంది.

సందెచీకటి పడుతోంది. ప్రకృతి రమణీయంగా వుంది. ఆ అమృతసదృశమైన వసంతమారుత మధుర వీచికలలో మొగిలిపూవుల గమగమలలో హృదయరంజిత శోభాయమైన ప్రకృతి ప్రాభవంలో ఆ నిండుహృదయాలు రెండూ, మాలతీ మాధవీ లతల్లా పెనవేసుకు పోయాయి.

ఆ తన్మయంలో వారికి బండి ఆగిపోయిన సంగతికూడా తెలియ లేదు.

బండివాడు, బండిదిగి, వారి మధురస్వప్నం భంగం గాకుండా అలాగే కొన్ని నిముషాలు నిలిచిపోయాడు.

పైకెంత మొరటుగా కనబడ్డా, చదువులేకపోయినా, ఆ బండి వాని మనస్సెంత నవనీతమో, చూసారా? ఎంత సంస్కారహృదయమో గమనించారా?

డొక్కచించినా అక్షరంముక్క లేనివాడి డాబుసరీ, విద్యాధికుడ్ననీ విర్రవీగే సంస్కారశూన్యుల్నీ, కూలివాడ్ని చూచి ముఖం చిట్లించుకునే ద్విపాదపశువుల్నీ, అనేకమందిని రోజూ చూస్తున్న మీలాంటి పెద్దలకు వేరే చెప్పనక్కరలేదనుకుంటాను.

పాపం! అలాగే నిలబడ్డ బండివాడు - ఇక చీకటి పడిడి పోవడం గమనించి—

'దిగండిబా! యీడనుండో క్రోసుడులో రోడ్డు తగుల్తది. ఆ వెంబడే పోతిరా - కృష్ణదేవుపేటబా!' అన్నాడు.

"ఓ!" అంటూ తడుంకుంటూ తన్మయత్వాన్నుండి కోలుకున్నాయా మధుర జీవులు.

రామం—

"క్షమించు!" అంటూ బండి దిగాడు.

"అబ్బ! చాలా చీకటిపడిపోయిందే - ఇప్పుడెటుపోగలం?" అంది కాస్త భయంతో శశి!

"ఏముందిబా! క్రోసుడులో తగుల్తది క్రిష్ణదేవపేట! యీమాపు కక్కడుండండిబా!...మరి నేనొల్లత్తాబా!'

"అలాగే!" అంటూ, ఒక రూపాయ తీసి—

"ఏదో—" అనబోయాడు రామం!

బండివాడికి కోపం వచ్చింది.

"ఇదేంటిబా! నేర పోయి కట్టిని - బండి!"

శశి అర్థం చేసుకోలేకపోయింది—

"ఏదో మేము నీలాంటి పేదోళ్ళమే...మరి..."

అని ఏదో అనబోతోంది - ప్రాధేయంగా.

"చక్"మని అందుకున్నాడు - బండోడు.

"అదేంటిబా ! దుడ్డుపుచ్చుకుంట మా మన్నెం ఇంటా వంటా నేదే ?"

శశి ఆశ్చర్యపోయింది. నిట్టూర్చి—

"అబ్బ ! ఎంత వుదారం ?"

"అవును శశీ ! నే చెప్పలేదూ? - ఇవ్వడమే గాని, పుచ్చుకోడం తెలీదీ కోయలకని!" అన్నాడు రామం.

బండివాడి కోపం యింకా ఆగలేదు.

"నేను తోలుతే చెప్తినే - దుడ్డొద్దాని! నాలుకోకేసినా అబద్ధమాడం బా!

రామం, శశిలు తొల్లబోయారామాటల్కి.

"అవునవును! నీ ఋణం తీర్చుకోలేనిది." అన్నాడు.

"ఇంకెళ్ళండిబా! ప్రొద్దు కుంకిపోనది!" అని బండి వాడన నే "అలాగే" అని తలమాత్రం త్రిప్పి రామం కొయ్యలా నిలబడిపోయాడు. శశి రామం భుజంపైని, తన చుబుకంపైన చేతులాన్చి బొమ్మైపోయింది.

"చ హహ్హా!" అంటూ చంగున బండిపైకి గంతేసి, వెనక్కు చూస్తూ "భద్రం బా! అరణ్నెం!" అంటూ బండి తోలుకుంటూ వెళ్ళిపోయాడు.

బండి కనుచూపు దూరం దాటేవరకూ, వారిరువురూ అలాగే నిలబడిపోయారు.

## 4

నిశాంగన ఆవులించింది. నల్లటికురులు పరిచి, గుర్రుపెడుతూ నిద్రపోతోంది కీకరారణ్యం. భీకరాకృతి ధరించిన కఠికచీకటి. దానికి తోడు భీతావహం చెందించే అడవిమృగాల అరుపులు. మిణుగురు పురుగుల కిరకిరలు. ప్రేగులు పీకుతున్నాయి. కన్ను పొడుచుకున్నా దారి కనబడ్డంలేదు. అలాగే వారిరువురూ, గుండె అరచేత పట్టుకొని నడుస్తున్నారు.

"కెవ్వు"మంది శశి.

ఓ పణుకు జారింది.

రామం చటుక్కున పట్టుకొని పైకి లాగాడు. అదో కొండ శిఖరం. ఇక ముందు కొండలేదు. క్రిందికి చూస్తే ఓ పెద్ద అగాధం. ఈ కొండను విడద్రొక్కుతున్న యింకో కొండ - క్రింద పారుతున్న సెలయేటి తరంగాలకు కోసుకుపోయి, కోసుకుపోయి - అంతస్థులు తీర్చి కట్టిన భవంతిలా వుంది.

శశి శరీరం భయంతో కంపిస్తోంది. కంపనలోనే అంది—

"పదండి, వెనక్కి!"

ధైర్యంగా అన్నాడు - రామం—

"కాదు! ముందుకే!"

అలా అంటున్నప్పుడు రామంను, ఇవతల కొండశిఖరం పైనుండి చూస్తే, ఆ మిణుకు మిణుకుమంటూ, అక్కడక్కడ ప్రకాశిస్తున్న నక్షత్రకాంతిలో - రామం ఓ మహా మానవుడిలా ప్రకృతిని జయిస్తున్న కర్మవీరునిలా కనబడుతున్నాడు.

రామం అన్నమాటకు మరీ హడలిపోయింది - శశి! —

"అమ్మ బాబోయ్! ఇక నా అడుగులు ముందుకుపడవ్?"

"నే నింటివద్ద చెప్పలేదూ? 'కాదు! - మీ నీడలో నాకు భయమేమి'టన్నావ్? శశీ! తొలిసారిగా నా జీవితంలో వెనక్కి అడుగులు వేయిస్తావా?" అంటూ ప్రాధేయంగా ఆమెవొంక చూచాడు.

శశి కొరుకడలేదు.

"ఎందుకండీ! యీ కారుచీకటి, కారడవిన?"

"కారు చీకటైనా, కారడవైనా, కార్యవాది ముందుకే పోవాలి శశీ!"

"ఊహూ!" కూలబడింది - శశి.

"ఇదేమిటింత పిరికిరకం - భారతస్త్రీ!" అని మీరనుకోవచ్చు. కాదు. పురాణకాలంనాడే మా ఆడోళ్ళు, మగవాళ్ళకంటె, వీరోచి

తంగా పోరాడారు. నరకాసురుడనే రాక్షసునితో పోట్లాడి క్రిష్ణుడు పడిపోతే, ధనువు సంధించింది - మా సత్య.

భర్త - తన్ను వెంబడించిన యాదవసేనతో పోరాడుతూంటే, రథసారథ్యం చేసింది - మా సుభద్ర.

చారిత్రక కాలంలోకూడా భారతావనిలో ఏకచ్ఛత్రాధిపత్యంగా తెలుగునాడును పాలించిన వీరరాణి - మా రుద్రమ్మ!

ఆధునిక కాలంలో - మన కథానాయకునికి డబ్భైఏండ్ల ముందు బ్రిటిషువాళ్ళపై తొలిసారిగా ధ్వజమెత్తింది - మా ఝాన్సీ లక్ష్మి!

ఇలా ఎందరో వున్నారు.

అయినా కారడవి. కటికచీకటి - మాటలా?

శశిని, లేవనెత్తడానికి రామం వొంగాడు. ఆ రెండు కొండల మధ్య అగాధంలో అతనికో దీపశిఖ కన్పించింది.

'చూడు శశీ! ఏదో కాంతి కనబడుతోంది. పద నెమ్మదిగా, కొండ దిగుదాం.' అంటూ శశిని లేవనెత్తి, నడుంపట్టి. మెల్లిగా రెండు పణుకులు దిగారు.

మరల దట్టమైన పొదల్లో చిక్కుకున్నారు. భయంకరధ్వనులు వొచ్చాయి. ఈదఫా ఆ ధ్వనులు ఆ రెండుకొండల మధ్య ప్రతిధ్వనులుకూడా చేస్తున్నాయి. శశి గుండె గుభిల్లుమంది. ధైర్యం సడలిపోయింది. అడుగడుక్కీ త్రుళ్ళిపోతోంది. రామం శశిని సందిటకు లాక్కుని నెమ్మదిగా కొండ దించుతున్నాడు.

ముందు సన్నగా కనబడ్డ దీపశిఖ కాస్త పెద్దదిగా కనబడుతోంది. అక్కడికీ, ఆ కాంతి అగాధంలోనే వుండడంవల్ల కళ్ళు తిరుగుతున్నాయి.

రామం శశి చెవిలో నెమ్మదిగా అన్నాడు-

'ఖంగారుపడకు. కాస్త ప్రయత్నిస్తే క్రిందకుదిగుతాం... లేకపోతే ప్రమాదం!' అని.

శశి మరీ భయపడి, కోతిపిల్లలా, రామంకు చుట్టుకుపోయింది. శశి బరువునుకూడా మోస్తూ రామం కాస్త క్రిందకు దిగగలిగాడు.

తీరాచూస్తే ఆ వెలుతురు దీపశిఖ కాదు. అదో మంట. ఆ వెలుతురులో ఆ రెండు కొండల దిగువ సమతల ప్రదేశంపై రెండు నిటారైన మద్దిచెట్లు కనబడ్డాయి. శశి కిక్కురుమనడంలేదు.

నెమ్మదిగా కాస్త క్రిందికి దిగారు.

ఈసారి ఆ వెలుతురులో ఏదో తెల్లగా, స్ఫటికంలా కనబడుతోంది.

శశిని అదిమిపట్టుకొని ఇంకో రెండు పణుకులు ఎలాగో జారాడు. ఆ స్ఫటికంలా తెల్లగా వున్నది సమాధిలా కనబడింది.

అతని ముఖం జేవురించింది. చిరుహాసం మెదిలింది. వెంటనే శశిని తట్టి—

'శశీ! ఇదిగో! సమాధి!'

'సమాధే! అమ్మో స్మశానం! అంటూ హడలింది. ఆమె ముఖంలో ముచ్చెమటలు పోసాయి

ఏదో అవ్యక్త కంఠధ్వని వినబడుతోంది—

'హు! స్మశానం, ఎంత మూర్ఖుడవో బాటసారీ!

'ఇచ్చోటనేగదా! వెచ్చటి కన్నీటి
కుండలై పేదల గుండెలెన్నొ;
ఇచ్చోటనే జాలి నుత్తేజపరచిన
యమృత కవి హృదయమ్ము లెన్నొ;
ఇచ్చోట యానందవీచికల్దేలించి
కోయిలారవములౌ, గొంతులెన్నొ!
ఇచ్చోటనేగదా, యచ్చముగ నెమలులై
నాట్యమాడిన చరణమ్ము లెన్నొ;
శశిర శశికాంతులై సోకి శాశ్వతముగ
చల్లబడిపోయె నిచ్చోట; చెలగి 'హరహ

రోంహార' యని వీరులు నెత్తురోడ్చ పుణ్య
భాసురమైన స్మశానమో బాటసారీ!

"ఎందరు ఎన్ని పుటలు రాసినా తరగని ఆద్యంతాలు లేని స్వర్ణ చరిత్ర గనీ స్మశానం - తెలిసిందా - బాటసారీ!"

రామంలో సంతోషకాంతులు వెల్లివిరిసాయి.

శశి కంపన తీవ్రమైంది—

"బ్రతికుంటే బలుసాకయినా తినొచ్చు! పదండీ పోదాం!"

"ఎంత బేలవు శశీ; నిజంగా ఇదే స్మశానమైతే, యీ పొలి మేరల్లోనే ఏదో పల్లె వుండితీరాలి. మనం త్రోవతప్పామంతే!" అంటూ ముందుకు నడిపించాడు.

ఆవేదనతో అడుగంటిపోయి, ముడుతలుపడి, నరాలు పొంగిన ముఖంతో ఓ వృద్ధుడు చటుక్కున వాళ్ళ కెదురుపడి—

"ఇది స్మశానం కాదురా - దేవతాస్థలం!" అని వురిమాడు.

కంగారుపడ్డ శశిని గుండె కదుముకొని, రామం ఆశ్చర్యంగా అడిగాడు—

"దేవతాస్థలమా ?"

"అవును! నీ వెవడవ్ ?" అని ఆ వృద్ధుడు గంభీరంగా హుంకరించాడు.

ఏమనాలో రామంకు బోధపడలే! ఏదో అనాలని వెంటనే అనేసాడు - "నేనాంధ్రుడ్ని !"

"ఆంధ్రుడవా - పాంధుడా? అయితే చెప్పు! ముప్పయ్యేండ్ల క్రిత మిక్కడేం జరిగిందో?

రామంలో ఉత్కంఠ హెచ్చింది. కాని ఆ వృద్ధుడెవరో, ఎందుకంత ఆవేశంతో, అలా అడుగుతున్నాడో అర్థం కాలేదు, కాని తర్కానికి దిగడం ప్రయోజనం లేదనుకున్నాడు—

"తెలీదు!" అంటూ వొప్పేసుకున్నాడు.

ఆ మాటకు ఆ వృద్ధునిలో ఆవేశం పొంగి, అంచుల్ని కూడా కోసేసింది. అతని ముఖంలోని ముడుతల్నిబట్టి అతనికి డబ్భైపండ్లు

దాచేవుంటాయి. అంత వయస్సు అతని కంఠధ్వని వొణుకులో కూడా కనబడుతోంది—

"తెలీదూ ? ప్రతిఆంధ్రుడి హృదయగర్భంలో చెయిపెట్టి దేవుతూ వుండాలిగా!...ఆనాడు తెలుగు తారాపథంలో తళతళ మెరిసిన ఓ తార రాలిపోయింది. వెన్నెల వెలుగులు వెదజల్లిన పున్నమచంద్రుడ్ని పాము మింగేసింది. మా మన్యం తలే తెగి పోయిందిరా!..." అంటూ శక్తివుడిగిన ఆ వృద్ధుడు. వుద్వేగంలో తూలిపోయాడు. ఆ తూలడంలో అతని చేతికర్ర విరిగిపోయింది. తటాలున ప్రక్కనున్న సమాధిపై బడ్డాడు. దెబ్బ తగులకుండా రామం పట్టుకున్నాడు.

కాస్త గుండె నిబ్బరంచెందిన శశి అడిగింది—

"ఎవరికోసం తాతా ?"

"ఎవరికోసమా? పంచభక్ష్యాలను వర్జించి, హంసతూలికా తల్పాన్ని త్యజించి, పచ్చినీళ్ళనే త్రాగి, కఠిక రాళ్ళనే శయనించి, ఒకనాడీ మన్యంలో మహావిప్లవాన్ని రగిల్చి, తెలుగజాతి యశః స్కాంతులను నేల నాలుగు చెరగులకూ ప్రాకించిన మహనీయ మూర్తికోసం! బానిసగా చచ్చి, శూరునిగా పుట్టండని సందేశమిచ్చిన వీరునికోసం!..." అంటూ "రాజా !" అని సమాధిపై పడిపోయాడు.

రామంకు ఆడబోయినతీర్థం ఎదురయినట్టు జరిగింది.

వెంటనే అడిగాడు-

"అయితే, యీ సమాధి సీతారామరాజుదా? తాతా?"

పాపం ! ఆ వృద్ధునిలో ఇక ఆవేశం ఆవేదనలోకి మారి పోయింది. హారతి కర్పూరంలా హరించిపోతున్న కంఠధ్వనితో -

"రాజు! మామూలురాజు కాదురా ! మా మన్యానికి కిరీటం లేని చక్రవర్తి నాయనా! కన్నీరోడ్చిన మన్యంకోసం, తన కవోష్ణ రక్తం చిందించిన అవతారమూర్తి నాయనా! బ్రిటిషు కవచ శకట

సాయుధబలాల కళ్ళముందు తెలుగుకత్తి ఝళిపించిన మొనగాడు నాయనా - సామాన్యుడా? నా రాజు సామాన్యుడా?' అంటూ ఆవేదనలో అడుగులు తేలిపోయి; తూలి, ఏడుస్తూ—

'...అసలు...అ...స...లు'

రామం హృదయం ద్రవించింది.

'తాతా?' అంటూ ద్రవీభూతమైన హృదయంతో కరుణధార నొలికించాడు - అణుమాత్ర స్పర్శాజ్ఞానానికే కరగగలది కదా-కవి హృదయం!

శశి కంఠంలో కన్నీటిబొట్టు గతుక్కుమంది.

రామం తన హృదయం ఘనీభవించుకొని—

'తాతా? రవిగ్రుంకని బ్రిటీషు సామ్రాజ్యాకాశంలో పట్టపగలే చుక్కలు మొలిపించి, తెలుగుజాతికి ఖండఖండాతర ఖ్యాతి నార్జించిపెట్టి, వీరమరణం చెందిన ఓ మహావీరుని గురించింత విచారమెందుకు తాతా?'

"విచారం కాదురా! హృదయక్షోభ! అసలు జీవితపుటంచుల తీపినైనా చవిచూడని నూనూగుమీసాల పాతికేండ్ల పసిబాలుని చిత్రహింస చేసి, యిదిగో! యిక్కడే ఆ తెల్ల కిరాతకులు చెట్టుకట్టి చెట్టుతోసైతం కాల్చేసారురా!..." అంటూ ఆ వృద్ధుడు తన వ్యథను ఆపుకోలేక, అనుకోకుండానే, అతని చేతిలోనున్న నలిగిన మన్నును క్రింద రాల్చాడు.

శశి ఇక ఆ బాధను వినలేకపోయింది.

స్త్రీది యిట్టే కరిగిపోయే హృదయం కాబట్టి కరిగిపోయింది. ఏడ్చింది. ఆమె కనుకొలకుల నిలచిన బాష్పపూరములు ఆమె నును బుగ్గలపైనుండి దొర్లాయి.

పాపం! శశికేం తెల్సు?

నా మహాభారతంలో అడిగిన దానినల్లా ధర్మం చేయగలిగిన బలిచక్రవర్తి, వాళ్ళు దివి కరిగిపోయాక స్వర్గధామంలో వాళ్ళకు యింద్రుడు సువర్ణకిరీటమే పెట్టి ఆదరించగలిగాడని—

కాని—

ప్రాక్పశ్చిమ భౌతికాధ్యాత్మిక చింతనా పరంపరలను సంలీనం చేసుకున్న మా సర్వేపల్లి పండితుడన్నట్టు, భువిపైని పదిమంది కోసం ఎవడైతే వేడి కన్నీటిపూరములు రాల్చగలుగుతాడో అట్టి మానవునికి మహేంద్రుడు స్వర్గంలో వజ్రకిరీటం పెడతాడని!

తెలీదు. అందుకే శశి—

'ఇకాపుచెయ్! తాతా!' అంటూ, ఆ వృద్ధుని నోరు నొక్కింది.

రామం మాత్రం రెచ్చాడు.

"ఎంత దారుణం?" అన్నాడు.

శశి జాలిగా అడిగింది—

'తాతా? యింతగా తపించిపోతున్న నీవెవరవ్?'

అవును నిజమే. "ఎవరో?" 'ఎంతటి ప్రగాఢమైత్రి రాజుపట్ల ఆయనకున్నదో?' లేకపోతే, రాజు చనిపోయినా, ముప్పయ్యేండ్ల తరువాతకూడా అట్లా 'రాజు! రాజు!' అని పలవరించగల ఆంధ్రుడేడి? నేడొక్కని పెదవులనుండి రాజు పేరుచ్చరించబడడం లేదే? ఆయన పేరుమీదుగా భిక్షమెత్తుకొని, నాలుగు మెతుకులు తిని, తిండి అరిగిపోయాక ఆయన పేరునే మరచిపోయిన రాజకీయపక్షు లెన్ని లేవు? అటువంటి మహానుభావుల త్యాగాల ఫలితంగా వుద్భవించిన 'మహాంధ్ర'ను పాలిస్తున్న నాయకులెపుడైనా రాజు పేరును స్మరించారా? లేదు. ముమ్మాటికీ లేదు. ఒకవేళ ఏమూలనో రగులుతున్న నిప్పులా ఓ కుర్రోడు - ఆ పేరెత్తేటప్పటికి - 'కుర్రకుంక వుద్రేకి! టెర్రరిస్టు!' అని ఏవేవో, తాటిపట్టలాంటి నాలుకలతో నాలుగు కూతలేస్తారు. అంతే వాడిపని అధఃపాతాళం! అది రాజముద్ర! అటువంటి రాజముద్రలకు అతీతమైన మానవుడావృద్ధుడు - తన కన్నీటిగాథను చెప్పడం మొదలెట్టాడు—

"నేనా? నా పేరు - శింగన్న. రాజు పితూరీలో వేగుల వానిగా పనిచేసా. నన్నా తెల్లోళ్ళు పట్టుకొని - యిదిగో! యీ

గోళ్ళసందు సూదులు గ్రుచ్చారు - రాజుజాడ చెప్పమని, నా నాలుక తడబడలేదు. అంతే. చావబాది-పీకకురి తగిలించారు. నాకు స్పృహ తప్పింది. చచ్చానని డొంకల్లో పారేసారు. తప్పించుకున్నా, మళ్ళీ నేను కోలుకునేసరికి యింకేముంది? రాజూ, పడాలూ, గంటం అంతా హతమైపోయారు. అప్పటినుండీ నా బ్రతుకీ సమాధివద్దే. ఇలా యిక్కడే ఏడుస్తూ, నా రాజును స్మరించుకుంటూ, గుండెబరువు తగ్గించుకుంటూ..."

అంటూ శింగన్న ముడుచుకుపోయి, గుండె అరచేతుల్లోకి తెచ్చుకుంటూ తనకు తెలియకుండానే ఓ మూలకు వెళ్ళిపోయాడు.

కూడా రామం వెంటాడాడు. రామం యిప్పుడు తనలో లేడు.

తీవ్ర అభినివేశంలో అడిగాడు.

"తాతా! ఆ చరిత్ర నాకు చెప్పవ్? నీవేదో కాస్త చెబితేనే వొళ్ళు జల్లుమంటోందే? వేడినెత్తురు వురకలు వేస్తోందే, ఏది తాతా చెప్పవ్?"

శశికూడా వొంతకలిపించి వుత్కంఠతో--

'చెప్పు తాతా' అని అంది.

శింగన్న ఒక్కసారిగా వెనుదిరిగి, వారిరువురు ముఖాల్లోకి తీవ్రంగా, కనుబొమలపైనుంచి సూటిగా చూస్తూ--

"చెప్పి ప్రయోజనమేంటి, నాయనా? మాయమైన విప్లవ మూర్తి మరల ప్రత్యక్షమౌతుందా? దెబ్బతిన్న మా గాయలు మరల మానుతాయా? అడుగంటిపోయిన ఆశలూ, అవేశాలూ మరల చిగురుస్తాయా? నా రాజు పేరునూ, మా జాతి పౌరుషాన్ని నిలబెట్టి మరలెవరైనా త్యాగంచేస్తారా? పాంధుడా!"

అంటూ బాధాదుగ్ధమైన గద్గదకంఠంతో అన్నాడు.

'తప్పకుండా!' అంటూ రామం శింగన్న చేతిలో చెయ్యేసాడు. ఆ చేతిలో, అతని నరనరంనుండీ, విద్యుత్ప్రసారంలో ప్రసవించిన నెత్తురంతా పొంగివుంది. ఆ పొంగిన నెత్తురు, ఆ వుద్రేకపూరితమైన

హస్తం ఎప్పుడైతే శింగన్నచేతిలో పడిందో, శింగన్న కర్థమై పోయింది. మాటలు అర్థంకాని మానవుడుంటాడు గాని, ఆవేశం, ఆవేదన అర్థం కానివాడెవడుంటాడు? ఆ మాటకొస్తే మన భాష పుట్టుకే ఆవేశాలూ, ఆశలూ, ఆవేదనలనుండే వుద్భవించిందిగా! అయినా రామం వుద్రేకంతో వేడెక్కి, వాడెక్కి శింగన్న హస్తాన్ని బిగించి - అన్నాడు--

"ఇదిగో! ముక్కోటి ఆంధ్రుల వెన్నుచరిచి నిద్రమేల్కొలుపుతా, కవిగా నా కలంలో రక్తం చిందించి, తెలుగుజాతి నేకత్రాటనడిపించిన రాజుపేరును, దేశదేశాలా కంచుఢక్కాన మ్రోగించేటట్లు చేస్తా! గతాన్ని మరచే జాతికి భవిష్యత్తు లేదని చాటతా! ఇది నా శపథం. ఇక చెప్పుతాతా!" అంటూ, వొక్కసారిగా పెల్లుబికిన వుద్రేకం గూడుకట్టిన గుండెతో శింగన్నను కౌగలించుకున్నాడు.

ఆ శపథానికి శింగన్న మేను పులకరించింది. హృదయం విప్పి మాట్లాడుతున్నాడు--

"తప్పకుండా చెబుతా నాయనా! చెప్పి, నా గుండెబరువు తగ్గించుకుంటూ, నా కండ్లలో నిలిచిపోయిన కన్నీటిమడుగులు వొలకబోస్తా!

"ఇక నేనెంతోకాలం బ్రతుకను. బ్రతికినంతకాలం, నారాజు పేరును ఆనోటా; ఆనోటా వినేభాగ్యమైనా కలుగుతుంది. మరొక్కసారి ఆ పావనచరితను, పారాయణ చేసుకునైనా తరిస్తాను..." అంటూ, ఆ సమాధి పీఠిపై చతికిలపడ్డాడు - శింగన్న!

"అయితే వినండి నాయనా! కూర్చోండి..."అంటూ సౌంజ్ఞ చేసాడు.

రామం, శశిలు ఆకలిదప్పులు మరచిపోయారు. శింగన్న సౌంజ్ఞచేసినదైనా గుర్తించలేదు. సర్వం మరచిపోయి, వారంతట వారే అలా శింగన్న ఎదుట కూర్చుండిపోయారు.

శింగన్న చెప్పడం మొదలుపెట్టాడు—

"పూవు పుట్టగానే వికసిస్తుంది. పూర్ణచంద్రుడు పుట్టుకలోనే ప్రకాశిస్తాడు. సరిగ్గా అలాగే... నా బాలచంద్రుడు - చిరుబుగ్గల సీతారామరాజు. నేటికి సుమా ౭౭ వై ఏండ్ల క్రితం...పవిత్ర గోదావరి జలాల తృప్తమైన గోదావరిజిల్లాలో, మహాసముద్ర తరంగాలు మాటి మాటికీ కోరాడుతూ, నవోత్తేజాన్ని ప్రసాదిస్తూచలగే, నరసాపురం తాలూకాలో, విప్పారిన మొగిలిరేకులు తలపుకువచ్చే ముద్దుపేరైన మోగల్లులో...ఒక పుణ్యపురుషుని యింట జననమందాడు. అదుగో! చూడు నాయనా!..."

అంటూ, వారిరువుర్నీ శింగన్న తన దివ్యపథంలోకి ఇట్టే అలా అలా తీసుకుపోయాడు. కథనంలో దృశ్యాన్ని చూపుతున్నాడు. ఆ దృశ్యాల్లోకి వారిని తీసుకెడుతున్నాడు.

ఏమో, వారిరువుర్నీ, ఆ వృద్ధుడు ఏయే పుణ్యనదుల్లో స్నానం చేయిస్తాడో? ఏయే పుణ్యక్షేత్రాల్లో ప్రవేశపెడతాడో? ఏయే పర్వతపంక్తుల నెక్కిస్తాడో, ఏయే గడపలకు త్రిప్పిస్తాడో, ఏయే మానవ హృదయగహ్వరముల్లోకి లాక్కెడతాడో? - చూద్దాం.

రామం శశిలు మాత్రం ఇప్పుడా శింగన్నచేతిలో మంత్రముగ్ధులైపోయారు. మరో లోకంవైపు - శింగన్న చెబుతున్న మానవ లోకం వైపు, పరకాయప్రవేశమున్న విక్రమార్కుడు మరో బొంది లోకి శరీరమొదిలి, పూర్ణ హృదయంతో ఎగసిపోయినట్టు — ఎగసి పోతున్నారు.

చూద్దాం - ఎంతవరకలా పయనిస్తారో?...

## 5

అది నర్సాపురం తాలూకాలో గ్రామమైన మోగల్లు. ముచ్చట గొలుపుతున్న ఆ వూరిలో నొకమూల పచ్చని పంటపొలాలను, తొంగి పూస్తూవున్న బంగాళాపెంకుల బంగళా అది. దానికిచుట్టూ పహారీగోడ వుంది. ఆ పహారీగోడ లోపం పుష్ప, ఫల వృక్షప్రదర్శ

నాలను మరపించే అనేక రకాలైన ఫల, పుష్ప వృక్షాలున్నాయి. ఇంతి, బంతి, చామంతి మొక్కలు; గులాబీ, ముద్దుగులాబీ, అడవి గులాబీ, ఎర్రగులాబీలు, జాజి, విరజాజి, సన్నజాజులు, మాధవీ, మాలతీలతలు, మన్మథబాణాలు, ఇంకా ఎన్నెన్నో రకాలున్నాయి. అవన్నీ ఆ రాత్రి ప్రశాంతంగా నిద్రపోయి, మరునాడు వుషాచలుడు తన వెచ్చటి చేతులతో మేను తట్టగానే, శరీరాలు పులకరించి, వొళ్లు విడుచుకుంటూ, తమ వదనాలను వికసింపజేసుకుంటూ, ఆ పూగన్నెలు ఒకటొకటే సుగంధాన్ని గుబాళిస్తూ లేస్తూ ఆ బంగళాకు వింత సౌందర్యాన్ని చేకూరుస్తున్నాయి. అన్నింటికీ మించి, ఆ పహరీగేటునుండి, బంగళా సింహద్వారంవరకూ కట్టబడిన ఆర్చిపై రేరాణి లతాపద్మాలు ఆ రాత్రల్లా వికసించి, తన సౌరభంతో మురిసిపోయి, ఇతరులను మురిపించి, మనోల్లాసాన్ని చేకూర్చి, నక్షత్రాల్లా ఆ బంగళా ముంగిట రాలిపోయి వున్నాయి.

ఆ బంగళా సుందరస్వరూపం, దూరానికి తీర్చిదిద్దిన మనోహర తైలవర్ణ చిత్రంలా వుంది.

సింహద్వారం తలుపులు తెరచివున్నాయి,

వచ్చేపోయేవాళ్ళ రాకపోకలు హడావిడి విపరీతంగా వుందా యింటిలో.

బయట ఆ బంగళా అరుగుపై అలా వచ్చేపోయేవారిని ఆత్రుతగా చూస్తూ ఓ నడివయస్కుడు అటూ, ఇటూ కంగారుగా తిరుగుతున్నాడు.

శింగన్న చెబుతున్నాడు—

'ఆయనే - మన రామరాజు తండ్రి - వెంకటరామరాజు గారు. ఆనాడాయన మొగల్లులో చేయిదిరిగిన చిత్రకారుడు. కుంచెపట్టితే తలవెంద్రుకకు కూడా విభ్రమలావణ్యాన్ని తేగల దిట్ట. పాపం! ఆయనకు బిడ్డలు లేరు. ఆ కొరతను పూడ్చుకోడానికే, అతని అడుగులు ఆత్రుత చెందుతున్నాయి...చూడు నాయనా!'

అవును ! "అపుత్రస్య గతిర్నాస్తి !" అనే సూత్రంలో విపరీత మైన నమ్మకం ఆయనికి.

పుత్రులు లేకపోతే గతులు లేకపోవడమే కాదు. అటువంటి వానికి ఆనందమే లేదు. ఆ కొంపకు కళే లేదు. ఆకాశానికి సూర్యు డెంత వెలుగో, కొంపకు పుత్రుడంత వెలుగు. పుత్రుడులేని కొరత మగ వానికైతే వృద్ధాప్యంలో తెలుస్తుంది. ఆడదానికయితే నిత్యమూ తెలుస్తుంది - మరి తన వక్షోజాల క్షీరాన్ని ఏ పటిలో పారబోస్తుంది.

ఆ తండ్రి ఆత్రుతకు తగ్గట్టుగా - లోపలనుండి—

"కేర్ ! కేర్ !" మని ధ్వని వినవచ్చింది. అది అప్పుడే పుట్టిన బిడ్డ మంగళవాచకం.

ఓ దాది రివ్వునొచ్చి—

"మగపిల్లవాడు. బాబూ !" అంది.

రామరాజుగారు సంతోషంలో వుక్కిరి బిక్కిరై—

"కాదే, పులిపిల్ల !" అంటు, జేబులోని ఒకనోటు దాదిచేతిలో పెట్టి, లోనికి పరుగెత్తాడు

అంతా తప్పుకున్నారు. ఓ ముసని అవ్వ మాత్రం ప్రక్కనుంది.

ఏడ్చిన బిడ్డకు, ప్రక్కలో తల్లి రొమ్ము అందించింది.

వెంకటరామరాజుగారు, ఛలోక్తిగా—

"పిచ్చిదానా ! నా బిడ్డ పాలకోసమేడ్చాడనుకున్నావా !"

ప్రక్కనున్న అవ్వ అంది—

"మరెందు కేడుస్తాడబ్బా ?"

"కాదు ! కాదు ! నా బిడ్డ ఏడిచింది - పాలకోసం కాదు. అగాధంలోని అనాథుల బాధలు చూచి ఏడ్చాడు. పరతంత్రమైన దేశపటం కనబడి ఏడ్చాడు..." అంటూ వెంకటరామరాజుగారు వుద్రేకతరంగ డోలికల్లో వూగిపోయాడు.

అలా దేశంచూచి, పేదలచూచి, ఏడ్చినబిడ్డకు తల్లిపాలు పడ వను కుంటాను. నవరత్నాలు నూరిపోస్తే పడతయో, లేక అమృ

తాన్నే తెచ్చి అంగుటిలో పోస్తే పడుతుందో? లేక చందమామను పట్టుకుతెచ్చి, కళ్ళముందు పెడితే ఏడవడం మానేస్తాడో, ఆ తండ్రికే తెలియాలి.

కాని ముసలిఅవ్వ మాత్రం గ్రమ్మున అనేసింది.

'ఏమోనాయనా? పిల్లవాడి లోదొడల్లో పుట్టుమచ్చుంది - ప్రాణానికే ప్రమాదం!' అంది.

ఆ మాటకు కంగారుపడ్డ తల్లి—

"బాబూ!" అంటూ బిడ్డను గుండెల కదుముకుంది.

తండ్రి తెల్లబోయి, పిల్లవాడి లోదొడలు, అరికాలు, అర చేతులు గబగబా చూసాడు.

ఆశ్చర్యబోయాడు.

చేతి వ్రేళ్ళపై అయిదు విష్ణుచక్రాలున్నాయి.

"ఏకచక్రే మహాభోగి" అన్న జోతిష్య పండితులు, అయిదు వేళ్ళకూ అయిదూ విష్ణుచక్రాలే వున్నప్పుడు ఫలితం ఏమిటో చెప్పలేదు. కాని శ్రీకృష్ణదేవరాయలకు, అయిదు వ్రేళ్ళను అయిదు చక్రాలున్నందుకు—

ఆయన చక్రవర్తి కావడమేగాక కలంపట్టి అష్టదిగ్గజాలచే కలనడిపించి, కమ్మని కావ్యాలు రాయించిన కవీ, రసికుడూ అయ్యాడు. కలమేగాక కత్తిపట్టి కళింగాన్ని గెలిచిన మహావీరుడై తుంగభద్ర ఒడ్డునే కత్తి కడుగగలిగాడు.

ఆ అవ్వ చెప్పినది - సత్యమే అయినా, చక్రాలు చూచి తండ్రి తన్మయుడై పోయాడు.

అంతేకాదు,

అరికాలులో విష్ణుచక్రముంది.

అలా అరికాలులో విష్ణుచక్రం - శ్రీకృష్ణుడికి వుంది. తరువాత గౌతమ బుద్ధుడికి వుంది.

అందుకే శ్రీకృష్ణుడు—

దుష్టజన శిక్షణకు—

సాధుజన రక్షణకు—

కృష్ణావతారం దాల్చాడు.

అందుకే గౌతమ బుద్ధుడు—

అర్ధరాత్రి ఆలుపిల్లలనూ, సామ్రాజ్యాన్ని చిల్లిగవ్వలలా తలంచి, త్యజించివేసాడు.

ధర్మ సంస్థాపనకు—

సత్య సముద్ధరణకు—

శాంతి వ్యాప్తికి

సర్వస్వాన్ని ధారబోసివేసాడు.

అవన్నీ తలచుకుంటె, తండ్రికి ఆనందబాష్పాలొలికాయి. బింకంగా, అవ్వకేసి చూచి, అన్నాడు—

"ప్రాణానికే ప్రమాదమో, ప్రాణాన్నే జయిస్తాడో! చూపిస్తా!" నని.

అవ్వ ఆశ్చర్యపోయింది.

తల్లి నారాయణమ్మ. భర్త రామరాజుగారి వొంక తేరి చూచింది.

"అవును, నారూ! నీ బిడ్డ గౌతమ బుద్ధునిలోని ధర్మ సందేశాన్నీ, శ్రీకృష్ణపరమాత్మలోని దుష్టజన శిక్షణ, సాధుజన రక్షణా సంబుద్ధినీ, శ్రీకృష్ణదేవరాయలలోని వీరత్వాన్నీ అన్నింటినీ జీర్ణించుకుంటాడు. నారూ!" అని ఆమె ముంగురులు దువ్వాడు. అబ్బ! బిడ్డంటె ఆయన కెంత ప్రేమ!

మూడుమాసాలు గడవగానే రామరాజుగారు బిడ్డడ్ని రాజమండ్రి తీసుకొచ్చేసారు. రాజమండ్రిలో ఆయన ఫోటో స్టుడియో పెట్టారు. రాజమండ్రి రావడం ఆయనకెంతో ఆనందమయింది.

కారణం—

రాజమండ్రి లలితకళలకు పుట్టినిల్లు. వుత్కృష్ట. సారస్వత సృష్టికి కేంద్రం. పవిత్రమైన గౌతమీ గోదావరి ప్రవహిస్తూ పాపులను పునీతం చేస్తున్న పుణ్యక్షేత్రం.

ఇక్కడే ఒకనాడు ఆదికవి నన్నయభట్టు, పవిత్ర గోదావరి తటాన పుష్కరాలరేవున స్నానమాడి, మొట్టమొదటిసారిగా కీకరారణ్యంలోవున్న తెలుగు సారస్వతానికి రూపురేఖలు దిద్దడానికి పంచమవేదమైన మహాభారత రచనకు, తాటియాకుల పత్రంపై. పసుపు పెట్టి, గంటాన్ని చేబట్టి శ్రీకారంపెట్టిన స్థలమిది.

ఒకనాడు - తెలుగు కళాకన్నిక, పచ్చని తోరణాలతో నలంకరించిన పందిరిలో తొలిసారిగా గజ్జకట్టి, తన పదవిన్యాసంలో చిరుగజ్జెల మోహనసవ్వడిలో, పరాయిరాజులకు నోరూరింపజేసిన రాజరాజుని ఆస్థానమిదే. ఇక్కడే.

ఇక్కడే దక్షిణకాశీ అని ప్రసిద్దిచెందిన కోటిలింగాల పవిత్ర తీర్థముంది. నిత్యం కోటిలింగేశ్వరుని పాదపద్మముల స్పృజిస్తూ, గోదావరీజలాలే పునీతమవుతుంటాయి.

ఇక్కడనే, సాంఘికదురాచారాలపై వితంతువివాహ వ్యతిరేకోద్యమంపై. త్రుప్పు పట్టిన హిందూ సనాతన ధర్మాలపై, మూఢనమ్మకాలపై యుద్ధం ప్రకటించి తిరుగబడ్డ మహావీరుడు వీరేశలింగం జన్మించిం దిక్కడే.

దామెర్లవారి కుంచె, రంగు రంగుల కాంతుల నలందుకొని, చిత్ర లేఖనంలో పేద, ధనిక తారతమ్యాలు లేవని - అనగా, పంట పొలాలపై కుప్పనూర్పులకు పోయిన తనప్రియుని రాకకోసం, పూరిగుడిసెలో ఎదురుచూస్తున్న పల్లెపడుచు కనుసన్నలకు, రాజభవన అంతర్మందిరంలో రాజకుమారుడైన తన ప్రేమికుని రాకకు ఎదురు చూస్తున్న రాజకుమారి కనుసన్నలకూ భేదంలేదని నిరూపించిన కళారంగమిదే.

"బిక్షుగాడివై వచ్చి, నా గుమ్మంముందు నిల్చి, 'బిక్షాందేహి అన్నపూర్ణేశ్వరీ!' అంటే, 'అబ్బీ! ముందునన్ను పెండ్లాడతానని చెప్ప

గలిగితే బిక్ష పెడతాన'ని అనగలిగిన చిత్రాంగిని ఆమె ప్రియుడైన సారంగధరుని నుండి విడదీసి, సారంగధరుని కాళ్ళు నరికి, చిత్రాం గిని తను పెండ్లాడిన రాజరాజనరేంద్రుని స్వార్థచింతనగాక, చిత్రాంగీ-సారంగధరుల పవిత్రప్రేమ సందేశాన్ని నిత్యం ప్రతిధ్వనించే సారంగధర మెట్ట యిక్కడే వుంది.

ప్రకాశంపంతులుగారి లాంటివాళ్ళు తెలుగు నాటకరంగ పవి త్రతను కాపాడ్డానికి తొలిసారి ముఖానికి రంగుపూసుకొని, స్త్రీ పాత్రలను ధరించిన, మహోత్కృష్ట ఆంధ్రనాటక రంగస్థల మిక్కడ నుండే అన్ని దిశలకూ ప్రాకింది.

అంతేగాక.

వీలుతప్పి, వశంతప్పి, చిత్తంవచ్చినట్టు పరుగెత్తి, పంటపొలా లను గ్రామాలను, పశువుల్ని ముంచెత్తి తన గర్భంలో కలిపివేసు కుంటూ, ఆ పటికాయేడు నూతన నడకలతో, రకరకాల భీకరావ తారాలను దాలుస్తూ, చెలరేగే గోదావరి జలాలకు ముక్కు త్రాళ్ళు వేసి, మానవుని చెప్పుచేతల్లో మసులుకునేంతటిస్థితికి తీసుకువచ్చిన ఆనకట్ట యిక్కడే వుంది.

రాజమండ్రి ప్రత్యేకత చెప్పుకోడానికి చాలాకాలం పడుతుంది. అటువంటి రాజమండ్రిలో నివాసం కావడం ఆయనకెంత ఘనత ! అందుకే ఆయనకంత ఆనందం.

ఏండ్లు గడిచాయ్.

శింగన్న చెబుతున్నాడు—

"గోరంతదీపం కొండలకంత వెలుగయితే, ఆ చిన్నారి బిడ్డ ఆ కొంపకే వెలుగయ్యాడు. ఆ వెలుగులో ఏడేండ్లు అవలీలగా గడిచి పోయాయి. వాక్శుద్ధిగల మాటలతో సత్యం ధ్వనిస్తుందంటారు - పెద్దలు. సత్యమే జయిస్తే ఆ తండ్రిమాట జయించాలి. చూడు నాయనా! ఒకరోజు..." అని ఆగాడు.

*    *    *    *    *

రాజు తల్లి నారాయణమ్మగారు బిడ్డడి ప్రక్కనే కూర్చొని చదువు చెబుతోంది. ఆ చెబుతున్న గదిలో ఏ గోడపైపై చూచినా ధృవుడు, ప్రహ్లాదుడు, బ్రహ్మనాయనా, బాలచంద్రుడూ, ఖడ్గ తిక్కన, కాకతీయ రుద్రమలాంటి వీరత్వాన్ని, తెలుగుతనాన్ని ప్రబోధించే చిత్రాలే వున్నాయి.

అందులోనూ వెంకటరామరాజుగారు ఛాయాచిత్రకారుడు. చిత్రలేఖకుడు కూడా ఇక కొంపెలా వుంటుందో వూహించుకోవచ్చు.

తల్లి ఓ లెక్క చెపుతోంది -

'చూడునాయనా! ఒక సాహుకారు ఒక మందుసీసా రూపాయ చొప్పున పన్నెండు కొన్నాడు. తిరిగి ఒక్కొక్కటే, రెండు రూపాయల చొప్పున పన్నెండు అమ్మేసాడు. ఆ సాహుకారికి లాభమెంత!" అని పిల్లవానిని అడిగింది.

మన రాజుదంతా తండ్రి తర్ఫీదు. మార్వాడీ లెక్కలంటే మహామంట!

కొంటెగా ప్రశ్నించాడు__

"అదేం మందో?"

"వెధవ కొంటెప్రశ్నా నువ్వూను. యేమందైతే ఏం?"

'అందులోనే వుందమ్మ ! లెఖ్క ! చెప్పు?'

తల్లి కాస్త విసుగ్గా -

"ఏదో ప్రాణాన్ని నిలబెట్టే మందనుకో !"

బిడ్డడు లేచి -

"అయితే చెప్పమంటావా?"

"కూర్చొని చెప్పరా?"

కూర్చొని చెప్పేది - కాదమ్మా !

"పన్నెండు సీసాలకి పన్నెండు నెలలు జైదు!" అంటూ చప్పట్లు చరచడం మొదలెట్టాడు.

తల్లి బిత్తరపోయి చూస్తూ -

'ఇవా నీవు నేర్చుకుంటూన్న లెఖ్ఖలు !' అంటూ బెదిరిస్తూ లేచింది.

ఇంతలోకే వెంకటరామరాజుగారో ప్రక్కనుండి వచ్చారు. ఆయన రాగానే, మన రాజు తండ్రి కాళ్ళను చుట్టేసాడు.

"సెభాష్ ! నాయనా !" అంటూ తండ్రి మేను తట్టాడు బిడ్డడ్ని !

"మీ తండ్రి కొడుకుల వరస బాగుంది." అంటూ, చుబుకంపై చేయివేసుకుని విడ్డూరంగా నిలబడింది.

"కాదు మరి ! ప్రాణాన్ని నిలబెట్టే మందు, అంతలాభాని కమ్మితే, చేతిలో కానీలేని పేదవాళ్ళు ఏంకావాలి ? అందుకే ప్రాణాపాయంలో నున్న పేదవాడ్ని ఏడిపించే దురాశాపరుడైన సాహుకారికి ఖైదు !' అని వెంకటరామరాజుగారనగానే -

'బాగుంది - మీ వ్యాఖ్యానం. ఇలాగే నేర్పండి ! వీడు బాగుపడతాడు.' అంటూ మూతి త్రిప్పుకొని ఆమె వంటింట్లోకి వెళ్ళబోయింది.

వెంకట రామరాజుగారు. ఆమె చేయిపట్టి నిలిపి -

"ఇదిగో ! చూడు ! వాడి విద్య నీ కిప్పుడే చూపిస్తా !" అంటూ బిడ్డనివొంక చూచి -

'చూడు, నాయనా ! మన తెలుగుజాతి గొప్పతనం ఎందులో వుంది ?'

"వారిలో !" అని బిడ్డడు గోడపై బొమ్మల్ని చూపాడు.

"సెభాష్, బాబూ !" అంటూ కొడుకును ,ముద్దాడి ఎత్తుకున్నాడు.

"ఏమిటో మీ తండ్రీ కొడుకుల భాష !" అంటూ నారాయణమ్మ గారు పైటచెంగు బొడ్డులో దోపుకుంటూ, మరల వెళ్ళబోతుండగా -

"కాదు, నారూ ! చూడు ! ఆ బాలచంద్రుడు - బాల్యంలోనే కత్తి ఝళిపించి పోరాడగలిగిన తెలుగుబిడ్డ! అదిగో, ఆమె రుద్రమ్మ!-

మూడుకోట్ల తెలుగుబిడ్డలకు ఏకైకతల్లిగా, తెలుగు రాణిగా, ముప్పయ్యేండ్లు పైగా పాలించి, తెలుగుజాతి నైక్యపరచగలిగిన తెలుగు దొరసాని. చూచావా? నిజంగా మన రాజు చెప్పినట్టు, మన జాతి గొప్పకు కారకులు వీరే. అంటూ హుషారుగా మాట్లాడారు? రామరాజుగారు.

"ఏమిటో, మీరు వీడికి దేశభక్తే నూరిపోసేస్తున్నారు!"

'ఆఁ! ఒప్పుకున్నావా? తల్లి పాలకంటే శ్రేష్ఠం - దేశభక్తే!'

'ఏదో తయారుచేయండి. వీరునిగా!' నంటూ వెళ్ళిపోయిం దామె.

మరి ఆమెకేం తెల్సు? - వెంకటరామరాజుగారి తర్ఫీదు?

అందరి తండ్రులలాగు కాదు ఆయన!

బిడ్డడ్ని ప్రేమిస్తాడు - అందరికంటె ఎక్కువగా!

బిడ్డడికి నేర్పుతాడు - అందరికంటె అధికంగా!

బిడ్డడిని అదుపులో నుంచుతాడు - అందరికంటె అధికంగా!

అయితే అందరూ బిడ్డడ్ని ప్రేమిస్తారు!

కాని -

కొందరు -

తమకున్న ప్రేమనంతా ఒలకబోసుకుంటూ. కుర్రోడు చేసే చండాలపు పనులన్నింటినీ సమర్థిస్తూ, పెద్దయ్యేసరికి శుద్ధ పొగరు మోతుగా, సమాజంలో ఒక దరికి జేరిన చెత్తలా తయారుచేస్తారు.

మరి కొందరు -

పిల్లవాడు పెరిగి పోకిరీ అయిపోతాడనీ, పొగరుమోతుగా తయారౌతాడని, ఆ పిల్లవాడు చేసే ఆదర్శమైన సాహసకృత్యాల నన్నింటినీ అణగద్రొక్కి, ఇనుపదర్వాజాల మధ్య కూపస్థమండూకంలా కట్టి పారేస్తారు.

ఇక ఆ బిడ్డడు వర్ధిల్లే దెలా?

అయితే అందరూ బిడ్డడికి ఏదో నేర్పాలనుకుంటారు.

ఈ నేర్పడంలో కొందరు -

తన కొడుకు పెద్దయి, సాధుమూర్తి, జ్ఞానసంపన్నుడు కావా లనే తహతహతో అనేక నీతులు బోధిస్తారు. కాని కుర్రవాడు వినడు సరిగదా! ఈ పద్ధతివల్ల వాడు సన్యాసై పోవడం తథ్యం. ఆ సంగతా తల్లిదండ్రులకు తెలీదు.

ఈ నేర్పేవారిలో ఇంకో మూర్ఖతెగ వుంది -

వాళ్ళకుండే దొక్కటే, వాళ్ళు పిల్లవాడికి నేర్పేదీ ఒక్కటే?

అది -

"మనకు చదువు అచ్చిరాదు!" అని

ఒకవేళ అచ్చొచ్చినా -

'మనం వూళ్ళేలాలా పరిపాలించాలా?' అని.

ఈ పద్ధతిలో పిల్లవాడు చిన్నతనంనుండే బండదేరి, కడకు పెరిగి అవినీతిపరుడుగానూ, రోడ్లో, తలలుకొట్టుకు బ్రతికే దొంగ వాడుగానూ తయారౌతాడు.

అలా అని తెలిస్తే వాళ్ళెందుకలా అంటారు? అయితే తెలియ జెప్పినా వినేదశలో ఇంకా వారు లేరు. ఇది చదువురాని తల్లిదం డ్రుల తెగ.

చదువొచ్చిన తలిదండ్రుల మూర్ఖతెగ యింకోటి వుంది.

తమ బిడ్డడ్ని విపరీతంగా, వేగంగా చదివించేసి, రాజ్యాలే లిద్దామని, కవిని చేద్దామని, నాట్యకోవిదుడుగా మార్చివేద్దామని ఏవేవో తట్టెడు కోర్కెలు.

కాని ఆ బిడ్డడి బుర్ర చిన్నది -

ఆ చిన్నదానిలో ఇన్ని విషయాలెలా పడుతాయి.

అయినా ఒకప్రక్క దిగుతున్న హిందీమేష్టరు; అదేమార్గాన ఎక్కుతున్న యింగ్లీషు మేష్టరు; ఇంకోప్రక్క దిగుతున్న డ్యాన్సు మేష్టరు, అదేమార్గాన ఎక్కుతున్న సంగీతం మేష్టారు; మరొకప్రక్క దిగుతున్న సంస్కృత పండితుడు; అదేమార్గాన ఎక్కుతున్న మరో పండితుడు.

అంతే ప్రయివేటు అయిపోతుంది.

కుర్రవాడికి పిచ్చెక్కిపోతుంది.

మరునాడు టైఫాయిడ్, లేదా నూతిలో తేలిపోయిన శవం.

ఇదీ పిల్లలయెడల లోకంలో తల్లిదండ్రుల వర్తన.

అందుకే పిల్లలు చెడిపోతున్నారు.

చంటిపిల్లవాని మనస్సు సన్నజాజి మొక్కనీ.

ఆ మొక్కను ఆకులు ఎంత చక్కగా దూస్తే అంత విస్తారంగా ఆ సన్నజాజులు పూస్తాయి. విరుస్తాయిని అర్థం చేసుకోగలిగినవాడు - మన రాజు తండ్రి - వేంకటరామరాజు -

అందుకే - ఆ లెఖ్కలైన వెంటనే విశ్రాంతికోసమని -

'పద, నాయనా! గోదావరి గట్టుకు షికారువెడదాం! అంటూ బిడ్డడ్ని వాహ్యాళికి తీసుకవెళ్ళాడా తండ్రి !

గోదావరి గట్టుకొచ్చారు - తండ్రీ కొడుకులూ :

పగలల్లా ప్రచండతాపంతో తేజరిల్లిన భానుడు కూడా పడమటి కొండలపై ఒక్కపూట విశ్రాంతి దీసుకోడానికి దిగుతున్నాడు. ఆ తేజస్సురు ఎర్రబారిన ఆ పడమటిగట్టున కుంకుమపూదోట పెరుగుతున్నట్టుగా వుంది ఈ వేళ గోదావరి గట్టుపై విహారార్థం అరుదెంచిన కలకలలాడుతున్న జనంపై ఆ అరుణచ్ఛాయలుపడి. దివ్యత్వం పొందిన దేవతాగణంలా కనబడుతున్నారు. ఆ మధ్య తండ్రీ కొడుకులు కేరింతాలు కొట్టుకుంటున్నారు.

అదేగట్టున జనసమ్మర్దాన్ని లక్ష్యం చేయకుండా, ఓ తెల్లాఫీసరు పొగరుమోతుతనంగా ఎత్తైన గుర్రంపై స్వారిచేసుకుంటూ, "టకటకా" వచ్చేస్తున్నాడు. త్రోవకోసం మధ్య మధ్య నిరంకుశంగా హంటరు ఝుళిపిస్తున్నాడాఫీసరు. జనం భీకాభీకలై పారిపోతున్నారు.. ఆ ప్రక్కనేవున్న మన రాజు 'కెవ్వు'న కేకేసి, వెనక్కుతూలి బెదురుతూ, ఆ పోతున్న ఆఫీసరుకు నమస్కారం పెట్టాడు.

వెంటనే దవడపై చెళ్ళున తగిలింది - లెంపకాయ!

"వెధవా! తెలుగువాడవై వుండి తెల్లవాడి పొగరుమోతు తనానికి చేయెత్తి నమస్కారం చేస్తావా?, అంటూ తండ్రి కొట్టాడు.

బిడ్డడు కెవ్వుమన్నాడు.

'ఊ! నోరుముయ్! ఇంకెప్పుడైనా పరజాతికి దణ్ణం బెడతావా?'

బిక్కచచ్చిపోయిన బిడ్డ—

పె...ట్ట...ను!...

"తెలిసిందా? మన జాతికి - వొంచు - తల! మనది ముక్కోటి రతనాలవీణ. నవరసాలు శ్రావ్యంగా గానంచేయగల గొంతు మనది. అటువంటి మన జాతిని గొంతును పిసుకుతున్న కసాయిజాతి - అది! గుర్తుంచుకో!"

అంటూ తీసుకొని, యింటికి బయలుదేరాడు. భానుడుకూడా తన బంగళా కెళ్ళిపోయాడు.

అంతే. మన చిట్టిరాజులో ఆ గడియ, బుద్ధుడు మహాపరినిర్వాణం చెందినరోజు. అర్జునుడు శ్రీకృష్ణుని గీతాసందేశము విన్న రోజు.

స్వభావంలోనే మార్పు వచ్చేసింది.

అన్యాయాలను చూచి వహించలేని తత్వం. ఆ పసిహృదయంలో చోటు చేసుకుంది.

అన్యాయాలను ధిక్కరించగల సాహసం, ఆ పసిగుండెలో కంబళీ పరిచింది.

ఒకరోజున విద్యార్థులంతా యీతకు వెళ్ళారు. అప్పుడు ఒక విద్యార్థి రేవులో మునిగిపోయాడు.

రాజుకు సరిగ్గా యీతరాదు.

కాని చొరవ! "ధైర్యే సాహసే లక్ష్మి!"

ధైర్య సాహసా లెక్కడుంటే అక్కడ లక్ష్మి తాండవిస్తుం దని పెద్దలన్నారు.

కాదు—

ధైర్య, సాహసా లెక్కడుంటే అక్కడ ప్రాణాల్ని రక్షించే శక్తి. ప్రాణాన్ని జయించగలిగే శక్తి వుంటుంది.

అంతే, వెంటనే రాజు కాలువలో దూకేసాడు. నీట మునిగి తేలుచున్న పిల్లవాడ్ని తక్షణం రక్షించాడు.

రక్షించి యింటికి వెళ్ళిపోయాక రక్షించబడ్డ పిల్లవాని తల్లి దండ్రులు వెంకటరామరాజుగారిని కలుసుకొని కృతజ్ఞత తెలియ జేసారు.

ఆ తండ్రి కళ్ళు ఆనందబాష్పాలు చిందాయి.

కాని, ఆ తండ్రిలో అనుమానం పీకుతూనే వుంది.

"తనకోసం గాక, ఎదుటివానికోసం తన బిడ్డడు ఏనాడో ప్రాణాలు పోగొట్టుకుంటాడేమో"నని.

అయినా, బిడ్డడ్ని ఆ తండ్రి ఏమీ అనలేదు. అలా మౌనం గానే వుండిపోయాడు.

ఒకనాడు సాయంత్రం, రాజు బడినుండి యింటికి వస్తున్నాడు. ఒక హరిజన పిల్లవాడ్ని అక్రమంగా ముగ్గురు తెల్లచొక్కా కుర్రి వాళ్ళు పుస్తకాలు లాక్కొని కొడుతున్నారు అలా కొట్టడానికి కారణం—

మాసినబట్టలతో క్లాసులో తమ ప్రక్క కూర్చున్నాడట!

విషయం తెలుసుకున్న రాజు-వెంటనే రణరంగంలోకి దూకాడు ఆ ముగ్గురు తెల్లచొక్కా కుర్రవాళ్ళనీ పట్టుకొని,

"అది తప్పు!" అని చెప్పగా వినకపోతే—

నాలుగు అర్ధచంద్ర ప్రయోగాలు చేసి, ఆ హరిజనబాలుడ్ని విడిపించాడు.

ఆ హరిజనబాలుడి తల్లిదండ్రులు రామరాజుగారిని కలుసు కొని కృతజ్ఞత తెలుపుకున్నారు.

తండ్రి ఎంతో ఆనందించాడు.

అయితే, పిల్లవానిలో దురుసుతనానికి బీజం పడుతుందేమో నని శంకించాడు.

దురుసుతనం - గొప్పతనానికే దెబ్బ ! ఒకానొక సమయంలో మనిషికి మరీ నష్టం చేకూర్చే తత్వం అది.

అలా అని బిడ్డడ్ని ఆయనేమీ అనలేదు,

లోలోన మధనపడ్డాడు.

మధనపడి వూరుకోలేదు. ఆ పద్ధతిలో ఆ బాలచంద్రునికి తర్ఫీదు నిస్తూ వస్తున్నాడు.

ఆపర్కప్రాయుడు కావాలి - తన బిడ్డ.

మృత్యువునే జయించగలిదిన మృత్యుంజయుడు కావాలి — తనబిడ్డ.

అహర్నిశలూ ఆయన కిదే తలంపు.

కాని లాభమేమిటి ?

రోజులు గడుస్తున్నకొద్దీ, ఆయన ఆరోగ్యం క్షీణించిపోయింది. మంచమెక్కాడు. జబ్బులోకూడా, తన బిడ్డ బాలచంద్రుని అంత వాడై చిరకాలం జీవించాలని కోరుకుంటూ - ఎదుటిగోడపైని బాల చంద్రుని చిత్రపటం వైపే ఆయనదృష్టి లగ్నంచేసేవాడు.

ఆ తండ్రికి పిల్లవానిపై ఎన్నో ఆశలు.

ఆ ఆశలు తను జీవించియుండగా పరిపూర్ణం కావాలని కోరు కున్నాడు.

అంతా అలా కోరుకుంటారు.

కాని ప్రయోజనమేమిటి ?

ఒక్కొక్కతండ్రి, పిల్లవాని దుర్నడతకు అహోరాత్రాలు క్రుంగుకుంటూ మంచం పట్టేస్తాడు. తన కళ్ళముందే తన బిడ్డడు తన వుద్దేశాలకు, నైజాలకు ఇక వొంగనంతటి మానులా పెరిగిపోతోంటే, ఆ తండ్రి ఏం చేయగలడు - మంచమెక్కడం తప్ప !

అలా ఎందరో తండ్రులు నిత్యము, తన బిడ్డనికోసం లోలోన కుమిలి కుమిలి చచ్చేవారున్నారు.

ఒక తండ్రి - పండితుడు.

బిడ్డ - శుంఠ.

వాడు తరగతిలో కూర్చుంటే - తను చదువకపోవడ మటుంచి, ప్రక్కనున్నవానిని చదువనీయడు. తను దెబ్బలు తిని, ప్రక్కనున్నవాడ్ని తినిపిస్తాడు.

ఈ వార్త తండ్రి వింటాడు. కంట తడిపెడతాడు. కాని బిడ్డడ్ని చక్కజేసుకోలేడు. అప్పటికే ఆ బిడ్డ మ్రానైపోయాడు. "మ్రొక్కై వొంగనిది మ్రానై వొంగదు" కదా!

అంతే; అలాగే!

ప్రతీ తండ్రీ, తన బిడ్డడు ఒక ఇంజనీరో, ఒక డాక్టరో, ఒక పండితుడో, ఒక రాజకీయనాయకుడో అయిపోవాలని కోరుకుంటాడు. తద్విరుద్ధంగా బిడ్డడు పెరుగుతూంటే, ఆ బిడ్డని ప్రతీచర్యా ఆ తండ్రి బ్రతికుండగానే, అతని శరీరంపై కత్తులనాట్లు పడుతున్నట్టే హింసించబడతారు.

కాని, వెంకటరామరాజుగారు అలా కాదు. తన బిడ్డడు అటువంటివాడు కాదు.

ఆయన మంచానికి ఎదురుగానే, వరండాలో ఓ మూల సన్నని దీపకాంతిలో పుస్తకం చదువుతూ, తండ్రి జబ్బుస్థితికి ఏదో ఆలోచనలో చదువునాపి, తదేకదృష్టితో చూస్తున్నాడు.

అర్థం చేసుకున్నాడు - తండ్రి.

కన్నీరు నిండుకున్న కన్నులతో—

"బాబూ!" అని పిలిచాడు.

"నాన్నా!" అంటూ బిడ్డడు చర్రున పరుగెత్తుకొనివచ్చి, తండ్రి ఒడిలో వాలాడు.

వాలిన బిడ్డని, తల నిమురుతూన్నాడు—తండ్రి. ఏదో చెప్పా లనుకున్నాడు. కాని యింతలో దగ్గుతెర, ఆ తండ్రీ కొడుకుల హృద యాలకు అడ్డుగా నిలిచింది.

తమాయించుకొని-అన్నాడు-తండ్రి—

"బాబూ! నా ఆశలు అన్నీ నీమీదే పెట్టుకుంటున్నా!" అంటూ బాలచంద్రుని చిత్రాన్ని బిడ్డడికి చూపించాడు.

ఏకదీక్షతో ఆ చిత్రాన్ని మనరాజు చూచాడు.

"చూసావా? నాయనా! మనజాతే వీరజాతి! వీరులుగా పుట్టింది: వీరులుగానే మరణించాం!" అన్నాడో, లేదో, ఆ తండ్రికి మరల పెద్ద దగ్గు తెరవచ్చింది. ఆ దగ్గుతెర; ఆయన గుండెల్ని రం పంతో కోసేసినట్లు కోసేస్తోంది—

"నాన్నా!" అంటూ, బిడ్డడు, ఆ గుండెల్ని రాస్తున్నాడు.

అంతలోకే, బిందెతో నీళ్ళుతెస్తూ గుమ్మంలో అడుగుపెట్టిన నారాయణమ్మగారు, హడిలిపోయి, బిందె వొదిలివేసింది.

"బాబూ!" అంటూ రివ్వున పరుగెత్తుకొచ్చి, పైట నోటి కడ్డంగా పెట్టుకొని, పతి పాదాలపై వాలిందె.

వెంకటరామరాజుగారు, తన జాలికన్నులతో, నారాయ ణమ్మను పిలిచారు.

'నారూ' అని అనబోయాడు.

మాట రాలేదు.

ఆమె చేతుల్లో బిడ్డని చేతులు పెట్టాడు.

తల్లీ బిడ్డలు, ఒక్కసారే ఘొల్లుమన్నారు.

గుమ్మవద్ద క్రిందపడ్డ బిందెలోని, ధారగా వొలికిన నీళ్లు, యిప్పుడు బొట్లు, బొట్లుగా పడుతున్నయ్. ఆ మూల వరండాలో బాలుడు చదివిన దీపశిఖ సన్నగిలుతోంది.

ఆ తండ్రి, అనలేక, అనలేక—

"బాబును ఎలాచూస్తావో, నారూ! బాబుకు తండ్రిలేని కొరత నీ వొక్కర్తవే తీర్చాలి..." ఇక మాటలాడలేకపోయాడు. ఆ

మాటలో బ్రహ్మాండమైన అర్థం గుంభనమైవుంది. ఆమె ఒక్కర్తే తీర్చాలట! వింత కోర్కె!

ఆ భారాన్ని నారాయణమ్మ, ఒక పొరలివచ్చిన ఏడుపుతో మోయడానికి అంగీకరించింది.

పాపం! ఆ అర్థాన్ని, ఆ తండ్రి చెబుదామనుకునేసరికి మరల ఇంకో దగ్గుతెరవచ్చింది. ఆ తండ్రి గుండెలను ఆపివేసింది—ఆ దగ్గుతెర. దానికి జాలిలేదు, హృదయంలేదు. మానవ రుధిరప్రవాహంలో క్రీడించే, ప్రళయాంతకి చేతిలో పెరిగిన బిడ్డది. అంతే.

బిందెనుండి వొలుకుతున్న నీటిబొట్లు ఒక్కసారిగా ఆగిపోయాయి. తెగిన పక్షిరెక్కల్లా టపాటపా కొట్టుకొని విలపించి, విలపించి ఆ దీపశిఖ కొండెక్కిపోయింది.

తల్లీ బిడ్డ ఘొల్లుమన్నారు.

ఇకా సంసారాన్ని ఒడుదుడుకులు లేకుండా మహా సాగరాన్ని, దాటించగల నావికుడు యిక లేడు.

ఆ మధుర సంసార, పూదోటను, నారుపోసి, నీరుపోసి, ఆకుదూసి, సుగంధపూతలు పూయించిన తోటమాలి యిక లేడు.

ఆ సంసారకోటను, ఆ కోటలోకి దోమకూడా దూరశక్యంగాకుండా, రాత్రింబగళ్ళు కాపలాకాసిన ఓ సైనికుడు భువి నొరిగిపోయాడు,

ఆయన హృదయం ఎంత కోమలమైనది? ఎంత సరసమైనది? ఎంత మృదువైనది? ఎంత మధురమైనది?

ఆయన నోరువిప్పితే పసిడితునకలు రాలేవి. ఆయన ప్రతి ఒక్క మాటలో ధర్మసందేశం ప్రస్ఫుటించేది. ఆయన హృదయం విప్పితే అమృత సరస్సు పొంగేది. ఎపటివాళ్ళ హృదయాలపై, ఆ అమృత తరగలను చిలకరించేది.

అటువంటి నాన్నిక లేడు,

"అమ్మా! యిక నాకు నాన్న లేడా?" అని బిక్కమొగంతో పలువరించాడా బిడ్డ!

"బాబూ!" అంటూ, తల్లి బిడ్డడ్ని ఒడిలోకి తీసుకుని బావురుమంది,

ఆ బావురుమన్న రోదనలో—

"....సంరక్షింపు భద్రాత్మకా?" అన్న తొండమెత్తి శ్రీమహావిష్ణువును ప్రార్థించిన కరి మొర వినబడింది.

ఏమో గజేంద్ర ప్రాణరక్షణకు—

సిరికిం జెప్పకుండానే, అన్ని వుడిచి, పరువులెత్తివచ్చిన ఆ పరమాత్మని కృపకు, ఆ తల్లీబిడ్డలు పాత్రమౌతారో, కాదో -

కాని--

ఆ రోజుకు, ఆ తల్లీబిడ్డలు దిక్కులేని పక్షుల్లా, అలా ఒకరినొకరు పెనవేసికొని పలువరించిరి, ఏకధార కన్నీటితో ఘొల్లు ఘొల్లున ఏడ్చారు.

మరోనాడు - ఆ యింట, ఆ తండ్రిపోయిన స్థానంలో నట్టింట ముగ్గుంది ముగ్గుపై ఒక దీపముంది.

ఆ దీపం క్రీనీడలో కూర్చొని, ఆ బిడ్డడు ఏదో రాస్తున్నాడు.

ఆ సన్నని వెలుతురులో - కన్నీటిలో రాస్తున్న ఆ అక్షరాలు కనబడుతున్నాయి--

"చిన్నాన్నా!నాన్న మాకు చెప్పకుండా వెళ్ళిపోయాడు.అమ్మ పూర్తిగా బెంగ పెట్టేసుకుంది అన్నం తినదు—నీళ్లు ముట్టదు - నిద్ర అనదు. మమ్మల్ని కారుచీకటి ఆవరించింది. చిన్నాన్నా ! ఒక్కసారి రావూ? అమ్మను ఓదార్చవూ?...చిన్నాన్నా !"...అంటూ రాసి ఇక రాయలేక ఏడుస్తూ ఆ కలం పట్టుకు ఏదో రాస్తున్నాడు.

రెండురోజులు గతించాయ్--

పినతండ్రి రామక్రిష్ణంరాజుగారొచ్చారు.

తల్లి నారాయణమ్మ, ఓ స్తంభానికి చుట్టుకుపోయి ఏడుస్తోంది. బిడ్డడు, ఆ తల్లిని చుట్టుకుపోయి, 'అమ్మా ! అమ్మా !' అని ఏడుస్తున్నాడు.

రామకృష్ణంరాజుగారి కనుకొలకులనుండి రెండు బరువైన కన్నీటి బిందువులు నేలపైబడి "టప్! టప్!" మన్నాయి. నెమ్మదిగా, ఆయన లోనికెళ్ళాడు.

బిడ్డని, తలనిమిరి--

"తండ్రిలేకపోతే, నీ పినతండ్రిని నే నున్నానుగా. నాన్నా! నీ తండ్రి కొరత రానిస్తానా?" అంటూ వదినతో--

"పద! వదినా! నర్సాపురం వెడదాం." యిక అక్కడే మాతోపాటు నీవు కాలక్షేపం చేద్దువుగాని అంటూ వారిరువురినీ, తీసుకుపోయాడు.

తన బిడ్డడు పెరిగిన కొంప, తన నాథుడు వొదిలిపెట్టిన కొంప. ఆ కొంపలో శూన్యాన్ని వెనక్కి చూచుకుంటూ, విడిచిపెట్టలేక, విడిచిపెట్టలేక తడబడుతున్న పాదాలు, అలాగే ముందు వేసింది నారాయణమ్మ.

## 6

ఆనాడు గోదావరి గమనం తప్పించి, నీరుకూడా తేరుకొని, నల్లబడి. విషాదచ్ఛాయలు క్రమ్ముకుంది. పడవలో ముగ్గురు ప్రయాణం చేస్తున్నారు. తల్లి మోకాళ్ళలో ముఖం దించుకొని ఏడుస్తోంది. ఆమె కన్నీటి బిందువులు, ఆ ప్రశాంత, గోదావరి వాలులో పడుతూ, శబ్దంచేస్తున్నాయి. తన కన్నీటి ప్రవాహంతోనే, గోదావరి వారిని దీబెడుతోంది. గోదావరి కంత జాలి! ఒకనాడు. గౌతముడు దర్భ విసిరితేనే చనిపోయి, ప్రాణాలిడిచిన, గోవుపై తన ప్రవాహాన్ని పోనిచ్చి ఆ గోవును పునీతం చేయగలిగింది - గోదావరి. అంతటి చల్లని తల్లి గోదావరి. అంతటి పవిత్రమైన నది-గౌతమి. అందుకే నిశాసమయాల్లో, ప్రశాంతవేళలో, గంభీరంగా గోదావరి తల్లి మౌనముద్రయైవున్న సమయంలో, దేవలోకమునుండి కూడా అప్సరసలు దాని సైకతశ్రేణులపై దిగి, జలకమాడి, పునీతమవుతూ

పోతుంటారు. ఎందరు తనలో స్నానమాడి, పునీతమవుతున్నా, ఏమీ అసూయలేనిది గోదావరి అందులోనూ అనాథులంటె, పాపులంటే, ఆమెకంత ప్రేమ.

పడవ పోతోంటే, ఆమె కన్నీరు మున్నీరుగా, వెనుక పోతోంది. బిడ్డడుమాత్రం పడవ కొయ్యకు కొయ్యలా జేరడిడి శూన్యదృక్కులతో నీలాకాశాన్ని చూచి, పరితపిస్తున్నాడు. అతని నోటినుండి ఒక్క పలుకుకూడా రావడంలేదు.

నిన్నటివరకూ, తండ్రి బ్రతికియున్నంతవరకూ, ఆ బిడ్డడి ముఖంలో, విషాదానికి స్థానం లేకపోయింది.

శింగన్న కంఠం వొణికింది—

ఏదో అవేదనతో ఆలపించింది—

'చూడు, నాయనా? మా బాబు?' అంటూ కట్టలు తెగిన గొంతు విప్పి కవి రామంకు చెబుతున్నాడు—

'తాతా!' అంటూ శశి తాతచేతులు పట్టుకుంది.

'చూచావా, అమ్మా! మా బాబు నడియేట బడిపోతున్నాడు. నిరాశా నడిబావిలో బడి కూరుకుపోతున్నాడు? ఒకనాటి చిలి బిలి పలుకులు, చిరు చిరు నగవులు యింకా నోటినుండి రావడంలేదు. చూడమ్మా! నా బాబు కనుకొలకుల నీరు నింపాడు, మబ్బులుకప్పిన చందురుడై పోయాడు...బ్రహ్మదేవుడు, ఎంత కఠినుడు తల్లీ! నా బాబు లేతమనస్సులో, సుడిగుండాలు లేపుతాడా? మధుర జీవితాన్ని ఛిన్నాభిన్నం చేస్తాడా?...' అంటూ సమాధిపై పడిపోయాడు.

'తాతా!...అంటూ శశి పలువరించింది.

ఎవరో పలువరిస్తే ఏమి పలుకరిస్తే ఏముంది?

ఆ బిడ్డడిలో విషాదచ్ఛాయలు క్రమ్మసాగాయి. ఆ బాలుని ముఖం యిప్పుడు సంపూర్ణంగా మారిపోయింది. పూర్వపు పద్ధతిలా కాదది. అందుకు పూర్తిగా భిన్నమైన పద్ధతి. ఎటో ఆ ఏకాగ్ర దీక్ష! సూటి చూపు! మౌనముద్రలు!

పడవ రేవుదాటిపోయింది. కారుచీకటి ఆవరించేసింది.

ఆ చీకటిలో నరసాపురం జేరిపోయిందా పడవ. ఆ పడవలో ముగ్గురూనూ!

రోజులూ, నెలలూ, సంవత్సరాలూ దొర్లిపోయాయ్. అలా అవి దొర్లిపోడంతోపాటు, రాజులో చిన్నప్పుడే తండ్రి చనిపోయిన నాటినుండే చెలరేగిన సుడిగుండాలు కదనుగుర్రాలయ్యాయ్. ఆలోచన, ఏకాగ్రదీక్షా ఆ బాలునికి అమూల్యాభరణాలయ్యాయి.

బాలుడు పెద్దవాడయ్యాడు. నవయువకుడయ్యాడు. పుట్టినది రాజు పుట్టుక, పెరిగింది రాజు కుటుంబంలో, పెద్దదయింది— అందులోనే.

ఆ బాలునిలో ఆవిర్భవించిన యౌవ్వనం - ఆయన తండ్రి మహా మందర పర్వతంతో, పాలసముద్రం చిలుకగా, అవిర్భవించిన యువకుడు.

అందుకే పాలసముద్ర మథనంలో తొలిసారిగా పుట్టిన చంద్రునిలా అతని ముఖం ప్రకాశిస్తూవుంది! అతని ముఖమండలం ఎల్లప్పుడూ అరుణచ్ఛాయలు గ్రిమ్ముతుంటుంది. దానికితోడు, భ్రుకుటి, పలుచగా, కనుబొమల వెంట్రుకలు, నూనూగుగా అలముకొనుట వల్ల ఆ ముఖంలో చక్రవర్తులను తలదన్నిన తేజస్సు ప్రస్ఫుటమౌతోంది. వెనుకకు నుంగరాలు, వుంగరాల్లా మెలితిరిగిన సింహపు జూలులా జుట్టు. ఆ జుట్టుకు యిరువైపులా చిన్న కుండలాలను ధరించిన చెవులూ, తీర్చిదిద్దినట్లున్న పొట్టిగా పొంకంగా సూదిగానున్న ఆ ముక్కూ, జ్యోతులు వెలుగుతున్నట్టున్న ఆ కళ్ళూ, వీరులకు తప్ప మరెవరికీ వుండవ్.

ఒకరోజు బడికివెళ్ళి అక్కడకు ఎవరో నరసాపురం రాజుల యువకుడు, తెచ్చిన గుర్రమెక్కి వుదయంనుండి సాయంత్రంవరకూ దానిపై స్వారిచేసి, మరీ యింటికి వచ్చాడు, గుర్రపు స్వారంటే ఆయనకు మక్కువ!

అలా గుర్రాన్ని చెప్పకుండా తీసుకుపోయినందుకు ఆ యువకుడు తల్లిదండ్రులతో చెప్పగానే, ఆ తల్లిదండ్రులు, రామకృష్ణంరాజుగారివద్దకు వచ్చి, విన్నవించుకొన్నారు.

రామక్రిష్ణరాజుగారు రాజును పిలిచి, చీవాట్లు పెట్టారు.

చీవాట్లు తిని వస్తున్న రాజును చూచి - తల్లి—

"నాన్నా! నాన్న లేడు నీకు! నాన్న లేనిలోటు ఎవరూ తీర్చలేరు బాబూ! చాలా బుద్ధిగావుండాలి బాబూ!" అంది.

పేడముఖం పెట్టుకుంటూ రాజు వెళ్ళిపోయాడు. తల్లిమాటకు మొట్టమొదటిసారిగా, తల వంకించిపోయిన దదేరోజు.

మరల కొన్నిరోజులు గడిచాయి.

ఒకరోజు, రాజు స్కూలుకైమింకా కాలేదని, డాబా వరండాపై ఓ నల్లబోర్డుపైనున్న తెల్లని చుక్కను, ఏకాగ్రదీక్షతో చూస్తూ, గాబిడీలు విసురుకుంటూ, ఒక్కొక్కఅడుగే వెనక్కు వేసుకుంటూ వస్తున్నాడు. అలా డాబా అంచుతాకుతున్నా, రాజుకు తెలియడం లేదు. ఇంకో రెండడుగులు వేస్తే రాజు డాబానుండి క్రిందపడి మరణిస్తాడు. ఇంకో అడుగు వేసేసాడు, మిగిలినది—ఇంకొక్క అడుగు.

ఇంతలో బంట్రోతు క్రిందనుండి చూచాడు.

గుండె బాదుకుంటూ, "బాబూ! బాబూ!" అని అరుస్తూ, మేడపైకి పరుగెత్తుకు వస్తున్నాడు.

ఆ వస్తున్న బంట్రోతుకు, రామక్రిష్ణంరాజుగారు గుమ్మంలో తగిలి - "ఏంటిరా!" అని ఆత్రుతగా అడిగారు.

"ఏంలేదుండండి బాబయ్యా?" అంటూ దూసుకుపోయాడు--బంట్రోతు--

ఇంకాస్త ముందులో తల్లి ఎదురైంది.

ఆమె "ఏమిటా?" అని బంట్రోతువైపు చూచించి. వాడు జవాబివ్వకుండానే పరుగెత్తుకుపోతున్నాడు.

ఆ గందరగోళం చూచి, అటు రామకృష్ణంరాజుగారు, ఇటు నారాయణమ్మగారు కూడా పరుగెత్తారు.

ఒగుర్చుకుంటూ, పైకివచ్చేడు - బంట్రోతు.

ఆ ఆఖరి అడుగు వేయడానికి రాజు పాద మెత్తాడు.

అప్పుడు, బంట్రోతు పడిపోతున్న రాజును పట్టుకొని లాభం లేదు. ఆ క్లిష్ట సమయంలో పట్టుకోలేడు - అలా పట్టుకోడానికి ప్రయత్నిస్తే అది దుస్సాహసమే అవుతుంది. కాని ప్రయోజనం వుండదు.

బంట్రోతు కాస్త తెలివితేటలుగా రివ్వున ముందుకొచ్చి, ఆ నల్ల బల్ల తప్పించాడు.

ఏ బల్లపై తన దృష్టినంతా కేంద్రీకరించాడో రాజు - ఆ బల్ల ముందునుండి తప్పుకోగానే ఆగ్రహావేశుడయ్యాడు.

'పశువా? ఎంతపనిచేశావ్!' అంటూ తటాలున వచ్చి, చెళ్ళున బంట్రోతు చెంపపై కొట్టాడు.

ఆ బంట్రోతు, తను దెబ్బతిన్నందుకు ఏడవలేదు. పైగా, ఎంతో సంతోషంతో వుప్పొంగిపోయాడు.

"నా బాబును రక్షించావ్ - నాయనా?" అంటూ నారాయణమ్మగారు మురిసిపోయారు.

కాని రామకృష్ణంరాజుగారికి రాజుపై కోపమాగలేదు—

"ఛీ! వెధవా! రక్షించిన బంట్రోతును కొడతావా? స్కూలు ఎగ్గొట్టి వెధవాటలూ, నువ్వూనూ!" అని కొట్టబోగా తల్లి ఆయన్ని ఆపింది.

"నువ్వూరుకో వదినా! వెధవ! మరీ పొగరుమోతై పోతున్నాడు." అని కళ్ళెర్రజేసాడు.

ఏనాడూ, పినతండ్రి మాటకు ఎదురుచెప్పని రాజు - చెప్పాడు.

"స్కూలుకైము కాలేదని, గాబిడీలు విసురుకుంటే తప్పా, బాబాయ్!" అని.

మరీ కోపమొచ్చింది - పినతండ్రికి—

"తప్పా? తప్పున్నరా? యిలా ఎదురుచెప్పదలుచుకుంటే, నా యింట్లో కుదరదు. కొండలో, అడవులో పట్టి, గాబిడీలూ, బాణాలూ విసురుకొని బ్రతుకు!"

అనగానే—

బాలునిలో రోషమొచ్చింది—

'ఆ బ్రతుకే గొప్పది!'

'బాబూ!' గద్దించింది - తల్లి! ఆ కంఠంలో కరుకును గ్రహించింది - ఆ తల్లి ఒక్కతే.

అసలు, రాజుకు ఆ పాఠాలన్నా, ఆ చదువన్నా వంటపట్టడం లేదు. అందులోనూ, ఆవుకు నాలుగు కాళ్ళున్న, ఇంగ్లీషు బానిస చదువులు ఏం వంటపడతాయ్!

దానికితోడు, తనను హృదయమిచ్చి, ప్రేమించిన తండ్రి చనిపోయాడు. కంఠకంగా, భారంగా అలా అన్ని సంవత్సరాలు గడిపాడు. అతనిలోనూ, విసుగుతనం, జనిస్తోంది. జీవితమంటే - అందులోనూ, కదలిక లేనిది, చలనం లేనిదీ - అంటే, అతనిలో రోత పుట్టి పోయింది. అందుకే ఆ బిడ్డడలా తెగించి అనేసాడు.

తల్లి గద్దించినా అతనిలో, శాంతం ఏర్పడలేదు.

'ఏలాగో? ఏడవండి!'అంటూ పినతండ్రి చర్రునవెళ్ళిపోయాడు.

రాజుకామాటలు శూలాల్లా గుచ్చుకొన్నాయ్ ఏవేవో ఆలోచనా తరంగాలు బుర్రలో వువ్వెత్తుగా లేచి, అతన్నూపసాగాయ్.

అందులోనూ, పిల్లల మనస్తత్వాలు, మరీ విపరీతంగా వుంటాయ్.

తండ్రి తొడపై కూర్చోడానికి వెడుతున్న ధృవుని, అర్హత లేదు పొమ్మన్న సవతితల్లి మాటకు - ధృవుడు ఎవ్వరికి చెప్పకుండా, క్రూరమృగ నివాసభూయిష్టమైన, కారడివికిపోయి, బొటనవ్రేలిపై

తపస్సుచేసి, తండ్రి తోడకంటె దేవేంద్రలోకం కంటె మహోన్నత మైన స్థానాన్ని పొందినది ఎవరూ మరచిపోలేరు.

ప్రహ్లాదుడు - తన తండ్రి శివునే పూజించమని బలవంతంచేసి నందుకు తద్విరుద్ధమైన హరినామజపంతో, ఏనుగులచే త్రొక్కించినా, ఎత్తైన పర్వతాలనుండి పడద్రోసినా చలించనంతటి స్థితికివచ్చింది మాత్రం ఎవరు మరచిపోగలరు.

ఒక ఆయుధ మిసిరి మరల దాన్ని వెనక్కు రప్పించుకోగలం. కాని మాట విసిరి రప్పించుకోడం కష్టం.

అందుకే మాట—అది సరళమైనదైతే, విత్తనాలు చల్ల కుండానే పూదోటల్ని పెంచుతుంది. అది కటువైనదైతే, ఆ పూదో టను ముళ్ళబాటగా కూడ మార్చివేస్తుంది.

అందులోనూ, పిల్లల మనస్తత్వంపై మాట అతి తీవ్రంగా అతి చురుగ్గా పనిచేస్తుంది. అప్పుడే జాగ్రత్తగా వుండాలి.

జాగ్రత్తకోసమని - తల్లి—

"బాబాయికి కోపం ఎక్కువగా! సైమైంది బడికి వెళ్ళమ్మా!" అంది.

"లేదమ్మా! బడికివెళ్ళి నేర్చుకొనే మాటల్లోకంటే-బాబాయి మాటల్లోనే నేర్చుకోవలసింది చాలా వుందమ్మా!"

ఆ మాటల కంతరార్థం తల్లికి బోధపడలేదు. బిడ్డన్ని బుజ్జ గిస్తూనే—

అవును బాబూ! బాబాయ్. ఏం చెప్పినా మన మంచికే, బడికి వెళ్ళమ్మా!"

ఆ మాటలకు రాజు తెల్లబోయాడు. తల్లికూడా పినతండ్రి మాటలకు వంతపాడుతోంది. ఆతని మనస్సు చలించిపోయింది. తండ్రిని పోగొట్టుకున్నందుకు ఎంతైనా క్రుంగిపోయాడా బిడ్డ.

తన బాధతో తల్లిని బాధించదలచుకోలేదు.

కాని ఏదో ఒక నిర్ణయానికి మాత్రం వచ్చేసాడు.

"అవునమ్మా! మన మంచికే బాబాయేం చెప్పినా!" అంటూ ప్రక్కనున్న పుస్తకాలసంచి భుజాన తగిలించాడు రాజు.

రాజు మాటలను పట్టుకోలేకపోయింది తల్లి. రాజు డాబా మెట్ల వరకూ వెళ్ళి ఒక్కసారిగా బాధతో వెనక్కు తిరిగి, అక్కడే నిలబడ్డ తల్లి పాదాలను చూపులతో స్పృశించి, నమస్కరించి ఆ డాబా మెట్లూ, యిల్లూ శాశ్వతంగా విడిచిపెట్టి వెళ్ళిపోయాడు.

శింగన్న గద్గదికంగా అన్నాడు--

"నాయనా! పాపమా ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డ హృదయాన్ని తల్లి అర్థం చేసుకోలేకపోయింది. తనను అర్థం చేసుకోగలిగిన తండ్రే పోయాక యిక చరిత్రే రాజుకు వ్యతిరేకంగా నడచిపోయింది నాయనా?" అంటూ ఏడ్చాడు.

"తాతా, ఎలా నడచిపోయింది..." రామం ప్రశ్నించాడు.

"తడుముకుంటూ, కుంటుకుంటూ..."

శశికి ఆత్రృతాగలేదు.

"అనగా?"

"శూలాల్లా గ్రుచ్చుకున్న పినతండ్రి మాటలు ఆ పసి హృదయాన్నెంతో గాయపరిచాయి. దాంతోనే ఆ బిడ్డ పరారై పోయాడు..."

"ఎక్కడికి పోయాడో ?"

"ఏమో ఎక్కడికిపోయాడో, ఎందుకు పోయాడో, ఎవ్వరికీ తెలీదు. తెగిన గాలిపటంలా ఎగిరిపోయాడు. ఎక్కడ. ఎప్పుడు వాలతాడో కూడా తెలీదు...ఇక ముందు చూడు తల్లీ!"

అంటూ శింగన్న చూపించాడు.

కవి, అతను భార్యా, ఎంతో ఆవేశంతో చూస్తున్నారు-తదుపరి చిత్రాన్ని.

నర్సాపురంనుండి వెళ్ళిపోయిన రాజు.

కాకినాడ వచ్చేసాడు. ఇప్పుడు రాజు స్వేచ్ఛాజీవి. అతన్నడిగే వాడు, కాదనేవాడూ లేడు.

ఇల్లువిడచి పౌరుషానికి, పెద్ద చదువే చదువాలని అతని అభిప్రాయం

పౌరుషానికి యిల్లువిడిచి, ప్రసిద్ధులైనవారి చరిత్రలెన్నో ఆయనకు తెలుసు.

వెంటనే కాకినాడ స్కూలులో చేరాడు.

అప్పుడు ఆయనతో ప్రసిద్ధ దేశభక్తుడు, త్యాగచరితుడూ బంగాళాబోసు బాబుకు శిష్యుడుగా అయిన మద్దూరి అన్నపూర్ణయ్యగారు సహపాఠిగా చదువుతున్నారు.

వారిరువురూ, పాఠ్యపుస్తకాల్లోని పేజీలు తిరగవేయడం పనికంటే దేశభక్తుల చరిత్రలు అధ్యయనం చేస్తూ, పేజీలు తిరగవేయడంలోనే కాలాన్ని గడిపేవారు. అయితే క్లాసులో పాఠాలు అనర్గళంగా అప్పచెప్పగలిగేవారు.

ఒక్క ఏడాది అక్కడే చదివాడు - మన రాజు.

ఆ ఏడాది ఆ స్కూలులో జరిగిన వైజ్ఞానిక ప్రదర్శనా పోటీల్లో స్త్రీ పాత్ర ధరించి బహుమతి పొందినాయన యీాయనొక్కడే.

అయితే ఒకరోజు కాకినాడ సముద్రపుటొడ్డున కాలేజీ విద్యార్థులతో ఆడుకొంటుండగా, ఆ సముద్రపుటొడ్డునే నివాసముంటున్న తెల్లదొరల పిల్లలువచ్చి, చుట్టూచేరి - రాజు, వొంగొని వుండగా, పైనుండొకడు దూకాడు.

రాజు భగ్గున మండిపోయాడు. తన తండ్రి చనిపోయినప్పుడు, రాజుకు చిరకాలం జ్ఞాపకముండే విషయ మొకటే బోధించాడు. రాజు దేన్నయినా మరచిపోగలడు గాని దాన్ని మరచిపోలేదు. తెలుగుజాతి పరజాతికి తలవొంచకూడదు!' అనేదే అతి ముఖ్యవిషయం.

నేడు తనపైనుండి ఒక్క తెల్లవాడు దూకడం తలచుకుంటే రాజుకు శరీరంలో విద్యుద్ఘాతమైనట్టయింది. సహించలేకపోయాడు,

వెంటనే ఆ తెల్లపిల్లవాడ్ని వోంగోబెట్టి వానిపైనుండి దూకి వాడ్ని మన్ను కరిపించాడు.

అంతే వెంటనే ఆ తెల్లపిల్లవాని తండ్రి, స్కూలుకు తెలియ పరచగా, స్కూలుమేష్టారు రాజుకు శ్రీముఖం యిచ్చాడు. దాంతో రాజక్కడనుండి జండా ఎత్తేయవలసి వచ్చింది. ఆనాడు తాను సహా పాఠకుని విడిచిపెడుతున్నందుకు ఎంతైనా విచారించారు—అన్న పూర్ణయ్యగారు.

ఎవరు విచారించి మాత్రం ఎవరినేం జేయగలరు? అందు లోనూ పరిపాలకులు తెల్లవారు. వారిపై తిరుగబడగలిగిన దృఢత్వం ఆ పిల్లల్లో అప్పు డెక్కడ దొరుకుతుంది?

శ్రీముఖం అందుకున్న వెంటనే రాజు ఒక్క క్షణమైనా అక్కడ నిలబడకుండా తిన్నగా తుని చేరుకున్నాడు.

ఇక ఆయనజీవితమే గతుకుల్లో పడిపోయింది. తునిలోచుట్టాలు వున్నారు. చాలా దగ్గరచుట్టాలు, అందుకే చుట్టాలుకదా, ఆదరిస్తా రనే నమ్మకంతో అక్కడకు వెళ్ళాడాయన. కాని ఆయనంకేం తెల్సు.

"చెడి స్నేహితునింటికయినా వెళ్ళవచ్చుగాని చుట్టాలింటికి వెళ్ళగూడదని."

ఎవరికైనా జీవితంలో తనమట్టుకంటూ వస్తేనేతప్ప, కొన్ని పెద్దల నీతులు, ధర్మ సూక్తులూ అక్షరాలా పాటించలేం.

కొన్నిరోజులు పేరుకుమాత్రం అక్కడ చదివాడాయన

కాని వెంటనే తేలిపోయింది—రాజుకు.

అక్కడ చదువుకుంటే, తిండికూడా ఎక్కడో చూచుకోవల సిందేనని ఆ చుట్టాలు తెగేసి చేప్పేసారు.

ఆయన వాళ్ళకు ఏదో చెప్పి, ఒప్పించదలచుకోలేదు. ఆయన స్వభావానికే విరుద్ధమైె బ్రతిమాలుటనుకూడా విడిచిపెట్టేసాడు.

అక్కడవున్న నాలుగు రోజులలోనూ, స్నేహితుడైన ఒక యువకుని ద్వారా, అక్కడ, అనగా తునికి దగ్గరలోనే వున్న కోట

నందూరులో, నడువబడుతున్న ఒక సంస్కృత పాఠశాలలో చేరా డాయన.

సంస్కృతం ఆయనకు కొరకరాని కొయ్య అయిపోయింది. దేశభక్తి ప్రపూరితమైన ఆయన పేరెక్కడ? అందుకు పూర్తి భిన్న మైన, రామశబ్దాలు, కృష్ణశబ్దాలు బట్టీపట్టడ మెక్కడ? అందులోనూ సంస్కృతం మాటలా ?

అది చూడ్డానికి పైకెంత మృదువో, చదువడానికి అదంత కరువు !

అందుకే పూర్వం, విప్రకుమారులు, నున్నగా బుర్రలు గీయించుకొని, బిళ్ళగోచీలు పెట్టుకొని, గురువుగారు ప సంధ్యావందనానికి వెళ్ళినాకూడా శబ్దోచ్చారణ చేసుకుంటూ, పోయేవారు.

అలా అయిదేండ్లకు, శబ్దాలు, ధాతువులూ బట్టీ పట్టేవారు. ఇక పోతే అమరం నెమరువేయడానికి మరికొంతకాలం. ఆ తరువాత, పంచకావ్యాల్లో మొట్టమొదటిదయిన రఘువంశం చేత బట్టడానికి వాళ్ళ పెద్దలు దిగివచ్చేవారు.

అంతటి కష్టమైన సంస్కృతం, వుద్రేకపూరితమైన యువకుడు నేర్చుకోవడం అంటే మాటలా ?

ఆరుమాసాలు ఓపికపట్టాడాయన. ఆరుమాసాలు పోయాక, ఆయననుకున్నదొకటే. ఏ భాషలోనైనా భావమొక్కటేనని భాషలు మాత్రం వేర్వేరనీ, అంచేత సంస్కృతభాషలోని ఏ కాళిదాసు భావమో - తెలుసుకోవాలంటే, తనకున్న తన తెలుగు భాషనుండి గాని, ఇంగ్లీషు భాషలోగాని ఆ భావాన్ని గ్రహించొచ్చని ఆయననుకొని, ఆయనకు ఇంగ్లీషు ప్రవేశ మెలాగూ వుందికదా అనీ, ఇంగ్లీషునే మరికొంత మథిస్తే సరిపోతుందని ఆయనభిప్రాయపడ్డారు. అదిగాక, నేడు రాజ్యం చేస్తున్నది యింగ్లీషువారు. వారి పరిపాలనా భాష ఇంగ్లీషు భాష. అంచేత ఇంగ్లీషువారిని ఓడించాలంటే, ఇంగ్లీషు భాషనే మరింత అభ్యసించాలనే పట్టుదల ఆలోచన పెరిగింది.

వెంటనే ఆ సంస్కృత పాఠశాలకు ఆయన స్వస్తిచెప్పి, మరల కాలాన్నీ, దూరాన్నీ, భారాన్నీ కొలవడం మొదలుపెట్టాడు. కోట నందూరు విడిచిపెట్టేడాయన.

విడిచిపెట్టడానికి ముందు అయనక్కడుండగా సంపాదించిన గొప్ప అనుభవం ఒకటుంది.

ఆ అనుభవాన్ని సంపాదించడం ఆ సంస్కృ పాఠశాలలోనే, చదువుకున్న ఏ ఒక్కరిసాధ్యమూకాదు. ఆఖరికి సంస్కృత పాండిత్యంలో, విశేషపాండిత ప్రకర్షను సాధించిన మహాపండితుని తరం కూడా కాదు. ఆ పాఠశాలలో, నూరేండ్లు చదివినా గ్రహింపు లేనట్టి దా అనుభవం !

ఆయన ఆ సంస్కృత పాఠశాలలో చదువుతున్నరోజుల్లో, ఆ చుట్టుపట్లనున్న అడవులన్నీ గాలించేవాడు.

ఆయన పినతండ్రి చెప్పాడుగా—

"ఏ కొండలో, అడవులోపట్టి, బాణాలు గాబడీలు విసురుకోమని."

దాని ప్రతిరూపమే అనుకుంటూ, రాజు నేడు అడవులు పట్టడం.

ఆ అడవిలో ఒకరోజునచూచాడు, ఓ హృదయవిదారకదృశ్యం.

భర్త, వెదురుపొదలో ప్రవేశించి, వెదురు నరుకుతున్నాడు. ఆ నరుకుతున్న వెదురును అతనిభార్య మోపులుకట్టి, అంతటి కష్టలనూ తను ఏకాకిగా మోసుకొచ్చి, ఒక రోడ్డుప్రక్క పోగు చేస్తుంది ఎదురు ఓమామిడిచెట్టుకు కట్టబడ్డవూయెలలో వారిగారాబు బిడ్డడు పాలకోసం "కెవ్వు కెవ్వున"న ఏడుస్తున్నాడు.

రాజు ఆ దృశ్యం చూచి కరిగిపోయాడు.

ఆయన పట్నజీవితంలో అనేకమందిని చూచాడు. యిలా కష్టపడి పనిచేసే దొక్కడు కనబడలేదు.

అనుకున్నాడు.

"అవును ! కష్టపడేదొకరు, బిడ్డ పాలకోసమేడుస్తున్నా చొరశక్యంగాని పొదలచిక్కి, వెదురుకోడుతూ, వొళ్ళంతా నెత్తురు

కార్చేదొకరు. ఆ కొట్టిన వెదురు, కాలు గడపకదలకుండా, పెరగ వలసిన స్త్రీ తన భుజస్కంధాలపై చెమటకారుస్తూ, మోసుకొచ్చే ఖర్మ—వారిరువురూ పనిచేస్తుంటే, ఆకలికి ఆగలేక తల్లడిల్లి పోయే బిడ్డ—వీరందికష్టాల్ని అనుభవించే పెద్దలొకరు!"

వెంటనే, గబగబా, ఆ వూయెలవద్దకెళ్ళాడు.

అతనక్కడ ఇంకేం చేయగలడు?

ఆ వూయెలనూపుతూ, ఆ బిడ్డ నూరుకోబెట్టాడు. ఇంతలోకి తల్లివచ్చి, పిల్లకు రొమ్మునందించి, రాజుకు రెండు చేతులా నమస్కారం పెట్టింది.

రాజు నమస్కారమందుకున్న దారోజే! నమస్కారం పెట్టిందొక పడుచు. ఎంతటిగర్వకారణం...ఆయనకు!

అలాగే ఒకరోజు, ఓ కొండకోనలో ప్రవేశించాడు.

అది మరీ హృదయవిదారక దృశ్యం—

బరువైన సుత్తి పైకిఎత్తి కండరాలు కదులుతుండగా, చెమటలు సంతత ధారాపాతంగా క్రిందపడుతుండగా, ఓ కఠికశిలను పగులగొడుతున్నాడో - కర్మజీవి: ఆయనభార్య నిండు గర్భవతి. ఆ పగులుతున్న కఠినశిలలను మోస్తూనే. త్రోవలో, కఠినశిలలపై నే కనేసింది. ఒక నూతన మానవుడు ఒక కష్టజీవి కడుపున, కటిక రాళ్ళపై పుట్టాడు. రాళ్ళను కొట్టే ఆ కూలివాని భార్యకు మంత్రసానేది? లేదు.

కాని, ఆ కూలివాళ్ళు కొట్టిన రాళ్ళతో, భవంతులు నిర్మించుకొని, ఆ భవంతులలో హంసతూలికాతల్పాలపై పిల్లలను కనేవారికందుబాటులోనే మంత్రసాను లుండడం చూచాడు. వాళ్ళకు మంత్రసానులేకాదు. దాదులు. సేవకులు, పరివారాలు.

ఎంత విచిత్రం! లోకం! కష్టపడేదొకరు, అనుభవించేదొకరు. యీ ఘటనలే రాజులో మరింత వుద్రేకాన్ని పుట్టించి, చదువుపై విరక్తి కలిగించేయి.

అందుకే కోటనందూరును విడిచిపెట్టేసాడు.

కాలం - ఓ మిషను చక్రంలా కర్రు కిర్రుమంటూ, ఎడతెగకుండా తిరిగిపోతోంది.

సూర్యునిచుట్టూ, భూమి తిరుగుతుంది. ఆ తిరగడంలో తన చుట్టూ తానే తిరుగుతుంది. కాలంకూడా అంతే. తన చుట్టూనే తాను తిరుగుతుంది. యీ తిరుగుడు రాజుకెంతో విసుగు జనించింది. తనూ అలాగే తిరుగుతున్నాడు. మార్పులేదు. యీ రోజు ఒక పగలు, ఒకరాత్రి, మరునాడు మళ్ళీ ఒక పగలు ప్రత్యక్షం. దానితోపాటు మళ్ళీ ఒక రాత్రి. అంతే భూమి. అంతే కాలం. అంతే తనూ ఐపోయాడు.

తిన్నగా విశాఖపట్నం వచ్చేసాడు.

రాజు విశాఖపట్నం వచ్చేటప్పటికి అక్కడ చెప్పుకోదగ్గ పాఠశాలలే లేవు. ఒక మనిషి సుఖంగా బ్రతుకడానికి, కావలసిన సదుపాయాలే లేవు.

డబ్బున్నవాడికే అన్ని సదుపాయాలునూ.

అయితే ఏం తను చదవాలి.

జీవితంలో మాటిమాటికి తొంగిచూస్తున్న విరక్తిని బలవంతంగా అణచివేస్తూ మార్గాంతరంలేక అమ్మకు ఒక వుత్తరం రాసాడు.

ఆ వుత్తరంలో తను క్షేమంగా విశాఖపట్నంలో వున్నట్టు చెప్పుకున్నాడు. తనపై ప్రేమవుంటే, తన మార్గానికి అంతరాయం కలిగించొద్దని బ్రతిమాలుకున్నాడు. తన శ్రేయస్సు కోరితే ఏమైనా డబ్బు పంపించమని ప్రాధేయపడ్డాడు. అదైనా తన తండ్రి ఏలాలపై కొద్ది ఆదాయము వస్తున్నది. కాబట్టి - అందులోనూ అడిగింది-తల్లిని. అయినప్పుడు ఒకరికి తలొంచని అతని నోమెక్కడ చెడింది? అతని వ్రతభంగమేమయింది?

లేదు. కాలేదు.

ఆయన వుత్తరంలో రాసిన ప్రకారం డబ్బు పంపడానికి ఏ అభ్యంతరమూ జరగలేదు.

డబ్బు వచ్చింది - ఆ డబ్బైనా స్కూలుజీతానికి మించి సరి పోదు- ఆ డబ్బు వచ్చేవరకూ--

రాజు, కాలినడకను విశాఖపట్నమంతా తిరిగాడు. ఎక్కడ చూచినా, గండుదోమలు, దుర్గంధపు మురికికూపాలు, పేదలు నివ శించే ప్రాంతాలు నివాసయోగ్యాలు కావు. అక్కడ ధనికుడన్న వాడే కనబడలేదాయనకి - ఏదో కొద్దిమంది తప్ప. కాని పుణ్యక్షేత్ర మైన సింహాచలం వైపునకు విస్తరించివున్న ప్రాంతంలో మట్టుకు దొరల బంగళాలు వున్నాయ్ అది అ పట్నంలో ఎత్తయిన ప్రాంతం కావడంవల్ల, సముద్రం గాలి హాయిగా తగుల్తుంది.

అదీకాక వారు పరిపాలకులు అంచేత సుఖమనుభవిస్తున్నారు.

ఎక్కడోనున్న తమ దేశానికి, భారతదేశంలోనున్న ముడి సరుకులన్నీ పట్టుపోతారు. అక్కడ వాళ్ళ జనానికి పనులు కల్పించి, ఆ ముడిసరుకును, వస్తువులుగా తయారుచేసి, ఆ విశాఖపట్నం రేవు లోనే దించుతారు. అమ్ముతారు లాభాలు గడిస్తారు. ఆ లాభాలు మరల తమ దేశమే పట్టుకుపోతారు. యిక్కడ తన దేశంలో కూలీ లకు కూలిపనుల్లేవు. తను పండించుకున్న వస్తువు తను అనుభవించ డానికి నోచుకోలేదు.

ఎంత విచిత్రం !

ఇదంతా చూచాడు రాజు. అతనిలో కొన్ని ముద్రలు పడ్డాయి.

ఈ లోపులో డబ్బు వచ్చింది. స్కూలుజీతం కట్టేసి, స్కూలులో చేరేడు. భోజనం ధర్మసత్రం. నిద్ర మఠంలో.

ఒకరోజు, కాస్త ముందేవచ్చి రాజు స్కూలు కెదురుగానున్న వేపచెట్టు వేరులపై కూర్చున్నాడు. యింతలో స్కూలుగంట గణ గణమని మ్రోగింది రాజు వెంటనే బడిలోకి వెళ్ళిపోయాడు.

ఆ రోజు వచ్చింది - కొత్త పంతులుగారు.

ఆ కొత్తపంతులుగారు తరగతిలో అడుగు పెట్టగానే, అంతా నిశ్శబ్ధమైపోయింది.

ఆ నిశ్శబ్ద వాతావరణానికి అంతరాయం కలిగిస్తూ, ఆ వుపాధ్యాయుడు కుర్చీలో కూర్చొని, బెత్తం టేబిలుపై కొట్టి, పుస్తకం తిరగేసి--

"తీయ్యండి, పదవ పేజీ - సత్యహరిశ్చంద్ర పాఠం !" అనగానే పిల్లలంతా ఒక్కసారిగా చకచకా పేజీలు తిరగేసారు.

పంతులుగారు ప్రశ్నించారు—

"హరిశ్చందుర్ని పాఠంవల్ల మీరు నేర్చుకున్న గుణపాఠం ఏమిటి ?"

"విద్యార్థులంతా ఒకరిముఖం ఒకరు చూచుకుంటున్నారు.

అందులో ఒక విద్యార్థి లేచి--

"ధన, ధాన్య, మానప్రాణాలు, బలైనా సత్యంకోసం పెద్దల మాట పాటించాలి !"

'వెరిగుడ్ !' అన్నారు పంతులుగారు--

వెంటనే రాజు లేచాడు.

పంతులుగా రడిగారు--

"ఎందుకు లేచావ్ ?"

"అతను చెప్పింది - తప్పు !"

ఆశ్చర్యపోయాడు - పంతులుగారు.

"అనగా !"

"సత్యం, దొంగపెద్దల దౌర్జన్యాలకు తలొంచుచు, రొమ్మిచ్చి ఎదిరించేది సత్యం. కాని సత్యంకోసం వొంగిపొమ్మంది - హరిశ్చంద్ర పాఠం !"

తరగతంతా విరగబడి చూచించి. ఇదంతా ఓ కొత్త పద్ధతి. కొత్త గొంతుక : కొత్త యువకుడు : అందరికీ ఆశ్చర్యం కలిగింది. ఆ తరగతిలోనే వున్న ఓ యువతి మరీ అదిరిపోయి చూచింది.

వుపాధ్యాయుడిక కుర్చీలో కూర్చోలేకపోయాడు.

గబగబా వచ్చి--

"తుంటరి! చరిత్రనే కళంకపరుస్తావ్ ?" అని బెత్త మెత్తాడు.

రాజు భయపడలేదు. పైగా--

"అది చరిత్ర కాదండీ!"

"ఆ!" అంటూ గబగబా చెళ్ళు చెళ్ళున నాలుగు కొట్టాడు.

"అమ్మ!" అంటూ రాజు ఆ దెబ్బకోర్చుకున్నాడు.

ఆ యువతి గుండె గతుక్కుమంది.

పంతులుగారు రాజును కొట్టడమేగాక హెచ్చరించాడు—

"జాగర్త ఇకముందు పాఠశాల క్రమశిక్షణకు భంగంగా నడిచావా ? డిస్మిస్ చేయబడతావ్!" అని.

క్లాసు అలా కొంతసేపు నడిచింది.

ఏమీ శ్రద్ధ కనబడలేదు.

అందరి మనస్సులూ, ఆ కొత్త యువకునిపైనే కేంద్రీకరించి వున్నాయ్.

బడిగంట కొట్టేసారు.

విద్యార్థులంతా బయటికెళ్ళిపోయారు. రాజు సాలోచనగా ఒంటరిగానే అలా నిలబడిపోయాడు.

ఆ యువతిమాత్రం వెళ్ళకపోయింది.

నెమ్మదిగా రాజుచెంతకొచ్చింది.

దెబ్బతగిలిన చేయి చూచింది.

నెత్తురుబికినతట్టుచూచి కంపించింది.

నెమ్మదిగా--

"గట్టిగా తగిలిందే!"

రాజు పరధ్యానంనుండి కోలుకొని--

"లేదు!"

"చేయి చూచుకోలేదా ?"

"లేదు!"

"చూడు! నెత్తురు తేలిపోయింది!"

"నీ వెవరు ?"

"అవును. శ్రీమంతుల పిల్లగా కనబడుతున్నావ్ ?"

"నీవు ?"

"నేనా?"

"అవును !"

"అనగా ?"

"పేరు ?"

"లేదు !"

"వూరు ?"

"లేదు !"

"ఇల్లు?"

"లేదు !"

పాప మా యువతికి ఆ సమాధానాలు చూచి భయమేసింది. జాలిగా అడిగింది--

"అనుభవించాల్సిన జీవితమెంతోవుండగా యిప్పుడే యింత విపత్తా ?"

'హా ! జీవితం !' అంటూ, పరిచితమైన ఒక స్నేహితునికి చెప్పినట్టు తనకు తెలియకుండానే మాటలు దొర్లాయి,

తెలివిగా, జవాబిచ్చిందా యువతి--

"జీవితమే దెబ్బలు కాదుగా ?" అని.

అది నీలాంటి శ్రీమంతుల పిల్లలకు. నాకా దెబ్బలే జీవితమైపోయింది ! అంటూ తన బాధను వెళ్ళగ్రక్కాడు.

జాలిపడిందా అమ్మాయి--

'ఎందుకింత నిరాశగా మాట్లాడుతున్నావ్? నీకెవరూ? లేరా?'

"వున్నారు. అడవికాసిన వెన్నెల్లా యిల్లు వొదిలి, వూరు వొదిలి, ఆ పంచా, యీ పంచా తిరుగు వ్యక్తికి నిరాశకాకేముంది?"

అనగానే ఆమెకో ఊహ తట్టింది.—

'ఒక మాటంటే నీకు కోపం రాదుగదా ?'

'అదేమిటలా అడిగావ్ ?'

'నీ ముఖం చూస్తుంటేనే భయంగావుంది ?'

"ఏమిటది ?"

'మా యింటికొస్తావా ?'

"నేనా ?"

'అవును !'

'ఎందుకు ?'

'మా నాన్నకు నీ సంగతి చెబుతా !'

'చెప్తే మీ నాన్నేం చేస్తాడు ?'

'మా నాన్న జాతీయవాది. ఏమైనా చేయగలడు.'

'ఆమె తన తండ్రి జాతీయవాది అనగానే, రాజుకు వూపిరి వచ్చింది. ఆహారం దొరికినట్లే అయింది. అతనికి కావలసిందే - అటు వంటివాని సాంగత్యం ! అటువంటివాని సాంగత్యం లేకనే అతనికి నిరాశ అనుసరించింది.

ఆమె అతని కళ్ళకో కాంతిరేఖలా ఆనింది. అయినా, బయట పడ్డానికి అతని కిష్టంలేదు.

"ఏం ? ఎందుకా ఆలోచన ?" మళ్ళీ అడిగిందా అమ్మాయి.

అతన్ని విడిచిపెట్టేలా కనబడ్డంలేదు.

'అందుకే ఆలోచన ?' అన్నాడు—రాజు.

'రా ! ఒకసారి ఇష్టంలేకపోతే వెళ్ళిపో ! స్నేహితురాలిగా చెబుతున్నా ! నా మాట విను ! రా !'

అంటూ చనువుగా, అతని చేతులు పట్టుకొని లాగింది. రాజు ఇంకేం చేయగలడు ? లొంగిపోయాడు.

లొంగిపోయిన రాజును, ఆమె తనయింటికి తీసుకుపోయింది.

ఆ యిల్లు - ఆ భవంతి. పురాతన సాంప్రదాయానికి పట్టు గొమ్మగా వుంది, ఆ భవంతిపైన రెండతస్తులున్నాయి - విశాఖ పట్నంలో రెండంతస్థుల భవంతులు అప్పుడు ప్రేళ్ళపై లెఖ్ఖపెట్ట గలిగినన్ని మాత్రమే వున్నాయ్. అందులో ఇదొకటి వీధిలోంచి, చూస్తే చూపు కందనంతటి దూరాన దాని దొడ్డిగోడవుంది. బయట,

వరండా సింహద్వారానికి, రెండునేపులా రెండు పెద్ద తొండాలు చాచిన ఏనుగు తలయలున్నాయ్.

ఆ అమ్మాయి చలాగ్గా, అంతటి ఎత్తయిన ఆ భవంతి మెట్లు తృటిలో బంతిలా ఎక్కేసింది. కూనిరాగంతో లోనికెళ్ళి ఎదురుగా వున్న టేబిలుపై పుస్తకాలు గిరాటువేసి, బయట నిలబడిపోయిన రాజువద్దకొచ్చి, చేతులు పట్టుకొని—

బయటే నిలబడిపోయావేం ? అంటూ లోనికి తీసుకుపోయింది.

రాజును చావడిలో, మేడమెట్లవద్ద నిలిపి—

చకచకా చలాకీగా, మేడమెట్లు—

'నాన్నా ! నాన్నా !' అని ఎక్కుడోంది.

లోపల ఓ నిలువుటద్దంవద్ద దుస్తులు ధరిస్తున్న తండ్రి 'చక్' మని వెనుదిరిగి—

"పడతావమ్మా ! ఎందుకా ఆత్రుత !" అంటూ కంగారుగా అన్నాడు.

"ఆతృత కాదు, నాన్నా ! అతిథిని తీసుకొచ్చా !"

'ఎవరమ్మా ?'

'నా క్లాస్ మేట్ నాన్నా !' అని చేయిపట్టుకొని క్రిందికి గబ గబ తీసుకొచ్చింది.

రాజు హాలు చూస్తూ వెనుకచాటుగా నిలబడ్డాడు.

తండ్రి, రాజును మనసారా చూస్తూ, ఆ వుంగరాల జుట్టూ, శరీరసౌష్టవం, ఠీవి, ముఖవర్చస్సూ అన్నీ దూరంనుండే ఆలోకనం చేస్తూ మురిసిపోతూ, మెట్లు దిగుతూ—

"రాజఠీవి మూర్తీభవించిన యీ యువకు డెవరమ్మా ?"

ఆ మాటలు రాజుకు వినబడ్డాయ్. వెనుదిరిగాడు - కాని రాజు మౌనవర్చస్సు ముఖంలో అలంకరించింది: ఆతనిని చూస్తూ కళ్ళలో కన్నీరు నింపుకుంటూ, అలాగే నిలబడిపోయాడు ఆయనకు ఆ ముఖంలో తన తండ్రి గుర్తుకొచ్చినట్టున్నాడు.

ఆ తండ్రి అన్నాడు—

"ఎందుకు నాయనా? ఆ కంట తడి?"

దుఃఖం దిగమ్రింగి—

'నమస్కారమండి! ఏమీ లేదు!'

యువతి అందుకొని--

"ఏదో వుంది నాన్నా, చెప్పడంలేదు!"

"వుంటేమాత్రం లాభం ఏమిటి?"

తండ్రి కరిగిపోయి—

"అదేమిటి నాయనా?"

"అవును. ఆర్చితీర్చగలిగినవారే లేనప్పుడెవరితో చెప్పుకోను?"

ఆ యువతి అందుకుంది - ఆమెకు రాజంటే ఎందుకో ఆ మమకారం--

"స్నేహితులికి చెప్పకూడదా?"

"అందుకే నీకు క్లాసులోనే చెప్పాగా!"

"అదా?" అంటూ ఆ యువతి చిరునవ్వు నవ్వింది.

తండ్రి నిశ్చేష్టుడై, వారిద్దరి భాషా బోధపడక అడిగాడు--

'అదేంటమ్మా?'

"చెబుతాలే. నాన్నా! తరువాత!" అంటూ యిక ఆ యువతి సంభాషణ తగ్గించింది.

"కూర్చో, బాబూ!" అంటూ రాజును కూర్చోబెట్టి తనూ ఓ కుర్చీలో కూర్చున్నాడు - తండ్రి!

'ఇప్పుడు చెప్పు, నాయనా' అంటూ!

రాజు అశ్రురుద్ధ కంఠంతో అన్నాడు--

"సరిగ్గా మీలాంటి వుదారహృదయుడే నా తండ్రి! ... కాని' అంటూ, అరచేతుల్లో ముఖం మూసుకున్నాడు.

వెంటనే, రాజుకనులనుండి తెగిన దండలా, నేలదొర్లుతున్న కన్నీటిముత్యాలను గుదిగుచ్చుతున్నదానిలా అంది--

'తండ్రి చనిపోయాడు నాన్నా !'

"ఊఁ !"

'యీాయనది గోదావరిజిల్లా !'

'ఊఁ !'

'యిక్కడ కొచ్చేసాడు !'

'యిక్కడెవరున్నారు ?'

'ధర్మసత్రం !' అని చటుక్కున కూతురనగానే.

"ఆపమ్మా !" అంటూ ఆపుచేసి, రాజుతో--

"అందుకా నాయనా, విచారిస్తున్నావ్ ? ఇదిగో ఇదే నీ యిల్లనుకో. నా బిడ్డతోపాటు హాయిగా చదువుకో...చూడమ్మా ! అబ్బాయికి ఏమైనా ఫలహారం తెచ్చియ్!" అంటూ లేచి, తండ్రి మీదకు వెళ్ళిపోయాడు.

కూనిరాగంతో హుషారుగా వెళ్ళి ఫలహారాలు తెచ్చింది – అ యువతి.

రాజుముఖం బలవంతంగా ఎత్తి--

'ఊఁ ! మా నాన్న చెప్పేసారుగా! యిక్కడే వుండిపొమ్మని ! యింకెందు కాలోచన !'

'అందుకే ఆలోచన !'

"ముందు నేనడిగినదానికి చెప్పు !"

"దేనికి ?"

"నన్నెందు కంతాదరంగా ఆహ్వానిస్తున్నావ్ ?"

"అదా ? మా గొప్ప ధర్మసందేహమే కలిగిందే !" అతను కూర్చున్న కుర్చీవెనుకకు వెళ్ళి, అతని తలపైనుండి, అతని ముఖం లోకి చూచి - అంది--

"చంద్రోదయాన్ని చకోర మెందుకు ఆహ్వానిస్తుంది ?"

రాజుకు వెంటనే అర్థం కాలేదు. రాజు యింతవరకూ బాగా

అర్థం చేసుకున్నది - తండ్రిని. ఆతని ఆదేశాన్ని. ఆతని సందేశాన్ని అంతే.

అందుకే ఆ యువతి మాటలు అయోమయంగా తోచాయి.

"అనగా ?" అని నోరు తేలేసాడు.

"అనగా !" అంటూ, ఆ తేలేసిన నోటిలో ఒక బిస్కట్టు కుక్కి గమ్మున ముందుకొచ్చి. మోకాళ్ళపై వొంగి, చూపుడువ్రేలుఆడిస్తూ-

'చెప్పుకో ! ఆ చంద్రుడికీ, చకోరానికి మేధ్య ఏముంది?'

రాజప్పుడు సమాధాన మివ్వగలిగాడు--

"చంద్రిక !" అని.

'ఆ !-అదే. మధ్య వుందిగనుక ! తెలిసిందా. సరే ! సమస్య పూరించడంలో చాలా అలసిపోయావుగాని ఇక కాఫీ పుచ్చుకో !' అని కాఫీ అందిస్తూ—

"ఏం?..." అని ఏదో అనబోతుండగా, తండ్రి మెట్లు దిగుతున్న చప్పుడు విన్న రాజు - "సీతా"అని ఆమె నోటికడ్డంగా చేయి పెట్టి, మరల అంతటి చనువును చూపినదాన్కి సిగ్గుపడి—

'క్షమించు ! చవువులో స్థానాన్ని మరచినందుకు !' అంటూ క్షమార్పణ కోరాడు.

'క్షమించను !'

'సీతా !'

సీత వెంటనే చిలిపిగా—

"ఉష్...ష్...ష్...ష్ ! మా నాన్న !"

ఇంతలో తండ్రి దగ్గరకొచ్చి నిలిచాడు. ఆయన శుద్ధదేశభక్తుడి లాగ వున్నాడు. గాంధిమహాత్ముడు చెప్పిన పదహారణాల ఖద్దరు అనగా, చేతితోనే స్వయంగా వొడికి చేతితోనే నేయించిన అసలు ఖద్దరు, పైన టోపీ, లాల్చి, బిళ్ళకట్టు పంచ కట్టుకొని మకీ వచ్చారు.

అలా చేతితో వొడికిన ఖద్దరు ధరించడంవల్లనే, దేశంలో కొట్లాది ప్రజలకు, చేతిపనివారలకు తిండి పెట్టగలమని ఆయన నమ్మకం.

వచ్చి—

"నేను మీటింగుకు వెడుతున్నా, చదువుకుంటూండండి !"

"ఏ మీటింగు నాన్నా ?"

'ఈ రోజున పంజాబునుండో కాంగ్రెసునాయకు డొచ్చాడు ...'

మధ్యలో రాజందుకొని—

"మీకు అభ్యంతరంలేకపోతే...?"

"దేనికి నాయనా ?"

'నేను మీ కూడా...'

"రా ! నాయనా దేశభక్తి ఒకరి గుత్తసొమ్ము కాదుగా ! అని తండ్రి అనగానే సీతకూడా—

'మరి నేనో, నాన్నా ?'

"అంతా వెడదాం - పదమ్మా !" అంటూ, ఆ ముగ్గురూ సభకు బయలుదేరారు.

# 7

సభ వేలాది జనంతో క్రిక్కిరిసిలాడిపోతూవుంది. నాడు దేశంలో నున్న రాజకీయ సంచలనంలోని ఉష్ణతరంగాల వేడి, ఆ జనంలో ద్యోతకమవుతోంది వేదికపై కారుమబ్బులు క్రమ్మిన రాజకీయాకాశంలో గంభీరమైన, గర్జించ సిద్ధంగానున్న మేఘంలా ఓ పంజాబు నాయకుడు కూర్చున్నాడు. ఆయన కంఠంలో సీత తండ్రి పూలమాల వేయగానే జనమంతా ఒక్కసారిగా 'వందేమాతరం !' అంటూ నినదించారు.

ఆ 'వందేమాతరం!' జనం నరనరాల్లోనూ ఎక్కిపోయి, స్పందింపచేస్తున్న ఆ గేయం వంగదేశపు బంకించంద్రుడు రచించాడు. ఇరవయ్యో శతాబ్దపు తొలి దశాబ్దంలో బ్రిటిషువాళ్ళు బెంగాలును బలాత్కారంగా విభజించిన రోజుల్లో చెలరేగిన మహోద్యమానికి జీవం - ఆ గేయం. ఆ రోజుల్లో చెలరేగిన ఆ మహోద్యమంలో.

కలమే కత్తిగా పట్టి దూకిన మొదటి కవివీరుడు బంకింబాబు. భారతజాతీయోద్యమానికి వూపిరి - గేయం. అందరు, జనం ఒక్క-సారిగ దిగ్దిక్కులు మార్మ్రోగేలా నినదింపగలిగారు.

ఎదుట వేదికముందు కూర్చున్న సీతతో, వుద్రేకం పట్టలేక రాజు అన్నాడు,

'సీతా ! ఒక దేశభక్తుని కూతురుగా పుట్టినందుక్కు నీ వదృష్ట-వంతురాలివి' అని.

సీతకు అతని అవేశం అర్థ కాలేదు.

సభ ప్రారంభమైంది. కంచుగొంతుకతో ఆ నాయకుడు లేచి-

నమస్కారం ! స్వతంత్ర సమరంలో మీ ఆంధ్రులతో పోటీకి తలపడ్డ పంజాబు వీరులనుండి మీకు నా అభివందనాలు. బ్రిటిషు సామ్రాజ్యవాదులు-యుద్ధం కాగానే మనకు స్వతంత్ర మిస్తామని ఆశపెట్టి, యుద్ధానికి మన భారతీయులను పశువులుగా తోలుకెళ్ళి యుద్ధంలో మన వీరుల త్యాగాలఫలితంగా గెలిచాక, వారి విజయానికి నెత్తురిచ్చి, రొమ్మిచ్చి, వీరోచితంగా పోరాడిన మన భారతీయుల త్యాగాన్నే మరచిపోయి, మనకు స్వతంత్రం సున్నచేసి, భారతావనినే ఆకలిమంటల కాహుతిచేస్తున్నారు. ఆకలి ఆక్రందనాలతో ఘొల్లుమంటున్న భారతీయులపై నోరెత్తితే కాల్చి చంపుటకు రౌలట్ చట్టం పెట్టి, రాక్షసరాజ్యం చేస్తున్నారు. మీరు నిత్యం చూస్తూనే వున్నారు. మా పంజాబులో జలియన్‌వాలాబాగ్‌లో జనరలు డయ్యరు చేసిన దురాగతాలు - మండుటెంటలో గర్భిణీ స్త్రీలను పొట్టలపై ప్రాకించిన పాషండుడు. శిశువులను చిత్రవధ చేసిన హంతకుడు. ఈ దుర్మార్గుల దారుణ హింసాకాండ యిక సాగకూడదు, దేశమంతా ఒక్కటై పోవాలి. సడలని-సమరోత్సాహంతో, దేశభక్తి ప్రపూర్ణులై భారతమహాప్రజ, మహాసముద్రమై హోరెత్తాలి. స్వతంత్రరణంలో దుమికి పోరాడుతున్న మీ సోదర పంజాబు వీరులకు వుత్తేజం కలిగించేం, మీ హామీని కోరుతున్నాను!' అని ఆయన సభలో నాలుగుదిక్కులా గాలించారు.

వెనుక బెంగాలు విభజనోద్యమం జరిగినప్పుడూ యిలాగే జరిగింది. నేడు పంజాబులో జరిగిన జలియన్‌వాలాబాగ్ దురంతాలకు సానుభూతి, ఆ దురంతాల ప్రతిఘటనకు సహకారాన్నందుకోడానికి యీ పంజాబునాయకుడిలా దేశసంచారం చేస్తూ దేశభక్తి ప్రభోదిస్తూ, ఎలా ఆంధ్రదేశ 'మొచ్చాడో ? అలాగే బెంగాలు మహోద్యమానికికూడా సానుభూతి సహకారాలు ప్రోగు చేయడానికి బెంగాలు "పాలు" ఆంధ్రదేశ సంచారానికి వచ్చినప్పుడు ఆయనకు తెలుగు దేశమే ఒక్కుమ్మడైౖ లేచి, నివ్వాళులెత్తింది. ధన కనక విరాళమేగాక, ఈ ధరామండలంపై అన్నింటికంటే విలువైన నెత్తురు మొట్టమొదటి సారిగాఆంధ్రే యిచ్చింది. ప్రతీ వూరినుండీ, తెలుగు పట్టణంనుండీ వందలాది వాలంటీర్లు బెంగాలు తరలి వెళ్ళిపోయారు.

నేడు పంజాబుకట్టి సహాయం కావలసివచ్చింది.

ఆ నాయకుడు సభలో అలా చూపులతో గాలిస్తోంటే, సభ నిశ్శబ్దమైపోయింది.

ఆ నిశ్శబ్దాన్ని చీల్చుతూ రాజు "టకీ"మని లేచాడు.

ఆంధ్రుడన్నవాడు ఎందులోనూ వెనుకబడకూడదని ఆతని అభిప్రాయం.

అదీగాక, ఆ నాయకుని మాటలకు రోషావేశితుడయ్యాడు రాజు బ్రిటిషువాళ్ళ దౌర్జన్యకాండ వినగానే. ఆతని శరీరం పగతో భగ్గుభగ్గుమని మండిపోయింది.

సభలో కలకలం బయలుదేరింది.

కలకలాన్నణుస్తూ—రాజు మాట్లాడేడు.

"ఇదిగో ! నే నిస్తున్నా ! యీ దొరల దురంతాల్ని ఎదుర్కొని స్వతంత్ర సమరంలో ఆత్మ బలిదానానికైనా జంకనని తెలుగు బిడ్డడిగా నేను హామీ యిస్తున్నా !" అన్నాడు శంఖారావం చేసినట్టు. భీష్మప్రతిజ్ఞ చేసినట్టు.

సభలో హర్షధ్వానాలు చెలరేగాయి. జనమంతా తెగించిన, ఆ తెలుగుబిడ్డ త్యాగానికి గర్వంతో పొంగిపోయి, కైమోడ్పు చేసారు.

సీత తండ్రి ఆనందాశ్రువులు రాల్చాడు. ఆయన యింటనున్న అతిథి యింతటి త్యాగనిరతిని ప్రదర్శించడం ఆయనకు సంతోషం గాక మరెవరికి ?

సీత ముఖంలో వుత్తేజం కనపడింది.

ఆ పంజాబునాయకుడు, వెంటనే వేదిక దిగాడు.

సరాసరి రాజువద్దకు వచ్చి, రాజు నాలింగనం చేసుకుని, వేదికపైకి తీసుకెళ్ళాడు.

తన మెడలోని చామంతిదండ, రాజు మెడలో వేసాడు.

మల్లెదండ ఆయన మణికట్టుకు కట్టాడు.

అది పంజాబు సాంప్రదాయంగా రక్షాబంధనం.

"జై ! ఆంధ్ర !" అని నినదించాడు రాజు.

"జై ! ఆంధ్ర !" అని నినదించాడా నాయకుడు.

అలా లేతవయసులోనే తెలుగుదేశాన్ని, ఆంధ్రేతరునిచే స్తుతింపజేసాడు - రాజు! తెలుగు యశఃస్కాంతులు, నేల నాలుగు చెరగులకు ప్రాకించడానికి బీజమేసాడు.

సభంతా "వందేమాతరం" నినాదాలతో గింగురు లెత్తింది.

సభ అయిపోయింది.

ఇంటికొచ్చాడు - రాజు !

కంటిపై కునుకు పడ్డంలేదు.

మంచంపై మేను వుండడంలేదు.

మనస్సు అతని స్వాధీనంలో లేదు.

నిద్రాదేవే, రాజు నావహించడానికి భయపడిపోయింది.

ఆయన కళ్ళముందు తన తండ్రి, కని పెంచిన తండ్రి, హృదయ మిచ్చిన తండ్రి ప్రత్యక్షమై రాజును వుద్బోధిస్తున్నాడు.

"తెల్ల దొరలకు తలొంచకు !"
'మనజాతి గొంతును పిసుకుతున్న కసాయిజాతది !'
అంటూ ఒకటే ఘోష.
ఇది లోపల, రాజు శయనామందిరంలో.
ఇక బయట సీత. లలితలతా తోరణాలవద్ద.
నిలబడి నెలరాజును చూస్తోంది.
ఆ నెలరాజులో తన రాజును చూచుకొంటోంది.
నెలరాజులో తన రాజును,
తన రాజులో నెలరాజును

చూస్తూ మురిసిపోతూ, ఆలపిస్తోంది. ఆ ఆలాపనలో మాటలు దొర్లుతున్నాయి.

రావోయ్! రావోయ్!
రావోయి నెలరాజా!
తేవోయి వెన్నెలనూ!
నీ వెన్నెల
ఆ వెన్నెల
నావలపులు విరిసిన
నవ్వుల
చిరునవ్వుల
తేనెల ఆరగిందమోయ్!
రావోయి - నెలరాజా!
తేవోయి - వెన్నెల వెన్నలనూ!...

ఆ ఆలాపన రాజుకు చికాకు కలిగిస్తోంది. అప్పటికే ఆతని కళ్ళముందు రెండు దిగ్గజాలు—

ఒకటి తన తండ్రి—
'తెల్లవాడికి తలొగ్గుతావా?'
రెండోది, పంజాబు నాయకుడు—

"స్వతంత్ర సమరానికి నడుంకట్టు!" అంటూ ఆదేశిస్తున్నారు. ఆ మధ్య పానకంలో పుడకలా సీత.

"రావోయి - నెలరాజా!" అని మరల ఆలసించింది సీత. ఇక సహించలేకపోయాడు - రాజు—

"సీతా!" అరిచాడు.

కాని సీత ఆగలేదు.

'తేవోయి - వెన్నెలనూ!...' అంటూ మరల కొనసాగించింది.

అవును! రాజుకు దేశమంటే ఆవేశం ఎలా రగులుతోందో, ఆలాగే దేశమంటే ఆవేశించగలిగిన రాజంటే తనకెంత ఆవేశం, అయితే ఒకరిది ఆవేశం—

ఒకరిది విరహం!

'ఆపుచెయ్యి! విరహాగేయం' అంటూ గద్దించాడు, రాజు!

"రాజా" అంటూ బెదురుతూ భీతహరిణిలా అరచింది సీత.

రాజింక మాట్లాడలేదు.

మంచం దిగాడు.

ముందుకు తిరిగాడు.

"వెళ్ళిపోతున్నా!" నన్నాడు,

ఆ మాట, సీత గుండెల్లో పిడుగుపాటయింది.

కాని రాజు అక్కడితో ఆగలేదు.

ముందుకు నడిచాడు.

"ఎక్కడికి?" అంటూ వెంటాడింది సీత!

రాజు నడుస్తూనే—

'ఎక్కడ భక్తి, ముక్తి దొరుకుతుందో, అక్కడికి?'

సీత అహంభావంతో అంది—

"నా పరిణయానికి మించిన భక్తి, నా ఆనందానికి మించిన ముక్తి నీ కెక్కడ దొరుకుతుంది?"

రాజుకు కోపమొచ్చింది—

"సీతా!"

"రాజా!" అంటూ సీత దిగాలుపడి నిలచిపోయింది.

మళ్లీ రాజు ముందుకు అడుగేస్తూ—

"దేశభక్తికన్నా, స్త్రీ ప్రణయం ప్రధానంకాదు!"

"ప్రేమలేని దేశభక్తి ఎందుకు?"

రాజు "చక్" మని వెనుదిరిగాడు.

"ఏమన్నావ్?" హుంకరించాడు.

లొంగలేదు - సీత!

"అవును!" అంది.

"వట్టి స్వార్థపరురాలివి! నీలోనేగనక ప్రేమనేదివుంటే, ఆ ప్రేమ నిన్ను స్వార్థాన్ని కోరనివ్వదు. త్యాగాన్ని కోరమంటుంది!"

'నాది స్వార్థమా?'

"ముమ్మాటికీ. నిస్సందేహంగా నీది స్వార్థం! సహించరాని స్వార్థం నీ స్వార్థం! నీ ప్రణయమేకాదు! యీ ప్రపంచలో యిక నన్నడ్డేశక్తిలేదు. అందుకు తెగిస్తే త్రినేత్రుడైనా అపజయానెదుర్కుంటాడు—తెలుసా?"

'రాజా!' అంటూ చేయిపట్టుకుంది - సీత.

'తప్పుకో!' అంటూ త్రోసేసి మెట్లుదిగి వెళ్ళిపోయాడు.

ఆ త్రోపుతోపడ్డ సీతను, వెనుకనేవున్న తండ్రి గభాలునొచ్చి, పట్టుకొని ఆపుచేశాడు,

ఆగిన సీత వెనుతిరిగి నాన్ననుచూచి—

'నాన్నా!' అంటూ తండ్రి గుండెలపై వాలిపోయింది.

ఏదో పౌరుషానికి ఏవేవో అందికాని, ఆమెలో రాజంటే, విరిసిన మల్లెచెట్టు.

రాజు కత్తిలా దూసుకుపోయాడు—గాలిలో.

నర్సాపురంలో గోపాలుని పూజకని తీసుకొస్తున్న నారాయణమ్మగారి చేతిలో పూజా పళ్లెరం క్రిందపడిపోయింది. ఆమె ఎడమ కన్ను వొణికింది. ఆమెలో కంగారు ఎక్కువైపోయింది. ఏదో మహాప్రమాదం జరిగివుండవచ్చని ఆమె అపనమ్మకం.

జరిగితే ఎవరికి జరిగివుంటుంది.

తన కెవ్వరున్నారు. ఒక్కడే ఒక్కడు-అతడే ఆమెకు వజ్రాలగని. అతడే ఆమెకు జాజితోట. అతడే - మన రాజు!

పున్నకొలదీ కంపన తీవ్రమైంది.

భక్తమీరాబాయిలా, తనలో తాను, తాను భగవంతునిలో లీనమైపోయి ప్రక్కనున్న తంబూరాతీసి, బలంగా తీగ నొక్కింది. ఆ తీగ ఆమెకు తెలియకుండానే, పైస్థాయి పలికింది. ఆమె గొంతు కూడా, ఆమెకు తెలియకుండానే ఆ స్థాయి నందుకుంది.

"మధురా నగర మురారీ!
గోవర్ధన గిరిధారీ!"

అంటూ పల్లవిస్తున్న ఆ ఆలాపనలో 'తీగ' ధన్‌మని తెగిపోయింది. వెంటనే ఆమె మురారి కళ్ళముందు మోకరిల్లింది--

"నా బాబును చల్లగాచూడు-ప్రభూ!" అంటూ అర్థించింది.

బయట రామక్రిష్ణంరాజుగారికి పోస్టుమేన్‌వచ్చి వుత్తరమిచ్చి వెళ్ళాడు. అది రాజు విశాఖపట్నం చేరాక, స్కూలులో అడుగు పెట్టాక రాసిన వుత్తరం. ఆ వుత్తరం పట్టుకుంటూనే, ఆయన ఆత్రతగా వదిన చెంతకువచ్చి--

'వదినా?' అని పిలిచాడు.

వెనక్కి తిరిగిచూచిందామె!

"ఏమన్నా బాబునుండి వుత్తరమొచ్చిందా?"

'అవు నొదినా? ఎందుకా ఏడుపు? పోనీ ఒకసారి చూచిరాకూడదూ?'

'అవును, నా బాబును కలుసుకుంటా!' అంటూ గోపాలుని కాళ్ళబడి--

"అనాధులపై నీ కె తదయ ప్రభూ!" అంటూ ఆ పావన పాదపద్మములను ముద్దాడింది.

"అయితే బండి సిద్ధంచేయిస్తా, వొదినా!" అంటూ రామక్రిష్ణంరాజుగారు వెళ్ళిపోయారు.

నారాయణమ్మగారు దుస్తులు సర్దుకుంటోంది, యీలోపునే రామక్రిష్ణంరాజుగారొచ్చి--

'బండి సిద్ధమైంది వదినా?' అనగానే!

'వస్తున్నా' అంటూ గబగబా బయలుదేరి బండెక్కిపోయింది.

బండి దొర్లిపోయింది.

దొర్లకేపోవాలి, దొర్లిందా-బండెప్పుడూ ముందుకే!

ఇక నారాయణమ్మగారు పడ్వ ప్రయాణం చేయనక్కరలేదు. పూర్వం రైలుబండిలేదు-యిప్పుడు రైలుబండి వచ్చేసింది. గోదావరిపై రైలువంతెన పడింది. రైలు నడుస్తోంది.

కాలం నడుస్తోంది
రైలు నడుస్తోంది
నడుస్తోంది - కాలం
నడుస్తోంది - రైలు!

ఇకిప్పుడు, పాదయాత్ర లక్కరలే. చెప్పు లరిగేలా, కాళ్ళు మండేలా, నడుం విరిగేలా, క్రోసులకు క్రోసులు, యోజనాలకు యోజనాలు నడువక్కరలే. కాశీ-రామేశ్వరయాత్ర ఇప్పుడు మంచి నీళ్ళ ప్రాయం.

పూర్వం గోదావరిపై కట్టిన ఆనకట్ట, నదీజలాలపై మానవుని విజయమయితే, నేడు పెనుభూతంలాంటి యంత్రంపైనే మానవుడు విజయం సాధించాడు.

మానవు డెప్పుడూ విజయుడే !

వాడి కపజయం లేదు.

తలచుకొంటే అరచేతిలోకి వైకుంఠాన్ని తెచ్చుకోగలడు.

అందుకే పెద్ద లన్నారు -

'నరుడు తలచుకుంటే నల్లరాయి బ్రద్దలైపోతుం'దని.

నిజం ! ముమ్మాటికీ నిజం.

నారాయణమ్మగారు నరసాపురంలోనే పొగబండి ఎక్కారు.

రాజుకూడా కత్తిలా దూసుకు పోయి ఆఖరికి ఎక్కింది పొగబండే.

రాజు తను ఎక్కిన రైలువేగంకంటె అతని మనోవేగం మరీ విపరీతంగా వుంది. పెట్టె గుమ్మంలోనే నిలబడ్డాడు రాజు. అతని చూపు బండికంటే ముందుకు పరుగెడుతోంది. గాలికి అతని ఉంగరాల జుట్టు పక్షిరెక్కల్లా టపటపా కొట్టుకొంటోంది. పొగబండి టపటపలాడుతూ తుని దాటి పోయింది.

నారాయణమ్మగారు ప్రయాణం చేస్తున్న బండికూడా దడదడలాడుతూ గోదావరివంతెన దాటి పోయింది. ఆమె ఆవేదనలో అలా ప్రయాణం చేస్తుండగానే, ఆమెకు తెలియకుండా, ఆమెబండిని గమనించకుండా, 'ఎక్కడో తుని దాటిన ఒక స్టేషనులో రాజు ఎక్కిన బండి, నారాయణమ్మగారి బండిని దాటించివేసింది.

అంతే, అలా దాటుకుపోయిన బండి గోదావరి, బెజవాడ, దాటేసి, క్రమంగా నాగపూరు, ఇటార్సీ ఝాన్సీలమీదుగా పరుగులెత్తుక పోతోంది.

ఝాన్సీకి బండి రాగానే, ఆ పెట్టెలోనే ప్రయాణం చేస్తున్న ఇంకొక ప్రయాణీకుని చూచి -

'ఝాన్సీకోట ఎక్కడ'దని అన్నాడు రాజు.

'అదిగో అదే. అక్కడే ఆమె తెల్లదొరలు చుట్టు ముట్టగా కోటలోనుండి కోటప్రహారీమీదుగా ఒక గంతేసి, మొదట బయటకు దూకిన శిలాస్థానం' అని దూరంనుండే చూపి, అక్కడ అలా దూకిన గుర్రపు అడుగులు వున్నాయనికూడ చెప్పాడు.

రాజుకు యజ్ఞంలో ఆజ్యం పోసినట్టయింది.

గమ్యం ఎంతత్వరగా చేరాలనే చింత ఎక్కువయింది.

పొగబండిమాత్రం పరుగెడుతూనే ఉంది ఆతనిగమ్యం దానికి తెలిసినట్లు.

కాని అది సాధ్యమా ? ఆతని గమ్యం ఎక్కడుందో ? ఎంత దూరమో ; ఎంతకాలం పడుతుందో ?

కాని -

సీతమాత్రం రాజు గడపదాటినే మరుక్షణం నుండి ఆ గడప లోనే కూర్చొని. ఆవేదనలో మెలిదిరిగి పోతూనే ఉంది.

ఆమె ఆవేదన ఆమెకు రాజు ఎడల నున్న విపరీత ప్రేమకు ప్రత్యక్ష నిదర్శనం.

పాపం! రాజుపోకతో ఆమె నడుం విరిగిన నాగుబాములా అయిపోయింది. ఇక ఆమె ఎముకలు విరిగిపోయాయ్. ఆమె శరీరం వొంపులు తిరిగిపోతోంది. ఆమెలో కార్చిచ్చు రగిలింది. రాజు పోకను తన మనోనేత్రాల ముందు వూహించుకొంటూ తల్లడిలి పోతూ మరీ తపిస్తోంది.

ఆమెకు రాజు పయనం -

బరిపడిచిన గారడీలా కనబడుతోంది.

ఏమవుతుందో అనే అనుమాన మామెకు! రాజు ఎక్కడైనా సుఖంగా వుంటే అంతే చాలు. ఆమె కంత ఆవేదన ఎందుకో ఏమో!

ఆరవిడిచిన అమ్ములా దూసుకపోయే ఆ వేగం, బిరవిడిచిన బాకులా కోసుకు పోగలిగినంతటి ఆ వాడి, నిగురొలిగిన నిప్పులాంటి ఆయనలోని వేడి, యిక్కడే ఆమెకు తన కళ్ళముందే చూచి భయ పడి పోయింది.

ప్రాణంతో చెలగాటమాడే యీ పద్ధతికి ఆమె కెంతయినా కంగారుగా వుంది.

ఇంతలోనే బయట నుండి -

'సీతా!' అన్న కేక ఆమెకు వినబడలేదు.

'అమ్మా!' అంటూ యీ దఫా తలుపుతట్టిన శబ్దం,

సీత గబగబా కన్నీరు తుడుచుకొని, తలుపుతీసి, తండ్రిముందు నిలబడిపోయింది.

"ఎందుకమ్మా! అస్తమానూ యీ ఏడుపు?" అంటూ తన వుత్తరీయంతో ఆ కనులు వొత్తాడు.

"కాదు, నాన్నా! నా కళ్ళతో చూచి. నా హృదయంతో అనుభవించు నాన్నా! నీకు తెలుస్తుంది."

"పిచ్చిదానా! నీ కళ్ళతో, నా కళ్ళతో కాదమ్మా?-చూడ్డం! డబ్బై అయిదుకోట్ల కన్నులతో చూడాలి తల్లీ! అప్పుడు తెలుస్తుంది - బాధ! భారతహృదయం యొక్క పరితాపం!"

'నాన్నా!'

"నీవింకా పసికూనవు తల్లీ! ఒక చెంప పాలూ, ఒక చెంప నెత్తురూనమ్మా! నీ, నా ఆరాటం కాదమ్మా! - ప్రధానం? దేశం ఆరాటం! బ్రిటిషు ధృతరాష్ట్రుల కరాళదంష్ట్రిలలో నలిగి, నలత చెందుతూ ఆరాటపడిపోతున్న మన పవిత్ర భారత మాతృమూర్తిని-చూడవమ్మా!"

ఆ మాటలు అంటూంటె, అతని హృదయం, టకటకలాడుతూ కొట్టుకుంది. యిక ఆయనకు వేడెక్కిపోతోంది.

'ఇక చెప్పకు నాన్నా! నేను వినలేను!' అంటూ సీత నెమ్మళించింది అప్పటికి.

అందుకే "ఉష్ణం ఉష్ణేనశీతలం!" అన్నారు పెద్దలు.

కాకను కాకచేతనే చల్లార్చాలి.

అలా చల్లారడం చూసి, మరల తండ్రి జాలిగా—

"మరేమనుకున్నావమ్మా! మన తల్లి యినుప సంకెళ్లు బద్దలుగొట్టడానికి ఒకటీ,' రెండూ కాదమ్మా! లక్షలాది మహావీరుల భుజాగ్రశక్తి కావాలి. ఆ శక్తిని ధారబోయడానికి ముందడుగేసే ప్రతి వీరుణ్ని చూచి, మనం గర్వపడాలి కాని భంగపడకూడదు - తల్లీ!"

అంటూ తల నిమిరాడు.

"నాన్నా!" అంటూ ఆయన కళ్ళలోకి చూచింది.

"తల్లీ!" అంటూ కౌగలించుకున్నాడు.

ఆయనకు ఒకే వొక కూతురు. కూతురంటె ఆయనకు చాలా ప్రేమ. కాని దేశమంటే ఆయనకున్న ప్రేమను, అంతటి ప్రేమభాజనమైన కన్నకూతురు కూడా తప్పించలేదేమో? ఏమైనా అతని మన

స్సులో వొంకరుంటే, అది పోయ్యే తీర్చాలి గాని యిక మన వశం కాదు. కూతురా - దేశమా? అన్న విషయం కంఠానికి వురిత్రాడులా తగులుకున్నప్పుడుగదా - ఆయన మనస్సులోని నిజానిజాలు ఆ కాకకు నిలబడేదీ, లేనిదీ తేలడం?

అయినా, యిప్పటికి ఆయన తనలోకే కూతుర్ని మార్చుకోడానికి విపరీతంగా ప్రయత్నం చేస్తున్నాడు.

ఆమెకు ఆయన మాటలు శూలాల్లాగునే గ్రుచ్చుకున్నాయి, ఆమెబాధ తనూ అర్థం చేసుకున్నాడు,

అందుకే—

"పదమ్మా! టౌన్‌హాల్లో యీ వేళో నాటకముంది - చూచొద్దాం!" అంటూ లాలనగా ప్రయాణం చేయించాడు.

ఇంతలో బయట సింహద్వారంవద్ద 'దభీ' మని శబ్దమైంది.

"చూడమ్మా!" అంటూ తండ్రి సీతవైపు, వీధితలుపు వైపూ చూచాడు.

సీత రివ్వున వెళ్ళి - సింహద్వారం తలుపులు తెరచింది. ఆశ్చర్యపోయింది!

సరిగ్గా తమ గుమ్మంముందే - ఒక నడివయస్కు స్మారకంతప్పి పడుంది.

సీత ఆప్యాయంగా లేవదీసి - 'నాన్నా!' అంటూ లోనికి తీసుకు వస్తోంది — "లోనికి తీసుకురామ్మా!" అన్న తండ్రిమాటలు మధ్యలో వుండగానే.

"కొన్నీళ్ళు తీసుకురామ్మా!"

సీత నీళ్ళు తెచ్చింది.

ఆమెకు నీళ్ళు త్రాగించాడాయన.

"నీరం నారాయణస్వరూపం!" కాదూ! ఆమె ప్రాణం లేచింది.

"ఎవరమ్మా! మీరు?" అని అడిగాడాయన.

నారాయణమ్మగారు తన కళ్ళను తాను నమ్మలేకపోయింది.

"ఎక్కడున్నాను నేను. ఎవరిదీ యిల్లు?"

"నీదేనమ్మా!"

"నా యిల్లయితే నా కొడుకుండాలి!"

"ఎవరమ్మా, నీ కొడుకు?"

"రాజు! నా కొడుకు పేరు - రామరాజు!"

తండ్రి ఆతృతగా అడిగాడు—

"మీ కుమారుడేనా - రాజు?"

"కుమారుడా?—ప్రాణం!" అంటూ "ఎక్కడ నా బాబు? ఎక్కడ నా రాజు?" గబ-గబా వూపిరాడకుండా అడిగేస్తోంది.

ఆ తండ్రి ఆమె ప్రశ్నలవర్షాన్ని గమనించలేదు, అతని తన్మయ మేదో ఆతనిది--

"ఓహో! వీరమాతవమ్మా! నీ కుమారుడు దేశంకోసం సర్వం త్యాగం చేసిన మహానుభావుడమ్మా!" అన్నాడు.

ఆమెలో ఆ మాటలు గుండెను కోసేశాయి. ఆందోళన మనస్కురాలై అడిగింది - నారాయణమ్మగారు--

'ఎక్కడికి?'

"త్యాగం ఎక్కడికయినా వెడుతుందమ్మా!"

ఆమె మతి చలించిపోయింది.

"నేనూ అక్కడకే వెడతా! నా కొడుకుకోసం ఎక్కడకయినా వెళ్ళిపోతా! లేవండి! అడ్డులేవండి!" అంటూ గబగబా లేచి పట్టుకుంటున్నా, గింజాయించుకుంటూ గడప దాటేసింది - ఆమె కాదు, కాదు. ముందు వెనుకలు, దూరభారాలు, కష్టనష్టాలు గుర్తించలేని ఆమె మాతృహృదయం.

సీత, ఆమెను చూస్తూ, తండ్రితో--

"పాపం! ఎక్కడికి వెడుతుందో, ఏమవుతుందో?" నంటూ నిట్టూర్పు విడిచింది.

తండ్రి సమాధానంగా—

"అందుకే చందమామ ప్రేమ ఒక్క జగతిలో వెన్నెలైతే మాతృమూర్తి ప్రేమ మనసంతా వెన్నెలన్నారమ్మా!" అన్నాడు.

'పాపం!'

"ఏం చేయగలమమ్మా! యీ సమయంలో ఎవ్వరిమాటలూ ఆమె కెక్కవ్! ఆ ఆందోళనాహృదయాన్ని సమాధానపరచం ఎవ్వరి తరమూ కాదు, అదమ్మా కన్న హృదయం!" అంటూ, ఆ గుమ్మంలో అలాగే నిలుచుండిపోయాడు.

# 8

గడప దాటిన రాజు, కల్లోలితరాజకీయమహాసాగరంలో తెరచాపా చుక్కానీ లేని నావలా అటూ, ఇటూ ఊగుతూ, అలాగే పోయాడు. ఏమో, ఎక్కడికో, ఎందుకో ?

అది నీవూ, నేనూ, మరొకడూ నిర్ణయించడం అసాధ్యం. అలా మనలో మనమే వెతకటం మొదలెడితే దానంత మనం కనుక్కోలేం సరిగదా, మనంతు అదే కనుక్కొంటుంది.

అలా కనుక్కోగల శక్తి, నాడు ప్రజలలో వున్న సాంఘిక రాజకీయ శక్తులపైనే ఆధారపడి వుంటుంది. రాజకీయశక్తి అంత గొప్పది. అయితే మహా విజ్ఞాని అయినవాడు తనే ఆ మహాశక్తిని హస్తగతం చేసేసుకోగలడు. కానివాడు దానికి లొంగిపోవలసిందే వాడెంత కుబేరుడైనా.

ఆ శక్తిని హస్తగతం చేసుకోగలిగిన ఆ మహావిజ్ఞాని కూడా ఈ రాజకీయశక్తికి నిమిత్తం లేకుండా బ్రతకడం అసంభవం. ఏదో తామరాకుపై నీటిబొట్టులాగున వుండి. అందింది పుచ్చుకుంటూ, అందంది అలా కూర్చొని చూస్తూ కాలక్షేపం చేయడం సాధ్యం కాదు. ఆ రాజకీయ తుఫానుగాలి వీచిందా ?-ఆకుతో సైతం మునిగిపోవలసిందే! మూలనున్న ముసలమ్మనుకూడా బరిలోకి యీడ్చేస్తుంది. అందుకే దానికంత శక్తి వుంది.

అంతటి శక్తి గలది మరొకటి ప్రపచంలో లేదు.

ఆనాడు రాజకీయాకాశంలో కారుమేఘాలు గ్రమ్ముకు న్నాయి. ఏ నిముషంలోనైనా కుంభవృష్టితో భీకరతుఫాను చెల రేగేలా వుంది.

ఆ మేఘాలు—

'తెల్లదొరల్ని తరిమేయాలని' గర్జిస్తున్నాయి.

'స్వతంత్రం కావా'లని ఘోషిస్తున్నాయి.

కారణం—

సరిగ్గా మొదటి ప్రపంచ మహాసంగ్రామం - మారణయుద్ధం! మానవ రక్తంలో క్రీడించే ప్రళయాంత పెడబొబ్బలు భారతప్రజలవి. సరిగ్గా ఏడాదయింది.

ఆ యుద్ధంలో - భయంకర పెనుభూతపు, మాయాపన్నా గంలో, ధనఖజానాల, ఫిరంగిమోతల పెనుహోమంలో, భారతీ యులు అనేకమంది నాశనమై పోయారు.

అసలు భారతీయులు నాశనం కావడానికి ప్రధానకారణం - శాంతికాముకులైన భారతీయులు యుద్ధంలో దూకడానికి ప్రధాన కారణం. సామ్రాజ్యవాదులు - సామ్రాజ్యవాద దురహంకారంతో బలవంతులైన బ్రిటిషురాజు, బలహీనులైన ఇతర రాజులను కొల్ల గొట్టడానికి చేసిన పన్నాగంలో భారతీయులు తల దూర్చడానికి కారణం వుంది—

అది యుద్ధం కాగానే భారతదేశానికి స్వయం నిర్ణయాధికార మిస్తామన్నారు. అనగా, తమ యింటిని తాము చక్కబెట్టుకునే హక్కు, తమ దేశాన్ని తాము పరిపాలించుకునే హక్కు యిస్తామన్నారు.

పైగా యిది ధర్మయుద్ధమన్నారు. ధర్మయుద్ధంకోసం తాము అవతారాలు దాల్చినట్టు, దెయ్యాలు వేదాలు వర్ణించినట్టు వర్ణిం చారు. భారతీయులు నమ్మారు. అందులోనూ సత్యసంధులు వారు. మాటయిచ్చి తల పోయినా తిరుగని త్యాగధనులు వారు.

యుద్ధంలో దూకారు. బలి పశువులుగా ఆహుతి అయి పోయారు. వికలాంగులై పోయారు. అంధులై పోయారు. బధిరులై పోయారు. ఆహుతై పోయిన భారతీయుల పిల్లలు, భార్యలు అనాథులై పోయారు. ఆ రకంగా ఎందరో భారత యిల్లాళ్ళ నల్లగాజులు, వల్లకాటి నల్లబండపై ఛళ్ళున బ్రద్దలై పోయాయి.

బ్రిటిషువారు జయించారు.

కాని మిగిలిపోయింది - యుద్ధతాకిడికి దెబ్బతిన్న భారత దేశం. దాన్ని కరువులు చుట్టుముట్టాయి. ఆకలికాగలేక, ఒకడు నూతిలోపడి చచ్చిపోయాడు. బిడ్డని ఆకలిబాధ వినలేక ఒక తల్లి, ఓ కామందునికి అమ్మేసుకొంది. ఓ తల్లి ఆ బిడ్డని పాలకోసం, నడిబజారులో వ్యభిచరించింది. ఓ తల్లి శీలాన్ని చంపుకోలేక, ఆ పిల్లవాని పీక నులిమి, నడివీధిలో పారేసింది. తనూ, ఓ చెట్టుకు వురిపోసుకు చచ్చిపోయింది.

ఇలా కొల్లలుగా వార్తలొస్తున్నాయి. భారతప్రజ మాడి పోతోంది. కలకత్తా వీధుల్లో, బొంబాయి బజారుల్లో, మదరాస్ ఫుట్‌పాత్‌లపై, ఢిల్లీ నగరంలో ఒకచోట కాదు; అన్నిచోట్లా కరువు మహమ్మారి ఇనుపగజ్జెలతో విలయనాట్యం చేస్తోంది. ఏనుగులాంటి మీసమున్న మగవాడు కూడా పీనుగై పోయాడు.

అదుగో! రాయలసీమలో నొకడు, చచ్చిపడివున్న గొడ్డు మాంసం తిని, కడుపు పొంగి చచ్చిపోయాడు. ఒకడు ఎవరితో చెప్పకుండా, వూరిబయటకు పోయి, విషం తిని చచ్చిపోయాడు.

ఇలా అయిపోయింది - దేశం!

ఇన్ని బాధలూ సహించింది ఎందుకోసం - స్వతంత్ర-వాయువుని పీల్చడానికి.

వాగ్దానం ప్రకారం - అడిగింది భారతప్రజ!

"ఏది మా స్వయం నిర్ణయాధికారమ"ని!

సాధుకంఠం దానిది. మెత్తగా అడిగింది. కాని ఆ గొంతులో సుడిగుండాలు, బడబాగ్నులు ప్రజ్వరిల్లిగలధ్వని నిబిడీకృతమైవుంది.

కనిపెట్టారు - తెల్లదొరలు. చూపారు మొండిచెయ్యి.

"స్వయం నిర్ణయాధికారం లేదూ, స్వతంత్రమూ లేదు!"

"ఒక్కటే స్వతంత్రం! - అది మలమల మాడి చావడం!" అన్నారు దొరలు.

ఇక తిరగబడుతుంది - భారతప్రజ!

వెంటనే రౌలట్ చట్టమన్నారు.

తన నిజస్వరూపంతో, విషపుపడగల నెత్తి, ఆ పయోముఖ విషకుంభం. పైశాచిక హత్యాకాండకు దిగింది.

దానికి - ప్రత్యక్షనిదర్శనం!

పంజాబు।

—జలియన్‌వాలా బాగ్!

అదే - పంజాబునాయకుడు - విశాఖపట్నం బహిరంగ సభలో వుద్ఘాటించాడు.

జలియన్‌వాలాబాగ్‌లో మండుటెండలో గర్భిణిస్త్రీలను పొట్టలపై ప్రాకించారు. శిశువులను చిత్రవధలు చేసారు. ఒక్కరోజు పట్టపగలు, ఒక్క క్షణంలో శాంతియుతంగా కూర్చున్న భారతప్రజలను చుట్టుముట్టిరి. మరఫిరంగులతో కాల్చేసి - స్మశానవాటికగా మార్చేశారు.

అగ్నిపర్వతమైపోయింది - దేశం!

దేశమంతా ఒక్కటైపోయింది.

భగ్గున మండిపోయింది.

"నాయకులు 'ఊ!' అంటే, యీ తెల్లప్రభుత్వాన్ని పునాదుల్తో పెకిలించి, ఇంగ్లండులో పారేస్తారు - ప్రజలు!"

'తొందరపడవద్ద'న్నారు నాయకులు!

'చట్' కుదరదంది ఒకవర్గం.

నాయకుల్ని ధిక్కరించింది.

కనబడిన బ్రిటిషు వుద్యోగినల్లా నరికిపారేయాలంది.

వీళ్ళే 'టెర్రరిస్టు' లయ్యారు.

వారికొట్టి వుద్రేకం! విపరీతమైన దేశభక్తి!

ఏదైనా వెర్రితలలు వేస్తే ప్రమాదం.

ఆ సంగతి వాళ్లకు తెలియదు. ఒక తెల్లదొర చస్తే, ఇంకొక దొర వెంటనే యింగ్లండునుంచి దిగుతాడని.

అసలు, బ్రిటిషువాళ్ళనే పునాదుల్తో విసిరేసే మార్గం వారికి తెలీదు.

రాజకీయలోకం గందరగోళంగా వుంది.

ప్రజల హృదయాల్లో రాక్షసబొగ్గులు రగిలాయ్.

ప్రజల్లో "టెర్రరిస్టు"ల మార్గమే చేబట్టే ప్రమాదం ఏర్పడిపోయింది.

వార్తలొస్తున్నాయి—

అదుగో! వైస్రాయి ప్రయాణం చేస్తున్న రైలుబండిని కూల్చేసారు.

అదుగో! ప్రభుత్వపు ఆయుధాగారంపైని దాడిచేసారు.

అదుగో! కలకత్తా కార్మికులు వీధుల్లోపడ్డారు.

ఈ వార్తలు విన్నారు. బ్రిటిషుప్రభుత్వం కూడా, యీ వుద్యమాన్ని ఎక్కడికక్కడ అణిచేయడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. కాని ప్రజలు రెచ్చిపోతున్నారు.

ఇక నాయకులు కదిలారు. ఒక హద్దుల్లో ఒక వుద్యమం నడపాలని నిర్ణయించారు 'సహాయనిరాకరణోద్యమం' అన్నారు.

వాళ్ళకు కూడా తెలీదు. ఒక హద్దులో వుండేదేదో? నీ యింటిలో ఏడ్చే పసిబిడ్డను హద్దులో పెట్టలేని పెద్దమ్మవు - నీవు! చెలరేగిన జనసమ్మర్దాన్ని, పోటెత్తి కెరలే సముద్ర కెరటాల్ని హద్దుల్లో పెట్టగల మనుకోడం భ్రమ

ఏమైతేనేం, భారతప్రజలకు వూపిరందింది.

ఒక్కసారిగా వూపిరి పీల్చారు.

"హరోం హర హర!" మంటూ లంఘించారు. మదమెత్తిన కరీంద్రముపైకి, సింహం లంఘించినట్టు.

ఎక్కడో సముద్రాంతరాల్లో భారతీయుల కొద్దిసైనికుల పనే చూడగలిగారు బ్రిటిషువాళ్ళు. కాని భారతప్రజలు - తమ గడ్డమీద వుండి ఎలా పోట్లాడతారో - వాళ్ళకేం తెల్సు!

భారతప్రజలు ఒక్కొక్క డొక్కొక మహావీరుడై పోయాడు.

భారతభూమి క్షాత్రభూమిగా మారిపోయింది.

బ్రిటిషురాజులు ఓడలపై సైన్యాలను దింపారు. ఆ వార్త విని మరీ రెచ్చారు ప్రజలు.

నాయకులు భయపడిపోయారు.

కాని—

"చౌరాచౌరీలో" ప్రజల వుద్రేకం హద్దులు దాటిపోయింది. తమను నిట్టనిలువునా కాల్చబూనిన పోలీసులను, నిలుచుండగానే యమపురి కంపేసారు.

యీ వార్త దేశంలో విద్యుత్కాంతిలా మెరసింది.

కాని నాయకుల గుండెల్లో పిడుగుపడింది.

"హాఁ" అన్నారు.

"హింసాచర్య" అన్నారు.

'చౌరాచౌరీ ప్రజ! మూర్ఖప్రజ!' అన్నారు.

కాని—

భారతప్రజలు —

"చౌరాచౌరీప్రజ మార్గాన్నే నడవాల"న్నారు.

వేటుపడ్డ సింహాల్లా గర్జించారు. డెబ్భైఅయిదుకోట్ల కళ్ళు డెబ్భైఅయిదుకోట్ల అగ్నికణాలయ్యాయి.

కాని—

చన్నీళ్ళు చల్లేసారు - నాయకులు!

పళ్ళిజలు గొంతులు నులిపేసారు—

"అహింస"న్నారు!

ఈ నాయకులు, దేశంలో ధనిక మేధావి వర్గానికి బంధువులు.

వీరు తమ పారిశ్రామిక విస్తరణకు మాత్రమే స్వాతంత్రం కావాలన్నారు.

ఆమాత్రపు కోర్కెకు కూడా బ్రిటన్ అంగీకరించలేదు. అందుకే వీరు 'బ్రిటిషువాళ్లు పోవాల'న్నారు.

ఆర్థికంగా, సాంఘికంగా పలుకుబడిగల పెద్దలు.

అంచేతనే ప్రజలు వాళ్ళ పిలుపుకు ఎదురుచూసారు.

ప్రజలూ, 'బ్రిటిషువాళ్ళు పోవాలన్నారు' కాబట్టి, ఆ ప్రజలను నడపడానికి అంగీకరించారు. స్వార్థం వాళ్ళఅంగీకారంలో గర్భితమై వుంది. కాని చెలరేగింది - స్వార్థం లేని శ్రామికశక్తి. కలకత్తా కార్మికశక్తి. అది అజేయశక్తి! దానిలో వూగిసలాట వుండదు. అది బరినురికింది.

అది కనిపెట్టిన నాయకులు - 'ఆప'మన్నారు వుద్యమం!

నిజంగా, ఆనాడు ఆ కార్మికులను నడపగలిగిన నాయకులే గాని ముందు నిలచివుంటే పరిస్థితి ఇంకోలా పరిణమించి వుండేది.

సరిగ్గా రెండేళ్లక్రితం! రష్యాలో పరిణమించినట్టు.

అక్కడా యీ యుద్ధమేవచ్చింది. మన భారతీయులలాగే ఆ దేశీయులు, సామ్రాజ్యవాదుల తరపున యుద్ధంలో కెళ్ళారు. ఆహుతై పోయారు. యుద్ధకాలంలోనే కరువక్కడ తాండవించింది. కాని అక్కడ ముందుచూపు గల నాయకులున్నారు. వాళ్ళకు భయంలేదు. కార్మికులకుండే నిస్వార్థశక్తి వాళ్ళ కుంది. మన నాయకులు 'స్వతంత్ర' కోసం బ్రిటిషు సామ్రాజ్యవాదుల దయాదాక్షిణ్యాలపై ఆధారపడినట్టు, వాళ్ళు ఆధారపడ దలచుకోలేదు.

వెంటనే పిలుపిచ్చారు—

"యుద్ధంపై యుద్ధం" చేయమని.

'సామ్రాజ్యవాద యుద్ధాన్ని స్వతంత్రయుద్ధం'గా మార్చేయమని. అంతే తిరుగబడిందక్కడ - తొలుత కార్మికవర్గం.

నాయకులు - కార్మికులు!

తిరగబడ్డ ఇరవైనాలుగు గంటల్లో సాధించారు. స్వతంత్రం! మామూలు స్వతంత్రం కాదు. దానికి హద్దుల్లేవు. ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా స్వతంత్రం! పేద ధనిక తారతమ్యం లేని స్వతంత్రం! దానికే వారు సోషలిజం పేరుపెట్టారు.

ఆ మహా విప్లవాన్ని కళ్ళారా చూచిన వీరులు, కాబూలు కొండల మీదుగా రష్యా దర్శించి వచ్చిన భారతవీరులు. అప్పుడు పంజాబులోనే వున్నారు.

కాని అప్పుడు వారిశక్తి తక్కువ, మన మహాభారతంలో వారి పట్టు అంతగా లేదు. చీకటిలో వెలుతురుగా చూచాయిగా, కనబడుతున్న శక్తి అది. శైశవాస్థలో, కనబడీ కనబడనట్టు - తిరుగుతున్న శక్తి అది.

అందుకే మనదేశం యీ ధనిక, మేధావుల నాయకత్వ గుప్పిటను వుండవలసి వచ్చింది.

అయితే, రష్యాలో ఆ నాయకులు చేసినట్టు మన నాయకులెందుకు చేయలేకపోయారని మీరడగొచ్చు! అదిగో! అక్కడేవుంది దాని కిటుకు!

యుద్ధాన్ని అంతర్యుద్ధంగా, స్వతంత్ర యుద్ధంగా మార్చితే, రంకెలేస్తూ, వీరిపగ్గాల్ని, హద్దుల్ని త్రెంచుకుపోయే శ్రామికశక్తి దేశంలో వుంది.

స్వతంత్ర పోరాటంలో ఎవరు ముందుండి పోరాడతారో, అధికారంకూడా వాళ్ళే గుంజుకుంటారు. అటువంటి అధికారం ఇంకో చేతికి పోడానికి అంగీకరింపరు - మన నాయకులు - అదీ అసలు సంగతి! యీ సంగతి గ్రహించిన కొద్దిమంది నాయకులు, దేశంలో లేకపోలేదు. వాళ్లే!

"యీ పోరాటం సాగవలసిందే!" అని సమర శంఖారావం మరల పూరించారు. ఇక చూచుకోండి! భారత మహాసాగరం మరల పొంగింది, ఒక్కొక్క పొంగుగా.

మొట్టమొదటి సారిగా, ఆంధ్రుడు నగారా మ్రోగించాడు - కోడిపందెముల తగాదాలో తెలుగు యోధులకవోష్ణరక్తం వ్యర్థమై ప్రవహించిన పలనాడులో - బాలచంద్రుడు ఒకనాడు తన వేడిరక్తం చిందించిన పలనాడులో - ఆ రక్తపుధారలు ఆరకుండానే, ఆ రక్తపు జీరలు, నాగులేట జీర్ణం కాకుండానే, మరల తెలుగు రక్తాన్ని ఎగజిమ్మాడు, పల్నాటివీరహనుమంతు! పన్నుల నిరాకారణోద్యమాన్ని ఏకఛత్రాటిపై నడిపిన తెలుగువీరుడు.

కాని ప్రయోజనం లేకపోయింది.

దేశంలో సహాయ నిరాకరణోద్యమాలు చల్లారిపోయాయి. కాని మరల పొంగిన ఒక్కొక్క పొంగును, తెల్లదొరలు అణచివేయ గలిగారు.

రెండు కొండల నడుమనున్న పల్నాడు గ్రామాన్ని సమూలంగా ధ్వంసం చేసివేసారు. రాజీ మర్మంపేరులో అరమరికలు తెలియని అమాయక విప్లవవీరుని ఎదుటపడి పోట్లాడే శక్తిలేక, ఒక చోటుకు పిలిపించి హత్య చేసేసారు. అంతే ఆంధ్ర చల్లారిపోయింది.

అదేకాలంలో చిటకాంగులో, లాహోరులో కొన్ని పొంగులు పొంగాయి. వాటిని నాశనం చేసేయగలిగారు.

మరల కారుచీకటులు, భారతరాజకీయాన్ని క్రమ్మేశాయి. నిరాశాఘోషలు, మూలుగులు వినబడుతున్నాయి.

మరల దేశం తయారు కావాలి. ఆ తయారు చేసే నాథులు కావాలి. ఆ నాథులకోసమే నాటి భారతప్రజ తహతహ! అదే మన రాజులోనున్న వేడి. ఆ వేడితోనే తిన్నగా పంజాబు వచ్చేశాడు.

గడ్డం, బట్టలు మాసిపోయాయ్. శరీరం చిక్కిపోయింది. కనులు గుంటలు పడిపోయాయ్. కాని కనుపాపల్లోని కాంతి తగ్గ లేదు. ఒక బంగళాముందు ఆగాడు. ఆ బంగళాను కావలికాస్తున్న ఓ పొడుగాటి తలపాగా ధరించిన ఓ సిఖ్ఖు—

"ఇదే బాబూ! లోనికెళ్ళండి!" అనగానే రాజు లోనికెళ్లాడు.

ఆ బంగళాలో ఎవ్వరున్నదీ లోకానికి తెలీదు. ఏం జరుగుతున్నదీ - ఆ బంగళాలోవారికే తెలీదు - దానితో ఆత్మీయ సంబంధమున్నవారికి తప్ప, అదో రహస్యమందిరం.

లోపలిగదిలో టేబిలుముందు, విశాఖపట్నంలో ఆనాటి సభలో అనర్గళోపన్యాసమిచ్చిన పంజాబు నాయకుడు ఏదో ఏకదీక్షతో రాస్తున్నాడు.

రాజు వచ్చిన శబ్దం విని లేచాడు.

ముందుకొచ్చి, చేతులుచాచి,రాజును ఆలింగనం చేసుకున్నాడు.

రాజును అక్కడే కుర్చీలో కూర్చోబెట్టి, ఆయన్ను సంపూర్ణంగా అర్థం చేసుకున్నవాడిలా అడిగాడు—

"ఇంత శ్రమతో, ఇంతదూరం, ఇంత ఆతృతగా ఎందుకొచ్చావ్ - బాబూ ?"

"శ్రమలేదు - చెప్పండి! నా స్వేదాన్నే గాక రక్తాన్నికూడా ధారవోయడానికి ఏపనైనా, ఎంతదూరమయినా, వెళ్ళి చేయడానికి యీ ఆంధ్రుడు సిద్ధంగా వున్నాడు. ఆజ్ఞాపించండి స్వామీ!" అంటూ రాజు వినమ్రుడై చెప్పాడు.

రాజు శక్తి, ఆయనకు తెలుసు! కాని అంతటి పసిహృదయం-కాగుతున్న పాలలాంటి హృదయంలోనుండి వెలువడ్డ పొంగు నిప్పుల పాలు కాకూడదనే భావంతోనే—

"ఇంకా నీవు బాలుడవు నాయనా - ఏం చేయగలవ్ ?"

"మీరు సెలవిస్తే నా దేశంకోసం ఏమైనా చేయగలను !"

మందహాసంతో ఆ నాయకు డన్నాడు—

"చేయడం కాదు, నాయనా ! యివ్వగలగాలి!"

"చెప్పండి స్వామీ ! ఏమైనా యిస్తా !"

"ఏమైనా యెందుకు ? స్వతంత్ర సమర మహాయజ్ఞంలో ప్రాణాన్ని సమిధగా బలివ్వగలగాలి!" అని నాయకు డనగానే రాజుకు ముఖాన్ని వీరగంధం పెట్టినట్టయింది. ఆయన శరీరం పులకరించింది

"బలిదానంతోనే స్వతంత్రం రాగలిగితే, నా గుండె ఒలిచి, మీ అరచేతిలో పెట్టగలను స్వామీ !"

"సెభాష్! నాయనా!" అని ఆ బాలుని లలాటాన్ని ముద్దు పెట్టి—

"అయితే లోనికి రా, నాయనా! అంటూ రాజును లోపలకు తీసుకెళ్ళాడు.

ఆయనకు రాజుపై విపరీతమైన నమ్మకం కుదిరింది. ప్రక్క గదిలోకి తీసుకెళ్ళి, ఆ ప్రక్క మీట నొక్కాడు. ఒక సొరంగద్వారం తెరచుకుంది. ఇరువురూ లోనికి వెళ్ళిపోయారు మరలా సొరంగ ద్వారం మూసుకుంది.

అసలు, ఆచరణలో అన్ని అగ్నిపరీక్షలకూ ఆగినవానికి తప్ప, అదెల్లకాలమూ మూసుకొని వుంటుంది.

అన్ని పరీక్షలకూ ఆగి, తన చిక్కటి నెత్తురును దీపంకాకలో కరిగించి, ఎవరైతే కాగితాలపై రక్తాక్షరాలతో దస్కత్తు పెడతారో. వారికే తెరచుకుంటుంది.

అటువంటివేమీ జరక్కుండానే రాజుకు తెరచుకుంది. అదే ఆంధ్రుని ఘనత. అతనిది వాక్శుద్ధి గలిగిన చిత్తశుద్ధి. అందుకే దానికంత విలువ !

ఆ సొరంగ మార్గంలో కొంతదూరం వెళ్ళి ఆ ప్రక్క మీట నొక్కగానే రెండు తలుపులు. తటాలున తెరచుకున్నాయి.

ఎదురుగా—ఓ పెద్ద శిలావిగ్రహముంది.

ఆ విగ్రహం బ్రిటీషు ముష్కరుల బందీగానున్న భారతమాత. తన ముప్పయ్యేడుకోట్ల బిడ్డల బ్రతుకుకై పరితపిస్తూ" మోచేతిపై జుట్టు విరబోసి తలవాల్చి, కుమిలిపోతున్న తల్లి! నడుముకు బలమైన ఉక్కు గొలుసులతో ప్రక్కనున్న ప్రబలమైన ఉక్కుకొయ్యకు బంధించబడి వుంది. ప్రక్క గోడకు తుపాకులు, రివాల్వర్లూ, విల్లమ్ములూ. బాకులూ, కత్తులూ, కఠారులూ అన్నీ తగిలించి వున్నాయ్,

ఆ విగ్రహం ముందు మనోనిగ్రహం కలిగిన పదిమంది పంజాబు యువకులు ఏకవరుసలో నిలబడివున్నారు.

వాళ్ళను బయటికి వొదిలితే, బ్రిటిషు సామ్రాజ్య వాదుల్ని చెండాడిగాని, వారి శిరములు త్రుంచిగాని, మరల వొరలో దూరని విచ్చుకత్తులు వారు.

వారినీ, ఆ విగ్రహాన్నీ రాజుకు చూపించి, ఆ దేశభక్తుడు కనుల నీరు నింపుకుంటూ అన్నాడు—

'చూచావా, నాయనా! రాతిబండలు సైతం కాలిపోగల, అతి దారుణ దీనావస్థలోనున్న మన పవిత్ర భారతమాత అవస్థ!'

రాజు - కళ్ళు అశ్రుపూరితా లయ్యాయి. ఆ నాయకుడు బాధాదుగ్ధ కంఠంతో—

"కాని విష పాషాణహృదయులైన తెల్లదొరల బందీ మన తల్లి - ముప్పయ్యేడుకోట్ల బిడ్డలుండి కూడా అనాధయైన మన తల్లి! ఆమె సంకెళ్లు ఛేదించడమే. ఆ వీరుల సేటి కర్తవ్యం!" అనగానే,

రాజు ముఖం జేవురించింది.

వరుసలో నిలబడ్డ ఒక వీరుడు సంకెళ్ళపైకి రివాల్వరు కాల్చాడు. అవి పగులలేదు. ఇంకొక వీరుడు తుపాకి కాల్చాడు. నిష్ప్రయోజన మయ్యాయి - అన్నీ.

రాజుకు వుద్రేకం ఆగలేదు. ఎదుటి వీరులు చిన్నబుచ్చుకుంటా రేమోనని కూడా ఆయన ఆవేశం చూడలేదు. అసలు వారిని చిన్న బుచ్చడం ఆయన వుద్దేశం కాదు. వుత్సాహంతోనే, వాటిని త్రెంచా లనే పట్టుదలతోనే, అడిగాడు—

'స్వామీ! అనుమతిస్తే నా తల్లి సంకెళ్ళు నేను విచ్ఛిన్నం చేస్తాను!'

'ప్రయత్నించు నాయనా!' అని చిరునగవుతో అనుమతించా డాయన.

పరమానందమైంది-రాజుకు. చప్రున గోడనున్న విల్లమ్ములు లాగేడు. చెవికంటా నారి లాగి, అమ్ము సంధించాడు. 'చక్!'మని

వొదిలాడు. పెళ్ళున పగిలి క్రిందబడ్డాయా సంకెళ్ళు! ఆ గదిలో జయగంట మోగింది. ఆ నాయకుని మోము వికసించింది.

వెంటనే భారతీదేవి చరణారవిందాల ముందునున్న సింధూరం తీసి, బాలుని నుదుట తిలకంపెట్టి, మేను తడిమి—

"సెభాష్! నాయనా! ఇక నాకు సందేహంలేదు. నీ శక్తి సామర్థ్యాలు అసామాన్యం. అసలా వింటిని వొంచగలిగినవాడు కానరాక కృశించిపోయిన నాకు విల్లు నెక్కుపెట్టి, అమ్ము సంధించి, సంకెళ్ళు ఛేదించి నా చిరవాంఛితాన్ని యీడేర్చావ్, నాయనా! యిక నీవు వాయించు! - రణభేరి! సాగించు - ధర్మయుద్ధం! నీకు విజయం తథ్యం! అఖండ భారతమే నీకు ఋణపడ్డం సత్యం! వెళ్లు, నాయనా!" అంటూ రెండు చేతులూ, శిరస్సునుంచి, ఆశీర్వదించాడా మహానుభావుడు.

"క్షమించండి! నేను మీతోనే వుండి యీ స్వతంత్ర సంగ్రామంలో పాల్గొనడానికి అనుమతించండి."

"కాదు, నాయనా! బ్రిటిషు సామ్రాజ్యశక్తి నీకింకా అర్థం కాలేదు. ఇదో బ్రహ్మరాక్షసి. దీన్ని నలువైపులనుండి వుచ్చులు బిగించి, వ్యూహాలు పన్నితేనేగాని నాశనం కాదు!'

"స్వామీ?"

"శుభం! ఇక వెళ్లు నాయనా! బహు అప్రమత్తతసుమా! వెనుకబడిన ప్రాంతాలే ఆటుకూ, పోటుకూ, ఐక్యతకూ కోటలు. ఆ కోటలో పాగావేయడం పోరాటానికి విజయం. అది కోట చిహ్నమని గుర్తించు. అయితే జనంలో నిరాశాస్పృహాలు జనించాయా?- భద్రం నాయనా! అవసరమైనప్పుడల్లా నా సహాయం నీకుంటుంది- నీ పోరాటానికి మా పంజాబు బాసటగా నిలుస్తుంది!'

"అయితే సెలవిప్పించండి!" అంటూ, ఆ నాయకునికి వందన సమర్పణ చేసాడు—రాజు. అంతా—'స్వతంత్రభారత్‌కు జై!' అనగానే యిటు అందిరికీ నమోవాకాలు సమర్పించి బయలుదేరాడు.

ఆయన బయలుదేరాక, మిగిలిన పదిమందినీ చూచి, ఆ పంజాబు నాయకుడన్నాడు—

"చూశారా! ఆంధ్రజాతి! అది శౌర్యానికి సింహం. మనం వారికి తీసిపోకూడదు!" అని.

మనరాజు బయలుదేరాడు.

సూర్యకాంతిని పుణికిపుచ్చుకున్న బాలచంద్రుడు ఆకాశంలో వుదయించాడు.

ఘడియఘడియకు ప్రవర్ధమానుడై, ప్రకాశవంతమై, యౌవ్వన తేజస్కుడై మొయిలుకన్యలతో దోబూచులాడుకుంటూ, పయనిస్తు న్నాడు.

తండ్రి బలవంతంపై సీత "ఆంధ్రశ్రీ" అను ఆంధ్ర వీరుల చరిత్ర గ్రంథాన్ని పారాయణ చేస్తోంది. ప్రక్కనే తండ్రి కూర్చొని, ప్రమిదలోని వొత్తు ఎగదోస్తున్నాడు.

సీత కొనసాగిస్తోంది—

"పలనాటి సోదరులు రెండుపక్షాలుగా చీలిపోయాయి. కయ్యాలు కల్పించడంలో కలహాకత్తె, తంత్రాలు పన్నడంలో నెర జాణ. నాగమ్మ ఓ పక్షానికి కొమ్ముకాసింది. మరో పక్షానికి ధర్మ సంధాత, శాంతిదూత బ్రహ్మనాయన పట్టుగొమ్మ. పోరు రాజి నాగు లేట నెత్తురు వరదలే పారుతున్నాయ్..."

తండ్రి వుత్కంఠంతో అడిగాడు—

"తర్వాత?"

సీత పేజీ త్రిప్పింది—

"కాని బ్రహ్మనాయన కొడుకు యౌవ్వనం చిందులు త్రొక్కు తున్న బాలచంద్రుడు ప్రణయోన్మాదంలో భార్య మాంచాల, వన్నెల మేడకు వెన్నెల రాత్రి వచ్చి, చంటిపిల్లవానిలా ఆమె పైట కొంగు పట్టుకొని వ్రేలాడాడు. మాంచాల, ఆ పట్టు విదిలించుకుంది. గోడనున్న ఖడ్గం లాగి బాలచంద్రుని చేతకందిచ్చి, కళ్ళు పచ్చబడే టట్టు, మందలించింది..."

"ఏమని ?"

సీత చదివింది--

"పలనాట నెత్తురు ఏరులు పారుతున్న సమయంలో వీరుని విధి కత్తి చేతబట్టి స్వైరవిహారం చేయడం. భీరువులా ప్రణయ కలాపం చేయడంకాదు." అని ఖడ్గమందించింది. మేను పులకరించిన బాలచంద్రుడు మత్తువొదిలి, కత్తిపట్టి కదనరంగాని కురికాడు.",

తండ్రి ఆవేశంతో—

"ఏది ? మళ్ళీ ఆమాటల వినిపించమ్మా!"

ఆమె ఆందోళనతో మరల చదివింది--

"పలనాట నెత్తుర ఏరులు పారుతున్న సమయంలో వీరుని విధి కత్తి చేతపట్టి, స్వైరవిహారం చేయడం - భీరువులా ప్రణయ కలాపం చేయడంకాదు."

ఆ మాటలు అంటూనే, తన కెంతగా అవి బాధపెడుతున్నాయో, సీత అర్థం చేసుకోడానికి ప్రియత్నం చేస్తోంది.

తండ్రి ఆ మాటల్ని సీతకు అన్వయించడానికి ప్రయత్నం చేస్తూ—

'ఆ! దేశంలో నెత్తురు ఏరులు పారుతున్న యీ సమయంలో స్త్రీ విధికూడా, మగవానికి కత్తినిచ్చి, కదనరంగంలో కురికించడం కదమ్మా! !'

సీత కా మాటలు శరాఘాతంలా తగిలాయి.

"నాన్నా !" అని పుస్తకం వొదిలి, తండ్రివొడిలో తల దూర్చింది.

అలా క్షణం గడిచిందో, లేదో, బయట తలుపు చప్పుడైంది. వారికా చప్పుడు వినబడలేదు. తండ్రి సీత తల నిమురుతూ--

'అవునమ్మా! తానుగా ఆవేశుడైన రాజును నీ వాశీర్వదించాలి గాని ఆవేదించకూడదమ్మా !'

'నాన్నా?'

'అవునమ్మా!'

బాధను అణుచుకుంటూ, చిత్త స్థైర్యాన్ని తెంచుకుంటూ సీత--

"క్షమించు, నాన్నా! ఇక అలాగే ఆశీర్వదిస్తా!" అంది. ఆ మాటలు బయటికి రావడంతోపాటు, ఆమె కన్నుల్లో కన్నీరుకూడా నిలబడింది.

"సెభాష్! తల్లీ! మన వంశప్రతిష్ట నిలిపావ్! తెలుగు కీర్తిని యినుమడింప చేసావ్!"

బయట మరల తలుపు, చప్పుడు తీవ్రమైంది. సీత వెళ్ళి తలుపు తీసింది. తీరా రాజు ప్రత్యక్షమయ్యాడు.

ఆ ముఖంచూచి, సీత నిర్విణ్ణురాలైంది.

రాజు ముఖంలో నవ్యోత్తేజం ప్రకాశిస్తూంది. కొద్ది పొటమరించిన చిరుగడ్డం. ముఖాన సింధూర తిలకం. చెవులకు కుండలాలతో అతని శౌర్య పటిమ ఆమెను చకితను చేసింది!

—క్షణం నిశ్శబ్దమయింది ఆ మధ్యప్రదేశం. ఆ క్షణం - సీత మౌనం దాల్చింది.

అనుకొంది - గతిలేక మరల గడప ద్రొక్కినాడని.

అలా నిర్ణయించుకొని, ఆతనిపై వుద్రేకంతో విరుచుకుబడింది.

సూటిగా ప్రశ్నింది - ఆ ప్రశ్నకు తన బుద్ధి అంగీకరించక పోయినప్పటికీ--

"మళ్ళీ ఎందుకొచ్చావ్?"

రాజును చూడగానే, సీత నిర్విణ్ణురాలైతే--

ఇప్పుడు సీతమాట వినగానే రాజు నిర్విణ్ణుడయ్యాడు.

కాని అతనిలో రాలుతున్న నిప్పులున్నాయి. నిండు హృదయంగల మానవుడాయన - దాపరికంలేకుండా, రెచ్చిపోకుండా అన్నాడు--

"నిన్ను చూడకుండా నేనెలా వుండగలను;" అంటూ సీత చేయి పట్టుకున్నాడు. ఆమె విదళించుకొని--

"నిగ్రహం కోల్పోతున్నావ్?"

రాజుకు కోపమొచ్చింది. నిజాని కామాట సీత అనాలని అన లేదు. పైగా ఆమెలో రాజుపై మమత. అతను చెప్పకుండా వెళ్ళి పోయినందులకు దుగ్ధ, వున్నాయి. వా టన్నిటికంటె ఎక్కువ అంతకుముందే ఆమె తండ్రి కిచ్చినమాట, ఆమెలో నున్నయిన్ని కోణాలు, రాజు కెలా అర్థమౌతాయ్.

రెచ్చాడు - "చులకన చేస్తున్నావ్?"

'ఆ! చేస్తా!'

'ఏమన్నావ్?'

"మళ్ళీ అంటా! పదిసార్లంటా, వెయ్యిసార్లంటా, యీమాత్రం నిగ్రహం లేనివాడివి ప్రపంచానికి పలుపుత్రాడేస్తావే."

"సీతా!" గద్దించాడు రాజు - పౌరుషంగా!

సీత మరీ రెచ్చగొట్టింది--

"అవును! దేశంలో నెత్తురు ఏరులు పారుతున్న యీ సమయంలో కత్తి చేతబట్టి కదనరంగంలో దూకడం వీరుని విధి!"

రాజు పొంగాడు. "నిజంగా అంటున్నావా?"

"ముమ్మాటికీ నిజంగా!"

రాజు ఆనందభరితుడైపోయాడు, తన సీత, ఒక విరహ తాపాన్ని వెల్లడించిన సీత. ఇలా దేశభక్తిని వెల్లడిస్తుందని అనుకో లేదు. కాని ఆయన్ని సీత అర్థంచేసుకోలేదు.

"అయితే నన్నర్థంచేసుకోలేకపోయావ్ - సీతా! నే నిక్కడకు వచ్చింది-తుచ్ఛకామం ప్రకోపించికాదు. రణభూమికి వెడుతూ, ప్రణయమిచ్చిన యువతికి కడచూపు అందించిపోదామని వచ్చా!" అంటూ ఘంటాపదంగా నొక్కిచెప్పిన ఆయన మాటలు ఆమెకు మరీ బాధ కలిగించాయి.

దుఃఖం ఉబికింది—

"అయితే క్షమించు! నిన్నన రానిమాట లన్నాను!"

అబ్బ! స్త్రీ బుద్ధి ఎంత సున్నితం! ఎంత తేలిక! ఒక్క తృటిలో, వెయ్యి వొంపులు, క్షణానికో అభిప్రాయం! కరుకైన ఆమె హృద

యాన్ని కరగిందామని ప్రయత్నిస్తే, సరిగ్గా అర్థంచేసుకుంటే, నీటి కంటె ద్రవమైపోతుంది. పెడార్థంచేసుకుంటే, పాషాణంకంటె కరుకై పోతుంది.

స్త్రీలవల్ల మారిపోయిన మనుషులున్నారు. మూర్ఖులు మహాకవులు అయినవారున్నారు. స్త్రీలవల్ల సర్వనాశనమైనవా రున్నారు.

స్త్రీలవల్ల మహాకవులుగా మారిపోయినవారిలో—

కాళిదాసు ఒకడు.

ఒకనాడు ఒంటరిగా పొట్టి గొర్రెలకాపరి. తను కూర్చున్న కొమ్మను తానే నరుక్కునేంతటి మూర్ఖుడు. మంత్రి కుట్రతో, వివాహమాడింది - రాజకుమారి. ఆమె గానానికి తుంబుర స్వరూపం, విద్యకు సరస్వతి, నాట్యానికి నటరాజు, అన్ని విద్యల్లో ఆరితేరిని వుద్దండురాలు. అనేకమంది రాజకుమారులు ఆమెను వక్తృత్వ పోటీలో, సారస్వత వ్యాసంగలో ఓడించలేక, వెన్నుచూపి, పరాన్ముఖులైపోయారు. అట్టి ఆమె గొర్రెలకాపరిని వివాహమాడింది.

నిజంగా—

కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ,
శయనేషు వేశ్యా, క్షమయా ధరిత్రీ.

అన్న సూక్తిని తల్లక్రిందులు చేసిందామె.

ఓర్పుకు భూదేవిని మించిపోయింది. ఆ గొర్రెలకాపరికి, గురువైపోయింది. రాత్రింబగళ్ళూ, అరంగుళం మందాన్నున్న అతని నాలుక అరగదీసింది. పంచాక్షరీ బీజాక్షరాలు అతని నాలుకపై గీసింది. పునశ్చరణ చేయమంది. అలా...కష్టించి, తుదకు ఒక మహాకవిని చేసేసింది.

జడజగత్తును, రసజగత్తుగా మార్చివేసాడా మహానుభావుడు. అది స్త్రీసాహసంలో ఒకరకం!

అలాగే ఉత్తరాది అంతా ఎవరిపేరును, భగవంతుని అపరావతారంగా భావించుకుంటారో, ఎవరు రామనామామృతాన్ని, ఉత్తరాది పల్లెలకూ తీసుకొని వెళ్లాడో, ఆబాలగోపాలం, చంటిపిల్లవాని

లగాయతూ, మూడుకాళ్ళ ముదుసలివరకూ, ఏ పావన గ్రంథాన్ని, పారాయణచేస్తారో, తల క్రింద పెట్టుకొని, పాపపరిహారమైపోయినట్టు భావించుకుంటారో, అటువంటి పవిత్ర రామాయణాన్ని వాల్మీకిని మించిన రసభాండంగా రచించిన, తులసీదాసు, గయ్యాళి భార్య చీవాట్లవల్లనే అంతటి మహాకవి అయిపోయాడు.

ఒక్కొక్క స్త్రీ మగనికి వూపిరిపోసినవా రున్నారు - మగనికై తనువులు త్యజించిన వారున్నారు. మగని మహావీరునిగా చేసిన వారూ వున్నారు,

క్షాత్రభూమిలో, వెన్నుచూపి యింటికివచ్చిన మగనికి నులక మంచం అడ్డుపెట్టి, కోడుపై పసుపు వుండపెట్టి ఆడదానివలె స్నానం చేయించి, మీగడపాలకు బదులు, విరిగిన పాలనిచ్చి—"అదేమనగా?"

"యుద్ధంలో నీ శౌర్యం విరిగిపోయింది. ఇంటిలో పాలూ విరిగిపోయాయ్!" అని ఖడ్గ తిక్కనను మరల యుద్ధోన్ముఖునిగా చేసిన వీరపత్ను లెందరో వున్నారు.

మాంచాలికూడా - అంతే!

భర్తను - వీరుని చేసింది! వీరపత్ని ననిపించుకొంది.

అటువంటి భాగ్యం అందరికీ రాదు.

ఒక్కొక్క యిల్లాలు పెట్టే బాధలకి, తాళలేక, మనసుపై విరక్తిపుట్టి సన్యాసుల్లో కలిసిపోయిన మగవాళ్ళూ ఉన్నారు. దేశాంతరాలు పోయినవారూ వున్నారు. కొందరు నిరంతరం అలా ఆ బాధలకు క్రుళ్ళిపోతూనే, కరిగిపోయిన మనుషులూ వున్నారు—

"స్త్రీ బుద్ధిః ప్రళయాంతకం!" అన్నారు అందుకే. ఆ మాటకు యింతవరకూ అర్థం చెప్పిన వారు కనబడలేదు.

'స్త్రీ' సర్వతో ముఖస్వరూపాన్ని, కొలచిన చిత్రకారుడూ లేడు. చిత్రించిన కవీ లేడూ, పసిగట్టగలిగిన రసికుడూ లేడు.

ఒక్క క్షణంలో బిగుసుకుపోతుంది. మరో క్షణంలో ద్రవించీపోతుంది. అలా ద్రవించిపోయిన సీతను, దిటవుచేస్తూ-"కాదు సీతా! అనవలసినవే అన్నావ్!" అన్నాడు. "అయితే నిలబడు!" అంటూ

వెళ్ళి, ప్రక్కనున్న గోడకున్న డాలునుండి చర్రున కత్తిలాగి, బొటన వేలు కోసుకొని, రాజుకు నెత్తుటి తిలకం దిద్ది - "విజయోస్తుతే!" అంది.

అంతే ఇక అక్కడ నిలబడలేదు.

"అయితే, సెలవ్ !" అంటూ సీత దీవనల నందుకునే పయన మయ్యాడు.

ఆమె దీవించిందే కాని ఆమె గుండె రాయైపోయింది. అలాగే నెత్తుటి తిలకం పెట్టింది.

మరల గుండెను నీరుచేసుకొని, రాజుపోకను, చూస్తూ ఒక్కసారిగా దుఃఖం పెల్లుబికి, వీధి వరండాలో నున్న ఓ స్తంభానికి సోలి పోయి, రాజు తన దృష్టిపథం దాటిపోయేంతవరకూ అలాగే చూస్తూ, మెమ్మదిగా, ఆ స్తంభాన్ని పట్టుకునే జారిపోయింది.

ఆమె అలా కుప్పలా కూలిపోవడం, రాజు వెళ్ళిపోవడం గమనించిన, సీత తండ్రి - బయటికొచ్చి, స్తంభంచుట్టూ చుట్టబడిపోయిన సీతను లోనికి తీసుకువెళ్ళిపోయాడు. అది - ఆ ఘటన - ఆమె జీవితంలో ఒక విష్కంభం ! రాజు జీవితంలో అది ఆదిపర్వం. అంతే.

## 9

చీకటి తొలగింది; బళ్ళున తెల్లవారింది. తూరుపుకొండలు జేవురించాయ్. క్రిష్ణదేవుపేట నీలకంఠేశ్వరాలయంలో రాజు ప్రత్యక్షమయ్యాడు - ఆయన ముఖ తేజోవిలాసమును తనివితీరా చూడ్డానికన్నట్టుగా, బాలార్కుడు, తన సహస్ర కిరణాలతో ఆకసం మీదకు వచ్చేశాడు. పక్షులు కిలకిలా నవ్వాయి. మంచుకు అప్పటివరకూ తలలువొంచిన వృక్షజీవాలన్నీ బాలార్కుని కిరణప్రసార తాకిడికి పైకెత్తి, ఆ ఆలయంలో ప్రత్యక్షమైన రాజు తేజోవిలాసాన్ని ఆహ్లాదంతో చూస్తూ, స్వాగతమిస్తున్నాయి. ఆలయంలో జయగంట మ్రోగింది.

గంభీరమైన ధ్వని, ఆయన పెదవుల కదలికలో ప్రతిధ్వనిస్తోంది.

"పరిత్రాణాయ సాధూనాం,
వినాశాయ చ దుష్కృతాం,
ధర్మసంస్థాప నార్థాయ,
సంభవామి యుగే! యుగే!"

అంటూ, ఆ నవతేజస్కుడైన బాలయోగి, పారాయణ చేసాడు.

నిజం! ధర్మ సంస్థాపనకు, దుష్టులను శిక్షిస్తూ, శిష్టులను రక్షిస్తూ అవతారాల దాలుస్తుంటాడు - పరమాత్ముడు.

ఆలాగే, దుష్టశిక్షణా, శిష్టరక్షణా తత్వంగల మానవుడుకూడా ఎక్కడ దుష్టులుంటే, అక్కడ, ఎక్కడ శిష్టులుంటే అక్కడ ప్రత్యక్షమవుతాడు.

అవును - లేకపోతే. ఆయన చదివిన విశాఖపట్నం ఎక్కడ? ఆయన తిరిగిన, పంజాబు దేశమెక్కడ? ఆయన అవతరించిన కృష్ణదేవు పేటెక్కడ?

అయితే, క్రిష్ణదేవుపేట తునికి చాలాదగ్గర. తునికి తరువాత రైలుస్టేషను అయిన నరిసీపట్నానికి ఇంచుమించు ముప్పయిమైళ్ళ లోపు. అయినంతమాత్రాన ఆయన సరిగ్గా యిక్కడే అడుగుపెట్ట వలసిన అవసరమేమొచ్చింది - అంటారా?

రాజెప్పుడైతే ఆ పంజాబు నాయకుని దీవనలందుకొని, బయట గేటులో అడుగుపెట్టాడో, అప్పుడే తన దృష్టిని విశాల భారత భూభాగంపైకి పరిచాడు. అప్పటికి ఆయన మనస్సులో స్థానమేర్పరచుకొని కాలిలో ముల్లులా, చెవిలో జోరీగలా, చెప్పులలోని రాయిలా మెదులుతున్న, తను కోటనందూరు, సంస్కృత పాఠశాలలో చదువుతున్నప్పుడు, జీవితంలో తొలిసారిగా గాంచిన పీడిత జన బాధలు - ఒక్కసారిగా దృష్టికొచ్చాయి, ఆయన కళ్ళముందు. ఆ మన్యం

ఆ వెనుకబడిన ప్రాంతం నిలబడ్డాయ్. తనూ అక్కడే నిలబడాలనుకున్నాడు. వేటుతిన్న సింహంలా, జూలు విదళించుకుంటూ, తిన్నగా, అంతవరకూ, ఆంధ్రప్రజలు విని ఎరుగని, అక్కడ తమలాంటి మనుష్యులు, వున్నారనే తెలియని, గడుమన్యానికి, సింహద్వార మనదగిన క్రిష్ణదేవుపేటలో మకాం పెట్టేసాడు. అక్కడే - ఆ నీలకంఠేశ్వరుని ఆలయాని కెదురుగానే వున్న ఒక నడివయస్కుడైన పుణ్యాచరితుడు. భాస్కరరావు నామధేయుడు, ఆయనకు ఆస్కారమిచ్చాడు. ఆ ఆస్కారాన్ని పురస్కరించుకొని, ఆ బాలయోగి, అక్కడ వెలసాడు. తొలుతనే గీతా ధర్మసందేశాన్ని పారాయణ చేసాడు.

పారాయణ పూర్తికాగానే, ఆ గీతాగ్రంధంపై ఒక నూరు వరహాల పువ్వువుంచి - గంభీరంగా లేచాడు.

అప్పటికే, ఆయన చుట్టూ, వినమ్రులై జనం సాష్టాంగ పడి వున్నారు, వారి మధ్య, ఆ బాలయోగి, రాజు - చేత కోదండం పూనినరాజు - ఏదో దివ్యజ్యోతిని వెదజల్లుతున్న కంచు కాగడాపట్టి, కారుచీకటికి కాంతిబాటను చూపుతున్న ఓ ధర్మదేవతలా కనబడుతున్నాడు.

ఎదురుగా వినమ్రులై సాష్టాంగ పడ్డ జనంలోంచి, ఓ కోయవాడు లేచి—

“సోమీ! మా మన్నెపోళ్ళని దొరలు మా చెడ్డ కట్టపెడుతుండ్రి. దాని కేమైనా యిరుగుడుండదా సోమీ!” అని పలుకరించాడు.

రాజును మొట్టమొదటిసారిగా పలుకరించిన ఘనత ఆ కోయవానికే దక్కింది.

అలాగే ఒక అమాయిక కోయజాతి బిడ్డడ్ని, తొలిసారిగా పలుకరించే భాగ్యంకూడా రాజు కప్పుడే కలిగింది - అన్నాడు—

“లేకేం, పరమేశ్వరుడు. దుష్టశిక్షణార్థం, శిష్టరక్షణార్థం, ప్రతీ యుగంలోనూ తప్పక అవతరిస్తుంటాడు. రామావతారమెత్తి రావణున్ని చంపలేదూ? అలాగే మన్యంలోనూ అవతారమెత్తుతాడు,”

"చిత్తం స్వామీ! అవతరిత్తడంట్రు ఏంటి స్వామీ?" మళ్ళీ పున శ్చరణ చేసాడా కోయబిడ్డ.

"అవును!" అని రాజు పెదవులనుండి మాటరాగానే, అతని ఆనందం చెప్పలేం.

"పోనీలే స్వామీ! కనికరం చూపింద్రు!" అంటూ మురిసి పోయాడు.

రాజు రెండడుగులు, ముందుకేసాడు.

ఒక కోయ స్త్రీ—

'దండాలు సోమీ!' అంది.

అబ్బ! కోయ స్త్రీని మొదట చూచిందా కన్నులతో, అంతకు ముందు అంత మధురంగా, మాట్లాడిన స్త్రీని తన తల్లినిచూచాడు. ఆమెది - మాతృప్రేమ. తరువాత ఇంకొకామెను చూచాడు—

ఆమె మంచి అందగత్తె! అందంలో అప్సరసల తలదన్న గలది. వొయ్యారంగా పిరుదలవరకూ వ్రేలాడే జడ — వుంగరాలు మెలిదిరిగిన ముంగురులు, ముఖంలో మాణిక్యం పొదిగినన్న కుం కుమతిలకం - సంపెంగలాంటి ముక్కు, దానిపై తళుక్ తళుక్ మని మెరిసే వుడక, బంగారానికి జీవకళ వచ్చినట్టుండే శరీరచ్ఛాయ! సుగుణాల్లో అందాన్నే తలదన్నగలది - తన్ను మనసారా-ప్రేమించి నట్టి దామె.

కాని యిప్పుడు చూచినామె, అటువంటిది కాదు.

యీామె, తీరే వేరు. సంపెంగ ముక్కు కాదు. బుగ్గలు ఎర్ర గులాబీల్లా లేవు. పిరుదలవరకూ వ్రేలాడే జడలేదు. ఛాయబంగా రాన్ని పోలిలేదు.

యీామె, నడినెత్తిపైని కొప్పు. శివుని జటాఝూటంలా వుంది. ఆ కొప్పుచుట్టూ చుట్టిన గవ్వలు, మోళిచుట్టిన మల్లెపూల దండలా వుంది. బంగారం ఎక్కడనుండి పుట్టి ఆ పసిడిరంగు పొదిగించు కుందో, అట్టి రంగు, ముఖం పైకి మొద్దుగా కనబడుతున్నా, వెన్న

ముద్దలను తేలిస్తూ వుందా ముఖంలో. ముక్కుకున్న ఆ నత్తిచూస్తే పార్వతీదేవిలా వుంది. ఆమె దండం పెట్టగానే రాజు కరిగిపోయాడు. ఎక్కడలేని సంతోష మొచ్చేసిందాయినకు.

మరీ కాదూ! మొదటిది మాతృప్రేమ!

కొడుకుపై యీగ వాలనివ్వని స్వార్థం అందులోవుంది.

రెండోది - ప్రియురాలి ప్రేమ!

అందులో ప్రేమికుని కూడాలని స్వార్థంవుంది.

ఇది - మూడోది మానవప్రేమ!

ఇందులో స్వార్థంలేదు. పరమార్థంగలది.

వెంటనే ఆనందాశ్రువులు రాలుతుండగా—

'శుభం తల్లీ! నీ భర్త వీరుడౌతాడు!' అని దీవించాడు.

'అదేంటి సోమీ! వా డొట్టి తాగుబోతే?'

రాజు చిరునవ్వు, నవ్వాడు—

"కాదు. తప్పక వీరుడౌతాడు!"అంటూ ముందుకు నడిచాడు.

వుబ్బి తబ్బిబ్బులై పోయిందా - కోయమగువ.

జీవితంపై ఎంత అనురాగం? ఎంత తీపి! ఎంత నమ్మకం! కలిగించా డొక్కమాటలో ననుకుంటూ మురిసిపోయింది.

రాజు, ముందుకు పోతూంటే—

ఆ మన్యపుజనం వెనుక, రాలుతున్న ఆయన పాదధూళిని, సీమంతాల దాల్చుకుంటూ నిలబడిపోయారు.

వూరి శివార్లల్లోకి వచ్చేసాడు - రాజు.

ఆయన స్నానంచేసేది - ఆ శివారుల్లో ప్రవహిస్తున్న ఒక సెల యేటిలో. అక్కడికే తిన్నగా వెడుతున్నాడు. ఆయన చేతిలో, కోదండం, కమండలం, లేడిచర్మం మాత్రం వున్నాయి. కాషాయి దుస్తులు ధరించాడు.

ఆయన ముఖంలోని క్షాత్రతేజము స్ఫురించే రాజఠీవి, ఆయన వేషంలో ప్రశాంత శాంతాల్ని తొంగిచూచే, సిద్ధిపొందిన సాధూ

లక్షణాలు - ఆయన నడుస్తున్న ఆ మన్యపు మధువనాలు, చూస్తున్న కొద్దీ ఏదో నూతనత్వం, అనుహ్యాత్వం పొడసూపుతోంది.

చెట్ల పలవలపై పక్షు లింకా మేతకుపోలేదు. అవి సంధ్య చీకటి పడేలోపున ఎప్పుడైనా బయలుదేరుతాయ్. స్వార్థ మానవుల్లా కాదా పక్షులు. ఎవరైనా, నాలుగు అన్నం మెతుకులు రాలిస్తే చాలు. అపరిమితానంత భరితంగా, నాలుగు పక్షులూ నేలకుదిగి, ఆ మెతుకుల్ని సమానంగా పంచుకుంటాయ్. వాటిని తిన్నగా తీసుకొని తమ చిట్టి, చిట్టి గూళ్ళలోనున్న చిట్టిపాపల ముక్కుకొనల కందిస్తాయి. అంతటి ప్రేమ, ఆనందం, నీళ్ళు కలియని పాలల్లా, నల్లపూస వేసినా కనబడగలిగినంత స్వచ్ఛమైన నీళ్లలా వుంటుంది-వాటిలో.

ఆ పలవలపైని పక్షులు, రాజును చూచి, కలకలా రావంతో మంగళవాయిద్యాలు వాయిస్తోంటే, గండుకోయిలలు శ్రావ్యమైన తమ గొంతులతో సంగీతం పాడుతున్నాయ్. కొండ కొనలపైని నెమళ్ళు నాట్యాలు చేస్తున్నాయ్. ఆ కొండలు, చెట్లకుమధ్య, గరగరమను శబ్దంతో, యిసుక తిన్నెలను కోసుకుంటూ, సెలయేరు ప్రవహిస్తోంది. చిన్న చిన్న గులకరాళ్ళు ఆ ప్రవాహంలో దొర్లుతూ గలగలమంటూ కేరింతలు కొడుతున్నాయ్.

ఆ సెలయేటి ప్రవాహపు, స్వచ్ఛమైన గానామృతాన్ని గ్రోలుతూ రాజు, ఆ సెలయేటి మధ్య నున్న రాతిబండ వెనుక, ఒక చిన్న గుంటంలో స్నానం చేస్తున్నపుడు

ఇంతలో మరో గంభీరమైన ధ్వని రాజు చెవినిబడింది. అది మామూలు గంభీరమైన ధ్వనికాదు. ఏదో ప్రమాదంలో చిక్కుకున్న ఓ స్త్రీ ఆందోళనా గొంతులా వుంది ఆ ధ్వని. అడ్డుగా వస్తున్న గాలిని కూడా దూసుకుంటూ రాజు చెవిని సోకాయ్.

గబగబా ఆ రాతిబండపై నుంచిన దుస్తులు ధరించి, ఏటిగట్టు పైకివచ్చి, తన వాడిచూపులను, దూరంగా విసిరాడు.

అదిగో ! ఆకాశమంత ఎత్తుగావుండి అయిదు వేలేండ్ల ఆయుష్షు గలిగి నాలుగు దిక్కులకూ, నాలుగు చేతులనూ చాపి, ఆ మన్యాన్ని

చల్లగా చూస్తున్న దనడానికి సాక్షిగానున్న ఓ పెద్ద వటవృక్షం పలవలమధ్యనుండి ఆ ధ్వని వస్తోంది.

ఆ వటవృక్షపు తొర్రలోనే, తన విల్లమ్ములు దాచుకుంటాడు - రాజు. ఆ విల్లమ్ములు అవసరమొచ్చినప్పుడుగాని తీయడు. వుత్తర గోగ్రహణంలో కౌరవులను ఓడించవలసినంత అవసరమొచ్చినప్పుడు, జమ్మివృక్షంపై దాచిన ధనస్సు పాశుపతాస్త్ర సహితతూణీరం అర్జునుడు ఎలా తీసాడో, అంతకంటె అవసరమొచ్చినపుడు అనగా ధర్మ కాంటా, మొగ్గు పాపంవైపు చూపుతున్నప్పుడు, ఒక పేదవాని జీవితం భగ్గున మండిపోతుందన్నప్పుడు మాత్రమే - రాజు ఆ గాండీవం తీస్తాడు.

ఆ అవసర మింకా రాలేదు. అప్పటికి అవసరమొచ్చిన, ఆ ధ్వనివైపు నిదానంగా చూస్తూ, ఆ ధ్వనిని వెంబడిస్తూ వస్తున్నాడు.

ఆ ధ్వని, ఆ వృక్షం వెనుకనుండి వస్తున్నట్టు గ్రహించాడు. గబగబా ఆ వృక్షం వద్దకు వచ్చాడు. ఇప్పుడు ఆ ధ్వని, ఆవేదితమై, చక్ర చక్రాలుగా తిరుగుతూ, ఆయన హృదయాన్ని ఆర్ద్రీవంతం చేసేస్తోంది.

అక్కడనుండే దృష్టి సారించాడు.

ఆ వెనుక ఓ కొండగుహ వుంది. ఆ కొండగుహలో ఒక కాళికాలయమున్నది. ఆకాళికాదేవే రాజు హృదయాధిష్టాన దేవత. ఆయన నిత్యం స్నానమాచరించాక, ఆ కాళికాలయంలో ప్రవేశించి, తల్లి పాదాలను స్పృశించి కన్నుల నద్దుకొనిగాని వెనక్కురాడు. నేడా కొండ గుహలోని, కాళికాలయంలో ఒక అనాథ స్త్రీ ఆర్తనాదం ఆశ్చర్యం గొలిపింది, రాజుకు. అతన్ని ఆ గొంతుక వూపేసింది.

వటవృక్షం తొర్రలోని విల్లమ్ముల అవసరం గమనించాడు.

గజేంద్రుని మొరవిని శ్రీతో సరస సల్లాపము లాడుచున్న శ్రీవిష్ణువు, అన్నింటినీ విడిచి, ఆయుధాలేమీ చేత బుచ్చుకోకుండానే భూలోకమొచ్చి, మొసలిని సంహరించి, కరిని రక్షించడానికి యీ యనేం మహావిష్ణువు కాదు.

ఏమైనా ఆయుధం చేబట్టాలి. లేకపోతే, ఒక నిండు జీవితం అవాలుతైపోవచ్చు. ఆయన కుడికన్ను అదిరింది.

వెంటనే ఆ వటవృక్షం తొర్రలోని విల్లమ్ములు తీసి, చకచకా బయలుదేరాడు.

ఆ కొండ గుహాద్వారంవద్ద నుంచొని, ఆ దృశ్యం తిలకిస్తు న్నాడు. అదో హృదయవిదారకమైన దృశ్యం. గుండెలను కోసే స్తున్న దృశ్యం. ఆ దృశ్యం చూచి, రాజు హృదయం క్రిందపడిన గాజులా బ్రద్దలైపోయింది.

కొండగుహాలోని, కాళికాలయంలో, కాళీ సమక్షంలో, ఓ తెల్లని దుస్తులు, మెడలో మామిడిరొట్ట, దండలకు, చేతి మణికట్టు లకు పూలదండలు కట్టబడ్డ ఒక స్త్రీ విలయనాట్యం చేస్తోంది. కొన్ని అమ్ములు ఆ అనాధను వేటాడుతున్నాయ్. కొందరు సంరక్షకులైన మానవులు చుట్టూ కూర్చుని భజన చేస్తున్నారు. ఆ స్త్రీని తన అమ్ముల వర్షంతో వేటాడుతున్న వాడు ఒక యువకుడు, ఆ యువకుడే ఆమె ప్రియుడు.

ప్రియుడు, ప్రియురాలిని వేటాడ్డం ఎక్కడా చూడలేదు. ఆ యువకుడు గుండెలను రాయిచేసుకుని, కనులు మూసుకొని, ఆ పిల్ల పైకి అమ్ములు వొదులుతున్నాడు.

ఆ పిల్లను చంపివేయాలని అతనివుద్దేశం కాదు.

కాని అక్కడ అతని వుద్దేశంతో నిమిత్తం లేదు.

ఆ పిల్లను ప్రేమిస్తున్న నేరానికి శిక్ష. అతని చేతులతోనే ఆ ప్రియురాలిని వధించాలి.

ఆ యువకుడిని, ఆ యువతి ప్రేమించినందుకు శిక్ష!

ఆ యువతి ఆ కాళికాదేవికి బలి కావాలి.

ఇదీ అక్కడ కూర్చున్న పెద్దల తీర్పు.

ఆ బలికావడం, వాళ్ళ అగ్నిగుండాల్లాంటి కన్నులతో చూడా లట - అదీ వారి కోర్కె.

అసలింతకీ వాళ్ళు చేసిన నేరం!

వుభయులూ పరస్పరం ప్రేమించుకోడం.

ఆ ప్రేమించుకోడంలో కూడా - ఒకతె చెంచుయువతి. ఆ చెంచుకులం, మన్యంలో కడజాతి కులంగా పరిగణించబడేది. అటువంటి కులం పిల్ల అదే మన్యంలో గొప్పజాతనబడే కోయకులంలోని ఒక యువకుణ్ని ప్రేమించడం. అలాగే, కడజాతి పిల్లను, వుత్తమ జాతి యువకుడు ప్రేమించడం - అదీ ఆ నేరంలోనున్న విశేషం.

ఆ నేరం-మన్యంలో మూడుపువ్వు లారుకాయలుగా కాస్తున్న మూర్ఖత్వానికి చిహ్నం.

నిజానికి వాళ్లు ప్రేమంత ఆర్పితే ఆర్పివేయబడేది కాదు. ఒక వేళ ఆ రోజున ఆపిల్ల వధించబడ్డా, ఆవధించబడిన యువతితో బ్రహ్మ భూతమై అలా శిక్షించిన, వధించిన పెద్దలను, వాళ్ళ వంశాల్ని వేధించుకు తినడం ఖాయం.

అసలు జరిగింది——

ఒక రోజు, ఒక పూరిగుడిసె పెరటిలో గాజుల గలగలలు విన్నాడు, పూరిగుడిసె ప్రక్కనుండే పోతున్న ఒక పెద్ద చూచాడు.

ఆనాడు నిండుపున్నమ వెన్నెలేమో, ఆ పూరిగుడిసెలో ఎవ్వరూ లేరేమో! పున్నమచంద్రుడు నాడు నడినెత్తిదాటి వెనుకకు వాలి వుండడంచేత నిఠారుగా పైన ఒక దిష్టిబొమ్మతోనున్న ఆ గుడిసె నీడ పటవాలుగా ఆ పెరటిలో పడుతోంది. ఆ నీడలో ఎంత హాయిగా వుంటుందో ఆ పెద్దకేం తెలును. ఆ నీడలోనున్న హాయిని, ఆ నీడలో, తన ముద్దుల ప్రియురాలితో సరససల్లాపము లాడుచున్న గోవిందు - వాడి కంట పడ్డాడు.

వెంటనే తన రెండు కళ్ళూ పొడుచుకోని, వూరిలోని ఇంకొక పెద్దకు చెప్పాడు. ఆ పెద్దవచ్చి, ఆ పూరిగుడిసెలో చూసేసరికి ఎవ్వరూ లేరు.

ఆ యువకుడు ఆ యువతిని వెంటవేసుకొని, కళ్ళు పొడుచుకు చూచే గుడ్లగూబల్లాంటి మనుషులకంట పడని ఆ వూరి శివారుల్లోని

కోయిల కువ కువలలో, మొగిలిరేకుల గమగమలలో, వెన్నెల ముద్దల విసిరే ఆ వెన్నెల ఆనందంలో తేలిపోయారు.

వాళ్ళలా వెళ్ళిపోయాక, ఆ పెద్దలు ఆ కోయ యువకుని తండ్రితో ఫిర్యాదు చేసారు. "రానీయ్! వాడిసంగతి కనుక్కుంటా!" నన్నాడు.

నెమ్మదిగా ఆ యువకుడొచ్చాడు. తలుపు తెరవబడ్డం. ఫడా యిన ముఖం పగిలేలా ఒకరు కొట్టి, బయటికి త్రోసేయడం జరిగి పోయింది. అలా జరుగుతుందని ఎన్నడూ అనుకోలేదా యువకుడు. ఇదివరకూ అలా కలుసుకున్నపుడు ఏదో తిట్టి తండ్రీ, పెద్దలూ విధిం చిన జుల్మానా చెల్లించేసి, లోనికి రానిచ్చేవాడు నేడు బయటికి గెంటేసాడు. పైగా అనరాని మాట్లన్నాడు—

"వెధవా! ఎంతపని చేస్తున్నావురా! వూరంతా కొనగొ మ్మను కూర్చొని వ్రేలెట్టి చూపుతుంటె, యీ వెధవముండను వొద లడం లేదు నీవు. దీనివల్ల నా సంసారమంతా కూలిపోయింది, జుల్మా నాపై జుల్మానాకు ఎన్నిరూపాయలు ఖర్చు చేయించావురా! నా పరువంతా గంగపాలు చేశావ్! అవినీతిపాలు చేశావ్! పో! వెధవా! దానితోనే పడు. ఇక నా గడప త్రొక్కకు! పో! తూ!" అని ముఖాన్ని వుమ్మేసి, తలుపులు దఢాలున బిగించుకొని లోని కెళ్ళిపోయాడు.

అంతే ఒక పెనుతుఫాను వీచినట్టయింది. ఆ తుఫానుకు బెదరి పోయిన పక్షిలా అయింది - అతని జీవితం!

అయినా ఎలా తన ప్రియురాలిని వొదిలిపెట్టగలడు?

తిన్నగా ఆ యువతి యింటికొచ్చేసాడు. ఆ యువతితో ఏదేదో బాస చేసాడు.

అంతే! తెల్లవారేటప్పటికి కొ(్త్త)కాపురం వెలిసింది. ఆ యువకుడు కట్టెలు కొట్టుకురావడం, ఆ యువతి వొండి పెట్టడం, వారి జీవనం, చిలకా గోరింకల జోడైపోయింది.

ఇక వీధిలోకి లాగేరు - పెద్దలు. రచ్చబండకు యీడ్చారు, శిక్షించారు—

ఆ శిక్ష నిప్పుడు అమలు జరుపుతున్నారు - అదీ అభయానక దృశ్యంయొక్క తెరవెనుక గాథ !

ఇక ఆ యువతి ఇలవేలుపైన మహాకాళినే ఆరాధిస్తోంది. ఈ ఘన ఘోరభయంకర హింసాకాండనుండి కాపాడుమని, ఆ అబలల రక్షను, త్రిపురసుర సంహారిని కోరుకొంటోంది.

ఆ కోయ యువకుడు కన్నులు మూసుకొని, వొణుకుతూ వేస్తున్న అమ్ములబారినుండి, ఆ చెంచుయువతి ఆవేదనా కెరటాల వూపులకు డోలాయమానమౌతూ, తప్పుకొంటూ గుండెలు కదిలేలా తన కాలి గజ్జల మ్రోతలతో ఆక్రోదిస్తూ, మరీ తన హృదయార్తిని మహాకాళికి నివేదిస్తోంది.

ఆ ఆవేదన ఆ యువకుని చెవిని చిల్లులు పొడిచింది. ఆ బాధిక వినలేకపోయాడు. ఆమె తట్టుకోలనంత వేగంలో, ఒక అమ్మును రివ్వునొదిలాడు. ఆ అమ్ముకు ఆహుతై తీరుతుందని ఆ పెద్దల విశ్వాసం. రాజుకు శరీరం కంపించిపోయింది. ఇక ఆలస్యం - ప్రమాదమైపోతుంది. తక్షణం - తను అమ్మును సంధించి వొదిలాడు. రాజు అమ్ము ఆ కోయ యువకుని అమ్ము కంటమట్టి, కటుక్కున రెండు తునకలుగా కొరికివేసింది.

అంతా నిశ్చేష్టులైపోయారు. ఇంతవరకూ ఆ పెద్దలు తమపై బడే పులినైనా చంపగలిగారు గాని, యిలా ఒక అమ్ముపచ్చి, రివ్వున దూసుకుపోయే మరొక అమ్మును ముక్కలు చేయడం చూడలేదు.

వెంటనే రెండు అడుగులుపడ్డ పాదుకల పాదాలు ప్రత్యక్షమయ్యాయి.

ఆ యువతీయువకులు పరుగునవొచ్చి, ఆ పాదుకల పాదాలపై "స్వామీ !" అంటూ సాష్టాంగపడ్డారు. అప్పుడు - వాళ్ళకయింది - పెద్దవూపిరి పీల్చుకోడానికి తీరిక !

రాజు కమండలంలోని నీరు వారిరువురికి పట్టి సేదదీర్చి, ఆ పెద్దలపై కను తెరచేసి - అడిగాడు!

"వీళ్ళు చేసిన నేరమేమిటి?"

అంతా భయకంపితులై పోయారు. నోట మాటలేదు-ఒకడికి.

'నేనూ, నా రత్తీ సుఖంగావుండటం. వీళ్ళ కిష్టంలేదు సోమీ!' అని గోవిందు - కోయయువకుడు - ఒగురుస్తూనే అన్నాడు.

రత్తి - తేలిపోయిన కన్నులతో రాజుకు చూచింది.

ఆ జంటను లేవదీసి, తన హృదయానికత్తుకొని, చూపులతోనే ఆశీర్వదిస్తూ - పెద్దలను చూచి—

"ఎంత దారుణం? ఎంతటి మహాపాపం? స్వచ్ఛమైన యీ యువతీయువకుల జంటను చీల్చే మీ రాక్షసకృత్యానికి కరుణామూర్తైన మహాకాళి క్షమిస్తుందా - మూర్ఖులారా!"

అని హుంకరించేసరికి - గజ గజ వొణుకుతున్న పెద్దలకు ముచ్చెమటలు పోసాయి.

'రక్షించండి సోమీ!' అంటూ రాజు పాదాలు పట్టారు.

వెంటనే రాజు ఆ అవకాశం తీసుకుని, వారి మూర్ఖత్వానికి గొడ్డలిపెట్టుగా హితోపదేశం చేశాడు. వారి అంధత్వాన్ని చీల్చి, వెలుతురు చూపించాడు—

"ఇటువంటి అమాయకుల్ని కాదు వేటాడ్డం..." అంటూ ఓ ప్రక్కకు తిరిగేటప్పటికి, తనముందు కాస్త దూరంలో బీడుకు కంచె వేయించిన ముఠాదారు, బీడుమేయడానికొచ్చిన పశువులూ కనబడ్డాయి. "అదిగో, నోరులేని మీ పశువులకు కూడా నోట మట్టికొట్టే యీ ముఠాదార్లను, వారి తెల్లదొరలను వేటాడండి!" అంటూ ఆ స్థలాన్ని వొదిలిపెట్టేసాడు - రాజు. పెద్దలంతా ముఠాదారువైపు తిరిగారు.

అక్కడ మామిడితోపు ఒకటుంది. దాని నానుకొని ఒక బీడుంది. కొందరుపిల్లకాయలు పశువులను బీడుకు వొదిలి, మామిడి తోపులో మామిడికాయలు కొట్టుకుంటున్నారు.

బీడుకు కంచె వేయించానుకదా, యీ కుర్రకుంకలు దాన్ని చూడలేదుకదా అనే సంతోషంతో ముఠాదారు బోర విరుచుకొని నవ్వుతున్నాడు.

ముఠాదారు కళ్ళముందే బీడుకు పశువుల్ని తోలి, వాడి కళ్ళ ముందే మామిడికాయలు కూడా కోసేయగలుగుతున్నామని, ఆ ముఠాదారు నవ్వునుచూచి, మరీ విరగబడుతున్నారు-పిల్లకాయలు.

కాని వారిరువురికి కనబడకుండా కాస్తదూరంలో వస్తున్న ఆ పెద్దలకు, ఆ దూరంనుండే కనబడింది - యీ పిల్లకాయలూ, ముఠాదారూ కాదు—

బీడువద్ద పశులు నిలిచిపోయాయి.

ఆ బీడుకు వాడి మూటల్లే కంచెవేయించాడు - ఆ ముఠాదారు వెంకప్ప. తెల్లదొరలు పరిపాలనకు రాకముందు యీ బీళ్ళూ, నేడు విరనబడి నవ్వే ముఠాదార్లూ ఎవ్వరూలేరు. ఆ కోయల బ్రతుకురు వాళ్ళే నాథులు. ఆ మన్యం ప్రకృతిసంపదకు వాళ్ళే అధినాథులు. ఆ వస్తున్న పెద్దలకు వొళ్ళు మండింది. గబగబావచ్చి, కంచె తొలగించారు. పశువులు బీడులో ప్రవేశించాయి.

ముఠాదారుని చూచి పిల్లకాయలు, ఆ పిల్లకాయల్ని చూచి ముఠాదారూ నవ్వుతుంటే, ఆ ముఠాదారునిచూచి ఆ పెద్దలు నవ్వుతున్నారు.

ఆ పెద్దలనవ్వు వినబడి, దానికి కారణమేమిటా ? అని ఆ కంచెవైపు చూచాడు. కంచె తొలగించబడింది.

గ్రుడ్లెర్రచేసాడు - 'వుండండి ! నా తడాఖా చూపిస్తా ! బాష్టియన్ దొరతోచెప్పి, మీ తోలూడదీయిస్తా !' అంటూ రంకె వేసాడు - ముఠాదారు.

'వాడబ్బతో చెప్పుకో పోవే !' అంటూ ఆ పెద్ద ముఠాదారుని బెదరించారు.

బెదురుతూపోయాడు - ముఠాదారు.

ఆ ముఠాదారు తాటాకు చప్పుడుకు అంతవరకూ తన అధి

కారానికి బెదురుతూవచ్చిన ఆ మన్యపోళ్ళు ఆ రోజెందుకలా ఎదురు తిరగగలిగేరో అర్థం కాలేదు.

ఆలా ఎదురు తిరగడానికి అనేక కారణాలుంటాయ్.

వెనుక, శ్రీకృష్ణదేవరాయలు వేటకుక్కల్ని తీసికొని వేటకు వెడితే, ఒక స్థలంవద్దకు వచ్చేటప్పటికి పులుల్నికూడా చంపగలిగిన ఆ వేటకుక్కల్ని, తాటాకుచప్పుడుకు భయపడి పారిపోయే కుందేలు నిలువరించిదట. వెంటనే ఆ స్థలప్రభావం అర్థం చేసుకోగలిగిన చక్రవర్తి కాబట్టి, అక్కడే "విద్యానగరం" పేరుతో దక్షిణభారత దేశానికే వన్నె తెచ్చిన రాజధాని నగరాన్ని కొన్నికోట్ల రూపాయలు వెచ్చించి కట్టేసాడు.

కాని ఆ మన్యంవాళ్ళు అలా ఎదురు తిరగడానికి కారణం - స్థలప్రభావం కాదు. అది రాజు ప్రభావం. శ్రీకృష్ణుడు లేకపోతే, పాండవులు యుద్ధం చేసేవారా - అంతే. మనిషిప్రభావం. అతను తమకిచ్చిన దన్ను ప్రధానం.

అదే ఆ ముఠాదారుకు అర్థం కాలేదు. అదే రాజుకు తొలి విజయం!

అలా రాజుకు విజయం సాధించిపెట్టిన ఆ పెద్దలు - యీ విషయాన్ని రాజుకు విన్నవిద్దామని కూడాపడ్డారు. శ్రీకృష్ణదేవుపేటకు రాజు చేరకుండానే ఆయన్ను త్రోవలో కలుసుకోగలిగారు.

ఆ త్రోవలోనే రొప్పుతూ రోజుతూ నడింపాలెంనుండి పరుగెత్తున్న ఒక స్త్రీ కూడా కలుసుకుని—

"దండాలు సోమీ! తమరు జోతిషం చెప్పిన మొగుడు కొట్టేసిండు సోమీ! చచ్చిపడింది పిల్ల!" అంటూ ఒగర్చుతూనే చెప్పిందా స్త్రీ.

"శివ శివ!" అన్నాడు - ఆశ్చర్యంగా.

"అవును సోమీ!"

"అయితే పద! అక్కడికే వస్తున్నా!"

"పదండి!" అంటూ అంతా ఆయనవెంట బయలుదేరారు.

అసలలా ఆ స్త్రీకి జరగడానికి కారణం - రాజే!

శ్రీకృష్ణదేవుపేటకు నాలుగుమైళ్ళలోనున్న నడింపల్లె - ఆ స్త్రీది.

'ఎవరో బాలయోగి!' వచ్చాడనగానే, ఆ స్త్రీ తన బాధలు చెప్పుకుందామని వచ్చింది.

సోదంటే ఆడోళ్ళకెంత దూరమయినా, ఎవరితో చెప్పుకుండానే బయలుదేరి పోతారు.

ఆమె మొగుడు - మల్లుదొర. పక్కా త్రాగుబోతు.

అతనికి చెప్పకుండానే ఆమె బయలుదేరింది.

"నీ మొగుడు వీరు డౌతాడ"నగానే గబగబా యింటికిబయలు దేరింది.

రాజు వుపదేశం విని, యింటికి వచ్చిన ఆ స్త్రీని, అమె భర్త మల్లుదొర - త్రాగి కై పెక్కిన నిషాలో—

"నంజ! ఏడకెళ్ళొత్తివే, నే నోరుననుకుంటివే?" అంటూ మూలనున్న కర్రతో చేతికందిన దెబ్బల్లా ధనధనా బాదాడు. ఆ స్త్రీ స్పృహ తప్పి పడిపోయింది. గూడెం గూడెం అంతా గొల్లుమని ఆ స్త్రీ చుట్టూ మూగారు. చచ్చిపోయిందనుకున్నారు.

ఆ మూగిన జనంలో ఓ ముసలిది—

"ఓరయ్యో, సోమి నీడకు తోడు తెండే యిది బ్రతుకదయ్యో!" అంది.

పల్లెల్లో, వెంట్రుకలు నెరసినవారల్లా పెద్దలే. వారి వాక్కు బ్రహ్మవాక్కు.

అందుకే ఓ స్త్రీ పరుగెత్తుకొచ్చి రాజును కలుసుకుంది.

రాజు నడింపల్లె వచ్చాడు. జనం పాయలు పాయలై, దూరంగా తప్పుకొని దణ్ణాలు పెట్టారు.

రాజు వచ్చీరాగానే, ఆ స్త్రీ శిరస్సును తన తొడలపై పెట్టుకొని ముక్కువద్ద చేయిపెట్టి వూపిరిచూచి, చేయిపట్టి నాడి చూచి,

కమండలంలో నీరు ముఖంపై చల్లి, తన సంచిలోని ఆకులు కొన్ని పసరుతీసి, ఆ గాయాలపై పిండాడు.

ఓ క్షణానికి ఆ స్త్రీ లేచింది. అంతా నిశ్చేష్టులవడంతోపాటు వెంటనే కోలాహలం కూడా మిన్నుముట్టింది. అక్కడే ఆ ముసల్ది మల్లును తిట్టింది—

"బుద్ధి లేదురా! తాగితే చేతికందినంత దెబ్బేస్తున్నావా! అది చచ్చిపోనాదే - మా రాజు బ్రతికించాడు!" అని.

మల్లుకు నిషా తగ్గింది. వెంటనే రాజు కాళ్ళపై బడ్డాడు.

"నిజంగా తమరు దేవతలు సోమీ! రక్షించండి - సోమీ!" అని.

"ఆ దేవుడే నిన్ను రక్షించాలి!"

"కాదు సోమీ!" అని మొలనున్న బాకుతీసి—

"తమొరిని యీనాలి కెన్నెన్నొ పాడుమాట లాడింది." అంటూ, ఆ నాలుకను కోసేసుకోబోయాడు.

త్రాగుబోతులో కూడా ఎంత నిజాయితీ!

త్రాగుబోతయితే నేం హృదయం కావాలిగాని! నీతి నిజాయితీలు నిలబెట్టుకోవాలిగాని!

హృదయంలేనివాడు, నీతి నిజాయితీలు లేనివాడే - నిజానికి త్రాగుబోతు.

అలా ఎప్పుడైతే బాకుతీసి, నాలుక కోసుకోబోయాడో - అంతా—

"ఆ! ఆ! ఆ!" అన్నారు.

రాజు మల్లు చేయిపట్టుకొని—

"నాలుక కోసుకుంటే ఆ పాపం పోదునాయనా!"

"మరెట్ట పోతది సోమీ?"

'ఈ ఘోరానికి మూలమైన త్రాగుడు మానాలి!'

వెంటనే మల్లు రాజు పాదాలముందు నేలచరిచి—

"పెమాణం సోమీ! యిక తల తెగినా నేను తాగేతాగను!"

"పిచ్చోడా! నీవు మానితే ప్రియోజనం ఏంటి? అంతా మానెయ్యాలి!"

"అలాగే సోమీ! మేమంతానేకాదు సోమీ! వాడ వాడా పెచారం చేసి తాగినోడ్ని దండిస్తాం దొరా!"

రాజు నవ్వాడు.

అంతా—"సోములవారికీ జై!" అన్నారు.

మల్లు-'పదండహే! అందరికీ యీ కబురు చెప్పేద్దాం.'

అంతా 'సై' అన్నారు.

రాజు ముందు నడుస్తూనే వున్నాడు, వెనుక, ఆ పల్లెలోనే తాడిచెట్లపైనున్న కుండలు ధనధనా పగిలిపోయాయ్. ఇళ్ళలోని కల్లుదొప్పలన్నీ ఆ జనం పాదాలక్రింద నలిగిపోయాయ్.

ఒక్కత్రుటిలో, గాంధి మహాత్ముడు సాధించలేని రెండో ఘన విజయం సాధించాడు - రాజు.

ఒకటి - నరబలి, రెండోది - తాగుడు!

రాజు సందేశం, రాజుకి తెలియకుండానే, మారుమూలల కంటూ ప్రాకిపోతోంది పల్లెపల్లెలనూ కదలించివేస్తోంది. రాజంటే ప్రేమాభిమానాలు, రాజెవరో తెలియక తెలియకపోయినా, ఇంటింటా నిండుకొంటున్నాయ్.

అలా రాజు - తనకు దొరికిన అవకాశాన్నల్లా, దుందుడుకు లేకుండా, వుపయోగించుంటున్నాడు. అతని ధ్యేయం ఎవ్వరికి తెలీదు. ఆయనేం చేస్తున్నాడో? అదెంతవరకూ తన ధ్యేయాన్ని దగ్గరకు తీసుకొస్తోందో? ఆ ప్రజలకు సేవచేయడమే అతని కప్పుడు పరమార్థం. అందులోనే ఆయన కానందం. ఆ ఆనందానికి అంతరాయం కలిగితే ఏమవుతుందో చెప్పలేం.

# 10

అంతరాయం కలిగించాలని ఆలోచించే తెగ లేదనుకో నక్కరలేదు.

మంచిప్రక్కన చెడూ, తెలుపు ప్రక్కను నలుపూ, వెన్నెల ప్రక్కను చీకటీ, పగలు ప్రక్కను రాత్రీ ఎల్లప్పుడూ వుంటూనే వుంటాయి.

అయితే ఆ సెగ ఎక్కడ తగులుతుందో, అక్కడ కదుల్తుందా అంతరాయం కలిగించే శక్తి.

అదిగో! అది. నర్సీపట్నంలో బాస్టియన్ కచ్చేరి. 'బాస్టియన్' అన్నవాడు ఆంగ్లో-యిండియన్. ఆ మన్యానికి ప్రత్యేకాధికారాలు గలిగిన ఒక తాసీల్దారు. ఆ కచ్చేరి చావిడిలో ఓ పెద్ద కొండల ప్లాను వుంది. మధ్య టేబిలుపై ఓ చిన్న చేతిఫిరంగి, ప్రక్క పులితలా, గోడకు కొర్రగేదె కొమ్ములూ, వున్నాయి. ఇవన్నీ కొత్తగా చూచిన వానికి అదురుపుట్టి తీరుతుంది.

ఒక మనిషి స్వభావం వాడు కోరే, ప్రేమించే వస్తువులపైన ఆధారపడి వుంటుంది, అలాగే, ఆ కచ్చేరిలో, గోడకూ, టేబిలు పైన వున్న వస్తువులనుబట్టి, ఆ బాస్టియన్ స్వభావాన్ని వూహించుకోవచ్చు.

అటువంటి స్వభావంతో కూడిన బాస్టియన్ వద్దకు పడాలు - వెంకప్పలు వస్తున్నారు.

వాళ్ళు మార్గంలో వుభయులూ మాట్లాడుకుంటూనే వస్తున్నారు. వచ్చి, ఆఫీసు గుమ్మంలో ఆగిపోయారు. పక్కా అరగంటయింది. పిలవడానికి ధైర్యం చాలలేదు.

అందులో పడాలు - అతని పూర్తిపేరు వీరన్న పడాలు. మన్యంలో పై కులానికి చెందిన ఒక పడుచువాడు, కాస్త పిక్కలున్నవాడు అంతే.

ఇక వెంకప్ప అంటారా - ఒక ముఠాదారు. శింగన్న చెబుతున్నాడు.

'చూచావా, నాయనా! అదే బాస్టియన్ కచ్చేరీ. వాడు మన్యానికే ఓ తహసీల్దారు. వాడి ఆగడాలకు అంతులేదు. నాకప్పుడు నలభై ఏండ్లు. గతిలేక ఆ బాస్టియన్‌వద్దనే కండలు కరిగే బండచాకిరీ. బాదుగలేని వూడిగం చేస్తున్నా, చూడు నాయనా!'

అనగానే, నలభై పండ్ల శింగన్న వచ్చాడు.

వెంకప్ప అతన్ని చూచి—

'ఓ! శింగన్నా! దొరగారేరి?'

'పొద్దుపొడవకుండానే వస్తిరే! పదండి! పదండి - బయటకు!' అంటూ గుడ్డతో టేబిలు కొట్టగానే, ధూళిరేగి, పడాలు, వెంకప్పల ముఖాన్ని కొట్టింది.

'చెవుడుతోపాటు చూపుకూడా తగ్గిందే నీకు!' అని వెంకప్ప వురిమాడు.

శింగన్న చిన్నతనంలో ఒక వేటకు వెళ్ళగా, దగ్గరలోనే అరచిన ఓ పులి ఘూంకరింపుకు ఆ చెవులు దిబ్బడిపోయాయ్. అప్పటినుండి అతనికి చెవుడు సంప్రాప్తమైంది.

"పద! పదండయ్యా! ఇంకా ప్రొద్దుపోతేనేగాని దొరగారు లేవరు!" అని శింగన్న అనగానే—

"ఆ ఏడుపు ముందే ఏడవకూడదా అంట!" అంటూ పడాలు విసుగ్గా అన్నాడు.

వెంకప్ప బయటికొచ్చాడు. శింగన్న ఆఫీసు తుడుస్తున్నాడు.

అతని బ్రతుకే తుడుపు అయిపోయింది. ఒకప్పుడు పచ్చగానున్న సంసారం అతనిది. నేడు వూడిగం అతని బ్రతుకు!

పిళ్ళె ఏదో ప్లాను చూపుతుండగా, బాస్టియన్ హుందాగా వచ్చి, గర్వంగా కూర్చొని, కాళ్ళు టేబిలుపై చాపి, తన రెండు కాళ్ళ మధ్యనుండి శింగన్నను చూచి—

'శింగన్నా!' పిలిచాడు.

'బాబూ!'

"చూడు బయట! ఎవడన్నా వచ్చాడేమో?"

"శిత్తపుండి!" అంటూ అణకువగా శింగన్న బయటకెళ్ళాడు.

బాస్టియన్‌ది వట్టి కుళ్ళుబుద్ధి ఇతరుల ప్రత్యక్షంలో పొగిడి, పరోక్షంలో తిట్టి, ప్రత్యక్షంలోని వాళ్ళచేతా, పరోక్షంలోని వాళ్ళ చేత కూడా పనులు చేయించుకోగలిగిన దిట్ట. అదొక విద్య అనీ, ఇతరుల కసాధ్యమైనదనీ; అదే మానవుడు అవరోధాలను అధిగమిస్తూ పురోగమించడానికి రాజబాటని అతని వుద్దేశం. అంతేకాని, అటువంటి పద్ధతులతో కొంతకాలం కొందరినీ, కొందరిని అంత కాలమూ మాత్రిమే నమ్మించగలమని, అందరినీ అంతకాలం నమ్మించడం సాధం కాదని, అందరూ అంతకాలానికీ తెలుసుకోగలిగినప్పుడైన్యాతనకు చిన్నప్పుడేసిన దొండాకుపసరు క్రక్కి తీరవలసిందేనని, ఆ పాపపు భాండం బళ్ళున పగలి, ముక్కుపై వేలు వేసుకుని సానుభూతి చూపించగలిగినవాడే కనబడ్డని వాడికి తెలీదు.

బయటకొచ్చిన శింగన్న పడాలు, వెంకప్పలను పిలుచుకొని కూడా తీసుకొచ్చాడు.

బాస్టియన్ 'చక్' మని లేచి—

'Foolish Dog! బుద్ధిలేనిగాడిదా! నీకు చెప్పిందేమిటి? నీవు చేసిందేమిటి? చూచి రమ్మంటే పిలుచుకువస్తావ్? Fool!' అంటూ నిప్పులు గ్రక్కాడు.

శింగన్న వొణికిపోయాడు. మౌనం వహించాడు.

ఆ మౌనాన్ని అవకాశంగా తీసుకున్నా పిళ్ళె—

"ఆమా! సార్! బుర్ర యిల్లియే సార్!" అంటూ, మరో రాయి ఫారేసాడు.

అది వాడి నైజం! అంతా కుతంత్రాలోచన. బోడితలకూ మోకాలికీ ముడిపెట్టే బుద్ధి-అతనిది.

అరవవాడు.

ఇటువంటివాడిని చూచే మొత్తం అరవజాతినే తెలుగువాళ్ళు తిట్టడం పరిపాటైపోయింది—

"అరవ అధ్వాన్నం!" అన్న సామెత ప్రాకిపోయింది.

అరవ లందరిలాంటివాడు కాదీతడు.

ఇదొక కుత్సిత స్వరూపం!

మన్యంలో ఒక రోడ్డు వేయవలసీ, ఆ పని జరిపించమని జిల్లా కలెక్టరు ఇతన్ని బాస్టియన్‌వద్దకు పంపాడు, రాజకీయవ్యవహారాల్లో పరిపాలనా పద్ధతుల్లో ఆరితేరినఘటం. ఒకడిని తైరుకొట్టి, మరొకడ్ని పడగొట్టగల నేర్పరి. అఖరికి ఆ మన్యానికే ప్రత్యేకాధికారియైన బాస్టియన్‌లాంటి వాడిని బుట్టలో వేసుకోగలిగిన జిత్తులమారి నక్క!

ఎప్పుడైతే శింగన్నపై పిళ్ళె జులుంచేసాడో—

బాస్టియన్న్, సింగన్నను—

"ఫో ! కాఫీ ! తీసుకురా!" అంటూ పిళ్ళెవైపుతిరిగి 'Right పిళ్ళె ! ఆ రోడ్డువర్కు వీళ్ళకు Explain చెయ్!' అన్నాడు—

'ఆమా!' అని పిళ్ళె మొదలుపెట్టాడు—

'తెరిమా?...

పడాలు, వెంకప్పలకు అంతకుముందు అరవభాష ఎలాగుంటుందో తెలియదు.

తెలిసిందల్లా అప్పుడప్పుడు, బీడీల ఆకుకు మన్యం వచ్చిపోయే సాహేబుల భాషే. అదైనా అక్కడక్కడ ఒక ముక్క?

కాని, వాళ్ళనుకున్నారు. ఇదేమిటి? 'నీ అమ్మ...' అని తిడుతున్నాడేమిటని?

హిందీలో 'తేరీమా!' అంటే 'నీ అమ్మ' అని అర్థం 'తెరీమా?' అని పళ్ళు కొరికితే అమ్మను తిడుతున్నాడన్నమాట.

అరవంలో "తెరియుమా?" – 'తేరిమా' అని కలిపేసి పిళ్ళె మాట్లాడాడనుకోండి - అంటే 'తెలిసినదా?' అని అర్థమన్నమాట.

ఆ పల్లెటూరివాళ్ళకు యీ అర్థాలేం తెల్సు?

బాస్టియన్ కలుగజేసుకొని–

'ఏంఅలా ముఖాలుపెట్టి, చూస్తారు - వినండి!' అన్నాడు.

అప్పుడనుకున్నారు - అది తిట్టుకాదని!

వెంకప్ప అడ్డువచ్చి—

'అదికాదు దొరా...' అని ఏదో అనబోతోంటే, బాస్టియన్ మండిపడి—

"కాదు, యిదే వినండి!" అని హుంకరించాడు.

"పిల్లిలా ఐపోయాడు - వెంకప్ప.

జానిసత్వం గల పెద్దమనుషులకు అది సహజమేనా - తనకు లోకువైన వ్యక్తి కనబడితే వాడిజుట్టు పట్టుకోడం, తనను ఎదుట వాడు లోకువచేస్తే కాళ్ళు పట్టుకోడమూనూ.

అయినా వెంకప్ప నెమ్మదిగా మొదలెట్టాడు.

'మనం దగ్గరుండి బీడుకేయించిన కంచె తొలగించాడు, దొరా!"

వొళ్ళు మండింది - బాస్టియన్‌కు.

"ఎవడా - రౌడీ! ఎవడా సాహసం చేసింది?"

"ఒక్కరా, దొరా! వూరువూరంతా ఏకమైపోయారుదొరా!"

"ఆ! అంతపొగరా?...సరే! వాళ్ళసంగతి చూద్దాం. ముందు ప్లాను వినండి!...ఊఁ! Proceed పిళ్ళై!"

"కాదు దొరా?"

"అవును, విను!"

"ఎవడో సాధూ కూడా వున్నాడు దొరా!"

బాస్టియన్ నవ్వాడు.

పిళ్ళై భళాభళీ అంటూ—

"చెవులపిల్లికి బెదురుతుంద్రేడే? సరిద్దా! అది అపరం పాకలాం! ముందు ప్లాను వినండి!" అంటూ ప్లానుచూసి, ఏదో చెప్పబోతుం డగా, బాస్టియన్ మరల కలుగచేసుకొని—

"అగు పిళ్ళై!...పడాలూ, జాగర్తగా విను! ఇదిగో! ఇదీనర్సీ పట్నం. కొండలకవతల చింతపల్లి, ఈ మధ్య అడ్డుగావున్న కొండ లను పగులగొట్టాలి. రోడ్డు వేయాలి, రోడ్డువేస్తే లాభంపొందేది

మన్యపోళ్ళు. దీనికి జనంకావాలి! సొమ్ము ఎంతైనా యిస్తాం! ఏం? ఏమంటావ్?" అని అడిగాడు.

పడాలుతోనే ఆ రోడ్డు ప్లాను ప్రత్యేకంగా చెప్పడానికి కారణం వుంది. అతనితోనే అంత ప్రత్యేకంగా చెప్పి, అతనికి లోకువ యివ్వగలిగినంత తెలివితక్కువోడు కాదు బాస్టియన్.

కాని, పడాలు - ఆ చుట్టుపట్ల కాస్త పేరున్నవాడు. పలుకుబడి కలిగినవాడు. అతను తలచుకుంటే, ఆ మన్యాన్ని లేపగలడు - అందుకే బాస్టియన్ అంత అప్యాయంగా చెప్పాడు.

బ్రహ్మదేవుడు నాలుక మాట్లాడుతూంటే, నొసలు వెక్కిరిస్తుందని మరచిపోకండి!

బాస్టియన్ విషయంలో - "హృదయానికి ముఖం ప్రతిబింబం" అనే పెద్దలు పట్టికొట్టి తీరుతారు.

అందులో నరసీపట్నంనుండి, చింతపల్లివరకూ పాతిక మైళ్ళు పైగా వుంటుంది. అంగుళ మంగుళానికి భూమిలోంచి పొడుచుకువచ్చిన రాళ్ళ పర్వతాలను త్రవ్వడమంత తేలిగ్గాదు—

అయినా పడాలు అన్నాడు—

"చిత్తం! మా మన్యపోళ్ళు పొట్టకాలి ఏడుస్తున్నారు. పని చెప్పితే అంతకంటే సంతోషంకదా దొరా!" అని,

పడాలు పనిచేసినా ఫలం దక్కుతుందని అభిప్రాయ పడ్డాడు. అందులోనూ బాస్టియన్ అన్నాడు - "ఎంత జనమైనా కావాలి! ఎంత ధనమైనా యిస్తాం;" అని.

ఇట్టే నమ్మివేయగల మన్యానికి చెందినవాడు - పడాలు కావడం వల్ల నమ్మేసాడు.

వెంటనే బాస్టియన్ అన్నాడు—

"జాగ్రత్త! జనాన్ని మాత్రం గొర్రెల్ని తోలుకొచ్చినట్టు తోలుకురావాలి! నీకుకూడా కొంత Partial..." అంటూ ఆగాడు.

దాన్ని అర్థమయ్యేలా పిళ్ళె చెప్పడానికి పూనుకున్నాడు—

"ఆమా! కొంత కాంట్రాక్టు ముట్టచెబుతారు!"

బాస్టియన్—

'Yes, you are right!' అన్నాడు.

పడాలు చాలా సంతోషించాడు. తనను కసాయివాని వద్దకు గొర్రెల్ని తోలుకొచ్చే, గొర్రెల కాపరిగానే గుర్తిస్తున్నారని అతను భావించలేకపోయాడు.

"చిత్తం! అలాగే దొర! మీ దయ!" అన్నాడు.

ఆ సంభాషణ పూర్తయిందని తెలుసుకున్న వెంకప్ప—

"తమరోసారి గట్టుపొలాకల రావాలి, దొర! ఆ గంటందొర పెద్దరికం పెచ్చుపెరిగిపోతోంది!" అని మొదలెట్టాడు.

వెంకప్పకు గంటమంటె ఎవరో తెలుసు!

గంటందొర చాలా పెద్దమనిషి! ఆ గ్రామానికి మునసబు. వెంకప్ప లాంటి ముఠాదారులు ఎన్ని ఘోరాలు చేస్తున్నా, ఎన్ని తంటసాలు పెడుతున్నా, 'వాళ్ళ పాపం, వాళ్ళనే తింటుందిలే!' అన్నంత శాంతమూర్తి. అయితే ఏం? ఆజానుబాహుడు. ఆకారాన్ని ధరించిన వక్షస్థలం. పిక్కలు, మెలిదిరిగిన దండలు, దృఢమైన ఆ శరీరం. గర్వం లేని పౌరుషం చిందులుత్రొక్కే ఆ మీసం, వెనక్కి మెలిదిరిగిన ఆ వుంగరాల జుట్టూ ఎదుట నున్నట్టుగాపే చూస్తున్న వెంకప్పకు గుండె దడే!

అందులోనూ, గంటందొరంటె ఆ కోయల తలలో నాలుక. అతనంటే ప్రాణమిస్తారు - కోయలు.

కాని వెంకప్ప అధికారం, గంటందొరలాంటి వారివల్ల క్షీణించి పోతోంది. మనిషన్నప్పుడే కొద్దో గొప్పో "అహం" వుంటుంది. వెంకప్ప వొట్టి స్వార్థమానవుడు కావడంవల్ల వీడి అహం వెర్రితలలు వేసింది.

ఎదుటపడి అనగలిగిన ధైర్యం లేక బాస్టియన్‌కు మొర పెట్టుకున్నాడు.

ఇంతలో శింగన్న కాఫీలు తెచ్చాడు.

"సరే! ముందు కాఫీ తీసుకోండి!" అంటూ, వారికి కాఫీలు అందిచ్చాడు బాస్టియన్. పడాలుమాత్రం పుచ్చుకోలేదు.

"అదేంటోయ్ - తాగు!"

"మా కలవాటు లేదు దొరా! చద్దిగంజే మాకు తల్లిపాలు!"

"దీని నిషా నీకు తెలీదు...ఊ!...'

అంతా త్రాగడానికి కప్పులెత్తారు. పడాలు, వెంకప్పలు కుక్కిన పేనుల్లా కళ్ళు మూసుకొని త్రాగుతున్నారు. పిళ్ళె, బాస్టియన్‌లు ఒక్కసారిగా మండిపోయి తుబుక్కున మొదట త్రాగబోయిన గ్రుక్కెడు కాఫీ శింగన్న ముఖాన వూసి—

"Idiet! Sugar కు బదులు Salt కలిపి తెస్తావా?......"
ఆ చివర ముక్కలు బాస్టియన్ అనకుండానే, పిళ్ళె—

"...Fool?" అని పూర్తిచేసాడు.

"Get out! You...." అంటూ బాస్టియన్ కోపమాగక, శింగన్నను ఆ కప్పుతోనే ముఖంపై కొట్టాడు. శింగన్న తల పగిలింది. నెత్తురు ధార కట్టింది.

"మాకు సెలవిప్పించండి!" అంటూ, పడాలు, వెంకటప్పలు వెళ్ళిపోయారు. బాస్టియన్ లేచి, వాళ్ళు వెళ్ళిపోయాక, శింగన్నతో-

"ఊ! పో! సాయంత్రానికి సామాను పంపుతానన్న సాహుకారు వద్దకు వెళ్ళి వెంటనే పంపలేకపోతే, వాడి దుకాణం, ధూళిలో కలుపుతానని చెప్పు!"

"శిత్తవుండి!" అంటూ శింగన్న కారుతున్న రక్తాన్ని, తుడుపుగుడ్డతోనే తుడుచుకుంటూ, వొణుకుతూ వెళ్ళిపోయాడు.

దుష్టద్వయం విషపునవ్వు నవ్వింది.

"మరి మనం కంట్రాక్టు తీసుకోవడం రూలుకు వ్యతిరేకం! నీవు ఓవర్సీరువి, ఎలా నడిపిస్తావో?" అంటూ తన భయాన్ని వెల్లడి చేసాడు - బాస్టియన్.

కడవంత గుమ్మడికాయ, కత్తిపీటకు లోకువకదండీ!

"పరవా యిల్లియే సార్! రూల్సు మనం చేస్తిమా? మనల్ని రూల్సు చేస్తివా? వాటిచే మనం చెప్పినట్టు చేయించు కుంటాం సార్!" అంటూ పిళ్లె నవ్వాడు.

బాస్టియన్ కూడా వెకిలినవ్వు నవ్వాడు.

అనగా, అది బ్రిటిషువాళ్ళ రూల్సుకు పట్టిన గతి.

వాళ్ళు ఎక్కడో యింగ్లండు నుండొచ్చిన రకాలు. వుద్దేశం కొల్లగొట్టడం.

ఆ కొల్లగొట్టడానికి వాళ్ళకెలా జంకుతుందో, అటువంటి వాళ్ళే వాళ్ళ ఆధీనంలోని నిరంకుశ అధికార్లు కూడా.

వెంటనే నవ్వునాపి, బాస్టియన్—

'అరె! వెంకప్పను పొమ్మన్నామే?'

"ఏం సార్?"

"గంటందొర, ఆ గట్టు పొణకలకే King అయిపోయాడు. వాడి సంగతి కనుక్కుందామని!"

"సరిదా! మనముదా పోతుము, వెంకప్పకు కబురు పంపిస్తుము!"

'Yes! You are right' అంటూ బాస్టియన్ నవ్వుతూ లేచాడు,

పిళ్ళెకూడా నవ్వాడు. వాడి పళ్ళు శకునిచేతిలోని పావుల్లా మెరిసాయ్.

అది గట్టుపొణకల గ్రామం. గ్రామానికి మధ్య ఓ పెద్ద చెట్టు క్రింద రచ్చబండపై గంటందొర కూర్చున్నాడు. చుట్టూ కొందరు కోయలు కూర్చుని రకరకాలుగా కేకలు వేసుకుంటున్నారు. గంటందొర లేచాడు. నిలువెత్తు విగ్రహమాయన. ఆయన లేవగానే జనం ప్రశాంతమైపోయారు.

ఆ గట్టుపొణకల గ్రామం అపార పర్వతపరివృతమై వుంది.

ఆ కొండల మధ్య, ఆ గ్రామంలోని కొంపలన్నీ, కూర్చబడిన ఆ కొండల కంఠహారంలా వున్నాయ్. ప్రశాంత జీవితానికి ప్రతి

బింబాలా వూరిగుడిసెలు. ప్రకృతికాంత ముచ్చటతీరా నృత్యమాడుకునే రంగస్థలమది. ఆ వూరిగుడిసెలలోని జీవితం ఒక తెల్లని పాల కుండలా వుంది. కాని ఆనాడు ఆ క్షీర భాండంలో విషపు బిందువు పడింది. కలతలు బయల్దేరాయి. ఆ కలతలకు నలత చెందాడు - గంటం! ఆ గ్రామ సౌభాగ్యాన్ని నూటికి నూరుపాళ్లు కాంక్షించే సౌహార్దుడాయన. ఆ గ్రామానికే ఆయన మునసబు. మామూలు మునసబు కాదు. అందరిలాంటి మునసబు కాదు.

అందరి మునసబుల్లా—

ఆ వూరి కంఠంలో ఏ రెండెకరాలనో పుచ్చుకున్నవాడు కాదు.

ఆ వూరి స్మశాన దురాక్రమణో - ఆ వూరి బీడు నన్యాక్రాంతమో చేసినవాడు కాదు.

లేక, ఆ వూరిలో తన తాబేదారులచే, ఏ నీటి తగువో? ఏ సాగు తడువో? ఏ కూలి తగువో? ఏ కుల తగువో? సృష్టించి ఆ తగవులపై బ్రతికే తుంటరికాదు.

దొంగలు, దొంగలూ జేరి వూళ్లు పంచుకున్నట్టు, కరణాలు, మునసబులు ఏకమై పొలాల్ని పంచుకునే కూటమికి చెందిన వ్యక్తి కాదు.

అందుకే ఆయన కంతబాధ! ఆ గ్రామంలో కలత. ఆయన హృదయంలో బాధ! ఆ కలతకు కారణం ఆయనకు తెలుసు! కాని అది అందరూ తెలుసుకోవాలి.

తెలుసుకోలేని అమాయకజనం కాబట్టి, వారికి తెలియజెప్పాలి. అందుకే గంటం లేచి నిలబడ్డాడు.

అంతా ఆయన లేవగానే, అతని విగ్రహానికి వినమ్రులై పోయారు.

కాని విచిత్రం!

ఎన్నడూ లేనిది ఆయన ప్రత్యక్షంలో నేడు కేకలు వేసుకుంటున్నారా జనం!

ఆ గ్రామహద్దుల్ని తాకాలని, ఇంకోప్రక్క బాస్టియన్ బృందం బయలుదేరింది. వాళ్ళింకా ఆ గ్రామహద్దుల్ని చేరలేదు. చేరడానికి ముందు అడ్డుగావున్న కొండ ఎక్కి దిగాలి. డోలీపై ఎక్కుతున్నారు. ఆ డోలీలో బాస్టియన్, పిళ్ళైలు వున్నారు. డోలీ ఎక్కి కూర్చున్నవాళ్ళకేం తెలుస్తుంది - ఆ డోలీ మోస్తూ కొండ ఎక్కుతున్న బాధ!

కాని దురదృష్ట మేమిటంటే, ఆ డోలీకూడా వెనుక డోలీ మోస్తున్నవారిని అదిమాయిస్తూ నడిచివస్తున్న వెంకప్ప పోలీసులలో పోలీసు, డోలీ భారంగా మోస్తున్న ఒక కూలీని కొట్టడం.

కాని మరొకప్రక్క మల్లు కొంత జనంతో, ఇంకొక కొండ నెక్కుతూ ఆ గ్రామంలోకే కొంత జనంతో వస్తున్నాడు.

గంటం లేచి నిలబడి, గొడవపడుతున్న జనాన్ని మందలిస్తూ-

మనం మనం గొంతుకలు పిసుక్కొని చస్తే ముఠాదారు చేతిలోనున్న భూములు రావు' అన్నాడు.

జనంలో ఒకడు—

"చెప్పు మావా! నీవు గీసిన గిరి దాటేదిలేదు. ఎట్ట వస్తరయో, చెప్పు మావా!" అని అడిగాడు.

ఖంఛా చెళ్లుమంది.

బాస్టియన్ వచ్చి—

'గిరిగీయడానికి వీడేం ప్రభువా?" అని హుంకరించాడు. నిరంకుశం! వాళ్ళకికమంచీ, మర్యాదా, వాక్శుద్ధీ లేదు.

కాని అటువంటివాళ్ళకు ఆ ప్రక్కనే వుంటుంది - గొయ్యి.

చటాలున మల్లు ప్రత్యక్షమయ్యాడు.

గాముగంటం దొర, గాముమల్లుదొరా యిరువురూ అన్నదమ్ములే.

అతనికి అసలే సూర్యాకారం పాలెక్కువ!

అయినా శాంతంగానే—

"మాటలు సరిగ్గా రానియ్, దొరోయ్!" అన్నాడు.

వెంటనే బాస్టియన్ వెంకప్ప ముఖం చూచాడు. ఏ ముఖం చూచి, ఏ మాట విసరాలా ? అని. వాడికి భయమే - ఏ పుట్టలో ఏ పాముంటుందోనని.

వెంకప్ప అన్నాడు - కాస్త వొళ్లు దగ్గర పెట్టుకుంటూ—

"యీాయనే గంటందొర తమ్ముడు !"

వెంటనే మల్లుదొర అందుకున్నాడు—

"ఓ ! వెంకప్ప మామకు, దొరల మోచేతి నీళ్ళు రుచి, బాగా వంట పట్టిందే ?"

మల్లుకు తెలుసు - వాడి సంగతి - మల్లులాంటివారి యిళ్ళ ముందు పడి కాపులు కాసి, ఏదో నాలుగు కాసులు పారేస్తే, వుబ్బి తబ్బిబ్బులై వెంకప్పలాంటివాళ్లు వెళ్ళిపోయిన రోజులున్నాయి.

అయినా గంటం శాంతపరచి—

"మల్లూ !" అని గద్దించాడు.

బాస్టియన్ పొగరుబోతుతనంగా --

పలుకుబడిగల పెద్దమనిషివై వుండికూడా, యీ పురుగుల్నిలా పురిగొల్పుతున్నావన్నమాట !" అని హుంకరించాడు.

నిరంకుశుల లక్షణ మది. ఏ మాటకైనా విరుద్ధంగా అర్థం చేసుకోడం. లేకపోతే వాళ్ళ అధికారాలుండవ్. ఇక మల్లు వుండబట్టలేకపోయాడు—

"ఏం ? పలుకుబడి పలుపు తాళ్ళిడులా పనిచేస్తుందనా - యీ పొగర్త ?"

"కాదు, పలుపుత్రాడేఃస్తేనే గాని, నీతిలేని మన్యంజాతి లొంగదని ?"

బల్లెంలా తగిలింది - మల్లు కా మాట !

"నీతిలేని జాతి మీదా మాదా ?" గద్దించాడు.

"మల్లూ !" అని నొక్కాడు గంటం.

మల్లు సంగతి గంటంకు బాగా తెలుసు. వుసికొల్పి వొదిలి పెడితేనేగాని పోట్లాడవ్ - కోడిపుంజులు. మల్లు అలా కాదు - వుసి గొలపకుంటానే బరిలో కురుకుతాడు.

అలా మల్లును అణచి, గంటందొర, బాస్టియన్‌కు తమ బాధను విన్నవించాడు—

"దొరా! తెల్లవన్నీ పాలనుకునే ఈ అమాయక జాతిని నెగడ కండి దొరా! చూడండి! ఒకప్పుడు మీ దొరలు రాకముందు కండ దేరిన యీ జాతి నేడెలా కండలేక చిక్కి శల్యాలైపోతున్నారో చూడండి దొరా!...మొన్న మా నడింపల్లెలో ముచ్చటగా పెండ్లయిన మా రామన్నదొర భార్య-పాపం! చింతంబలి త్రాగి, త్రాగి కలరా సోకి; ఆ పాదపారాణి, కళ్ళకాటుకయినా ఆరకమున్నే కాటికి పయనం చేసింది. మరల తమ శాసనంతోనే యీ ముఠాదార్ల నుండి మాకూ మా భూములకీ ముక్తి కలిగించకపోతే మరీ నాశనమై పోతాం - దొరా!'' అంటూ ప్రాధేయపడ్డాడు.

ఆ ప్రాధేయతను అవిధేయతగా భావించిన బాస్టియన్ ఒక్క సారిగా విసురుకుపడ్డాడు—

"ముక్తి! చాలించు నీ పెద్దమనిషి వేషాలు!" అని.

అసలు ఒక గంభీరమైన శాంతమూర్తినుండి కోపం; రాకనే పోవాలి. వచ్చిందా - ఆ ప్రసాంత గంభీరంనుండే బడబాగ్నులు ప్రజ్వరిల్లుతాయ్ - సుడిగుండాలు చక్రాలు తిరుగుతయ్.

గంటం తోక తొక్కిన త్రాచులా లేచాడు.

"నోరు సంభాళించుకోండి!"

"మళ్ళీ అను!"

ఆ బాస్టియన్ మాటను త్రుంచుతూ, మల్లు మధ్యలో అందుకున్నాడు—

"ఓసోసి! మీరాడింది - ఆట! పాడింది పాటయ్యే రోజులు గతించాయ్. దొరోయ్!"

వులికాడు - వెంకప్ప—

'గతించాయి, గతించాయ్! నా ముఠాలో భూమి, ఇంకో ముఠాదారుకి తాకట్టుపెట్టే రోజులు గతించాయ్!' అని.

వాడికింతవులు కెందు కంటె, అతని ముఠాలో భూములు సాగు చేస్తున్నవారు-ఆ గ్రామ కొండదొరలు.

అతని ముఠా అంటే, వాడి స్వంతంకాదు — పేరుకు, పరిపాలనా సౌలభ్యానికి కొన్ని ముఠాలుగా విడగొట్టారు-తెల్లదొర లామన్యాన్ని.

కాని, ఎన్నాళ్ళుగానో, సాగుచేసుకుంటున్న రైతు. ఆ భూమిని వా డిష్టమొచ్చినట్టు చేసుకోగలడు! అది కదలదుగాని, కదలితే వా డిష్టమొచ్చిన చోటికి నడిపించుకుపోతాడు - అది కదలదు కాబట్టి పేదరికంవల్ల ఆ భూమిపై. అపప్పు తెచ్చుకున్నాడు - గంటం - అది ఇంకో ముఠాదారునుండి. వెంకప్ప వడ్డీలుకూడా త్రిప్పుతుంటాడు-డబ్బు! ఆ వడ్డీకి తనవద్దనే అప్పు తీసుకెళ్ళలేదని వాడికి మంట !

అందుకు వులుకక్కడ వొలకపోసుకున్నా.

కాని గంటం, వెంకప్పకు హితవు చెప్పాడు.

'వెంకప్పా! తెల్లవారితే యీ గ్రామం వాకిట్లో తలదాచుకోవలసినవాడవు మన చేతులు మన నెత్తినే పెట్టే, ఈ దొరల వలలో దొర్లి, నీ యిష్టమొచ్చినట్టు మాట్లాడుతున్నావ్ ?'

బాస్టియన్ దురుసుగా-

'నోరు మూయ్' అన్నాడు.

అన్నతడవుగా గంటం-

'జాగర్త! కొండను డీకొన్నావ్, దోపిడీని సహించడం మన్యం మనస్తత్వానికి వ్యతిరేకం. తలచుకుంటే పులినైనా పిలిచి చంపగల జాతి మాది. దాని మానసంలో పిరికికి తావుంటుందనుకోకు!'

'ఖబడ్దార్! అంటూ బాస్టియన్ హుంటరెత్తాడు.

'ఆగు! నా అన్నను తాకావా?' అంటూ మల్లు వాడి మణికట్టు పట్టుకున్నాడు.

ఆ చేయి విడిపించి, గంటం-

'మల్లూ! ఆవేశాలు, అనర్థాలకు మూలం సుమా!-విడిచిపెట్టు!' ఆ మాటలు లొంగుబాటుగా తీసుకున్న బాస్టియన్ వికటాట్టహాసం చేస్తూ-

"ఇదిగో తొలిసారి క్షమించి, నీ ముసలబుగరి తీసివేస్తున్నా. ఇకముందు నీ మతం కాని మార్చుకోకపోతే, నీ భూముల్ గీముల్ Hand over చేసుకుంటా! జాగర్త" అంటూ తన బృందాన్ని తీసుకుపోయాడు.

మల్లు బుసకొడుతూ--

"హే! చేసుకో!" అని ముక్కు రెమ్మలెగరేసాడు.

'మల్లూ! వారు ప్రభువులు!'

"తలకొట్టి మొతేస్తారా?"

'మనం తొందరపడ్డాం - మల్లూ!'

'ఊరొక్క అన్నా! పోతే మనకు పోయేవేంటంట! యీ దొరపీడేగా - పోతే?

"అలా అనకు మల్లూ! విషజంతువ దులో వుందని తెలిసి, పుట్టపై రాయేస్తే

'ఏస్తే?'

"ఇక పాము బుసకొట్టొచ్చు!" అన్నాడు - గంటం

'పాము కాటుకు కూడా పసరువేసే యోగీశ్వరుడే, మన ధారుకొండపై వుండగా మనకు భయమేంటన్నా?"

'ఎవరా యోగీశ్వరుడు?'

"ఎవరేమంటున్నా! మా పల్లె త్రాగుడు మాన్పిండు. చచ్చిన నా ఆడదాన్ని బతికించిండు! కల్లు నేను మానేస్తినన్నా?"

"నువ్వే?"

"అవునన్నా!"

"అయితే, ఆయనెవరో అవతారపురుషుడన్నమాట!"

"అన్నమాటేమిటి? చూద్దువు పదన్నా!"

జనంలో "పదండేహే !" కేక వినబడింది. అంతా రాజు దర్శనానికి పయనమయ్యారు.

వారు నడుస్తూంటే, రేగిన ధూళితో ప్రచండభానుడే కప్పుకపోయాడు.

## 11

చూసారూ! ఇదిగో, ఇదే, దీన్నే ధారుకొండ అంటారు. భారతావని వుత్తరఎల్లలను తన మెళ్ళకొలదీ పొడుగున్న హస్తాలను చాచి, ఇటు ఆఫ్ఘన్‌స్థానం లగాయతూ, అటు అస్సాం దాటువరకూ మహాభారత హృదయంపై శత్రువుల నీడకూడా పడకుండా కాపాడుచున్న మహోత్తుంగ హిమాచల పంక్తులు ఎలాగో, అలాగు. మన్యపు తూరుపు కోస్తాను కాపాడుకుంటుంది - ఆ కొండ ఒక్కటే ఒకటి - ఆ మూల నరసీపట్నం లగాయతూ యీ మూల చింతపల్లి వరకూ విస్తరించివున్న కొండది.

ఆ కొండపై 'కాంచనగంగ' లాంటి మహోన్నత శిఖరంవుంది. క్రిందనుండిచూస్తే అది సూది మొనను గుర్తుకు తెస్తుంది. పైకెళ్లి చూస్తే బల్లపరుపుగా నుండి, రత్నకంబళి పరచినట్టుండే మెత్తటి పచ్చికతో మనోల్లాసంగా వుంటుంది. ఆ శిఖరంపై నింగిని తాకుతున్నట్టున్న ఓ పొడుగాటి మద్దివృక్షం ఉంది. అది నాలుగు దిక్కులకూ తన నాలుగు చేతుల్నీ ఆ విశాలాంతం చాచి చూడముచ్చటగా వుంది.

ఆ మద్దిచెట్టుకు, దాని కయిదుగజాల దూరములోనున్న ఓ పెద్ద బండరాతిపై కాలూని, రాజు ఏకాగ్రదీక్షతో ఆ చెట్టుమానుకు గాబిడీలు విసురుతున్నాడు. ఆ విసరడంలో ఆయన వూపును బట్టి చూస్తే, విసిరిన ఆ గాబిడీ, ఆ మానుకెంత బలంగా నాటుతుందో అర్థమౌతుంది. విసరడంలో ఆయనకు దేనిపైననో ఒక గాఢమైన ద్వేషం, ఒక సడలని పట్టుదలమాత్రం కనబడుతోంది.

ఆయనేకాగ్రదృష్టిని చెదరగొడుతూ, ఆయనపైనుంచి ఓ నీడ రివ్వున పరుగెత్తింది. పైకి చూచాడు. ఒక విషాదసంఘటన గగ నాంతరాళంలో కనబడింది. వెంటనే ప్రక్కనున్న విల్లమ్ములు ధరించి, చెట్టుపలవలు అడ్డురాని-ఆకాశమొక్క చే కనబడే ఆ కొండ పైని ఆరుబయట ప్రాంతానికొచ్చాడు. ఆకాశంలోకి చూచాడు - ఆ చూపుకు నక్షత్రాలన్నా అదిరిపడతాయ్. కాని పైన ఎగురు తున్నదో భయంకర పక్షి - అదే ఒక పావురాన్ని వేటాడుతున్న డేగ. అతి సున్నితమైన జాలిగుండెగల మానవహృదయుడెవరా దృశ్యాన్ని తిలకించినా, సహించలేడు. దాని వాడిగోళ్ళు గ్రుచ్చుకుని, నెత్తురు బొట్టులు చిందుతూ విలవిల తన్నుకునే ఆ లేబ్రాణిని చూచి నిలువునా నీరైపోక తప్పదు. కాని మరోతెగ వుంది - అది విలవిల తన్నుకునే ఆ పావురాన్నిగాక ఆ పావురాన్ని వేటాడ్డంలో తన ప్రతిభ చూపు తున్న డేగను చూచి, మురిసిపోయే తెగది.

ఈ తెగకు పల్లెపట్టుల్లో కాలదోషం పట్టిపోయింది. అందుకే పల్లెపట్టుల్ని విడిచి, పట్నాలుపట్టి, అందమైన రంగు రంగుల భవంతు ల్లోకి ప్రవేశించి, ఏ మోహనసుందర లతాంగినో అద్దెకు తీసుకుని కాపురం చేస్తుంటారు. వాళ్ళ హాబీ - యీ క్రూరపక్షులైన డేగల్ని కొని, పెంచి, పేదప్రజల్ని కొల్లగొట్టిన ధనంతో వేటలాడుటకు క్రీడించే జమీందారుల తెగ - యిది.

ఈ తెగకు బద్ధవ్యతిరేకి - రాజు. అందుకే ఆ దృశ్యం చూచి సహించలేకపోయాడు. ఆయన కన్నులు సహనాన్ని పూర్తిగా కోల్పోయాయ్. చేతులు ప్రతీకారానికి పూనుకున్నాయ్. వెంటనే ధనస్సుకు - అమ్మును సంధించాడు. నారి చెవికొనకంటాలాగి రివ్వున వొదిలిపెట్టాడు.

గగనాంతరాళంలో, మేఘాల్ని దూసుకుంటూ, ఆ పావురం శరీరంలో లోతుగా గోళ్ళను గ్రుచ్చుతూ, ఆ లేబ్రాణిని రక్తసిక్తం చేస్తున్న డేగ డొక్కల్లోకి దూసుకుపోయిందా—బాణం. తాటకిలాంటి

రాక్షసైనా రామభద్రుని జృంభకాస్త్రానికి తప్పుకుపోవచ్చు గాని — మన రాజు గురిచూచి విడిచిన వాడి బాణాని కా డేగ దాటిపోలేదు.

రెండు కొండలమధ్య, దట్టంగా పెరిగిన గడ్డిని చీల్చుకుంటూ, ఎదురుగుండా యీదురుగాలిని దూసుకుంటూ వస్తున్న గంటం, బృందం కాళ్ళముందు అమ్ము, ఇటువైపునుండి అటువైపుకంటూ నాటుకుపోయిన ఆ డేగ పడింది.

ముందున్న గంటం నిర్ఘాంతుడయ్యాడు.

చెట్లపైనున్న పక్షినే గురిచూచి కొట్టలేని మన్యంలో గగనాంతరాళాల్లో విహరించే డేగను కొట్టగలగడం అంటే - గంటానికి ఆశ్చర్యం కలిగించింది. అతని మనస్సులో, అలా కొట్టగలిగిన వీరుని రూపం అతనికి తెలియకుండానే మహోన్నత మహాత్వంగల ఒక దివ్య మానవ స్వరూపాన్ని ఏర్పరచుకొంది. గంటం ఇంకా ఆలోచనలోనే వున్నాడు.

మల్లు క్రిందపడ్డ డేగనెత్తి గంటానికి చూపుతూ—

"ఇది మామూలు వేటగాడు కొట్టివుంగడన్నా, కొడితే-యీ డేగ పావురాన్ని చంపుతుండడం చూచి సహించలేకపోయిన, మెత్తని మనిషెవరో కొట్టివుండాలి!"

"ఏమైనా ఆశ్చర్యమే మల్లూ!"

"ముందుకు పదన్నా! ఓరయిందీ - తెలిసిపోతది!" అని మల్లు అలగానే, ఆ బృందం ముందుకు కదిలింది. ఆ బృందంలో నున్న కోయలకా ఘటన విచిత్రంగా కనబడింది, ముందుకు కదిలారు.

ఆకాశం అతి నిర్మలంగావుంది గంటం పైకి చూచాడు. నిరారు కొండ శిఖరంపై ఏంటినారి శబ్దం విన్నాడు. ఓ కొండపణుకు ఎక్కి తేరి, దూరంగా దృష్టి సారించి చూచాడు. కాని, సరిగ్గా ఆయన రూపు కనబడ్డం లేదు మొత్తం గుంపు గుంపుంతా, నాలుగు పణుకు లెక్కారు.

యీ దఫా రాజు వారికి కనబడుతున్నాడు. వాళ్ళు రాజు గురించి అనుకున్న వీర రాకుమారుని పోలికలుగాని, లేక ఒక తెలి

వైన వేటగాని పోలికలుగాని ఆయన వేషాన్నిబట్టి వారికి కనబడ్డ, లేదు, ఆయన ఆ పచ్చని కొండ శిఖరంపై, ధవళచంద్రికలు వెదజల్లే. చంద్రశేఖరుని మలచుకున్న జటా జూటంగల శివునిలా కనబడ్డాడుం కాని శివుడు చర్మాంబరధారి. యీాయనో - కాషాయంబరధారి ! ఏమైనా యీాయన చేతిలో గాండీవముంది. ఆ పక్షి ఎగిరిపడిన దీ వైపునుండే.

అందుకే గంటం—

"ఆయనే యీా డేగను కొట్టివుండాలి;" అన్నాడు, అప్పటికే, రాజు దరిదాపువరకూ, ఆ గుంపు ఆ కొండనెక్కిపోయింది. యిప్పుడు స్పష్టంగా గోచరిస్తున్నాడు-రాజు.

మల్లు చటుక్కున అందుకొని - సంతోషం వుండబట్టలేక—

"అన్నోయ్ ! నేను చెప్పిన యోగీశ్వరు డీయనే అన్నోయ్ !"

ఆమాట మల్లు అన్నాడో లేదో వెంటనే ఆ జనసందోహం పెదవులపై తారకమంత్రంలా వుచ్చరించబడింది—

"ఆహో ! రామదూత!" అని.

వెంటనే, ఆ జనమంతా, గంటం మల్లులతో సహా ఆయన కాళ్ళపై సాష్టాంగపడ్డారు. రాజు ఆశ్చర్యబోయాడు. మానవుడన్న వాడు - ఎవరికీ తలొంచకూడదన్న సిద్ధాంతి - రాజు. ఎన్నడూ, రొమ్ము విరుచుకునే మట్లాడాలన్న తత్వం గలవాడు-వెంటనే—

ఏంటిదంతా?" అని ప్రశ్నించాడు.

ఆ గుంపులో మల్లుకే తెలుసు-రామరాజు మహత్యం-అందుకే ముందుగా మల్లే అందుకున్నాడు—

"తమ దర్శనంకోసం నేనే వీరి నందరినీ రప్పించాను సోమీ, యీాయనే మా అన్న గంటందొర.

"ఓహో! మునసబు గంటం దొరా?"

గంటం చకితుడయ్యాడు -

"నన్ను మీరెలా తెలుసుకున్నారు స్వామీ?"

"మీరు నన్నెలా తెలుసుకున్నారు?" ఎదురుప్రశ్నించాడు-రాజు

జనం అయస్కాంతంలా ఆకర్షించబడ్డారు.

"ఓహో ! నిజంగా రామదూత వే!"అని మరొక్కసారి కాళ్ళపై బడ్డాడు. గంటం ఆ జనాభిప్రాయాన్ని వెల్లడిస్తున్నాడు -

"అవును స్వామీ ! మా కష్టాల్ని గట్టెక్కించడానికే ఆ భద్రాద్రి రాముడు మీచే మా గడ్డ త్రొక్కించాడు. యోగీశ్వరులు మీరు, నరుడు కన్నుతెరచిగానీ కానలేని సత్యాన్ని మీరు కన్నుమూస్తే చాలు - చతుర్లోకాలు మీ మనోనేత్రాలముందు బొంగరాల్లా తిరుగుతుంటయ్. మీకు తెలియని రహస్యాలంటూ వుండవ్ - కాని మా కష్టాల్లో మచ్చుకొకటి మీకు విన్నవించుకోవాలి. తెల్లోళ్ళు యీ మా మన్యంలో అడుగుపెట్టి, మా భూముల్ని లాక్కొని, ముఠాదార్ల కప్పగించి, మమ్మల్ని అష్టకష్టాలు పెట్టేస్తున్నారు-స్వామీ!"

'అవును ! ఆ ముఠాదార్ల తెగనే మనం చూడకూడదు. యీ ముఠాదార్లు మనలాంటి బీదప్రజల్ని మ్రింగే కప్పలు మాత్రమే. కాని ఆ కప్పల్ని మ్రింగుతున్న విషజంతువు - నల్లత్రాచుంది - అదే తెల్లవాళ్ళ తెగ. యీ ముఠాదార్ల తెగ లేనిదే - ఆ తెల్లతెగ మనల్ని పరిపాలించలేదు. దాని కసలు మన దేశంలో స్థానముండదు!'

'వాళ్ళకంటె వీళ్ళ ఘోరాలే పెరిగిపోయాయ్ - స్వామీ ! మన్యంలో మన్యానికే పొరుపులు పెట్టేస్తున్నారు.'

'అసలు పొరుపులు, చీలికలు పెట్టడమే - బ్రిటిషు రాజనీతి. కాని ఆ వుచ్చులో పడ్డాం మనది - బలహీనత!'

"ఇక దీనికి మార్గాంతరం లేదా స్వామీ ?"

"లేకేం - రాచపుండుకు కూడా మందుంది. దీనికి మందు, మన కట్టుబాటు. మన తగవులు ముఠాదార్లముందు వెళ్ళకుండా చేయడం. పంచాయతీలు పెట్టుకొని మనమే ఆ తగవులు పరిష్కరించుకోడం!"

మల్లు వుబ్బి తబ్బిబ్బైపోయాడు -

'నిజంగా, యిది తారకమంత్రంలా వుందన్నా!'

గంటం అందుకొని -

'స్వామీ! మా మన్నెపోళ్ళ తరపున ఒకమాట - తమరు మా గూడేనికి వచ్చేయాలి స్వామీ!'

"కాదు! యోగులకు కొండలే నివాస యోగ్యాలు!"

మల్లు అందుకొని -

"పోన్లే అన్నా! యిక్కడే ఆశ్రమం నిర్మిద్దాం - సామికి!"

ఆ మాటకు రాజు ఎదురుచెప్పలేదు. చిన్న చిరునవ్వు మాత్రం తన పెదవులపై తొలకరించాడు. అది గుర్తించిన ఆ జనంలో సంతోషం వెల్లువికింది. వాళ్ళకు పెన్నిధి దొరికినట్టయింది.

*　　*　　*　　*

"అమ్మా! మన్యం సోదరులు నాకు రేపు ఆశ్రమం నిర్మిస్తున్నారు. యీ శుభసమయంలో నీవు నా ప్రక్కలేని లోటు భరించలేనమ్మా! వెంటనే ధారుకొండ కువచ్చి నీకన్నకొడుకును ఆశీర్వదించు!"

అంటూ వచ్చిన ఒక లేఖను, తునిలో చిన్నకొడుకు సత్యనారాయణ రాజు ఓ పర్ణకుటీరంలో నారాయణమ్మగారికి చదివి వినిపించాడు. భగవంతునికి హారతి నిచ్చి జేగంట వాయిస్తున్న నారాయణమ్మగారు పున్నమచంద్రుని చూచి వుప్పొంగిన మహా సముద్రమై పోయారు.

"నా బాబు దొరికాడు! నా బాబు దొరికాడు. ఎన్నాళ్ళకు నాపై కృపగలిగింది-ప్రభూ!" అంటూ ఒక్కసారిగా, పరమేశ్వరుని పాదాలు పట్టుకుంది. మరల మరల భగవంతునికి హారతి నిచ్చింది. జేగంట కొట్టింది. అక్కడ మన్యం వాసులకు దొరికిన పెన్నిధే యీమెకూ దొరికింది.

ఆ యింట ఆ రోజు మహానందం పురివిప్పి నెమలిలా నాట్యమాడింది. మాతృ మమత కట్టలు త్రెంచుకున్న సెలయేటిలా చెలగాట మాడింది.

"బాబూ! పద! అన్నదగ్గిరకు సామానంతా సర్దు!" అని సత్యనారాయణరాజుకు ఆ తల్లి ఆజ్ఞాపించింది.

వెంటనే బయలుదేరారా యిరువురు.

ఆనాడు ధార్ పర్వతసానువులపై మహా కోలాహలంగా వుంది ఆ కోలాహలంలో పాల్గొన్న కోయలు, చెంచులు, కంఠ మాలలూ, ఆడ, మగా భేధంలేకుండా ఏమరిక, అరమరిక లేకుండా కళకళలాడుతున్న ముఖాలతో వికసిస్తున్నారు. ఆ వికసనకు యింకో కారణముంది.

ఆ ధార్ కొండ, తన గర్భంలో దాచుకున్న, నవరత్న కాంతులను వెలికి చిమ్ముతోంది. ఆ కాంతులను ఆచ్ఛాదించుకొని, మెరుస్తున్నారా జనం.

ఆ మెరుపులతోపాటు, ఆ నాడొక మహోత్సాహం వెల్లి విరుస్తోంది.

వాళ్ళ దృష్టిలో ఆరోజునుండి ఆ కొండొక, లాయలాసాలేని కైలాస పర్వతం.

రాజు - ఆ కైలాసగిరిపైని అవతరించిన, అర్ధనారీశ్వరుడు.

వాళ్ళకో నమ్మకం - యోగులు కనులు తెరిస్తే, కాస్త అలిగితే, గిరులుకూడా గిర్రు గిర్రున తిరుగుతాయనీ, ఛాతీగాని విరిచి విల్లు చేబట్టితే భువి దద్దరిల్లి పోతుందనీ.

అటువంటి యోగీశ్వరుడు - తాము నివసిస్తున్న మన్యంలో, తాము గడుపుతున్న పంటపొలాల చేరువలో, తాము నిత్యం అధిరోహిస్తున్న గిరి శిఖరాలపై అధిష్టించబోతున్నాడు. అనగా వారి దృష్టిలో మన్యమే ఏనాడో అటువంటి మహా పుణ్యాన్ని నోచుకోడానికి పెట్టి పుట్టివుండాలి. అటువంటి పుణ్యాన్ని పంచుకుంటున్న ఆ మన్యంవాసుల మహోత్సానికి అందుకే మేర లేదు.

ఆ మహోత్సాహంలో ఎవరెవరు ఏం చేస్తున్నారో వారికే తెలియదు. ఒక్కొక్క మనిషికి వుండేవి రెండు చేతులే అయితే, ఇరవయ్యేసి చేతులతో పనిచేస్తున్నట్టుగా చేస్తున్నారు. బారులుతీరి, క్రమశిక్షణ అలవరచుకున్న ఆధునిక జీవుల్లా పనిచేస్తున్నారు. ఒకడు కొండ

దిగువ వెదురు నరుకుతున్నాడు. ఆ నరుకుతున్న వెదురును లాటు చేస్తున్న దొకామె. ఆ లాటులను, మోపులుగా కట్టుకొని మూపున ఎత్తుకొని మోస్తున్న దొకామె. ఇంకొకడు త్రాటిచెట్టెక్కి ఆకులు కొడుతున్నాడు. ఆ చెట్టుక్రింద ఒకడు కుప్ప వేస్తున్నాడు. ఆ కుప్ప నుండి, దొంతరలు దొంతరలుగా ముంజేతులపై అంచెలువారిగా అందుకుంటూ, కొండ దిగువనుండి కొండ పైభాగానికి చేరవేస్తు న్నదో బాగు అలా వాళ్ళ చేతులపై ఆ ఆకులు నడుస్తోంటే నీలా కాశంలోని చలువమేఘాలు ఆ పడుచుల్ని ముద్దు పెట్టుకుంటూ పోతు న్నట్టు వుంది.

కొండపై పొడుగాటి బాడితలతో తాటివాసాలు చెక్కుతు న్నాడో కర్మజీవి. అవి ఎత్తుకొని ఆశ్రమ నిర్మాణంవద్దకు తీసుకు పోతోం దొకామె. ఆశ్రమంవద్ద తాటిబాజులు దింపడానికి గోతులు త్రవ్వుతున్న జనం కొందరు ఆ గోతుల్లో బాజులు దింపిస్తూ, ఆశ్రమ ఉపరిభాగాలపై వెదురు పేరుస్తూ, ఆ పేర్చినవాటిపై ఆకుల పడక లను వేస్తున్న కొందరికీ, అందరికీ గంటం, మల్లు హుందాగా సల హాల నిస్తున్నారు. వాళ్ళు ధరించిన పటవాలు, కోర తలపాగాల అంచులు ఆ కన్నులపండువైన వాతావరణంలో వీస్తున్న దక్షిణ పవనాల వాలులో, జండల్లా రెప రెప లాడుతున్నాయ్.

ఆ మహోత్సాహాన్ని మరపించే ధ్వని అంతలోనే వినబడింది. పని చేస్తూ చేస్తూ వున్నవారంతా ఒక్కసారిగా అటు చూచారు.

ఆ ధ్వని మరింత హృదయాలను గగుర్పొడుస్తూ నినదించింది.

వారి హృదయాలనే గగుర్పొడిపించడమేం కర్మ !

విశ్వామిత్రునిలాంటి వాని వెయ్యేండ్ల తపస్సు, భళ్లున పొరలు పొరలుగా విడిపోయి కరిగిపోయింది. పురూరవునిలాంటి వానిని కిరీటాన్ని, రాజదుస్తుల్నీ, వజ్రవైఢూర్య హారాల్నీ ఆవలికి పారవేయించి, దిగంబరధారిని చేసివేసింది. ఋష్యశృంగునిలాంటి మనస్సే చెదిరిపోయింది. భస్మాసురునిలాంటి రాక్షసునే భస్మం చేయ

గలిగింది - ఐతే వీరందరూ శృంగార, కామ విలాస పీడనలో మైమరచడంవల్ల భంగపడ్డారు.

ఆ ధ్వనికి వుత్తేజం పొందగలిగినవారూ వున్నారు.

అటువంటి పవిత్ర వుత్తేజితమైన ఆ ధ్వనికి ఆలంబనం - నిర్మల మేఘగర్జనం. మధుర మధుర మురళీ కలస్వనం. మానవ హృదయ ద్రవంలో తేరిపారిన సంతోష తరంగం.

అందుకే ఆ ధ్వని చిరుగజ్జల మోహనసవ్వడి అయింది. అంతా అటు చూచేసరికి—

'ఓ కొండ కొనపైన రత్తి తారకలా ప్రత్యక్షమైంది.'

'చణం చణ!' మన్న మరొక్కమారు పలికిన అమందానంద అమరధ్వనితో.

ఆ ప్రక్కనే ప్రత్యక్షమయ్యాడు గోవిందు - తారకా నాధునిలా.

మరల "చణ చణం చణ! చణ చణం చణ!" మంటూ ధ్వనులు వెడిలి అందరి హృదయాల్ని మరొక్క గిలికొట్టాయి.

ప్రసాంత ప్రవాహంనుండి ఆ జనసాంద్రం కెరలుతూ, తుషార ముల తూలియాడే, తరంగ తురంగాలై కేరింతాలు కొడుతూ, కేళీ విలాసంతో, ంరకుల రాట్నాల్లా తిరుగుతూ, ఆ దృశ్యాన్ని చూస్తున్న గంటం, మల్లు, రాజులకు పది గడియలు అసలు వూపిరి పీల్చుకోకుండా చేసేసాయ్.

అయింది - రత్తి చెంచునృత్యం.

గిర్రున తిరుగుతూ, రాజు పాదాలపై పడింది - రత్తి.

రాజు 'సుఖీభవః' అంటూ లేవనెత్తాడు.

అంతా ఒక్కసారిగా దిక్కులు పిక్కటిల్లేలా—

'జై! అల్లూరి రామరాజుకీజై!' అంటూ నినదించారు.

కొండ దిగువనుండి, ఆ నినాదాలను చీల్చుకుంటూ - 'బాబూ!' అన్న నాదం రాజుచెవిని బడింది. తన రెండు చేతుల్తో చుట్టూ గుమి

గూడిన జనప్రవాహాన్ని రెండు పాయలుగా చేస్తు, కాస్త ముందు కొచ్చి కొండ దిగువకు చూసాడు రాజు.

'అమ్మా!' ఒక్కసారిగా కెవ్వున కేకేసాడు - బిడ్డ.

అంతే 'బాబూ!' అని మరల కొండ దిగువనుండి మరో మాతృ స్వనం.

తను ఎన్నడో పోగొట్టుకున్న అ వజ్రాలమూట ఆమెకు దొరికింది. అప్పటికి ఆమె వక్షోజాల్లోని క్షీరం యింకిపోయింది. కాని ఆ బిడ్డని ఆ కేకకు యీామె - 'బాబూ!' అని నాదించిన కేకలోనే, మరల ఇంకిపోయిన ఆమె వక్షోజాల్లోని క్షీరం, చివ్వున చిందినంతటి ధ్వని యిమిడిపోయుంది.

రాజు 'అమ్మా! అమ్మా!' అని నినదిస్తూ రివ్వురివ్వున పరుగెత్తు కెడుతోంటే, ఆ పరుగును వెనుక వస్తున్న ఆ జనం అందుకోలేక పోయారు. రాజు తన రూపాన్ని, వేషాన్ని, శరీరాన్ని మరచి పోయాడు

బలిచక్రవర్తిని దానమడిగిన మహావిష్ణు, ఆ దానమిచ్చిన బలిని జాలైనా లేకుండా, నేలలోకి త్రొక్కేయడానికి చిటికెనవ్రేలంత విప్రుడై వచ్చి ఆకాశమంత ఎత్తుగా పెరిగిపోయాడు.

కాని ఇది మాతృ మమత. ఆ కోయప్రజల దృష్టిలో ఆకాశమంత ఎత్తుగా పెరిగిపోయిన రాజు, చిటికెన వ్రేలంత బిడ్డడై పోయాడు.

అదీ ఆశ్చర్యం. ఆ జనం నవనాడులూ, అందుకే పొంగి పోయాయ్.

తుదిసారి - ఒక్కచోట కలుసుకున్న కూడలివద్ద—

'అమ్మా!' అన్నాడు బిడ్డ!

'బాబూ!' అని తన వేడికౌగిలిలో పొదుగుకుందా మాతృదేవి.

ఒక్కసారిగా చుట్టూవున్న జనం నిశ్చేష్టులైపోయారు.

వారి పెదవులనుండి, వారికి తెలియకుండానే—

'జై! అల్లూరి రామరాజుకీ జై!' అన్న ధ్వానం బాహ్యాకృతి ధరించింది.

ఇందరు ఇంతటి మహానందతరంగడోలికల్లో తేలియాడుతోంటే, అంతటి విషాదానల గోళాల్లో కరిగిపోతున్న దొకామె.

రండి! చూడండి! ఇదిగో. ఇదే ఆ దృశ్యం. ఇదెంత హృదయ విదారంకగా వుందో చూడండి! మీ కడుపులో చెయిపెట్టి దేవుతూ వుండొచ్చు. అయినా, కాస్త కుదుటపడి, ఆమె జీవితాన్ని అనుభ వించకుండా అర్థం చేసుకోండి - చాలు!

ఈమే - సీత!

ఒక్కనాడు ఎక్కడైతే ఏ విశాఖపట్టణంలోనైతే, ఏ మంది రంలో ఏ స్థానంలోనైతే, గుండె రాయిచేసుకొని, రాజు నుదుటను సింధూర తిలకం దిద్దిందో అదే స్థలంలో మరల రాయి చేసుకున్న గుండెను కరిగించివేస్తోంది.

ఆమె తన ఏకాంతమందిరంలో తను చిత్రించిన తన మధుర స్వప్నాల సంధాతయైన రాజు చిత్తురువు వద్ద కరిగి కరిగి, క్రింద జడలుకట్టి, ఆమె హృదయానికి యింకా ప్రకాశమిస్తున్న క్రొవ్వొత్తి కాంతిలో, సరిగ్గా ఆ క్రొవ్వత్తిలాగే కరిగి కరిగి, తన శిరోజాలు జడలుగట్టి, నేలదొర్లుతున్నా లక్ష్యపెట్టక ఆశను చంపుకో లేక ఏక ధార కన్నీటితో విలపిస్తూనే వుంది - పాపం!

కాని - ఆమె విలాపాన్ని అర్థం చేసుకున్నాడు-భగవంతుడు. నమ్ముకున్నవాడ్ని దగాచేయడు - దేవుడు. ఆమె చిత్రించిన రాజు చిత్తరువు నలంకరించియున్న పూలహారంలోని ఓ నవుతున్న పువ్వు ఆమె శిరస్సుపై పడింది.

సీత తేజరిల్లింది.

ఆమె నోము ఫలించింది.

'రాజా!' అంటూ ఆ చిత్తరువును ఆలింగనం చేసుకొని— 'ఎంతటి మహాభాగ్యాన్ని కలుగజేసావ్ ?' అంటూ గబగబా లేచి, జడలుకట్టిన శిరోజాల్ని ముడివేసుకుంటూండగా - తను ఎవరి కావార్త

నైతే, ఆత్రుతగా వెళ్ళి చెప్పాలనుకుందో, ఆయనే తన తండ్రియే - ఎదురై —

'ఏంటమ్మా? చీకటితెచ్చిన కారుమబ్బు, ఒక్కసారిగా వురిమి మెరిసినట్టు?'

'ఇదిగో, నాన్నా! నా స్వామి మెడలోని పూలహారంలోని ఓ పువ్వు నా శిరస్సుపై పడింది!'

'అదృష్టవంతురాలివి - తల్లీ! త్వరలోనే తప్పక నీ రాజును కలుసుకుంటావమ్మా!'

'కాదు, నాన్నా! ఆయనెక్కడున్నా, యిప్పుడే బయలు రాలి నాన్నా!'

"అదేంటమ్మా! ఆయనెక్కడో, ఏమిటో అసలు సంగతైనా తెలుసుకోవాలా?"

"తెలుసుకునేదాకా ఎలా నాన్నా?"

అని జాలిగా ఆ తండ్రి కళ్ళలోకి చూసింది.

పాపం! అమాయకురాలు! ఆమె ఆత్రుతను ఆ తండ్రి ఇంకా గుర్తించినట్టు కనబడలేదు.

శ్రీనాథు డొకసారి, పోతన "సిరికిం జెప్పడు..." పద్యాన్ని అపహాస్యం చేసాడు. అది విని పోతన కూతురు ఆ పెరటి నూతిలో రాయినేసి, "మామా! నీ బిడ్డ నూతిలో పడిపోయింద"న్నదట! "అమ్మా!" అంటూ వెంటనే శ్రీనాథుడు రివ్వున నూతిగట్టుకొచ్చి వాలాడట. పోతన కూతురు పకాలున నవ్వి - "ఏమిటి మామా! పడిపోయిన బిడ్డను పైకి దీయటానికి పగ్గమైనా లేకుండా వచ్చి ఏం చేద్దామని?" అనేటప్పటికి శ్రీనాథుడు - నివ్వెరపోయాడు.

ఇంతకీ, పోతన భాగవతంలో రాసిన పద్యాన్ని అవహేళన చేద్దామన్న శ్రీనాథుడే భంగపడ్డాడు - ఓ పిల్ల చేతిలో. పోతన భాగవతంలో రాసాడు. మొసలిచే మడుగులోకి దిగలాగబడుతున్న కరీంద్రము మొరవిని, లక్ష్మితో, ఆమె కుచోపరిచేలాంచలముపట్టిచెల్లాటలాడుతున్న మహావిష్ణువు అన్నిటినీ మరచి, లక్ష్మికి చెప్పకుండా,

ఆమె కుచోపరిచేలాంచలమైనా విడిచిపెట్టకుండానే, గదా, శంఖు, చక్రాల్నీ, గరుడవాహనాన్ని కూడా మరచిపోయి - పరుగెత్తు కొస్తున్నాడని.

తన బిడ్డను రక్షించుకోడానికి, ఆ పోతన మహావిష్ణువులోని రస స్పందన హృదయాల్ని పొదిగించుకున్న తండ్రులెంత మంది వున్నారు - లోకంలో. అటువంటి రసహృదయాల్ని అర్థం చేసుకో గలిగిన రసికు లెంత మందున్నారు - లోకంలో.

ఉన్నారు అటువంటి మమతను అర్థం చేసుకోలేని శ్రీనాథులు! దాక్షారామం నడిబజార్లోని, భోగం పడుచుల కామవిలాసానికి కరిగి పోయి పరుగెత్త గలిగిన రసికులున్నారు.

కాని సీత తండ్రి - పితామమతగల పోతన, మహావిష్ణుల రస హృదయాల కోనకు చెందినాడు. వారిలా ఆయన అన్నీ మరచి 'పద!'ని ఆమెతో అనలేకపోయినా-ఒక్కమాట మాత్రం అన్నాడు-

'నీ సుఖమే నా ఆనందమమ్మా; ఇదిగో, యిప్పుడే అన్ని వైపు లకూ వుత్తరాలు రాస్తా! జవాబువచ్చిన మరుక్షణం బయలుదేరుదాం! ఆఖరికి గాఢ నిబిఢాంధకార కీకరారణ్యాల్లో వున్నా - మనం వెళ్ళి కలుసుకుందాం - సరేనా?'

ఆయన కోమలహృదయాన్ని అర్థం చేసుకున్న సీత - 'నాన్నా!' అంటూ, ఆ మెత్తని మేఘ సదృశమైన హృదయంపై శిరస్సు వాల్చింది. అలా చల్లగా ఆమె శిరస్సును నిమిరాడా-తండ్రి!

## 12

రూపాయి నాణేనికి ఒకవైపు బొమ్మ, ఇంకోవైపు బొడ్డును వుంటుంది. అలాగే జీవితానికి కూడ రెండువైపులుంటాయ్. ఒకవైపు ఆనందం, ఆ ఆనందాన్ని వెన్నంటే చారగా విషాదం మరోవైపు వుంటుంది.

ఆ మన్యంలో ఆనందం ఒకవైపున వెల్లుబుకుతూనే వుంది. ఆ మన్యం సంపదపై ఆ మన్యం వాసులకున్న హక్కు లటువంటివి. అవి హక్కులని వారికి తెలియవు. స్వభావసిద్ధంగా సంక్రమించి నటువంటివే.

స్వభావసిద్ధంగానే ఆ మన్యంవాసులు పని చేసుకుంటున్నారు.

కంసాలిపిట్ట ముక్కుతో ఓ చెట్టుమానును పొడుస్తుంటే ఎటువంటి శబ్దాలొస్తాయో, సరిగ్గా అటువంటి శబ్దాలే దూరానికి వినిపిస్తున్నాయ్.

అది మన్యంలోని కారడవి. ఆ కారడవిలో ఓ మద్దిచెట్టును గొడ్డలితో నరుకుతున్నాడు - గోవిందు. అలసిపోయాడు. ఆకలావురు మంటోంది. ప్రేగులు కొరుక్కుతింటున్నాయ్. ఇక నరుకు ఆపు జేసి, నుదుటిపైనున్న చెమటను బొటనవ్రేలితో నేల చిందీ, గొడ్డలి ఓ ప్రక్క పారవేసి, శ్రమబడలికను తీర్చుకోడానికి వొళ్లు విరిచి, 'రత్తీ!' అని కేకేసాడు.

రత్తినుండి జవాబు లేదు.

మరల కాస్త ముందుకొచ్చి, నోటికి అరచేయి పిటవాలుగా పెట్టి- 'రత్తీ!' కేకేసాడు.

జవాబువచ్చింది. దూరంగానున్న రెండు పొదల మధ్యనుండి వచ్చిందది - జవాబు.

'వొస్తుంటి మామోయ్!' అని.

'దీని సిగతరగ! ఆకలావురావురు మాంటూంటే యింకా ఎక్కడుంటిదే?' అంటూ భ్రుకుటి ముకుళించాడు.

గోవిందు కేతెల్సు? ప్రియురాలికి మగనిపై ఎంత మనసుంటుందో? మగాడికి తెలియకుండా ఎన్నెన్నో మగని ప్రియంకోసం చేస్తుంటుందో?

అతనికోసం చద్ది తేవడంలో ఆలస్యమయిందనేకాని ఆ చద్దిలో ఏమేమి కలిపి తీసుకువస్తుందో అతని కేమెరుక? లేకపోతే అంత ఆలస్య మెందుకవుతుంది?

ఆ చద్దిగో ఆమె మనసునంతా పిండిపోసిందేమో? పయట వొత్తిగించి, ఆమె మనసులోని వయసునంతటినీ ఆ చద్దిలో వొలక బోసిందేమో?

తీరా చద్దిఒక్కటే ఎక్కడుగా-మగవాడికి! దాంతోపాటు నంచుకు కావాలి. ఆ సంగతి ఆడదానికే తెలుస్తుంది.

అందుకే ఆ నంచుకుతో తన సొగసంతా నూరి కలిపివేసిం దేమో, గోవిందు కేంతెలుసు - మరెందుకవుతుంది - యింతాలస్యం?

కాని గోవిందు అలా చూస్తూండగానే, ఘల్లుఘల్లున గజ్జల రవాళితో రత్తి గోవిందుముందు ప్రత్యక్షమైంది. చిలుకలాంటి ఆ చిన్నదాని ముఖం చూడగానే - గోవిందుముఖం మంచుముక్కు కొట్టినట్టయింది. చల్లబడిపోయాడు.

గబగబా చద్దితట్ట దింపడానికి ముట్టుకోబోయాడు. ఆపు చేసింది - రత్తి;—

ఒకప్పుడు ఇలాగే ఆపుచేసింది - రత్తి!

ఆనాడు ఒకరోజు సంతకెళ్ళారు. చాలా రోజులైంది. గోవిందు తన తండ్రితోనే వున్నప్పుడు సంగతది. తన తండ్రి చింతపండు బుట్టలు, తేనె కుండలూ బండిపై వేసి, యేలేశ్వరం సంతలో అమ్ముకు రమ్మన్న రోజది.

ఒక్కడే వెళ్ళితే సరదా ఏముందని, కాస్త దూరమొచ్చి, రత్తినికూడా చాటుగా బండిపై ఎక్కించుకుని మరీ బయలుదేరాడు.

సంతలో తెచ్చిన సరుకును అమ్మేసాడు. సంత తిరునాళ్ళలా సాగిపోయింది. సరుకు అమ్మేసిన తరవాత రత్తితో సర్దాగా సంతకు బయలుదేరాడు.

ఆ సంత విచిత్రంగా వుంది.

ఒకచోట పచ్చనిగడ్డిపై బక్కచిక్కిన ఎడ్లను నిలబెట్టి—

"ఇదిగో, కామధేనువులు కుంచెడు పాలిస్తాయ్! రండి! రండి!" అంటూ వేలాంపాట పాడుతూండడం చూచి, అలా చేస్తున్న మాయకు ఆ అమాయకులు ఆశ్చర్యపడ్డారు.

ఇంకోచోట మరో తమాషా !

ఒక పగటివేషధారుడు - పిట్టలనుకొాట్టే తుపాకిలా ఒక కర్రను తయారుచేసి, ఒక దొర టోపీ పెట్టుకొని, చిరిగిపోయిన కోటూ, పట్లాం వేసుకొని—

చూడండి ! రండి ! యీ తుపాకితో అనేకవందల మృగాల్ని ఒక్కడినే చంపేశాను. వెనుక మాయింటినిండా బంగారమే. అందరికీ ధర్మం చేశాను, మొన్న మొన్న ఏనుగు తలకాయంత బంగారం మిగిలితే కుక్క ముట్టిందని బయట పారేసాను...అనేటప్పటికి—

రత్తి గోవిందులు విరగబడి నవ్వారు.

అలా రక రకాల తమాషాలు చిత్ర విచిత్రంగా నడిచిపోతున్నాయ్.

తరువాత రంగురంగుల రంకుల రాట్నమెక్కారు. ఆ రంకుల రాట్నం మెక్కినప్పుడు వొళ్లే మరచిపోయారు. వాళ్ళకదంతా విచిత్రంగా కనబడింది. డబ్బు లక్ష్యం కనబడలేదు. ఎంతడిగితే అంతా ఇచ్చేసి, గిర్రున చిలకా గోరింకల్లా తిరిగారు.

ఆఖరుకి వూరు చివర తను బండి దిగవిడచిన చోటుకొొచ్చి, జువ్విచెట్టు నీడ పడుతూ చల్లగానున్న ప్రక్కనున్న గడ్డిమేటిపై యిద్దరూ కాళ్లుపీకి కూలబడ్డారు. రత్తి ఆనాడు తను ప్రత్యేకంగా తెచ్చిన చద్దిముంత గోవిందు ఎదుట పెట్టింది. గోవిందు ముట్టుకోబోయాడు. రత్తి ఆపుచేసి—'నాదోకోరిక'ంది.

'ఏంటది?'

'ఓ ఎర్రచీర కొనిపెట్టు మామా!'

అబ్బ! రత్తికి ఎర్ర చీరంటే అంత మక్కువ! ఆ ఎర్ర చీర కొంటేనే గాని చద్దిముంతపై గుడ్డ తొలగించలేదు.

ఒట్టేసి, మరీ చద్ది త్రాగాడు.

వెళ్ళాడు - సంతకి. అందులోనూ బట్టల సంతకి.

రకరకాల చీరలు దండేలకు వ్రేలగట్టివున్నాయ్. ఆ చీరల్లో ఒకటి ఎర్రగా డొక్కాడితేనేగాని, రెక్కాడని చేనేత కార్మికుల

రక్తంలో తడిసి మిల మిల లాడుతున్నట్టుంది. ఎంత రక్తాన్ని స్వేదంగామార్చి. తన యావత్తు శిల్పవిద్యనూ ఆ చీరలో జొనిపితే లాభమేంటి? మిల్లుబట్టల ముందు ఎవ్వరూ కొనే దిక్కు లేదు.

మరో చీర తెల్లగా వెలవెల బోతూవుంది.

సునిశిత కళానైపుణ్యంతో ప్రఖ్యాతిగాంచిన వన్నె వన్నెల ఢక్కా మజిలీలను నేసిన ఆ నేతకూలీల మృదుహస్తాలు ఏనాడో ఆ ఢక్కా భూములలోనే కలిసిపోయాయ్ అలా కలిసిపోయిన మృదు హస్తాల ఎముకల చూర్ణాన్ని యీ తెల్లచీరలు గుర్తుకు తెచ్చాయ్, వారేమైనా ఆ కూలీలను మరచిపోలేం. వారినే కాదు. ఆ కూలీల ఎముకలు రాసులపై సైనికవిన్యాసాలు జరిపిన తెల్ల దొరల్ని మరిచిపోలేం.

తిన్నగా రత్తి ఆ ఎర్రచీరనే కాంక్షించింది. శ్రమజీవుల ఒక్క నెత్తుటి పనితనాన్నే వరించింది - రత్తి! ఆ చీర కొనిస్తేనేగాని రత్తి ముచ్చటతీరలేదు ఆమె కోరిక నెరవేరలేదు.

ఇప్పుడు కూడా సరిగ్గా ఆ చద్దిదగ్గరే ఆపుచేసింది; ఏం కోరు తుందో మరి?

'యింత ఆలస్యమెందుకైందో తెలుసా?' అని చిలిపిగా గోవిందు కళ్ళలోకి చూచింది. అతని కర్థంకాలేదు. చద్దిపైకప్పిన పైటచెంగును తొలగించి - చూపించింది. తట్టలో దట్టంగావేసిన గడ్డి తొలగించింది. చద్దిముంతకు కట్టిన గులాబీగుడ్డ విప్పింది.

గోవిందు సంతోషానికి మేరలేదు.

అమృతంలా తెల్లగా కనబడింది - చద్ది.

వెంటనే రత్తి ప్రక్కనున్న చిన్న మూట విప్పింది.'

అది నంచుకు. గబ గబా, వేలుగ్రుచ్చి నాలుకపై రాసు కున్నాడు. ఓహో! ఏం కమ్మని రుచి ?

'రత్తి! కోరుకో! ఏం కోరుకుంటావో?'

వెనుకా ముందూ ఆలోచించకుండా. భక్తుడ్నిచూచి బ్రహ్మ దేవుడు వరమిస్తున్నట్టుఅనేసాడు.

కాని రత్తి పెద్దకోరిక కోరలేదు.

తన అరుణ దళాయత నేత్రాలతో కూడిన చెక్కుటద్దాల కాంతిని మించిన చెక్కుళ్ళుగల ముఖంతో, పగడాల్లా మెరుస్తున్న తన రెండు పెదవులనూ అలా గోవిందు నోటికి అందించింది.

అంతే, 'ప్ఫ' అన్న మధురశబ్దం.

ఒక్క నిట్టూర్పుతో చద్దితట్ట గోవిందు ఎదుటికి తోసి చద్ది ముంత అతని ముందు పెట్టి, తట్టతీసి, లేచి—

"సరే"! నీవు చద్దితిని నాలుగు పెళ్ళు కొట్టు. నేనీ లోపులో నాలుగు తొనికిపండ్లేరుకొస్తా! అంటూ, తట్ట మోకాళ్ళను తన్నుకొంటూ, గెంతుతూ వెళ్ళిపోయింది.

గోవిందు చద్ది గబగబా తిని, మరల నడుంగుడ్డ తలకు కట్టుకొని ప్రక్కనున్న గొడ్డలితీసి, చద్దిగంజి త్రాగిన తరువాత వచ్చిన పనుకు బలంతో, గొడ్డలెత్తి ఆ చెట్టుపై బలంగా నాటువేశాడు.

అంతకంటే బలంగా అతని వీపుపై బాస్టియన్‌హంటరు చెళ్ళుమంది.

"అమ్మ!" అంటూ గోవిందు కెవ్వున అరిచాడు.

ఆ అరుపు. ఒక్క గోవిందుకే తగలదని, విశాల పీడిత ప్రజా హృదయానికి తగిలిన, గాయం రోదనగా మారి విశ్వస్వరూపం దరిస్తుందని ఆ కొట్టినవాడికి తెలీదు - అదొక పశువు. వాడి వెనుకనే, పిళ్ళె, వెంకప్పలు, మరిద్దరు పోలీసులు కూడా వున్నారు.

దారిలో పిళ్ళె వెంకప్పను మందలించడం ద్వారా, బాస్టియన్‌కు పురెక్కించాడు. అందుకే ఆంధ్రులు "అరవ పితలాటకం" మని పిళ్ళెలాంటి వాళ్ళపనులకు శాశ్వతముద్ర వేసేసారు.

వాడన్నాడు - "సర్వే నెంబరున్న చెట్టునే వాడు నరుకుతున్నాడంటె మీరొట్టి దద్దమ్మలన్నమాట!"

ఆ మాటతో "పదండి! వాడిసంగతి-కనుక్కుందాం!" అంటూ, బాస్టియన్ కళ్ళెం లాగాడు. గుర్రం సకిలించింది ముందుకు - యీ దారుణానికి దూకారు.

అలా చెళ్ళున కొట్టి అడిగాడు - ఎవడన్నా మనిషన్నవాడు కొట్టకముందు అడుగుతాడు - వీడు కొట్టింతర్వాత అడిగాడు - అదీ తేడా!

"కనపడ్డంలేదా? - చెట్టుకా సర్వే నెంబరు" అని. గోవిందు ఆ దెబ్బకూ తమాయించుకొని—

"మా తాత ముత్తాతలనుండీ లేని యీ సర్వేనెంబరేంటి? దొరా?" అని సమాధానమిచ్చాడు.

"చెట్టు మీ తాత ముత్తాతలదే" అంటూ, చిందులుత్రొక్కి వెంకప్పతో—

"వెంకప్పా! ముందు వీడ్ని చెట్టుకు విరిచికట్టు"

వెంకప్ప కట్టడానికి ముందుకొచ్చాడు. గోవిందు వాడి మాన వత్వానికి అర్జీ పెట్టుకున్నాడు—

"వెంకప్పా! మన్యంలో ఎన్నడన్నా, ఓ చెట్టు కొట్టుకున్నా, ఓ పంట పండించుకొన్నా, ఒకర్ని అడిగేవాళ్ళమా?"

"అది మన హయ్యాం!"

పానకంలో పుడకలా పిళ్ళె—

"ఇది దొరల హయ్యాం" అన్నాడు.

"హయ్యాంవరకూ వచ్చిందే?" అంటూ మరల బాస్టియన్ చెళ్ళునకొట్టి, వెంకప్పతో—

"వెంకప్పా! వీడి ప్రక్క లిరగదన్ను!" అని ఆజ్ఞాపించి—

'శింగన్నా!' అని కేకేసాడు,

శింగన్నా కనుచూపు దూరంలో ఓ మలుపు మళ్ళుతూ, కేక విని అదిరిపడుతూ, పరుగెత్తుకొస్తున్నాడు.

ఆ వచ్చేవరకైనా బాస్టియన్ 'శివ' ఆగలేదు. 'Nasty dog' అంటూ బూటుమడమ నేలను త్రొక్కాడు. ఆ త్రొక్కడంలో అది పిళ్ళె కాలిపైపడింది. పిళ్ళె 'అప్పా!' అంటూ ఎగిరి గంతేశాడు.

శింగన్న వచ్చాడు - బాస్టియన్ ఎర్రగా చూచి—

'ఇంకా ఎక్కడే డుస్తున్నావ్ !'

'ఏది దొరా! చీకటుండగా వచ్చిణ్ను, బంగళా వూడిగ మంతా చేసిణ్ను, కబురు పంపి స్తిరి వచ్చిణ్ను!'

'వచ్చిణ్ను! చచ్చిణ్ను! Idiot!' అంటూ లాగి లెంపకాయ కొట్టాడు.

పాపం శింగన్న 'అమ్మో!' అనడానికి కూడ స్వేచ్ఛ లేక పోయింది.

ఆ స్వేచ్ఛగల గోవిందు, ప్రక్క వెంకప్ప దెబ్బలకు 'అమ్మో!' 'అమ్మో!' అని అనగలుగుతున్నాడు.

'పో! ఆ సాహుకారి గొడవ తేల్చుకురా!' అని హుంకరించాడు.

తెల్లదొరలకు దోపిడీ అలవాటైతే యీ నల్ల - తెల్లదొరకు దండుకోడం అలవాటు కాని అందుకు అంతరాయం కలిగింది. శింగన్న వొణుకుతున్న పెదవులతో అన్నాడు—

'నిన్నటిదినం పోయుంటి దొరా! దుడ్డు తెమ్మనిండు!' అని.

'ఆ! అంతపొగరే! వెళ్ళు! దొరొస్తున్నాడని చెప్పు!' అంటూ వీరముష్టిలా హుంకరించాడు. అంతేగా! బిఛుకోసం వీరముష్టి ఒక చేయిచాపుతూ, మరో చేయితో మీసం మెలిబెడుతుంటాడుగా!

'చిత్తం!' అని యిక యెదురుచెప్పకుండా శింగన్న వెళ్ళి పోయాడు. వెంకప్ప గోవిందును కొడుతున్నాడు. కాని పిళ్లై దృష్టి ఇంకొకవైపు మళ్లింది.

వెంటనే బాస్టియన్‌కు చేయిపెట్టి చూపిస్తూ-

"అదిగో సార్! వీడి పెళ్ళాందా, వుండాలి సార్!"

"లాక్కురా! ముండని!" అన్నాడు బాస్టియన్ - దున్నపోతు యీనిందంటే, దూడని కట్టెయ్యమన్నట్టు.

"ఆమా!" అంటూ వెళ్ళాడు - పిళ్ళై.

ఆగిన వెంకటప్పను చూచి - బాస్టియన్—

"ఊఁ! తన్ను వెధవని."

ఒక్కపోటు పొడిచాడు - వెంకటప్ప, గోవిందుని.

"అమ్మా!" అంటూ బెకాకాడు గోవిందు.

"ఇదిగో సార్! ముండా! అంటూ పిల్లి, రత్తిని బాస్టియన్ కాళ్ళపైకి గెంటాడు. ఆమె తట్టలోనున్న ఏరుకొచ్చిన తునికిపళ్ళన్నీ తట్టతోసైతం నేలపై దొర్లాయ్. 'అమ్మ!' అన్న రోదనలో ఆమె కంటినుండి, రెండు కన్నీటిబొట్లు కూడా - నేలదొర్లాయ్.

దబదభా అటు గోవిందుపైన, ఇటు రత్తిపైన పడ్డాయి. యీ రోదనలు, చెళ్లు, చెళ్లు' మంటున్న దెబ్బల ధ్వనులూ, దూరంగా కోదండ. కమండలధారియై దూరంనుండి వస్తున్న రాజు చెవిని, మరొకవైపునుండి, అడ్డుగావున్న పొదలను నరుక్కుటూ వస్తున్న, గంటం, మల్లాల చెవుల్ని పడ్డాయ్.

వెంటనే ఆ చెవులు, వారి కళ్ళకు ఆ వార్త నందించాయ్. ఆ కళ్ళు దిక్కుల్ని పరికించాయ్. కాళ్ళు అతివేగంగా అడుగులు వేస్తున్నాయ్!

'బ్రతకాలని లేదేం-ముండ!' అంటూ బాస్టియన్ రత్తి జుట్టు పట్టుకొని, ఆ తలను నేలకు కొట్టి, ఆ తలను తన ఇనుపనాడాల బూటుతో మట్టి—

'జాగర్త!. తొక్కి నారదీస్తా! యికనుండి యీ అడవిలో యీ తునికిపండ్లేరావా - తల తెగుతుంది - జాగర్త!' అని హెచ్చరించాడు.

గోవిందు రోషి కషాయినేత్రు డయ్యాడు—

"దొరా!" అని అరిచాడు.

'ఏం?'

గోవిందు - మరల మారాడు—

'మూణ్ణాల్లుగ పస్తులుంటిమి దొరా!'

'మన్ను తినండరా! బ్రూట్స్!' అంటూ చెళ్ళున కొట్టాడు- బాస్టియన్.

ఆ దెబ్బ గోవిందుకు తగలలేదు. కాని, గోవిందును రక్షిం చడానికి ముందుకొచ్చిన గంటంకు తగిలింది. తగిలినా గంటం చలిం చలేదు మాట్లాడలేదు. గోవిందు, రత్తిలు మాత్రం 'మామా!' అంటూ బరువైన విశ్వాసాన్ని వొదిలిపెట్టారు. వాళ్ళకు పోయిన ఊపిరి వచ్చినట్లయింది. కాని కూడానే వచ్చిన మల్లు - పళ్ళుకొరికి-

"దొరా!" అని హుంకరించాడు.

"వాయి ముడరా! నాయీ!" అంటూ పిళ్ళె కలుగజేసు కున్నాడు.

మల్లు వొళ్ళు మండింది—

గంటం - యిప్పుడు మాట్లాడేదు.

'మూస్తాం! మా మన్యం పొదుగుకోసి పాలు త్రాగుతున్నారు!' అని.

గంటంను బాప్టియన్ ఏమీ అనలేదు. గంటం సత్తా బాప్టి యన్‌కు తెలుసు.

"హూ! పిళ్ళె!" అని మాత్రం పిళ్ళెను పురిగొల్పాడు.

మల్లు అడ్డువచ్చి—

'జాగర్త! మల్లు బ్రతికుండగా, నా అన్నను తాకలేరు.'

ఆ మాటకు దుష్టత్రియం వికటాట్టహాసం చేసింది.

ఆ వికటాట్టహాసానికి సమాధానంగా గంట —

"తెల్లనివన్నీ పాలనుకునే మన్యంజాతిని అవహేళన చేయడం మీకు భావ్యంకాదు"—అన్నాడు.

'చాలించు! నీ పెద్దమనిషి వేషాలు!'

'ఏమన్నావ్?' అని మల్లు గ్రుడ్లెర్రన చేసాడు.

"నోరుమూయ్!" అంటూ హుంటరెత్తాడు-బాప్టియన్.

ఆ దృశ్యం - భీభత్సంగా పరాకాష్ఠ నందుకోడం గమనించి ఆ రత్తీ గోవిందుల జంట 'కెవ్వు' మంది 'మామా!' అని.

హడలిన రత్తీ గోవిందులను లాలిస్తూ - గంటం--

"భయపడకండి! దీనులకు దేవుడే దిక్కు!'

అనగానే, ఒక్కుమ్మడిగా ఆ సత్యసంధుని మాట - మంత్రశక్తియై ప్రభావాన్వితమైనట్టు - చుట్టూవున్న కొండలు, పైన మేఘాలూ, బద్ధమైన శబ్దం ధ్వనించింది - "తళ ఫెళ తళ ఫెళ!" మంటూ మెరుములతో ఆ ప్రదేశమంతా భీకరాకృతి ధరించింది.

ఆ భీకరాకృతిని విచ్ఛిన్నంచేస్తూ ఓ గంభీరమైన నాదం కంచులా మ్రోగింది-

తరువాత ఓం-కారధ్వనితో, శంఖారావంలా పొడగట్టి ది. ఆ నాదంలో--

పరిత్రాణాయ సాధూనామ్
వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే, యుగే!

అన్న పవిత్రాక్షరాలు విద్యుత్కాంతులతో కళ్ళుకొడుతున్నాయ్. ఆ ధ్వని కొండల ప్రతిధ్వనులతో రాను రాను బిగ్గరయ్యాయ్. ఉదయార్కుని సువర్ణకిరణ కాంతులకు మించిన తేజస్సుతో, ఓ కొండశిఖరాగ్రంనుండి ఆ ధ్వనితోపాటు గంభీర ముఖవర్చస్సును వెలిగక్కుతున్న ఓ మూర్తి రయంగా వచ్చి, వాళ్ళ ముందు ప్రత్యక్షమయ్యింది.

అంతా ఒక్కసారిగా - 'జై! రామరాజుకీ జై!' అన్నారు. దుష్టత్రయానికి చిరుచెమట్లు గ్రమ్మాయ్. కళ్ళు మిరుమిట్లు గొలిపాయ్. శరీరాల్లో జెర్రులు, తేళ్ళు ప్రాకాయ్. ఆ పీడితుల్లో రేచులు, రోచులు లేచాయ్.

గంటం - పుష్పాంగి--

"చూచారా, భద్రాదిరాముడు!"

బాస్టియన్ మండిపోయాడు--

'ఎవడా రాముడు?"

మల్లుకు సూర్యాకారం పాలు ఎక్కువ. అందుకున్నాడు--

"మీలాంటి రాక్షసుల్ని కూల్చిన రఘురాముడు!"

'Take care! అంగ అర్థబలాలన్నీ మా చేతుల్లో వున్నాయ్!'

రాజు మందహాసం చేసాడు--

"నీ అంగ అర్థబలాన్ని అంగలార్పించే అవగాహనశక్తి వీళ్ళ చేతుల్లో వుంది - తెల్సా?"

బాస్టియన్‌కు ఆ మాటలు శూలాల్లా గ్రుచ్చుకున్నాయ్ - అన్నాడు.

"ఎవరు నువ్వు?"

"కనబడ్డంలేదూ!"

"జాగర్త! నా అంగబలానికి ఆయుధాలున్నాయ్!"

"నీ ఆయుధాల ఆటకట్టించగల అభేద్యమైన ధైర్యసాహసాలు వీళ్ళ కంచు కవచాలని తెలుసుకో! ఇంతకీ వీళ్ళు గర్జించే సింహాలు. మీరో మొరిగే కుక్కలు! కుక్కలు సింహాల్ని ఎదిరించలేవు!"

ఏంటో వెంకప్ప కదోలా అనిపించాయా మాటలు. బాస్టియన్ యెదల మెహర్బానీగా—

"సాధూవైతే వయ్యావుగాని, మాటలు తిన్నగారానీయ్ స్వామీ! యీ దొరలీ మన్యంలో అడుగు పెట్టబట్టే, ఎర్రటి ఏగాడనేది చూస్తున్నాం. అందుకే మన్యపోళ్ళకింత పొగరు!"

ఆ మాటకు రాజు చేతిలోని కోదండం వుద్రేకంలో ఫెళ ఫెళమంటూ విరిగిపోయింది. పట్టరాని కోపంతో వెంకప్పను మెర మెర చూస్తూ—

"ఆంధ్రుడవై పోయావ్! మన్యంలో పుట్టి, మన్యం వుప్పు, కారంతిని, మన్యాన్నే దూషిస్తావే - మూర్ఖుడా!" అని గర్జించాడు.

వెంకప్ప వొణికిపోయి బాస్టియన్ వెనక్కి నక్కాడు. బాస్టియన్‌కూ దడపుట్టింది. కాని అణచుకొని—

"చాలించు! నీ సాధూ వేషం!" అని హుంటరెత్తాడు.

వెంటనే కాకుల్లా పట్టుకున్నారు గంటం, మల్లు, గోవిందులు.

"సాధూపైనా దౌర్జన్యం?"

"ఏదీ చెయ్యేయ్!"

"ఏయ్! చూస్తుము!"

పిడుగుల్లా వెలువడ్డ ఆ మాటలకు బాస్టియన్ కంపించిపోయి నిలువునా నీరైపోయాడు. ఆ నీరైపోయిన బాస్టియన్ చేతిలోని హంటరు, మల్లు లాక్కొని—

"హే! మన్యం తలచుకుంటే మొలతాడున్న మగోడే కాదు! కిరీటమున్న చక్రవర్తి కూడా ఎగిరిపోతాడు - జాగర్త!"

పిళ్లై యిక నిలవలేకపోయాడు. "రండి! సార్! పోదుము!" అని తొందరపెట్టాడు. అందరికంటె ముందు పసికట్టాడు-పిళ్లై. మనిషి మిఠాయి తింటేనేగాని రుచికి ఆనందించడు. కుక్కలా కాదు—మిఠాయ చూస్తే ఆనందిస్తుంది.

పిళ్లై, అలాగే చుక్కెదురుకావడం ఎప్పుడైతే కనిపెట్టాడో - కాళ్ళకు బుద్ధి చెప్పకపోతే, వీపు విమానంమ్రోతేనని వెంటనే కనిపెట్టేస్తాడు

పిళ్లైకంటె ఏమంత తక్కువ తిన్నవాడు కాదు - బాస్టియన్.

"పద!" అంటూ చిందులుత్రొక్కే పిళ్ళై వెనుకడుగుల్లో తనూ అడుగు వేసాడు.

రాజు మందహాసం చేసాడు.

గంటం, మల్లు, గోవిందు, రత్తినల్గురూ యీ దుష్టత్రయాన్ని చూచి విరగబడి నవ్వారు.

గోవిందు, రత్తిలను చూచి, రాజు—

"ముందు వీళ్ళ కట్లు విప్పండి!" అన్నాడు.

వెంటనే కట్లు విప్పారు. తన కమండలములోని పవిత్రోదకంతో రాజు గోవిందు, రత్తిల గాయాల్ని శుభ్రంగా కడిగి, తన కాషాయవస్త్రంతో కట్టు కట్టాడు.

ఆ చల్లనయ్యపై ఆ కోయజనులకు మమకారం, ప్రేమ మరింత ఇనుమడించి అతిశయించింది.

ఆ అతిశయంలో రాజును, వారు తమ ఆరాధ్యదేవతగా ఒక్కసారి అరమోడ్పు కన్నులతో చూచారు. ఇకా మన్యం ఏ పుంత తొక్కుతుందో చూడాలి!

* * * *

అదుగో, చూడండి వారెవరో? ముగ్గురు వ్యక్తులు, మూడు గుర్రాలపై గాముకొండ శిఖరాగ్రంపై కనబడుతున్నారు. అందులో ఒకడు పొడుగాటి లాల్చీ ధరించి, పెద్ద తలపాగా చుట్టుకొని అతి ఠీవిగా ఓ గుర్రంపై కూర్చున్నాడు. మీ దృష్టి అతనిపైనే నిలపండి. అతనే పడాలు. అలా ఆ గుర్రంపైనుండి, కొండ దిగువనున్న ఓ పల్లెను చూపించి—

'ఇక్కడే చాటించు!' అనగానే, వెనుక గుర్రంపైనున్న మరో వ్యక్తి వేసాడు - చాటింపు! డప్పుల చప్పుడు వింటే చాలు-మన్యం ప్రజల చెవులు మెదులుతాయ్ - మనుషులు కదులుతారు. క్రింద గూడెంలోని, ప్రజలంతా పిల్లా, జెల్లా, ముక్కా, ముదుసలితోసహా బిలబిలా ఆ చాటింపుచుట్టూ చేరిపోయారు.

చాటింపుదారుడు—

'సర్కారు ఆదేశమేమనగా, చింతపల్లి ఘాటు రోడ్డు వేయుటకు కూలీలు వేలమంది కావాలి గనుక, కూలి ఎక్కువ, కష్టం తక్కువ జేసారు దొరలు - కాబట్టి, ఎంతమందైనా కూలికి రావచ్చహో!' అని చాటింపు వేసాడు.

అప్పటికే తెల్లవాళ్ళ ప్రవేశంతో, మన్యంలో వస్తువులు మార్చుకునే దశపోయి, విలువలేని కాగితాలు మార్చుకునే రోజులొచ్చాయ్. మన్యం సంపదంతా వారికి తెలియకుండానే, తెల్లదొరల చేతుల్లోకి పోయి, మన్యంవాసుల చేతుల్లోకి - కొరగాని కాగితాలు మాత్రం చేరుతున్నాయ్. జనమంతా కొల్లగొట్టబడుతున్నారు. పనుల్లేవు. ఆకలి తల్లి ప్రతీయింటా తొంగిచూస్తోంది.

అటువంటి సమయంలో ఆ డప్పుల చప్పుడు ఆ జనం ముఖాల్లో ఆనంద రేఖల్ని తొణికింపచేసింది.

అలా ఆ చాటింపు, గ్రామ గ్రామాన, పల్లె పల్లెనా వాయించ బడుతూనే వుంది. జనం తండోపతండాలుగా వారి వెనుకబడుతూనే వున్నారు. బెల్లం వెనుకే చీమలు పడతాయ్. తీరా తిందామని వెళ్ళి, ఆ జిగురుకు అంటుకుపోతాయ్. దీపం చుట్టూ పురుగులు చేరుతాయ్. తీరా ముద్దుపెట్టుకుని, ఆ వేడికి భగ్గుమని మండిపోతాయ్.

ఆ సత్యం వారు గుర్తించడం వేదశ్లోకాలవల్ల ధర్మసందేశాల వల్ల మాత్రం సాధ్యంకాదు. చీమలు, పురుగులలాంటివారు జనులు కాదుకాబట్టి, ఆలోచనాజ్ఞానం, హేతువివేకంగల బుద్ధి వారికున్నది గాబట్టి. అనుభవంలోనే గ్రహించాలి. అలా గ్రహించగలిగి నప్పుడే మానవుడు తన అరచేతిలోకి, ఆకాశంలోని పదకొండు గోళాల్ని యిట్టే తెచ్చుకోగలడు.

కాని వారింకా ఆ స్థితిని అర్థం చేసుకోలేదు. ఆశతోనే వెడుతున్నారా జనం! ఆ జనానికి నాయకుడు పడాలు.

తిన్నగా కొండ కనుములను, లోయలను దాటి అతని వెనుక జన మొస్తూవున్నారు.

రాజు నివాసమున్న ధారుకొండ అవతల దిగువభాగం గుండా ఆ జనం వెడుతున్నారు, ,

కొండపైె, ఆశ్రమం. వాకిటనున్న రాతిబండపై రాజు విల్లుకు నారి బిగిస్తూ మ్రోతను చూసుకుంటున్నాడు. అనగా మీకు వెంటనే ఓ ధర్మసందేహం బుర్రలో మెరవొచ్చు. జనం బాధల నరాల్ని బిగించి, వారి వుద్రేకం మహోద్యమంగా పొంగడానికి సిద్ధంగా వుందా? లేదా? అని మీటి చూచుకుంటున్నాడని.

మీకంటే ముందుగానే ఆ అనుమానం ఆశ్రమంలో ఆయన ప్రక్కనే వుంటున్న తల్లికి కలిగింది. అప్పుడే సూర్యోదయం కావడం వల్ల, ఆ అరుణకాంతులు పడి, చిందులు త్రొక్కుచున్న రాజు ముఖం చూచి - ఆ తల్లి అడిగింది—

"ఏంటి బాబూ ! యీ విల్లమ్ములూ ?"

ఆమె తన ప్రత్యక్షంలో రాజు చేతిలో విల్లమ్ములు ఆ రోజునే చూచింది. భయపడింది. వెంటనే అడిగేసింది.

తల్లి భయం కనిపెట్టాడు-రాజు.

"విల్లమ్ములు లేకపోతే యీ కారడవిలో వుండలేమమ్మా! మృగాలు! మృగాలు తిరుగుతాయమ్మా!"

తల్లికి అర్ధం కాలేదా మాటలు.

"మృగాలు! మృగాలు!" అని రెండుసార్లంటాడేమిటా? అనుకుంది.

పాపం! మృగాలంటే, తెల్లమృగాలని ఆమెకెలా అర్ధ మౌతుంది.

"ఏమిటో నీ పనులు నా కర్ధం కావడంలేదు బాబూ!"

"అర్ధం కాకపోయినా నీ ఆశీస్సులుంటే చాలమ్మా!" అన్నాడు మరల భావగర్భితంగా,

తల్లి ఆశీస్సులుంటే ఏ పనైనా చేయగలమని.

తల్లి ఆశీస్సులతోనే భీముడు బకాసురుని చంపాడు. చైతన్య మహాప్రభువు - శ్రీకృష్ణపరమాత్మునిలో లీనమైపోయాడు.

తల్లి ఆశీస్సులతోనే హెర్క్యులెస్ ప్రపంచాన్ని గెలిచాడు. అంతటి ప్రపంచ ప్రసిద్ధుడు గనుకనే ఆఖరికి సైకిళ్ళకు కూడా "హెర్క్యులస్" పేరొచ్చేసింది.

ఆ తల్లికి మాత్రం భయం తగ్గలేదు. పైగా—

"బాబూ!" అని చేతులు చాపింది.

"అమ్మా!" అంటూ ఆ తల్లి కౌగిలిలో ఆ బిడ్డడు చేరి, ఆమె కను కొనకుల నిలిచిన కన్నీటి బిందువులు కొనవ్రేలితో దులిపాడు.

అలా వారిరువురూ ఒక అనూన్య ప్రేమలో పడుగుపేకల్లా అల్లుకుపోయారు.

వారి ప్రశాంతతను భంగపరచిందో - రొద!

ఆ రొజ-రొద కాదు సుమండీ. - కొండదిగువ నుండొస్తోంది.

అసలా రోజ రావడానికి కారణం - అంతవరకూ వచ్చిన జనం తిన్నగా పోకుండా, ఆ కొండదగ్గరాగి, కొండపైకి మళ్ళడం. అలా మళ్ళిన జనాన్ని 'అటుకాదు ఇటు!' అని పడాలు గద్దించడం వల్ల వచ్చిన రోజే.

ఆ జనంలో గోవిందన్నాడు—

'కొండపై యోగి మా దేవత! ఆయననుమతి లేనిదే మేం పనులు ముట్టం!' అని.

'నిక్కం. నిక్కం!' అంటూ జనంలో పొలికేకలూ, కలకలం బయలుదేరింది. పడాలు లొంగిపోయాడు. జనం కొండపై తమ దేవత-రాజువద్దకెళ్ళి ఆయన కాళ్ళపై బడ్డారు.

అబ్బ! వాళ్ళ కాయనంటే ఎంత ప్రేమ! అసలాయన ఎవరో? వారికేం అవుతాడు? అన్నగారా? తండ్రా? తమ్ముడా? బంధులా? ఎవరు? తమ వాడవాడు కాదు-కనీసం వూరివాడన్నా కాదు. తమ కులమంటే, అదీ కాదు. ఎందుకో ఆ ప్రేమ! ఆ ప్రేమలో ఆ జనంలో తల్లిదండ్రుల ప్రేమను త్యజించిన రత్తి, గోవిందులున్నారు. ప్రభువుల్ని ధిక్కరించిన గంటం. మల్లులున్నారు. వారు ధిక్కరించిన త్యజించిన వారందరికంటే ఘనమైనది. దివ్యమైనదేదో ఆయనలో వుండాలి.

అలా సాష్టాంగపడ్డ జనానికి ప్రసన్నమయ్యాడు - రాజు,
అందరినీ ఒక్కసారిగా కలియజూచాడు - గోవిందుతో—

'ఏం? ఏం జరిగింది. నాయనా?'

'సర్కారు రోడ్లపనులకు రమ్మని చాటించారు. తమ సెలవు కోసమని వచ్చాం - స్వామీ:'

వారికి తెలియనిది రాజుకు తెలుసు! అందుకే వారికి ఆయనపై అంత ప్రేమ. తెలుసుకున్న రాజు-అడిగాడు 'కూలెంతో చెప్పారా?'

పడాలు ఆ మాటకు గుర్రంనుండి దూకి చరచరా రాజు ముందు కొచ్చి—

'ఆ గొడవ నీ కెందుకయ్యా?'

రాజుకు కోపమొచ్చింది. కాని పడాలులోని అమాయకత కని పెట్టాడు. అతనిలో ఒక పెద్దవంశ లక్షణాలను గుర్తించాడు. గుర్తించబట్టే, అతను కోపంతో అన్న మాటలను క్షమించాడు అతనికో రహస్యం చెబుతున్నట్టుగా, చిరునవ్వు నవ్వి—

"పిచ్చివాడా! కనులను కరిగించి కన్నీరూ, కండలను కరిగించి నెత్తురూ చింది, శ్రమతర్పణ చేసి, కొండల్నీ, భూగర్భాల్నీ దొలిచి, బండరాళ్ళను పగులగొట్టి కంకరగా మార్చి, నడినెత్తిన ఎండ మెదడును కరిగించినా, ములుకుల్లాంటి రాళ్ళు కాళ్ళకు గ్రుచ్చుకొని నెత్తురు చిందించినా, దొరల గుర్రాలూ, కారులూ సాఫీగా పోడానికి నునుపాటి రోడ్లను తయారుచేసే వీరెంత అరమరికలేని అమాయక జీవులో ఆలోచించు నాయనా! ఇటువంటి అమాయకులను నీ దొర మెప్పుకోసం కూలి కూడా యింతని నిర్ణయించకుండా కరికవాని బండకత్తెకు మేకలను అందించినట్టు తోలుకెళ్ళడం ఎంత అవివేకమో, అత్మవంచనమో నీ హృదయాన్నొకసారి అడుగు-యిది న్యాయమా? అని!" అన్నాడు - రాజు.

పడాలుకు అదంతా క్రొత్తగా కనిపించింది.

పడాలులో వూగిసలాటను కనిపెట్టి, ఇంకో మోతాదు వేసాడు- రాజు!

"ఒక్కసారి ఆలోచించు, నాయనా! బలవంతంగా ఎంత కూలి యిస్తారో కూడా నెలియకుండా, తెలియజెప్పకుండా ఇందరినీ ఎందుకు తోలుకెడతావ్? "కూలి ఎంతని?" అడిగే స్వేచ్ఛ అయినా పనిచేసే కూలివాడికి లేదంటావా? ఆలోచించు! యిప్పటికే ఆ స్వేచ్ఛ దొరలు కొల్లగొట్టారు. పశువులు హాయిగా మేసే బీళ్ళకు కంచె వేయించారు. మీరు స్వేచ్ఛగా అనుభవించే అడవులను సర్వేచేసారు. మీరు చేసే భూమిపై అధికారం ముఠాదార్ల కంటగట్టేరు. ఎదురు తిరిగితే కొట్టడం. నోరు మెదిపితే హింసించడం పెచ్చు పెరిగి పోతున్నాయ్...ఇక వున్న "మాట స్వేచ్ఛ" కూడా ... బలి చేసుకోమంటావా?..."

అంటూ రాజు వుద్రేకంతో తన వాగ్ధోరణిని పాదరసంలా ప్రాకిస్తున్నాడు. పడాలు కరిగిపోయాడు. అతనిలో ఘర్షణతరంగాలు విజృంభించాయి. అతని తప్పు అతనికి తెలిసిపోయింది. అందుకే రాజంటే అందరికీ తలమానిక మయ్యాడు. ఆరాధ్య దేవతయ్యాడు. అందుకే జనం ఆయన పాదాలు ముడితేనేగాని, ఆయన సలహాను వింటేనేగాని పనే చెయ్యమన్నారు. ఎందుకో అర్థమైపోయింది - పడాలుకు. పశ్చాత్తప్తుడయ్యాడు.

"క్షమించండి, స్వామీ!" అని రాజు కాళ్ళపైబడి, తన నిజస్వరూపాన్ని విన్నవించుకున్నాడు—

"నా కళ్ళు కప్పిన పొరలను కోసి యథార్థాన్ని చెప్పేరు స్వామీ! వాడేదో కుట్రలు పన్నుతోంటే, తొలుతనే నా కనుమానం తోచింది. అది నిజమని తేలిపోయింది. చెప్పేస్తా, స్వామీ! చేప్పేస్తా! కూలి నిర్ణయం లేకుండా, కోయలు రోడ్డుపనికి రామన్నారని చెప్పేస్తా!" అంటూ రాజుపాదాలను స్పృశించి, ఒక్క క్షణం అక్కడ నిలవకుండా, గుర్రమెక్కి దౌడు తీసాడు.

పడాలులో సంభవించిన ఆ మార్పుకు జనమంతా నివ్వెరపోయారు. రాజు అక్కడే నిల్చి, చేతితో పోతున్న పడాలును దీవిస్తూనే వున్నాడు. ఆ చాపిన చేతిక్రింద నివ్వెరపోతూ, పడాలు పోకను గమనిస్తున్న జనం, పడాలుతోపాటు రాజు ఆశీస్సులనుకూడా పొందుతున్నట్టు కనబడుతున్నారు.

అలా ఒక్కొక్క వుచ్చునుండి ఆ జనులు ఒక్కొక్క సమయంలో రాజువలన రక్షించబడుతున్నారు. కాని ప్రభుత్వం రోజుకొక వుచ్చులో ఆ పేదప్రజలను బిగిస్తూనేవున్నారు. ఆ వుచ్చులో పడిన జనాన్ని వారిష్టమొచ్చినట్టు పీడిస్తున్నారు. కాని ఆ మన్యం జనుల్లోవాళ్ళు పన్నుతున్నవి వుచ్చులనే సంగతి తేలిపోతోంది.

చూడండది నిమ్మగడ్డ గ్రామం!

ఆ గ్రామంలోకి జమాబందీ వసూళ్ళకని వచ్చారు వెంకప్ప, ఒక సబ్ యిన్‌స్పెక్టరూ, ఇద్దరు పోలీసులూనూ.

అసలు మనిషి చచ్చాక యముడు తన యినుపగిట్టల దున్నపో తెక్కి వస్తాడు. కాని మనిషి చావడాన్కి-ముందు మాత్రం తన కింక రుల్ని పంపుతాడు. మనిషి త్వరగా చావడానికి అవసరమైన పరి స్థితిని ఆ కింకరులు కల్పించేస్తారు.

అలాగే, జిల్లాకలెక్టరు జమాబందీకి రావడానికి ముందు - ఆ జమాబందీ ఖర్చులకని ముందు కొంత సొమ్ము వసూలు చేస్తారు. కల క్టరు జమాబందీ కాలంలో వారికి మేకపోతులు, కోడిపెట్టలు, పులా వులు, అల్వాలు లగాయతూ, బ్రాందీ, సారా, సిగరెట్లు వరకూ యిలా పేదప్రజలనుండి గోళ్ళూడగొట్టి వసూలుచేసిన డబ్బుతోనే ఖర్చు పెట్టేస్తారు. పోనీ దాంతో వూరుకుంటారా ?

అప్పుడు యముడు తన పాశాల్ని వొదులుతాడు. అవి కరెంటుతీగలే. ఆ తీగలు తగులుకుంటే ప్రాణాలు యిట్టే ఎగిరి పోతాయ్. అనగా పన్నులు వసూలుచేస్తాడు. ఆ పన్నులే ప్రజల పాలి పాశాలు.

సబ్‌యిన్‌స్పెక్టరు డబాయిస్తున్నాడు. జనం చేసేదిలేక తలలు వొంచేసారు.

అందులో ఒకడన్నాడు—

"కూడు లేకనే పిల్లలతో మాడి చత్తుంటిమీ దొరా!" అని.

వెంటనే వెంకప్ప అందుకున్నాడు—

"మీ చావులతో మాకు నిమిత్తంలేదు. పెద్దదొర యీ వారం లో జమాబందీకి రావడం ఖాయం! మీరు తల తాకట్టుపెట్టయినా తలో అయిదురూకలు యిచ్చుకోడం ఖాయం!" అని.

అవును. మొగుడు చచ్చి అదేడుస్తుంటే, రంకు మొగుడొచ్చి చెంగట్టుకున్నాడనే ముతకసామెతలా వచ్చింది - ఆ వెంకప్ప వ్యవ హారం.

ఆ వెంకప్ప మాటలకు మండిపోయిన ఆ జనంలోని శూరకత్తి లాంటి కుర్రోడొకడు - పేరు. ఎర్రేశంటాడులెండి! చటుక్కున బల్లి దోమను పట్టుకున్నట్టు పట్టుకున్నాడు—వెంకప్పని—

"డబ్బిచుకోలేకపోతేనో?"

'మేకపిల్ల యిచ్చుకోవచ్చు!' అన్నాడు- వెంకప్ప.

మోదిగాడనే ఓ కంఠమూ లున్నాడు - ఆ జనంలో వాడికా మాటలు - "నా నోటిలో నీవేలెట్టు, నీ కంటిలో నేనేలెడతా" అన్నట్టు తోచి, వెంటనే—

"అదీ లేకపోతేనో?" అన్నాడు.

"ఇది! అంటూ సబ్ యిన్‌స్పెక్టరు కంఛాతో చెళ్ళున కొట్టాడు. కొట్టి వూరుకోలేదు—

'కట్టండి! వెధవని గుఱ్ఱాన్కి. వీళ్ళలా యివ్వరో తేల్చుకుందాం!' అని వెంకప్పకు హుకుం చేసాడు.

అంతే. మోదిగాడ్ని బలవంతంగా రెండుచేతులూ కట్టి, గుఱ్ఱం తోకకు బలంగా ముడేసారు.

వెంటనే సబ్ యిన్‌స్పెక్టరు గుఱ్ఱమెక్కి "చల్" అన్నాడు. గుఱ్ఱం ముందుకు దూకింది.

ఆ జనం కళ్ళు తిరిగాయి. బ్రతికున్న మానవుడ్ని కఠిన పాషాణులు, బ్రతికుండగానే గుఱ్ఱానికి కట్టి యీడ్చుకెళ్ళడం ఆధునిక చరిత్రలో ఘోరహత్యానేరానికి సమానమని మనం అనుకుంటాం. కాని ఆ యమకింకరుల కదిలేదు.

జనం 'మోదిగా! మోగిగా!' అని వెనుక అరుస్తూ డస్సిపోయినంత దూరం పరుగెత్తారు. మోదిగాని రోదనకు అంతం లేకపోయింది. శరీరం తుండు తుండులుగా తెగిపోతూ, త్రోవపొడుగునా నెత్తురుధారకాజొచ్చింది. ఆ నెత్తురు ధారే ఆ దుర్మార్గుల అంతిమ అధఃపతనానికి దారి కావచ్చు. కారణం - చెట్టు చెడుకాలానికే కుక్కమూతి పిందెలు పుడతాయంటారు పెద్దలు. ఆ పెద్దల మాటలే సత్యమైతే- ఆ నెత్తురు ధారకూడా వారిఅధఃపతనానికి దారి అనడానికి సందేహంలేదు.

ఇక రక్తం కళ్ళచూచికూడా సత్యాన్ని కానలేని మూర్ఖులుంటారా? 'వుంటే వుండొచ్చు' అని మీ రనొచ్చు.

ఉండరంటాను - నేను.

ఉంటారో, వుండిరో తేల్చవలసింది - నేనూ, మీరూ కాదు - చరిత్ర !

ఇంకా మనం అసలు చరిత్రలోకి వెళ్ళనేలేదు.

పొయ్యిపై వెసరుపెట్టాం. పొయ్యిక్రింద నిప్పుపెట్టాం. కుండలో బియ్యం కుతకుత లాడుతున్న శబ్దంమాత్రం వింటున్నాం. ఆ కుతకుతలాడుతున్న బియ్యం-అన్నంగా తిరుగబడ్డం చూడాలి.

వెసరు వేడిగావున్నా సరే, చేయిపెట్టి చూడాలి. చేయి కాలుతుందంటారా? చరిత్ర సహాయంతో బయలుదేరి చూద్దాం.

## 13

అదే బాస్టియన్ గుడారం. చింతపల్లిఘాటు రోడ్డువర్కు నేడే ప్రారంభమౌతుందన్న కుషీలో కైపెక్కి వున్నాడు - బాస్టియన్. ఆ గుడారంలో మధ్యగా ఓ తెర వుంది. తెర ముందు కుర్చీలూ, బల్లలూ వగైరా ఆఫీసు సరంజామాతో నిండివుంది. వెనుకవైపు మాత్రం బాస్టియన్ ప్రయివేటుగది. ఆ గదిలో బాస్టియన్ నిషాలో కైపెక్కి, ఎదురుగావున్న గ్రామఫోను ఇంగ్లీషు ట్యూనును, తను వుంచుకున్న వుంపుడుకత్తె ఇంగ్లీషు డ్యాన్సు త్రొక్కుతుండగా వింటున్నాడు. ఆ వుంపుడుకత్తెకూడా వానిలాగే బొద్దుగా, మొద్దుగానే వుంది. దాని ఒక్కొక్క అడుగు మర్దనకు భూమి ఒక్కొక్క అడుగు క్రుంగిపోతోంది. అనగా వాళ్ళిరువురి కాయలూ ఆ భూమికే బరువైపోయాయన్నమాట.

బయట ఒక గుర్రం అంగలారుస్తూ, సొంగలు గ్రక్కుతూ వచ్చి నిలబడి సకిలించింది.

తన కుషీ, నిషాలోనుంచి తూలుతూ బయటికొచ్చాడు - బాస్టియన్. ఎదురుగా ఆ గుర్రంపైనే దిగిన పడాలు కనపడ్డాడు.

"ఏరీ జనం?" అని గద్దించాడు.

"కూలి నిర్ణయం కానిదే రామన్నారు దొరా!"

నిషా విరిగిపోయింది - కొత్తగోదావరి నీటిలో యిండుగు కాయ అరగదీసి రాస్తే, విరిగిపోయినట్టు, తాగుడు మైకంలోంచి, మనిషిమారి—

'ఆ! ఏమన్నావ్, రామన్నరా? యింత పొగరా? ఏడి పిళ్ళే? ఏడీ వెంకటప్ప? ఏయ్ శింగన్నా!' అంటూ శివం త్రొక్కుతూ, శింగన్నను పిలిచాడు.

'చిత్తం దొరా!' అంటూ శింగన్న ఎదురయ్యాడు.

'ఏడీ వెంకటప్ప?'

"జమాబందీ వసూళ్ళ కెళ్ళారు, దొరా!"

"అసలు ప్లానే తల్లకిందులయితే వెధవ జమాబందేమిటి? పిలవరా వాడ్ని!"

శింగన్న కుక్కినపేనులా మారు మాటాడకుండా వెళ్ళిపోయాడు. అవును, మాట్లాడితే తంతాడు—మరి!

అంతటితో బాస్టియన్ వూపు ఆగలేదు—

'ఏయ్! పిళ్ళే!' అని పిలిచాడు.

పిళ్ళే లోపల కుర్చీలో కూర్చునే 'సార్!' అన్నాడు.

అంతకుముందు, లోపల్నుండి బయటకొచ్చిన బాస్టియన్‌కు నిషాలో అక్కడే ముందు కూర్చున్న పిళ్ళే కనబడలేదు.

'ఏంటి నీ ముఖం సార్!'

"ఇలా వాంగో సార్!" అనగానే, బాస్టియన్ లోపలకెళ్ళాడు. ఆ వచ్చిన బాస్టియన్‌ను, ఏదో రహస్యమన్నట్లు లోపలికి తీసుకు వెళ్ళబోయాడు. లోపలఉన్న తన అందాలగత్తె వుంపుడుకత్తె, పిళ్ళే కళ్ళ బడుతుందేమోనని అక్కడే ఆ విషయం చెప్పమన్నాడు—బాస్టియన్. ఆ లోపల ఉంపుడుగత్తె వున్నదనే

సంగతి పిళ్ళెకు తెలియదనుకున్నాడు, బాస్టియన్. నిజానికి బాస్టియన్ లోపల ఆ వుంపుడుకత్తె ప్రత్యక్షంలో కూర్చొని సుఖం అనుభవిస్తే, పిళ్ళె తెర యివల పరోక్షంగా ఆ సుఖం అనుభవించేసాడు. బాస్టియన్ ఎందుకు అక్కడే చెప్పమంటున్నాడో గ్రహించిన పిళ్లె "నమ్మకి తెరియుము రాండి సార్ !" అంటూ బాస్టియన్‌ను లోనికి తీసికెళ్ళాడు.

"సార్ ! ఆ సాధూ యీ కూలినాయలికి ఏదో విషం పోసి వుంటాడని నమ్మకి అనుమానం యిర్కిదా సార్ !"

'అటువంటిదేమైనా వుంటే పడాలు చెప్పడంటావా ?'

"అదేంటిసార్ ! యిప్పుడు ఎందాళికి నమ్మ ముడియాదు సార్ !"

వాళ్ళలా మాట్లాడుకుంటూంటే పడాలు వాళ్ళ మాటలకు ఒక చెవి యొగ్గి వింటూ కుతకుత లాడిపోతున్నాడు. అప్పటికే శింగన్న బయటికెళ్ళి కనుచూపు దూరంలో వెంకటప్ప వస్తుండడం గమనించి, తిరిగి బాస్టియన్‌కు ఆ కబురు చెబుదామని వస్తుండగా, డేరాముందే నిలుచున్న పడాలు - శింగన్నను ఆపు జేసి—

'ఏయ్, శింగన్నా ! మాట!...నీవు మన్యంలో పుట్టి మన్యంలో పెరిగావని చెబుతున్నా. వీళ్ళు మన్యాన్ని, మన్యం జనాన్ని నాశనం చేయడానికి ఏవేవో కుతంత్రాలు పన్నుతున్నారు. ఆ కుతంత్రాలు నీ కొక్కడికే తెలుస్తాయ్. నీవుకూడా గత లాగరాయి పితూరీలో కన్న కొడుకును పోగొట్టుకున్నవాడివి. ఆ కుతంత్రాలు సాగనివ్వ కూడదు. ఏమైనా సాగుతూంటుంటే, నీవు తిన్నగా ధారుకొండపై నున్న సాధూచెవిలో పారేయ్ - చాలు. పుణ్యం చేసుకున్నవాడి వవుతావ్...'

ఆ మాంటలకు శింగన్న మురిసిపోయాడు.

'అవును మామా! వింటిని! ఆయనోరో రామావతారమంట!' అంటూ అంతలోనే కనుల నీరు నింపుకొని—

'పడాలు మాహూ! నేనూ యీ దొరల బాధలు భరించలేక పోతుంటిని. ఆ స్వామితో చెప్పుకొని కాస్త భారం దించుకుంటా నులే, పడాలూ!'

లోపల పిళ్ళె, బాస్టియన్‌ల శబ్దం పెరిగింది.

'ఉష్...ష్...ష్...ష్!' అంటూ పడాలు శింగన్నను ఆపు చేసాడు. లోపల పిళ్ళె, బాస్టియన్‌ల సంభాషణ వినబడుతోంది.

'సరిదా! ఎంతకూలిమనందా సొల్లినాయిచ్చేవి, రెండణాలేగా?'

'అంతే! అంతే! శిసల్లైన అరవనపించుకున్నావ్!'

మాటలు ఆగాయ్. నవ్వుకుంటూ ఇద్దరూ బయటకొచ్చారు. వాళ్ళు వచ్చేటప్పటికి బయట పెద్ద శబ్దంతో వచ్చిన గుర్రాలాగాయ్. మోదిగాని వొళ్ళంతా నెత్తురు కండై పోయింది. కండలువూడి, శరీరానికి మర్రివూడల్లా వ్రేలాడుతున్నాయ్. పోలీసులుతన్ని విప్పి, బాస్టియన్ కాళ్ళముందు పారేసారు. ఆ బీభత్స పూరితమైన దృశ్యం చూచి, శింగన్న, పడాలుల నాలుగు కళ్ళూ ఒక్కసారిగా వూపిరి బిగబెట్టి మూసుకున్నారు.

'ఇదుగో దొరా! జమాబందీ జరక్కుండా ఆపుచేయించాడు!' అన్నాడు - వెంకప్ప.

'లాకప్‌లో పారేయండి, వెధవని!' అంటూ హుంకరించాడు బాస్టియన్.

ఇక వాళ్ళకు దాక్షిణ్యం లేదు. దక్షయజ్ఞాన్ని ధ్వంసం చేయ డానికి శివుడు ప్రళయతాండవం చేసి, తన పదఘట్టనలచే వాళ్ళను చూర్ణం చేయగలిగినప్పుడు తప్ప, ఆ దుర్మార్గులు అంతంకారు.

అలా బాస్టియన్ ఆర్డరు వేసాడో, లేదో వెంటనే పోలీసులు మోదిగాడ్ని బరబరా యీడ్చుకుపోయారు. వాళ్ళకదో సరదా — ఎద్దుపుండు చూస్తే కాకికి కలిగే సరదా అది.

మోదిగాడ్ని లాక్కెళ్ళారు. ఇక ఎదుట పడాలు కనబడ్డాడు పడాలుపై విరుచుకుపడ్డాడు - బాస్టియన్ —

'సరే! పడాలూ, యిప్పుడు మన్యంలో అరణాలు కూలి యిస్తున్నారు. రోడ్డుపని కష్టం కాబట్టి మరో రెండు అణాలు అదనమని చెప్పు!' అని.

వెంకప్పకా కూలి రేటు ఆశ్చర్యం కలిగించి 'అదేంటంత కూలి సార్?' అని అడిగాడు.

'నీకు తెలీదులే! కూలీలు బాగుంటేనే మనం - సరే! వెళ్ళు పడాలూ! అందరినీ రప్పించి పని మొదలుపెట్టించు!'

'చిత్తం!' అంటూ పడాలు వెళ్ళిపోయాడు. కాని అతని హృదయం భారంగా వుండడంవల్ల, అతని బుర్ర ఆలోచనతో కొట్టుకుంటూండడంవల్ల అడుగులు తేలిపోతున్నాయ్.

పడాలు వెళ్ళగానే, సబ్ యిన్‌స్పెక్టరును, బాస్టియన్ చాటుగా పిలిచి, రెండువుత్తరాలు రాసిచ్చి, ఒకటి Dy. Sp గారికి, రెండోది R. D. O. గారికి పెద్దాపురంవెళ్ళి యిచ్చిరమ్మన్నాడు. కిమ్మనకుండా సబ్ యిన్‌స్పెక్టరు ఆ రెండు వుత్తరాలూ పుచ్చుకొని మోటారు సైకిలుపై వెళ్ళిపోయాడు.

అదంతా దుష్టవ్యూహం గాబట్టి, అలా సబ్ యినస్పెక్టరు వెళ్ళిపోయాక, మరి పిళ్ళె వాడికేం నూరిపోసాడో, వికటాట్టహాసంచేస్తూ వెంకప్పతో—

'వెంకప్పా! నీ వొట్ఠి Brain less fool వోయ్! ఆ-ఆ సాధూ ఎవడో తేల్చావా?'

పిళ్ళెకు సందు దొరికింది—

'ఈ మన్యం పైత్యకారులకేం తెరియుము సార్!'

'అహ్హహ్హహ్హా! బాగా చెప్పావ్ - పిళ్ళె!' అంటూ టేబిలుపైనున్న బ్రాందీ రెండు గుటకలేసి తూలుతూ, తెరఅవతలికి వెళ్ళిపోయాడు. మరల ఇంగ్లీషు ట్యూన్ వినబడుతోంది. మొద్దులాంటి ఆడమనిషి పదఘట్టనలు దభీ దభీమని వినబడుతున్నాయ్. హీనాతిహీన

మైన, అసహ్యాపూరితమైన, జుగుప్సాకరమైన చిందులు, బిర బిరలు ఆ గుడారాన్ని నింపివేసాయ్ - అక్కడ.

ఇక్కడ థార్ కొండపై పవిత్రమైన, స్వచ్ఛమైన ఆశ్రమంలో పరిశుద్ధమైన గోమాయతో అలికి స్వస్తికముగ్గు పెట్టబడిన పీటంపై పురుషోత్తముడైన శ్రీరామచంద్రుని విగ్రహంముందు, రాజు జప తపములు చేసివచ్చి,కాషాయాంబరధారియై రామాయణపఠనం చేస్తున్నాడు. ఆయనచుట్టూ గంటం, మల్లు దొరలు, ఎర్రేశు, గోవిందు, రత్తి కూర్చున్నారు. ఎదుట రాజు ప్రక్కనే కూర్చున్న తల్లి, పవిత్రాక్షతలు శ్రీరామచంద్రమూర్తి విగ్రహంపై జల్లుతోంది.

రాజు పారాయణ సాగిస్తున్నాడు—

'ఇవ్విధంబున తపోధనులైన మునిపుంగవులను తదాశ్రమ వాసులైన జడధారులను, యెల్లవిధంబుల యీ రాక్షసమూకలు, ఘోర హింసాకాండకు గురిజేయుచుండ నొక్కనాడు, విశ్వామిత్ర మహర్షి అయోధ్యాధీశుడైన దశరథమహారాజు కడకేగి, ఆ మహా రాజనుంగు పుత్రులైన రామలక్ష్మణులను రాక్షస సంహారార్థం తన వెంట పంపమని ఆదేశించ అమ్మహారాజు, మహర్షియాజ్ఞ కాదనలేక పుత్రులపై ప్రేమవీడలేక 'హా! రామా! రఘుకులశ్యామా!' యనుచు పుత్రమమకారంబున మూర్ఛనొంద...'

అని పారాయణ చేస్తుండగానే ప్రక్కనున్న తల్లి "బాబూ!" అని స్పృహతప్పి పడిపోయింది. వెంటనే రాజు శైత్యోపచారాలు చేయడం మొదలుపెట్టాడు. మిగిలినవారందరూ రాజుకు తోడ్పడ్డారు. కాస్సేపటికి, తల్లికి స్పృహ వచ్చింది-ఆమె కనులు తెరుస్తుండగానే, తన ముఖాన్ని ఆమె ముందుకు వంచి—

"ఏంటమ్మా - యిది?"

"బాబూ! నాకేదో అపశకునం పొడగట్టింది-బాబూ!"

"ఖంగారుపడకమ్మా! అసలు విషయం చెప్పమ్మా!"

"నీవిక్కడ చేస్తున్న పనులు చూస్తుంటే, నాకేమీ బోధపడ్డం లేదు బాబూ! ఎందుకు? ఎవరికోసం చేస్తున్నావో-నాకర్థం కావడం లేదు బాబూ!... నిన్ను ... నిన్ను...?"

ఆమె కనులవెంట రాలిన కన్నీటిబిందువులు తుడిచి—

"ఏం భయపడకమ్మా! మానవసేవే మాధవసేవ కదా, అమ్మా!" అంటూండగా, ప్రక్కనున్న గంటం కన్నులు చెమ్మగిల్లి—

"అవునమ్మా! రాజుగారిలాంటి మహానుభావులకు లోకమే కుటుంబం తల్లీ!" అంటూ జాలిగా ఆ తల్లివైపు చూచాడు.

బయట గిట్టల చప్పుడైంది. పడాలు గుర్రంపైన వచ్చాడు. పడాలును చూడగానే, ఎర్రోళు మోదిగాడి సంగతి అడిగాడు.

"బ్రతకడం అనుమానమే. నెత్తురు కాల్వకట్టింది. కండలూడి చిందరవందరై నేల దొర్లాడుతున్నాయ్ - కాని లాకప్‌లో పాకే పారు-దుష్టులు!" అన్నాడు. పడాలులో స్పష్టమై మార్పు తొణికిసలాడిందా ముఖంలో, కృష్ణపక్షంనుండి తొలిగి, తొలిసారిగా విజృంభించిన విదియచంద్ర రేఖలా.

కాని ఆ మాటలకు మల్లు మండిపోయాడు. రాజు ఒక్కసారిగా "హరహరా!" అంటూ కనులు మూసుకున్నాడు.

అప్పుడన్నాడు-పడాలు!

పడాలుకెందుకో రాజుగారిపై అభిమానం కలిగిపోయింది. ఆయనలో పడాలు యిప్పుడు మానవతను చూస్తున్నాడు. సౌమ్యపురాశుల్ని ఎగురబోస్తున్నాడు.

"స్వామీ!"

పలుకలేదు - రాజు

"స్వామీ!"

ఇప్పుడు 'ఆ!' అని త్రుళ్ళాడు - రాజు.

"ఊ! ఏమిటి చెప్పు! పడాలూ?"

"అర్ధరూపాయ కూలియిస్తామన్నారు!"

ఆ మాట వినగానే అంతా ఒక్కసారిగా ఆనందపరవశులై పోయారు. అలా ఎక్కువకాడానికి కారణం పడాలేనని వారి వుద్దేశం. అమాయకులు వారు. కసాయినన్నా నమ్మగలిగిన గొర్రెలు వారు. అంతా పడాలును ఆనందంతో చూస్తున్నారు.

రాజుమాత్రం ఒక్కసారి భ్రుకుటి ముకుళించి, ఓ క్షణానికి అడిగాడు—

"ఇందులో మోసముండి తీరాలి!" అని.

పడాలు తన హృదయాన్ని విప్పాడు. తెర తొలిగించి,కాదు-చింపివేసి, తన హృదయగహ్వారంలో భద్రంగానున్న రహస్యాన్ని రాజుకు విప్పిచెప్పాడు—

"అవును. స్వామీ! లోపలేదో గుసగుస లాడుకున్నారు - నా కప్పుడే అనుమానం తగిలింది."

"అమ్మ దొంగనాయాళ్ళూ!" అన్నాడు మల్లు.

"మల్లూ! అలోచనలేకుండా ఆవేశంలో ఏదేదో అనేస్తుంటావ్!" అని మందలించాడు-గంటం.

"సరే, కానియ్! యీ కంటి కీ రెప్పలు దూరం కావుగా, చూద్దాం పర్యవసానం. కోయలకు కష్టం, నష్టం కలుగకుండా కాపాడు - నీవూ ఒక కంట్రాక్టరువి గాబట్టి ఆ పని చేయగలవ్! తీసుకెళ్ళు! కూలీలను!" అనగానే పడాలు వొళ్లు ఝల్లుమంది.

వెంటనే రాజు కాళ్ళముందు భూమిచరిచాడు. గుప్పెడు మన్ను తీసి, సాలోచనగానున్న రాజుతో—

"రాజా! ఇక మీరాలోచించ నక్కరలేదు. ఇదిగో ప్రమాణం చేస్తున్నా! భూదేవితోడు, ఈ రోజునుండి, నేనూ మీవాడినే." అని, రాజు కళ్ళముందు ఆ మట్టి నలిపి రాల్చాడు.

ఆ రాలుస్తున్న మట్టి, తెరవెనుక పడాలు ఆయనపై కుంకుమ రాలుస్తున్నట్టుగా వుంది.

ఎందుకైనా మంచిదని గంటం - గోవిందు, రత్తి, ఎఱ్ఱేశు లను కూడా రోడ్డుపనికి వెళ్ళమన్నాడు.

పడాలుతో, గోవిందు, రత్తి, ఎఱ్ఱేశుకూడా వెళ్ళారు.

వాళ్ళలా వెళ్ళగానే శింగన్న దిగులుతో వచ్చి, రాజు కాళ్ళపై పడ్డాడు. రాజు వారందరికీ కల్పవృక్షమై పోయాడు.

"ఓ శింగన్నమామా!" అంటూ గంటం ముందు పలకరించాడు.

"ఎవరు?" అన్న ప్రశ్న రాజు నోటివెంట వస్తుండగానే గంటం చెప్పడం మొదలు పెట్టాడు —

"సరిగ్గా ఆరేండ్ల క్రితం మన ప్రక్క-గ్రామాల్లోనే లాగరాయి పితూరీ జరిగింది. అప్పుడు భూమికోసం తొలిసారిగా మన్యంలో పోరు జరిగింది. లాగరాయి వూరిపేరు. దీని నాయకుడు గరగండ మంగరాజు. బలేమనిషి ! పులిలాంటి మనిషి ! పొలం, పుట్రా అంతా మందేనన్నాడా రాజు!..." అనగానే - రాజు కనులు జేవురించాయి.

'ముందో పితూరీ జరిగిందా ?'

'ఒక్కటా ! అనేకం జరిగాయి. మొదటిది నలభై ఏళ్ళ క్రితం తెల్లోళ్ళపై మొట్టమొదటివాడుగా తిరగబడ్డాడు - ద్వారబంధాల చంద్రయ్య. చంద్రయ్యంటే హడలు. అతనివద్ద మాయ లనేక మున్నాయని మా మన్నెపోళ్ళంటారు. కాని మాయలు కావవి; మహేంద్రజాలాన్ని మరపించేటంతటి మహావిద్య-అది. మర్రిమొక్క నెత్తిన పెట్టుకుంటే చాలు. ఆ మనిషి రెండోమనిషికి కనబడేవాడు కాదు. అతను గడుమన్యం అగ్నికొండల్లో చాలా కాలం తిరిగాడు. పాషాణాన్ని కరిగించగలిగేవి, మనుషుల్ని మాయంచేసేవి - పులుల్ని చంపగలిగేవి, దేవతల్ని ప్రత్యక్షం చేసుకొనగలిగేవి, దెయ్యాలను పారద్రోలేవి - ఐన, ఒనేక ఓషధుల సంగతి ఆయనకు తెలుసు. ఆయనో భిషగ్వరుడు - ధన్వంతరీ అవతారం. అధర్వణ వేదాన్ని నూరుకొని తాగేసాడు. ఆయనొస్తుంటే, ఆయనేనని కూడా ఎవరూ నమ్మరు. అటువంటివాడు. సిద్ధసంకల్పుడు - ఒక్క

రోజు అడ్డతీగల పోలీసుస్టేషనువద్ద ఆయన దాడి చేస్తున్న సమయంలో తెల్లవాళ్ళు దొంగచాటుగా వచ్చి చుట్టుముట్టారు - ఆ మహావీరుడు మూడు రాత్రులూ, మూడు పగలూ నిద్రాహారాలులేకుండా, అసి ధారావ్రతుడై పోట్లాడాడు. శతృవుకు అదనపు బలాలు సరఫరా ఔతుండేవి-చంద్రయ్యకు లేదు. అలాగే పోరాడాడా మన్య వీరుడు - కట్టకడపటగా "టప టప టప" మంటూ ఒక మరఫిరంగి ప్రేలింది - అంతే చంద్రయ్యిక లేదు—"

అంటూ వుద్రేకంలో చెప్పుకుపోతున్న గంటాన్ని—

"సెభాష్!" అంటూ రాజు ఆపుచేసాడు. కాని గంటం ఆగ లేదు. ఆ వుద్రేకంలో, వుద్వేగంలో దడదడ లాడుతూపోయే రైలు బండిలా చెప్పుకుపోతున్నాడు—

"అంతేకాదు. రాజా! దాని తరువాత చంద్రయ్యను మర పించే మరో పితూరీ జరిగింది. ఇది కోయరాముడు పితూరీ అంటారు మా మన్యదొరలు. కోయ రాముడో వుద్దండుడు. ఒక చిచ్చుల పిడుగు. వాడ్ని పట్టుకోడం దొరతనానికి చేతనైంది కాదు. వాడి దంతా ఒక మోస్తరు. చూడడానికి ప్రేలుడుండేవాడు. పోటుపొడి చాడా - ఎర్ర తేలే. పెద్దతలకాయల్నే కొట్టేవాడు. చిన్న తలకాయ లకు పంచేవాడు. చాలామంది అనుకుంటారు - ఎవడ్నికొడితే ఏం? కొందరికి పంచుతున్నాడని - ఆ మాటకొస్తే ఎవడితలా కొట్టకుండా బ్రతికేవాడ్నొకడ్ని చూపించమంటారు - ఒక్కడ్ని కాదు. మన్యంలో వేల మందిని చూపించగలను ఆలా కోయరాముడు ఒకడ్నికొట్టి, పది మందికి దానం చేస్తోంటే, నిలదీసింది - మన్యం. అడిగింది - యీ ధన మెక్కడదని? పళ్ళు గిట్టకరిచి సమాధానం చెప్పేవాడు - కోయరాముడు - అతనికి ధనికులంటే అంత ద్వేషం. జనంలో సమర్ధన నశించింది. నిరుత్సాహపడ్డాడు. అతనికో దుర్వ్య సనముంది - తన వుంపుడుకత్తెకైతే ప్రాణంకూడా యిస్తాడు. అది కనిపెట్టారు - దొరలు! వెంటాడారా వుంపుడుకత్తెను - ఆనాడు

మధు మత్తతలో వుంపుడుకత్తెపై పొర్లుతున్నాడు - రాముడు. "ధనా"మని వచ్చి పట్టేసారు. కోర్టులో నిలబెట్టారు - ఆ కోర్టులో ఆ పట్టిన పోలీసుల ముఖాన్ని వుమ్ము పూసాడు, దొంగతనంగా, మోసంగా తన్ను పట్టుకున్నందుకు.

"లేకపోతే దొరకవా?" అన్నాడు - న్యాయాధికారి.

"చూడండొక్కసారి విడిచిపెట్టి!" అన్నాడు - రాముడు.

చెంగున లంఘించి, మెరసి, కేకవేసాడు - అంతే. ఆ కోర్టు గేటు అవతలున్నాడు - రెప్ప అరమోడ్పు కాలంలో మళ్ళీ వెంటనే వచ్చి ఖైదు చేసుకోమన్నాడు - న్యాయాధికారి హడలిపోయాడు - కోయరాముడ్ని, ద్వారబంధాల చంద్రయ్యనూ కన్న గడ్డిది - శత్రువుల గుండె దడ దడ కొట్టించగల వీరగడ్డిది—" అంటూండగానే -

రాజు మహోత్సాహంగా, గంటం భుజాలు నొక్కి—

'కాదు, గంటం! మన్యమే ఒక అగ్నిపర్వతం!' అని రాతుసి బొగ్గులాంటి తేజస్సుతో రాజనేటప్పటికి, మల్లు త్రుళ్ళి గుండెలపై "తూ! తూ!" అని వుమ్మేసుకోవలసి వచ్చింది.

గంటం ఆగలేదు.

'తర్వాత మరో అగ్నిపర్వతం పగిలింది - అదే లాగరాయి పితూరి—!' అనగానే—

శింగన్న కళ్ళు గిర్రున తిరిగాయ్.

'అవును సామీ! ఆ పర్వతం పగిలితే నా కొడుకు చచ్చిపోయాడు!' అంటూ 'ఖేర్'మని ఏడ్చాడు.

'చనిపోయాక?' రాజు ఆతృతగా అడిగాడు.

"నా ఆడది బెంగపెట్టుకొని మంచమెక్కేసింది. దానికోసం నా ఆరెకరాల పుట్రా యాభై దుడ్డుల కమ్మేసా. ఆ పేణం దక్కలేదు—అంతా ఐపోనాక యీ దొరదగ్గిర వెట్టి చేస్తుంటిని స్వామీ!"

రాజు కామాట కలచినట్టయింది "వెట్టి" అనగానే వొళ్లు ఝల్లు, మంది. ఇది ఆధునిక కాలం. అనగా అనేక కాలాల్ని -

బానిస కాలాన్నీ, భూస్వామిక కాలాన్నీ, బూర్జువా కాలాన్నీ అన్నింటినీ దాటుకుపోయి, మరోకాలంలో, ఆధునిక కాలంలో, స్వేచ్ఛ, సమత్వ విశృంఖల వీరవిహారం చేస్తున్న కాలంలో క్రెమ్లిన్ కోటపై విశ్వ విఖ్యాత కాంతుల వెదజల్లుతున్న ఎర్ర నక్షత్రం ప్రకాశిస్తున్న కాలంలో - నిలిచింది లోకం. ఇప్పుడు "వెట్టి!" పదం నిఘంటువుల్లోనే కనబడని రోజుల్లో రాజు "వెట్టి" మాట మొదటి సారిగా విన్నాడు—మరి ఆ మాట కలచివేయక ఏమౌతుంది ?

ఆశ్చర్యంగా అడిగాడు రాజు.

"ఎవరివద్ద?"

"బాస్టియన్ దగ్గిర స్వామీ ! వాడొట్టి కసాయి ముండా కొడుకు—నన్ను కొట్టి కొట్టి చంపుతుంటడు స్వామీ ! పీక పిసుక్కు చద్దామనిపిస్తది. మిమ్మల్నీ ఏదో చేద్దామని కావాసు - వుత్త రాలపై వుత్తరాలు పెద్ద దొరలకి రాసి పంపిండు !"

తల్లి మధ్యకు చటుక్కునొచ్చి—

"నా బాబుమీదే ?"

రాజు ఏదో పరధ్యానంనుండి కోలుకొని—

"అదేంటమ్మా ! వేడినీళ్ళకు కొంప లంటుకుంటాయా ?"

"అలా అనకండి స్వామీ! వాడొట్టి కుయుక్తులోడు - వాడంటే నా కొల్లు వొణికిపోతది. స్వామీ !"

"ఫర్వాలేదు - శింగన్నా! నీవిక్కడ పని చేయడంవల్ల మన్యా నికి బాగు శింగన్నా !"

"ఏం బాగో స్వామీ ! చచ్చిపోతున్నా, చచ్చిపోదును కాని వాడిదెబ్బ లోర్చుకోలేను స్వామీ !"

మల్లుకు కోపమొచ్చింది—

'ఆ దొంగనాయాళ్ళ దగ్గర పనిచేసేకంటే నీవన్నట్టు చస్తేనే మంచిది."

"నూరేళ్ళు బ్రతుకు మామా !"

"మల్లూ!" గంటం వురిమాడు.

"లేదు. శింగన్నా! మన్యం బాగుకోరితే నీ వక్కడే పని చేయాలి! వెళ్లు నీవిక్కడ కొచ్చినట్లు నరుడన్నవాడికి తెలియ కూడదు!— గంటం! మల్లుతో నీవుకూడ వెళ్ళు. రోడ్డుపని ఎలా జరుగుతోందో చూచిరావడం మంచిది!"

రాజు మాటంటే వాళ్ళకు సుగ్రీవాజ్ఞ. మారు మాటడకుండా ముగ్గురూ వెళ్ళిపోయారు.

వాళ్ళలా వెళ్ళగానే తల్లి నారాయణమ్మగారిలో ఏవేవో విచార తరంగాలు లేచాయి. గబగబా రాముని విగ్రహం ముందుకు వెళ్ళి, మోకాళ్ళపై దిగజారి—

"రామచంద్రప్రభూ! నా బాబును రక్షించు తండ్రీ!" అంటూ ప్రార్థించింది.

ఈ ప్రార్థనపై రాజుకు దృష్టి లేనే లేదు. అతని దృష్టల్లా శింగన్నపై కేంద్రీకరించబడింది. పడాలు తనలో కలిసానని అంతకు ముందే అన్న మాటలు కూడా అతని బుర్రలోనుండి చెరిగిపోయాయ్. గంటం, మల్లు, గోవిందు, ఎర్రేశులు తన వుద్యమంలోకి వచ్చిన సంగతికూడా అతనిలో పాతబడిపోయింవె. పాతబడిపోవడమే కాదు. ఆ ఘటనలన్నీ ఒక వుద్యమస్వరూపానికి సమీపంలోకి మాత్రం వచ్చాయి. కాని శింగన్న బాస్టియన్‌వద్ద నౌఖరీ చేస్తున్నాడు. తన వుద్యమానికి పరమశత్రువువద్ద పని. అంచేత వుద్యమాన్ని అణచ డానికి ఆ దుష్టుడు పన్నే దుష్టవ్యూహం ఎప్పటికప్పుడు తనకు అంది పోతుంది. వుద్యమాన్ని రక్షించుకోవచ్చు. అటువంటి రక్షకుడు— శింగన్న! ఆ భావనలో ఎంతో ఆనందపడిపోయాడు - రాజు.

ఆ ఆనందంలో "అమ్మా!" అన్నాడు.

విచారంలో "బాబూ!" అని జవాబిచ్చింది - తల్లి.

ప్రపంచంలో ఒకరు ఆనందిస్తూంటే ఒకరు విచారిస్తుంటారు. ఒకరి విచారంలోనే మరొకరి ఆనందం యిమిడి వుంటుంది. కావి, యీ తల్లీ బిడ్డల మధ్యనున్న ఆనందవిచారాల కాసామ్యం బద్ధ నిరుద్ధం, అంతే.

# 14

ఏవో కొన్ని భారమైన ధ్వనులు వినబడుతున్నాయ్. ఆ ధ్వనుల్లో ప్రపంచమే ప్రసవిస్తున్నట్లు కనబడుతోంది. పుడమితల్లి పురుడు నొప్పులు పడుతున్నప్పుడు కలిగే బాధలో వస్తున్నట్టున్నాయ్ - ఆ ధ్వనులు ! మహాపారావార పరీతమైన సమస్త ధరామండలాన్ని మోసి, మోసి భుజం సల్పి, ఆదిశేషుడు ఒక్క నిట్టూర్పు విడిచి, రెండో భుజంపైకి సర్దుకున్నప్పుడు వెలువడిన ధ్వనుల్లా కూడా వినిపిస్తున్నాయ్.

ఆ ధ్వనుల్లోంచే 'ఓం'కారం ప్రభవించిందనుకుంటాను. ఆ ధ్వనుల్లోంచే స్వర్గం ఆవిర్భవించివుంటుం దనుకుంటాను. లేకపోతే, ఆ నిశ్వాసన ధ్వనుల్లో అంత భారం, అంత బాధా ఎందుకు ప్రస్ఫుటించాలి ! అయినందువల్లనే అంత బాధ, భారం ప్రస్ఫుటమౌతున్నాయ్.

నిజానికి ఆ ధ్వనులు, ఆదిశేషునివి కావు. పుడమితల్లివీ కాదు. ఎవరైతే తమ స్వేదంతో భూతలాన్ని స్వర్గంగా, మానవుని దేవతగా, మట్టిని బంగారంగా మార్చేస్తున్నారో - ఆ కర్మజీవులవా ధ్వనులు !

ఆ ధ్వనులు వెలువడుతున్న ప్రాంతం, ఇరుకైన కొండల వరుసలలో, మెలికలు దిరిగిన పాములాంటి బాటనుండి వస్తున్నాయ్. ఆ పాములాంటి బాటపైనే వందలాది కష్టజీవులు దొరలకు రోడ్డు వేసి పెడుతున్నారు ఇంకా వందలాది కూలీలు నల్లరాతితో కూడిన కొండలను త్రవ్వుతూంటే, కణేల్ కణేల్ మంటున్నాయ్. వారి శరీరంపైని పోసిన ముచ్చెమటలపై సూర్యకిరణాలు పడి తుళ్ళుతున్నాయ్. ఆశ్చర్యమేమిటంటే, మధ్యమధ్య కుక్కగొడుగుల్లా ఎర్రటి టోపీలు పెట్టుకొని, యమకింకరుల్లా నిలబడి పహారా యిస్తూ పనిచేయిస్తున్నారు.

ఇంకాస్త ముందు ఓ కొండశిఖరం వుంది. ఆ కొండశిఖరం అప్పటికే పూర్తిగా కూల్చబడి కాస్త ఎత్తుగామాత్రం వుంది. ఆ

ఎత్తుకు ఇటు పల్లం, అటు పల్ల. ఇటు పల్లంనుండి మెరకకు కొందరు కూలీలు ఇనుపరోలరు లాగుతున్నారు. ఆ లాగుతున్న ముందువరున కూలీల్లో రత్తి గోవిందులున్నారు.

అంతటి బాధను, కష్టాన్ని, భారాన్ని బ్రతుకుకోసం వారు చేస్తున్న ఆ సాహసకార్యాన్ని మరచిపోవుటకు గాను, గోవిందు పదం అందుకున్నాడు - మిగతా వెనుకనున్న వారంతా "ఐలాసా" అంటూ వూతపదం మాత్రం వల్లిస్తున్నారు.

"లాగోయ్ - బ్రతుకు!
ఐలాసా!
బ్రతుకూ - భారం
ఐలాసా!
గతుకుల బ్రతుకూ!
ఐలాసా!
మెతుకుల కోసం!
ఐలాసా!
రావయ్యా రామయ్యా
ఐలాసా!
కొండదిగి రావయ్యా
ఐలాసా!
బ్రతుకూ - భారం
ఐలాసా!
చూడ దిగి రావయ్యా
ఐలాసా!"

అంటూ ముందుకు కొండపై ఎత్తుకు లాగుతున్నారు. అది చాలా ప్రమాదమైన స్థలం. తాడు తెగినా, భారానికి ఎవరైనా తాడు వొదిలినా పాలోమంటూ ఆ రోలరు దొర్లిపోతుంది. ఆ పల్లంలో వేల కొలది పని చేస్తున్నారు. అందులోనూ బాటపైనున్న

రోలరు; క్రింద బాటపైనే పని చేస్తున్న జనం. ఇంకేముంది - ప్రమాదం జరిగిందా - మనుషులే ఎగిరిపోతారు. రోలరు మెరక ఎక్కలేక పోతోంది.

'ఐలాసా!' అని ఒక్కసారి అంతా వూపిరి బంధించి మరీ ముందుకు లాగారు—

ఉ! హు! లాభం లేదు. కదిలేవాటం లేదు. అది కదలక పోయినా పరవాలేదు. కదలి ఎప్పుడైతే ముందుకు వెళ్ళలేదో - అది ఎక్కడ నుండైతే బయలుదేరిందో, సరిగా ఆ పల్లానికే చేరి పోతుంది - అటువంటి స్థానంలో దాన్ని నిలబెట్టడమే - ఓ పెద్ద గండం. నిలబెట్టారు. ఆ నిలబెట్టడమంతా ఆ కూలీల కండబలంతోనే జరిగింది.

ఆ బాధనూ, భారాన్నీ పోలీసులేం గుర్తించగలరు? - పరాన్న భుక్కులు వాళ్ళు. కాని అసలు విషాదమేఁటంటే, కూలీలే ప్రత్యే కంగా పనిగట్టుకొని, పని ఆపుచేసినట్టు భావించారు - పోలీసులు.

అలా ఎప్పుడైతే భావించారో, అప్పుడే ఒక పోలీసు—

'ఊ! లాగండి!' అంటూ చెళ్లున గోవిందు వీపుపై కొట్టాడు. తడిం చూచుకుంటే అప్పటికప్పుడే పెద్ద తట్టు తేలిపోయింది. హడలి పోయాడు - గోవిందు. ఆ బాధ భరించలేకపోయాడు. ఆతనికి తెలియకుండానే, గోవిందుతన పట్టు విడిచిపెట్టేసాడు.

'గోవిందూ!' అంటూ త్రాడువొదిలి, రత్తి గోవిందు చెంత నుండి పోయింది.

ఎత్తుకు ఎక్కించడమంటే కష్టంగాని, పల్లానికి దొర్లిపోవడాని కెంతసైము కావాలి? అందుకే పెద్దలన్నారు. ఒక మనిషి కీర్తి ప్రతిష్టలు తెచ్చుకోవడమంటే, కొండపైకి బండరాతిని ఎక్కించడం వంటిదని - పతనం కావడం బహు తేలికని. కొండపై బండ రాతిని చిటికెన వ్రేలుతో కదిపితే చాలు, అధఃపతన మౌతుందని.

ఆ రోలరు అలా పల్లానికి దడదడలాడుతూ దొర్లిపోయింది. క్రిందనున్న కూలీల్లో హాహాకారాలు బయలుదేరాయి. రెప్పపాటు జాగైనా చేయకుండా, ఆక్రందనాలతో ప్రక్కలకు తొలగి పోతున్నారు. కలకలం మితిమీరి పోయింది. ఆ రోలరును ఆపి, ప్రమాదాన్నుండి కాపాడబడ్డానికి కూలీలు ప్రయత్నం చేసారు. గునపాలు అడ్డంగా పెట్టారు. పతనం కావాలిగాని పతనమయిందా? ఆపడం ఎవ్వడితరం? ఆఖరికి శ్రీమహాలక్ష్మి బంగారుకొండై ఎదురువెళ్ళినా పిండి పిండై పోతుంది. ఎందుకంటే ఆ పతనంలోనే శనిగాడు దాక్కొనివుంటాడు. వాడు ఆ పతనం కళ్ళు కప్పేస్తాడు.

అలాగే, రోలరును అడ్డగించడానికి గునపాలు అడ్డుపెడుతున్న కూలీలను,

'మీ పనులు మీరు చేయండ'ని పోలీసులు, శనిగాళ్ళలా కొట్టడం మొదలుపెట్టారు.

ఒక వైపు దెబ్బలు. ఆ దెబ్బలనుండి రక్షించుకోవాలనుకుంటే, స్థానాలు విడిచిపెట్టకూడదు. విడిచిపెట్టకపోతే, మహాప్రళయంలా రోలరు మీద పడిపోడానికి దొర్లుకొచ్చేస్తోంది.

ఆ రోలరు మరీ విసురుగా దొర్లిపోతోంది.

ఆ దృశ్యాన్ని ఓ గుట్టపైనుండి చూచిన పడాలు—

'తప్పుకోండి! తప్పుకోండి!' అని అరిచాడు. అప్పటికే పొద్దు పోయింది.

జనం తప్పుకోడం. తప్పుకొని బట్వాడాకోసం, ఓ గుడారం ముందు వికటాట్టహాసంచేస్తున్న బాస్టియన్ ముందుకు రావడం కూడా జరిగిపోయింది.

కూలీలంతా కూలి అడిగారు. బాస్టియన్ పిళ్ళకు లెఖ్ఖలు తేల్చి, కూలి పంపక బాధ్యత అప్పగించాడు. ఆ అప్పగించడంలో కొన్ని వారికీ వారికీ మధ్య సాంకేతాలు. వారి చూపుల్లో నడిచాయ్.

అలా బాస్టియన్ బాధ్యత అప్పగించడమే తడవుగా అప్పటికి లెఖ్కలన్నీ తేల్చి వుంచిన, పిళ్ళె—

'తేల్చేసే వుంచా సార్ !' అన్నాడు.

'అయితే యిచ్చెయ్ - కూలి!' అంటూ బాస్టియన్ లేచి, ఓ ప్రక్క కెళ్ళి, వెనక్కి తిరిగి నుంచొని, పైపు పీలుస్తున్నాడు.

తను ఒకడికి బానిసైతే, ఆ బానిసకు మరొకడు బానిస కావలసి వస్తాదని - సామెత.

సరిగ్గా అలాగే జరిగింది. బాస్టియన్ తనకు ఆర్డరువేస్తే తను, పడాలుకు ఆర్డరువేసాడు. పడాలు 'వూ' కొట్టాడు. పిళ్ళె గుడారంలోనికెళ్ళి, డబ్బుసంచి తెచ్చి యిచ్చాడు. ఆ సంచి చూడగానే పడాలుకు అనుమానం తగిలింది.

సంచి చూస్తే తేలిగ్గా వుంది. పంచవలసిన కూలీలుచూస్తే వేలకొలదీ వున్నారు. వెంటనే పిళ్ళెను అడిగాడు—

'ఈ డబ్బు ఎందరి కూలి?' అని.

'అందరిదీనూ!' అన్నాడు - పిళ్ళె.

'ఎలాగు లెక్క కట్టేరు?'

'రెండణాలు!'

'ఘోరం !'

'ఎన్నడా ! ఘోరం ! కూలి నిర్ణయం కాకుండా రాముని పొల్లితిరే యీ నాయీలు, యీళ్ళది ఘోరంకాదే ?'

ప్రక్కనేవున్న గోవిందు, ఆ మాటలు భరించలేకపోయాడు. అనేసాడు—

'మా రెక్కలకష్టం అడగడం ఘోరం ఏంటి దొరా ?'

బాస్టియన్ చరుగ్గిన వెనక్కి తిరిగాడు—

'ఊ ! పిళ్ళె ! యీ కుట్రకు కారకులు వీళ్ళే అని తేలిపోయింది—

ఊ ! చెట్లకు కట్టు వెధవల్ని ! మిగతావాళ్ళకు కూలి పంచు!"
అని చిందులు త్రొక్కాడు.

'మా కక్కరలేదు—జేడ!' అంటూ రత్తి వెంటనే ధిక్కరించింది.

'ఆ ! తలపొగరు! దీన్నికూడా ఆ చెట్టుకు కట్టండి!' అంటూ రత్తి జుట్టు పట్టుకుని పోలీసుల ముందుకు విసిరేసాడు.

అంతే. ముగ్గురినీ పోలీసులు లాక్కెళ్ళారు, జనంలో అలజడి బయలుదేరింది. అలజడే వుద్యమానికి నాంది.

ఆ అలజడే చెలరేగింది. రత్తిని పిళ్ళె, కెవ్వు కెవ్వున అరుస్తున్నా, లక్ష్యపెట్టకుండా లాక్కెడుతున్నాడు. అవతల పోలీసులు గోవిందు, పడాలులను చెట్లకు కట్టి - మరీ కొడుతున్నారు.

రత్తిని పిళ్ళె ఓ చెట్టుకుకట్టి, ఆమె పైట చర్రున లాగాడు - వాడికి తెలియదు - తెలుగు స్త్రీ ఎలనాగ కన్య - అని. పగ పట్టిందా-మళ్లోకాల్లోనున్న పగవాడిని తరమి తరమి మరీ కాటువేస్తుందని. చర్రున లాగిన పైట ప్రక్కనేవున్న పుట్టపై విసిరాడు. అది పాముల పుట్టని వాడికి తెలీదు. ఆ మైలగాలికి, బుసలుకొడుతూ మూడుతలల నాగేంద్రం పడగ విప్పుకుంటూ పైకి వచ్చింది. 'దొరోయ్!' అంటూ బాస్టియన్‌వద్దకు పరుగెత్తాడు - పిళ్ళె ! బాస్టియన్ వెంటనే తన పిస్టలుతో కాల్చివేసాడు. ఎత్తిన పడగ ఎత్తినట్టే వుంది. నాగేంద్రం చచ్చిపోయింది. చచ్చిపోయినా, ఆ ఎత్తివున్న పడగ ఎప్పటికైనా కాటెయ్యొచ్చు - ఆ దుష్టుడ్ని.

వెంటనే, జనంపై విరుచుకుపడ్డాడు. ప్రభువే విరుచుకుపడితే, సేవకులు ఆగుతారా? వాళ్ళూ విరుచుకుపడ్డారు. జనాన్ని చితుక బాదడం మొదలుపెట్టారు పోలీసుల లాఠీలు స్వైరవిహారంచేసాయి. పిళ్ళె కొందరిని గుడారంలోకి యీడ్చుకుపోయి, మర్మస్థానాల్లో కొట్టి మరీ హింసిస్తున్నాడు.

ఈ దుర్మార్గం చూచి సహించలేకపోయాడు - శింగన్న. ఆ వార్త వెంటనే రాజుగారి కందివ్వడంకంటే పరమార్థ మింకొకటి

లేదనుకున్నాడు. దుష్టుల కళ్ళబడకుండా, చాటుమార్గాన అక్కడ నుండి అదృశ్యమైపోయాడు.

జనం భీకభీకలైపోయి, పరుగెత్తుకుపోయారు. దొరికిన వాళ్ళను మాత్రం పోలీసులు వొదిలిపెట్టకుండా బాదుతున్నారు.

ఆ ఘోర హింసాకాండకు అదిరిపోయిన శింగన్న—

'రాజా! రాజా!' అంటూ గావుకేకలు వేసుకుంటూ, కొండలను చీల్చుకుంటూ వచ్చేస్తున్నాడు. అతని కేకలకు, పర్వతాలు ప్రతి ధ్వనిస్తున్నాయ్. శింగన్నకు ఆ కొండలుకూడా సహాయం చేస్తున్నాయ్. శింగన్న అలసిపోయి - 'రాజా!' అని ఒక్క కేక వేస్తే, ఆ కేకకు మరల సానుభూతి సహకారంగా - 'రాజా!' అంటూ ఆ కొండలు మరొక్కసారి పిలుస్తున్నాయ్. మనుష్యులకు లేని ధర్మబుద్ధి ఆ నోరు, వాయీ లేని కొండల్లో మూర్తీభవించి వుంది.

ఆ కేకలకు అదిరి, క్రిష్ణదేవుపేట నీలకంఠేశ్వరాలయంలోని గంటలు కూడా గణ గణ మ్రోగుతున్నాయ్. ఆ మ్రోతలకు పరమేశ్వరునికి కర్పూర నీరాంజనమిస్తున్న తల్లిచేతిలో హారతి పళ్ళెం క్రిందపడింది. రాజు ఆశ్చర్యంగా శివునివైపు చూసాడు.

అతని చిత్త మదిరింది. శివుని పాదాలు గట్టిగా పట్టి, ప్రార్థించాడు.

'దేవతలకోసం, కాలకూట విషాన్నే కంఠాన్ని నిలిపిన గరళ కంఠా! నా ప్రజలకోసం ఒక్క నీ చల్లనిచూపు ప్రసరించవ్? నా ప్రజలకేమీ అన్యాయం జరక్కుండా కాపాడవ్? వాళ్లు నా రక్తంలో రక్తం! వారికోసం నా శిరస్సైనా త్రుంచి, పుష్పంగా నీకు సమర్పించుకుంటా!'

ఆ మాటలకు మరీ అదిరిపోయింది - తల్లి! ఆమెకు తెలుసు - రాజు త్రికరణం. ఆయన శిరస్సునే కాదు. గుండె దొలిచి, ఆ హృదయాన్ని కోసి యివ్వమంటే యివ్వగల సమర్థుడు. అంతటి త్యాగి. అంతకుమించిన సాహసుడు.

ఇంతలోకే శింగన్న కేకలు వినబడ్డాయ్ - రాజు గబగబా బయటికొచ్చాడు. రాజు అలా బయటకు వెళ్ళగానే తల్లి శివుని ముందు వాలి, తన బాబు మంచిని కోరుకుంది.

రాజు బయటకొచ్చాడు గాని, శింగన్న కనబడలేదు. గుడిలో గంటలు మ్రోగుతూనే వున్నాయ్. ఆ గంటలు ఎందుకంత ఆరాట పడుతున్నాయో ఎవ్వరికీ అర్థంకాదు. అవి పరమేశ్వరుని జేగంటలు. ఆ ఆరాటంలో ఏదో బాధ వుండితీరాలి.

ఆ ఆరాటాన్ని ప్రశాంతంగా మార్చాలి. మరల రాజు, గర్భ గుడిలోకి వచ్చి, రెండుచేతులూ పైకెత్తి, అరమోడ్పు కన్నులతో ప్రశాంతంగా రెండుసార్లు జపించాడు—

'సర్వేజనాః సుఖినోభవంతు!' అని.

'రాజా!' అంటూ శింగన్నవచ్చి రాజు కాళ్ళపై బడ్డాడు. గంటలన్నీ ఆగాయ్. శింగన్నను అడిగాడు - రాజు - ఏం జరిగిందని-

శింగన్న వెంటనే చెప్పలేకపోయాడు. పరుగెత్తుకొని రావ డంలో గుండె అదిరి ఇంకా కొట్టుకుంటూనే వుంది. ఇంతలో బయ టకు ఆర్తనాదాలతో వందలాది ప్రజలు, ఏ రక్తపుటేరుల్లోనో మునిగి వచ్చినట్లు వచ్చి నిలబడ్డారు. దేవాలయ ప్రాంగణంలోకి రాజు వచ్చాడు, చూచాడు.

ఇంకా రక్తసిక్తులైన ప్రజలు వస్తూనేవున్నారు. కాని వచ్చిన వారి నెత్తురే చూచి, ఒక్కసారిగా కండ్లు మూసుకున్నాడు.

'ఇవి స్వామీ! పొద్దల్లా పనిచేసినందుక్కు ముట్టిన బట్వాడా!' అన్నారు - ఆ వచ్చిన జనం.

'పడాలు, గోవిందు, రత్తిలను చెట్లకుకట్టి, మరీకొడుతున్నారు- స్వామీ!' అన్నాడు - శింగన్న. ఆ అనడంలో అతని ప్రాణమం కోసుకుపోయింది.

అంతకంటే కోసుకుపోయింది - రాజుకు. 'అమ్మా!' అని కణ తలు పట్టుకున్నాడు. వెనుకనేవున్న తల్లి 'బాబూ!' అని పట్టుకుంది.

'చూసావా, అమ్మా! యీ కూలీలు చేసిన నేరమేంటి? రెక్కలకష్టం ధారోయడమే నేరమా, అమ్మా! ఇంతకంటే దుర్మార్గం లోకంలో యింకొకటుంటుందంటావా? కనులున్నవాడు చూస్తూ వూరుకోగలడంటావా - అమ్మా!'

ఆ మాటలు తల్లిలో చలనం కలిగించాయ్. ఆమె కా భాష అర్థం కాకపోవచ్చు. కాని ఆమెలో మాతృత్వం వుంది. అది వుంటే చాలు భాషకన్నా భావానికి ప్రాధాన్యత నిస్తుంది. మేకపిల్ల 'మే' అని అరిస్తే పాలకోసం బిడ్డ ఏడుస్తున్నదని ఎంతదూరమున్నా తల్లి గుర్తించి పరుగెత్తుకొచ్చి, ఆ పిల్లకు తన పొదుగు అప్పగిస్తుంది. ఆ మేకపిల్ల 'పాల'ని అడగక్కరలేదు. దాని భావమే అది. దానికి భాషక్కరలేదు. అందుకే పెద్ద పెద్ద మహాపండితు లనుకున్నవారు భాషకే ప్రాధాన్యతిచ్చే ప్రకర్షులు - నుంచాలు పట్టేసారు. కునుకు తున్న దీపాన్ని చూస్తూ, రోజుల్ని లెక్కిస్తూ, భావానికి ప్రాధాన్య తిచ్చే రసహృదయులైన కవులు మాత్రం దినదిన ప్రవర్ధమాన మవుతూ, మహోత్తుంగ హిమన్నగశిఖరాల్ని తాకుతున్నారు.

నారాయణమ్మగార్కి మానవత్వానికి పునాది అయిన మాతృత్వం వుంది కాబట్టి ఆమెహృదయం కరిగింది. ఆమె మాతృత్వం తన ఒక్కబిడ్డని ప్రేమనుండి అనేకమంది బిడ్డల ప్రేమ మీదికి విస్తరిల్లింది. ఏమీ అనలేకపోయింది. రాజును వెనక్కి లాగలేకపోయింది.

అంతలోనే పెద్ద శబ్దంతో ఆ దేవళ ప్రాంగణంలోనున్న రక్తసిక్తులైన ప్రజలను చీల్చుకుంటూ ఓ మోటారుసైకిలు వచ్చింది. దాన్ని వెన్నంటే, మరో జీపు జనాన్ని ఢీకొంది. జనం చెదిరి పోయారు. హడలిపోయారు. రాజుకు ఆ పోలీసు ఆఫీసర్ల నిరంకుశత్వం చూడగానే ఆవేశం అతిశయిల్లింది. ధైర్యంగా తన్ను పట్టుకున్న తల్లిని ప్రక్కకు తప్పించి, మహోగ్రమూర్తిలా ముందుకొచ్చి నిలిచాడు.

కయ్యానికి కాలుదువ్వే కుర్రగేదెలానిల్చిన కరకు తురక డిప్యూటీ కలక్టరు ఫజులుల్లాఖాన్ రాజునుచూచి - ప్రశ్నించాడు.

'నీవేనా మన్యంజనాన్ని రెచ్చగొడుతున్నది?'

'అదుగో, ఆ జనాన్ని అడుగు!'

'అవునా, కాదా? తిన్నగా ప్రశ్నకు జవాబు చెప్పు!'

"కాదు! మీరే. వాళ్ళ నెత్తురు రోడ్లపై పోయించుకొని కూలి ఎగ్గొటి పైగా చర్మాలు చిట్లేలా చావగొట్టి, రెచ్చగొటింది-మీరు."

ప్రక్కనున్న బాస్టియన్ కస్సుమంటూ—

'పంచాయితీలు పెట్టుకోమని ప్రోత్సహించింది - నీవుకదూ?'

ఇటు పంచాయితీల విషయంపైకి దృష్టి మళ్ళించకపోతే, తనకే ప్రమాదమన్న సంగతి గుర్తించే బాస్టియన్ అలా ప్రశ్నించాడు. లేకపోతే అసలారోడ్డు కంట్రాక్టులో వాడి మోసమంతా బయట పడుండేది.

కాని తొణక్కుండా రాజు జవాబు చెపాడ్పు.

'అవును! మంచి చెప్పడం తప్పుకాదు! అందులోనూ సత్యాన్ని చెప్పడం అసలే తప్పుకాదు. భూమి గుండ్రంగా వుందని చెప్పినట్లు, పంచాయితీలు పెట్టుకోమని యీనాడు ప్రత్యేకంగా ఎవ్వరికీ చెప్ప నక్కరలేదు. ఐదువేలేండ్ల క్రిందట రామరాజ్యంలోనే వున్నాయ్ - పంచాయితీలు!"

వొల్లు మండింది - Dy, spకి. Dy. sp ఒక తెల్లవాడు - పేరు. 'Swine' వుక్రోషంతో—

"అయితే రాముడు మద్యం నిషేధించమన్నాడా?"

"లేదే. త్రాగి కైపెక్కిన రాక్షసుల్ని మర్దించమన్నాడు!"

దాంతో వాడి నోరు బందయింది. పిళ్ళె ఒత్తు ఎగదోశాడు—

"రిజర్వు అడవులన్నీ కొట్టించేస్తున్నారు సార్!" అని.

రాజు నవ్వాడు—

"మీరు పెంచని అడవులను రిజర్వు చేయడానికి మీకు అధికారంలేదు కాబట్టి."

'ఈయనవల్ల జమాబందీ ఖర్చులుకూడా వసూలు కాలేదుసార్!'

మన్యంలో జరుగుతున్న వన్నింటికి రాజునే బాధ్యునిచేసి మాట్లాడుతున్నారు-ఆ దుష్టులు. అయినా రాజు వుదారుడు. ప్రజల విషయమైనప్పుడు ఎంతటి భారాన్నయినా మోయడానికి సంసిద్ధుడు-కాని పిళ్ళ మాటలకు వుగ్రుడై—

"ఆపుచెయ్!" అని వురిమాడు.

వెంటనే ఫజులుల్లాఖాన్ అందుకున్నాడు—

"ఆపుచేయడానికే వచ్చాం!" అంటూ పక్కనున్న సబ్ యినస్పెక్టరును చూచి "S. I. - వెయ్ - బేడీలు!" అని ఆజ్ఞాపించాడు.

ఎప్పుడైతే "వెయ్" అన్నాడో జనంలో గగ్గోలు బయలుదేరింది. సబ్‌యినస్పెక్టరు రాజు చేతికి బేడీలు వేయడానికి ముందుకొచ్చాడు. మల్లు అగ్గిమీద గుగ్గిలమైపోయాడు—

"ఎలా వేస్తారో వేయండి!" అంటూ మీదికెళ్ళాడు.

"వీడెవడు?" అడిగాడు Dy. sp.

ఒక త్రాగుబోతు! బాస్టియన్ చెప్పాడు.

గంటంకు కోపమొచ్చింది—

"నోరు సంబాళించుకోండి!" అని హెచ్చరించాడు.

ఫజులుల్లాఖాను అధికార అహాన్కి. అదో పెద్దదెబ్బలా తోచింది.

"జాగ్రత్త! రవిగ్రుంకని బ్రిటిషుసామ్రాజ్యాన్ని ధిక్కరించడం అషామాషీ కాదు!"

'రవిని మ్రింగే పడమటి కొండలను కాదనడంకూడా భ్రమే-జాగర్త' అని రాజనగానే, పెద్దహంగామా చేసాడు - ఫజులుల్లాఖాన్. త్రాగిన కోతిలా శివంత్రొక్కాడు. వెంటనే పశుబలం రాజుకు బేడీలు వేసింది. రాజు వుద్రేకులైన ప్రజలను వారించాడు. బేడీలు వేసిన రాజును కారులో ఎక్కించడానికి ముందుకు లాగగానే, ఆ తల్లి నారాయణమ్మగారు. ఆ కసాయిసాహేబు కాళ్ళపై బడింది.

'నా బాబును క్షమించండి: ఒకరికి అన్యాయం తలపెట్టి ఎరుగని నా బాబును వొదిలిపెట్టండి : బిడ్డను తల్లినుండి దూరంచేయకండి: నా బాబు లేకుండా నేనోక్షణంకూడ బ్రితకలేను. కనికరించండి;' అని బ్రతిమాలుకుంది. కాళ్ళు పట్టుకొంది.

వెనుక విన్నాం. వసుదేవుడు గాడిదకాళ్ళు పట్టుకున్నాడని. ఆ గాడిద వసుదేవుని మొరాలకించి, అరవడం మానేసిందని. కాని వీళ్ళు గాడిదలు కాదు - గాడిదలకన్నా కనాకనిష్టమైన మరోతరగతి. అందుకే ఆ తల్లి మొర లెక్కచేయలేదు. రాజును కారులో ఎక్కించారు. కారు 'బుర్' మంటూ వెళ్ళిపోయింది. ఆ తల్లి 'బాబూ;' అంటూ రెండడుగులు ముందుకేసి సొమ్మసిల్లి పడిపోయింది.

'అమ్మా!' అంటూ శింగన్న ఆ మాతృమూర్తిని లేవదీయడానికి కూడా వెళ్ళాడు. ఆ తల్లి యిక ఒకరిసహాయాన్ని అపేక్షించలేక; కన్నకొడుకుపై మమతకొలదీ; కిరాతకుని వలలో చిక్కుకుపోగా, తల్లడిల్లిన తల్లిపక్షిలా రెపరెపలాడుతూ కొట్టుకుంది. ఆమెను పట్టుకున్న వారిపట్టు విడిపించుకుంటూ—

'నన్ను వొదలండి! నా బాబును విడిపించుకోనివ్వండి; నన్ను వొదలండి!' అంటూ లేచి, ఆవేదనతో ముందుకు పరుగెత్తింది

ఆ బాధను అర్థంచేసుకొని నీరైపోయిన గంటం—

"అమ్మా: మీ బాబును మా శిరస్సునిచ్చైనా మీ కళ్ళముందు పెడతాం. నీ వెళ్ళకు తల్లీ!" అని ప్రాధేయపడ్డాడు.

ఆ మాటలు ఆమె అసలు వినిపించుకోనేలేదు, వినిపించుకునే స్థితిలో లేదు. వినిపించుకోలేదు. అలాగే అందరినీ విడద్రొక్కుకుంటూ వెళ్ళిపోయింది.

వెంటనే గంటం రోషకషాయితనేత్రుడై జనాన్ని వుద్బోధించాడు—

"ఇక మనం ఒక్క క్షణంకూడా ఆలస్యం చేయకూడదు. రామ రాజులాంటి పవిత్రమూర్తే మనకు దూరమయ్యాక. మనం

బ్రతకడమే వృథా! ఏమైనాసరే మన రాజును విడిపించుకోవాలి. వాళ్ళు చీకటికొట్టుల్లో బంధించినా కారడవుల్లో ఖైదు చేసినా, గృహాంతర సీమల్లో దాచినా, ఆఖరికి పాతాళంలో పెట్టినా విడిపించుకోవాలి. అంతవరకూ మన్యం లో పుట్టిన ఏ వ్యక్తీ, ఒక్క మెతుకు కూడ ముట్టడానికి వీలులేదు - పచ్చి మంచినీళ్ళయినా పుచ్చుకోకూడదు, రెప్పలు కోసుకునైనా కునుకునుకూడా ఆపుచేసుకోవలసినదే. మన బ్రతుకులో పడ్డ నిప్పు, రాజి, రగిలి, ఆ నిప్పు పెట్టిన దొరలనే దహించివేసినా వెనుకాడవద్దు...ఏమంటూారు?" అని పిడికిలి బిగించి అడిగాడు.

గంటంలో ఆనాటి రోషావేశం మన్యంవాసులు తమ దైనందిన జీవితంలోనే ఎన్నడూ చూడలేదు. తొణకని కుండ భళ్ళున బ్రద్దలై ప్రవహించినట్టయిది. ప్రశాంతసాగరం తన ప్రశాంత గంభీరం నుండే బడబాగ్నులు ప్రజ్వరిల్లింపజేసినట్టు భగ్గున మండిపోయాడు- గంటం. మేఘంలా పటాలున గర్జించాడు. వురుములా వురిమాడు. పిడుగులా పలికాడు.

ఆయన ప్రశ్నకు, ఆ జనం—

"జై! అల్లూరి రామరాజుకి జై!" అని దిక్కులు పిక్కటిల్లేలా ఘానభోంతరాళాలు దద్దరిల్లేలా పిడికిళ్లు బిగించి - ముష్టి ఘూడించి మరీ నినదించారు. ఆ నినాదానికి తోడు ఆ నీలకంఠేశ్వరాలయంలోని కంచుగంట "జయం! జయం! అని "గన్గణా" కొట్టుకుంది. గుడి గోడలన్నీ "కదం! కదం! కదం!" అంటూ ప్రతిధ్వనించాయ్. ముందుగా మల్లుసోదరులు చెట్టపట్టాలుపట్టి బరిలోకి దిగారు. ఆ వెనుక జనం. ఆ జనంలోంచి విప్లవావేశం, వేడి, భగ్గు భగ్గునమండుతోంది. అదో కోలాహలం. మహాభారత రణరంగానికి తరలి వెళ్లిన సైనిక జన కల్లోలతరంగణది. ఆ తరంగిణి తరంగాల్లో నురుగులు గ్రక్కుతూ పోటుపెడుతున్న ఆ జనప్రవాహం హోరులోంచి, శరీరాలు, హృదయాలూ పులకరించే శంఖారావంలా ఓ ఓంకారధ్వని పుట్టింది. ఆ ధ్వనినుండి వుత్సాహాన్ని, వుద్రేకాన్నియిచ్చే మహా

గీతం ఆలపించబడుతోంది. ఆ గీతంలో మాటలు విచ్చుకత్తుల్లా గాలిలో దూసుకుపోతున్నాయ్.

ఒక్కుమ్మడిగా, ముక్తకంఠంతో ఆ ధ్వని లేచింది.

వుప్పొంగి, పొంగరా, ఓ తెలుగుబిడ్డా!
భారతా స్వాతంత్ర్య సమరరంగానా!

దుష్టులే పాపిష్టి సీమదొరలా నీడ,
కృంగుతూ, బ్రతుకుచే జాతికే సిగ్గనీ,
హరహరోంహర మహా ఓంకార హేర్భాటి
ఘానభోగోళాల ఘీంకారపెట్టరా!

వుప్పొంగి, పొంగరా, ఓ తెలుగుబిడ్డా!
భారతా స్వాతంత్ర్య సమరరంగానా!

పలనాటి చంద్రునీ తెలుగు విక్రమధాటి
నాగులేటి నాగ, భుగ భుగల పగఘాటు
రాణి రుద్రమ రౌద్ర రోషానలజ్వాల
నీ మహాశక్తిరా, శ్రీరామరక్షరా!

వుప్పొంగి, పొంగరా, ఓ తెలుగుబిడ్డా!
భారతా స్వాతంత్ర్య సమరరంగానా!

గోదావరీ పరుగు, క్రిష్ణవేణీ వురక
పర్వతాలే రగులు మన్యతేజంబుతో
దిశలెల్ల దుందుభులు ధంధణాజై కొట్ట
తొడగొట్టి చేబట్టు జయము మొనగాడా!

అంటూ దుసెళ్ళి పోతోందా - ధ్వని.

ఆ వేడి ఆంధ్రావని అంతటా, అన్ని పత్రికల్లోనూ పతాక శీర్షికలతో ప్రచురించారు. ఒక్కటే వార్త!

అది "అల్లూరి రామరాజు అరెస్టు!" అని మాత్రమే, దాంతో ఆ వేడి మొట్టమొదటిసారిగా, ఆంధ్ర యువజనం నవనాడుల్ని

పొంగించింది. ఆ నాటి వేడది. అందులోనూ వేడిగల జాతి తెలుగు జాతి. వేడెక్కాలేగాని ఎక్కిందా? దాని కవోష్ణ కాంతులకు, కాంతులకు, పాపము, దుర్మార్గం, కలుషం, ఏ మూల ఎక్కడ దాగివున్నా, భస్మం కావలసిందే.

ఆ ప్రజావాహిని అలా పరుగులెడుతోంటే, ఆ వాహినిలో మధ్య మధ్య నదులు, సెలయేళ్ళు కలిసినట్టు అనేకమంది కోయ యువకులు కలుస్తున్నారు. ఆ కోయయువకుల్ని దీవించి పంపుతుందామన్యం. ఓ తల్లి బిడ్డని నుదుటకి కుంకుమ తిలకంపెట్టి పంపుతోంది. మరో యువకుని భార్య మూలనున్న విల్లమ్ములు భర్త భుజాల కమర్చి, చిరునగవుతో పంపుతోంది. గోళీలాడే పిల్లవాని లగాయతూ, వేటలోనున్న వీరులవరకూ అంతావచ్చి ఆ మహాజన ప్రవాహంలో కలసి పోతున్నారు. అలా ఆ వాహిని, విల్లమ్ములు, బల్లెములు, పలుగులు ధరించి - ఆ కారుచీకటిలో, కాగడాల వెలుతురులో మిట్టలు, గుట్టలూ, గుహలూ, లోయలూ, ఏర్లూ, దాటి మహోత్తుంగ తరంగ డోలికలై పొంగులువారుతూ సాగుతోంది.

ఆ కటికచీకటిలో, కాగడాల వెలుతురులో ఆ ప్రక్కనే మూడుచెట్లకు వరుసగా బంధించబడివున్న పడాలు, గోవిందు, రత్తిల మేనులు పులుకరించాయ్.

"వుప్పొంగి, పొంగరా ఓ తెలుగుబిడ్డా!" అన్న చరణం వినగానే, వాళ్ళ కెక్కడలేని బలమొచ్చేసింది. నవనవోత్సాహం పెల్లుబికి కట్లు త్రెంచుకొని వచ్చి, మహాప్రవాహంలో కలిసిపోయారు—

"వుప్పొంగి, పొంగరా ఓ తెలుగుబిడ్డా!" అంటూ.

వాళ్ళు కలియడంతో ఆ జనప్రవాహం, చంద్రునిచూచి సముద్రం పొంగినట్టు పొంగింది. పొంగి పోటెత్తిన మహాసముద్రంగా మారి పోయింది.

ఒక కాగడా అరచేత పట్టుకొని, ముందుకు సాగుతూ-రత్తి—

"గోదావరి పరుగు, కృష్ణవేణి వురక
పర్వతాలే రగులు మన్య తేజముతో."

అని గొంతెత్తగానే "మన్యతేజముతో," అని కొండలు మార్మోగాయ్. మరల రత్తి—

"దిశలెల్ల దుందుభులు ధంధణా జైకొట్ట
తొడగొట్టి చేబట్టు జయము మొనగాడా;"

అంటూంటే. చుట్టూవున్న కొండలన్నీ కదిలి, ఒకదాని కొకటి ఢీకొంటూ, "జయము మొనగాడా," అని అందుకుంటూ, ధంధణ దుందుభులు మ్రోగినట్టుగా మ్రోగుతూవచ్చి, ఆ మహాయాత్రలో పాల్గొన్నట్టుగా వున్నాయ్.

జనమంతా ఆ చివర చరణం—

"జయము మొనగాడా!" అంటూ మరొక్కసారి గొంతులు పెకల్చి ఆలపిస్తోంటే, మానవుడు - మొనగాడు. మహేంద్ర పర్వతాన్నికూడా జీలుగుబెండుగా చేసెయ్యగలిగేటంతటి మహత్వసంపన్నుడన్న మహోత్కృష్టపదం అక్షరాలా నిజమనిపిస్తోంది.

ఆ మాటవుచ్ఛరిస్తుంటేనే, ఆ కోయజనంలో మేరమీరిన శౌర్యతేజం చిందులు త్రొక్కుతోంది.

రత్తి అలా కొండమలుపుల్లో మెలికలు తిరుగుతున్న నాగుబాములా ప్రాకుతున్న ఆ జనవాహినిని ఓ గుట్ట ఎక్క, కాగడా పట్టి—

"జయము మొనగాడా!" అటూ మరీమరీ వుత్తేజపరుస్తోంది.

ఆ వుత్తేజం ఎంతటి శక్తివంతమైనదంటే, పళ్ళు ముదిరి, కీళ్ళు కదిలి, బ్రతుకంటే కోర్కెసడలి, దారిప్రక్క ముగ్గుబుట్టలాంటి తల ఆడించుకుంటూ కుదబడిపోయిన దీనజనునిలోకూడా తిరుగుబాటు వేదాంతం ఆవేశించి, వూతకర్ర చేతికిచ్చి, ఆ నవయువకులతో పాటు, గుట్టలు, మిట్టలూ, కొండలూ దాటించగలంతటి శక్తివంతమైనది.

రత్తి అలా వుత్తేజపరుస్తోంటే, ఆమె గొంతుకనుండి దేవ దత్త పాంచ జన్య శంఖారావమూ, గాండీవంనారి మ్రోతలూ, రణ రంగస్థలంలో పోరాడు మహావీరుల రథాంతర భాగాల్లోని కంచు గంటారావమూ, భేరీనాదాలూ, వుంగర వుంగరాల్లా మెలి దిరు గుతూ గింగురు లెత్తుతున్నాయ్. ఆ చీకటిలో ఆ జనసందోహం పట్టిన కాగడాలు, మింట నక్షత్రాల్లా మిలమిల మెరుస్తూ విప్లవాక్షరాలను దిద్దుకుంటున్నాయ్.

మహా సంరంభంతో వురకలు వేసుకుంటూ పోతోందా శివ సాగరం.

నిజంగా అంతే. అసలు ఏ కొండ కోనలోనో పుడుతుంది- నీటిబొట్టు. అది ఏ కొండకనుమ గుంటలోనో పడి, మడుగై, స్రవించి, సెలయేరై, నదీసంగమం చేరి, ఆఖరికి మహాసాగరంగా మారి పోతుంది. అల మారినప్పుడు, ఆ మహాసాగర తరంగాల్ని ధిక్కరించేవాడు ప్రపంచంలో దొరకడు. ధిక్కరించాడా, ముంచెత్తి పారేస్తుంది- ఆ మహాసాగరం. అంతే ప్రజా వెల్లువ కూడా.

## 15

తొలికోడి కూసింది. తెలతెల్లవారింది. బాలార్కుడు వుదయాద్రి నెక్కి లోకాన్ని చూస్తున్నాడు. రామరాజును ఎక్కడికి తీసుకు పోయారో, కనులు పొడుచుకున్నా, ఆ అర్కునికి కనబడ్డంలేదు.

కాని అర్కునికి కనబడనిది - పత్రికలకు కనబడింది. పత్రికలు ప్రజాభిప్రాయానికే ప్రతిబింబాలు కాదు. ప్రజలకు తెలియని అనేక రహస్యాల్నే కాదు. విశ్వవార్తలను అరక్షణంలో మన అరచేతిలో పెట్టగలవ్.

నిన్న 'అల్లూరి రామరాజు అరెస్టు' అని పతాకశీర్షికలతో రాసిన పత్రికలన్నీ మరల యీ రోజు 'నరసీపట్నంలో రాజు దిగ్బంధం!' అన్న వార్తనిచ్చాయ్. ఆ వార్త దవానంలా వ్యాపించి, ఆంధ్ర దేశాన్ని అట్టుడికించింది. ఏ నోట విన్నా, ఏ గుంపు చూచినా, రాజు అరెస్టు వార్తే. రాజు ఇంటర్న్మెంటు వార్తే పత్రికల కుర్ర వాళ్లు ఆ వార్తను మరీ అతిశయంగా చిత్రించి, మరో కొన్ని పత్రికలు అదనంగా అమ్ముకుంటున్నారు.

అందులోనే ఓ పత్రిక సీత తండ్రికూడా కొన్నాడు. అతనా వార్త చదవగానే. ఇక కాళ్ళక్కడ నిలబడలేదు. ఇంకేవార్తా చూడలేదు - అతని కళ్లు తాటికాయంతఅక్షరాలతో అచ్చుబడ్డ 'రాజు దిగ్బంధం' వార్త చూచే, క్షణం జాగుచేయకుండా యింటికి వచ్చేసాడు.

తండ్రికి పత్రికిచ్చిన పేపరు కుర్రవానిగొంతు ఒక యింటి కిటికీవద్ద మరల 'నరసీ పట్నంలో రాజు దిగ్బంధం!' అని మ్రోగింది.

ఆ మ్రోత ఆ భవంతిలోని సీత చెవిని పడింది. వెంటనే సీత 'కెవ్వు'న అరచి, నీరసంతో జోగిపోయింది. ఆ జోగిపోవడంలో, ప్రక్కనే స్టాండుపైనున్న రాజు చిత్తరువు క్రిందపడి పగిలింది. ఆ పగిలిన బీటలనుండి విద్యుత్కాంతుల వెలిగ్రక్కుతూ ఓ ధ్వని మ్రోగింది—

'దేశభక్తికన్నా, స్త్రీ ప్రణయం ప్రధానం కాకూడద'ని. ఆ మాటలు ఆమె మనస్సులో గిర్రున తిరిగాయ్. చలించిపోయింది.

'రాజా! నన్ను క్షమించు! నిన్ను ఏవేవో అనేసా. నీపైనే పంచ ప్రాణాలు పెట్టుకొనివున్న సీతను క్షమించవ్. రాజా! ఇదిగో చెంపలు వేసుకుంటున్నా!' అంటూ తన నునులేత ఎర్రగులాబీల్లాంటి చెక్కిళ్ళు పడపడా కొట్టుకుంది.

ఆ దృశ్యం చూచి తండ్రి గలగబా పరుగెత్తుకొచ్చి—

'ఏంటమ్మా ఆ పని? దబ్బపండులాంటి శరీరాన్ని, తిండిమాని హింసించి. పీడించి, కృశింపజేసావ్! నిజంగా రాజు అంతటి దేశ భక్తుడైన సుకృతానికి నీవైనా సంతోషించాలి గాని ఖేదపడ గూడదు!' అంటూ ధైర్యం చెప్పబోయాడు.

ఆ ధైర్యాన్ని విని విని విసుగెత్తిపోయి విరక్తి చెందిన సీత కడకు తెగించి—

'సంతోషం! ఇవిగో, యీ రెండుకళ్ళూ పోయాక ఆ సంతోషం!' అంటూ గ్రుడ్లు పెరుక్కోబోయింది.

'అమ్మా!' అని గుండెల కత్తుకొని—

'మాట నిలబెట్టుకున్న తెలుగుబిడ్డమ్మా, మన రాజు!' అంటూ ప్రక్కను క్రిందపడ్డ రాజు చిత్రాన్ని మరల స్టాండుపైవుంచి—

'చూడమ్మా! రాజువల్ల మన తెలుగుతల్లి నోములపంటే పండింది!' అంటూ బలవంతంగా త్రిప్పాడు.

సీత 'భేర్'మని ఏడ్చింది—

'తప్పమ్మా! ఏడవకూడదు! అరెస్టులూ, నిర్బంధాలూ, దేశ భక్తులకు పూలమాలలు తల్లీ! కఠినశిలా పర్వతాలను ఢీకొనగలిగిన వాడు, చెలదుత్తుంగ తరంగాలను తలదన్ని యీదగలవాడు, చక్ర చక్రాలు తిరిగే సుడిగుండాలను ఆ సుడిగుండంలో నిలచి, మెలి త్రిప్పగలిగినవాడే - రాజకీయనాయకుడు - దేశసేవాధురంధరుడు!- అటువంటి వుత్తమకోవకు చెందినవాడమ్మా - మనరాజు!'

"నాన్నా! నా కెందుకీ మాటలుచెప్పి, మరింత క్షోభపెడ తావ్? నా రాజు నిక వొదిలిపెట్టరా, నాన్నా!"

"వొదిలిపెడతారు - ముందు రాజుకు జయం పలుకమ్మా!"

పలుకలేదా - పెదవులు. ఆ నాలుక పొడారిపోయింది. కాని. ఓపిక, జీవ తెచ్చుకుంటూ—

"నా——"

'ఆ! అనమ్మా- నా— ?,

"నా రాజుకు—"

"జయం!—ఊ! అనమ్మా!"

"జయం!"

"సెభాష్, తల్లీ! రాజెక్కడున్నా, తీసుకువస్తా!" అంటూ ఆమెను లాలించి, నడుంపట్టి నెమ్మదిగా ఆమె పాన్పుపై పరుండబెట్టి, తను తన పాన్పుపైకి వెళ్ళి దీపం కొండెక్కించి, రామరాజు సాహస కార్యాచరణకు, జాతీయబాటకు ఎంతో మురిసిపోతూ, అ కిటికీనుండి వస్తున్న సముద్రపుగాలికి హాయిగా నిద్రబోయాడు.

కాని సీతకు కునుకు పట్టడంలేదు. ఆమె నిద్రాదేవిని ఏనాడో కైవసం చేసుకుని, తన కన్నులపైకి మాత్రం వాలకుండా, చేతిలో చేయి వేయించుకుంది.

అదీగాక యీ రోజు కొంచె మించుమించు శుభవార్త వింది. రాజుజాడ దొరికిది. వెంటనే వెళ్ళిపోవాలి. లేకపోతే రాజు మరల అక్కడనుండి అదృశ్యం కావచ్చు. ఇక రాజు తనవాడు కాక పోవచ్చు. తన బ్రతుకే అడవిలోని వెన్నెల కావచ్చు. తన యౌవ్వన లతాకుసుమాలు వృథాగా నేల రాలిపోవచ్చు. లే దా చెట్టునే వుండి పోవచ్చు

తండ్రి ఏదో తీసుకువస్తానని వాగ్దానం చేసాడు. కాని ఎవరి కష్టం ఎవరికి తెలుస్తుంది? మోసేవాడికికాని బరువు తెలీదు. అనుభ వించే వాడికికాని బాధ తెలీదు. తన బాధ ఎంత తండ్రైనా ఆయన కేం అర్థమౌతుంది? ఆయన కూతురుపోతే ఆయనకు బాధ, కాని తన రాజుపోతే ఆయనకు బాధేముంది ?

ఇలా ఆలోచించుకుంటూనే వుంది. ఆమెకు నిద్రపట్టలేదు. ఏనాడూ ఆమె అంత తీవ్రంగా ఆలోచించలేదు. ఆలోచించవలసిన

సమయం అదే అని ఆమె బుర్రకు తట్టివుండాలి. ఆ ఆలోచన తట్టడం తోపాటు, ఆమె బుర్రలోకి రామరాజు మాటలు దేశభక్తికన్నా. స్త్రీ ప్రణయం ప్రధానం కాకూడదు!" అంటూ రింగున మరల మ్రోగాయ్. ఆమె ఆలోచన ఆగింది.

ఇంకో మార్గంవైపు ఆమె బుర్ర పరుగెత్తించింది. నీరు ఎక్కడవున్నా-ఎటు పల్లంవుంటే అటు ప్రాకిపోతుంది. గాలి తన కెక్కడ సందు దొరికితే, ఆ సందు చీమతలకాయంతున్నా, లోపలకు ప్రవేశించేస్తుంది.

అలా ఆమె బుర్ర గ్రుక్క తిరుగని ఆలోచనలలో, చిలవలు పలవలుగా, ముళ్ళడొంకల్లా దట్టంగావున్న సందులగుండా కూడా పెడ మార్గంపెట్టి ఆలోచిస్తోంది.

ఒకవేళ రాజు తిరస్కరిస్తే, తృణీకరిస్తే, తన గతి యేమౌతుంది. దుష్యంతుడు శాకుంతలను తిరస్కరిస్తే, దివ్యశక్తులుగల తండ్రి - కణ్వుడేంచేసాడు. పైగా, శిష్యులతో చెప్పి పంపించాడు- "సతి బ్రతుకు పతివద్దే గాని పితవద్దగాదని!" ఘోరవిపినంలో ఏకాకిగా విడిచిపెట్టి కణ్వశిష్యుల వెళ్ళిపోయారు! అప్పుడు ఆమెను ఆదరించడానికి ఎవరో వొకరున్నారు - అది పురాణకాలం గాబట్టి, ఆనాడు మానవులుకూడా పురాణపురుషులు కాబట్టి ఆదరించారు. కాని యీ కాలంలో ఆదరించేవాడెవడు ?

అలా ఆలోచించి ఆలోచించి ఆమెబుర్ర వెయ్యింతల కాకెక్కిన ఉక్కును కరిగిన మూసలా వేడెక్కిపోయింది.

కన్నులు నులుముకుంది. అంతటి సముద్రపుగాలి వీస్తున్నప్పటికీ నుదుటపట్టిన చెమటను తుడుచుకుంది. బయట సముద్రంలో పెద్దగా త్రుళ్ళిన ఓ కెరటం పంపినగాలి, కిటికీ తలుపులకు తగిలి, ఆ తలుపులు కొట్టుకోగా వచ్చిన శబ్దానికి ఆమె బుర్రలోకి మరో ఆలోచనొచ్చింది—

పోనీ, సాంగత్యభాగ్యం కలుగకపోయినా, సాన్నిహిత్యభాగ్యమైనా కలుగుతుంది. భర్తను దీవించగలిగినందుకే మాంచాలి

వీరపత్నియై ఆచంద్రార్కం తెలుగుప్రజల నాలుకపై నాట్యం సలుపడంలేదా? దీవించడమే గాక, భర్తతోపాటు స్వతంత్ర సంగ్రామంలో పాల్గొనడమే తటస్థిస్తే, అటువంటి స్త్రీని దేశం యింకెంత గౌరవిస్తుంది? అంటూ ఆలోచిస్తూ, తను ఏదో సాహసం చేయబోతున్నట్టు, ఆ సాహసానికి కావలసిన వూపిరి పీల్చుకోడానికి ధైర్యాన్ని తెచ్చుకోబోతోంది.

కాని 'సీత' అని గుర్తిస్తే, సీత స్వతంత్రి పోరాటంలో దూకాడానికి, రాజు అంగీకరిస్తాడా? తను బ్రతికుండగా, శిసలైన దేశభక్తుడనే వాడు తన ప్రక్కనున్న స్త్రీ ఆత్మబలిదానానికి అంగీకరిస్తాడా? అంగీకరించడు. ఇకామె నిస్తబ్ధతైపోయింది. ఇక ఆలోచన తెగడం లేదు. అంతవరకూ కళ్లెంలేని జోడుగుర్రాల్లా పరుగెత్తిన ఆమె ఆలోచనలు 'టక్'మని ఆగిపోయాయ్.

మరల ఆమె కనులముందు మగదుస్తుల్లో శత్రువులను ధిక్కరించిన ఝాన్సీరాణి, మగదుస్తుల్లో బాలచంద్రుని రక్షించుకోడానికి వెళ్ళిన మాంచాలి. మగదుస్తుల్లో తాను ప్రేమించిన చంద్రగుప్తుని శత్రువు కుట్రనుండి కాపాడిన 'మురి' ఆమె కనులముందు నిలిచారు. మరల ఆమె బుర్రకు పని తగిలింది.

'ఆ' బాగుంది! ఇదే చక్కని మార్గ'మనుకుంది. కాని ఆ లంగా. ఆ వాణీ, ఆ జాకెట్టుతోనే అలా ఆ చీకటిలో లేచింది.

తలుపు కిర్రుమంది. ఆమె గుండె పీకింది. నెమ్మదిగా ప్రక్క గదిలోకి వెళ్ళితలుపువేసి, దీపంవొత్తి ఎగద్రోసి, ఆ వెలుతురులో తన వొంటిపైనవున్న ఆ రంగు రంగుల జరీఅంచుల లంగా, ఆ ఇంద్రనీలకాంతిని మరపించిన వాణీ, ఆ వెల్వెట్ జాకెట్టూ, అన్నీ విడిచేసి, తన తుమ్మెదరెక్కల్లాంటి నల్లని కురులను పోలిన, ఓ నల్ల చీరా, నల్ల జాకెట్టూ కట్టుకొని దీపం వొత్తు తగ్గించి, నెమ్మదిగా బయటికి వచ్చి, తండ్రి నిద్రిస్తున్న మంచంచుట్టూ ఆర్ద్రనయనాలతో ముమ్మారు ప్రదక్షించి, సముద్రపుగాలికి కప్పుకున్న దుప్పటి లేచి

పోగా కనబడుతున్న కాళ్ళకు ఒక్క నమస్కారం చేసి, ఆ అర్ధరాత్రి సద్దణగిన నడిరాత్రి, నిశ్శబ్దంగా, ప్రసాంతంగా బయటికొచ్చేసింది. చరిత్ర యిక్కడ పునరావృతమైంది. ఒకనాడు రాజుకూడా ఇలాగే, అర్ధరాత్రి ఆలుబిడ్డల్ని, భోగభాగ్యాలనీ, మణికిరీటాన్ని సామ్రాజ్యాన్ని కాలదన్ని బయటికొచ్చిన సిద్ధార్ధునిలా బయటికి వచ్చేసాడు.

మరిల సరిగ్గా అలాగే యిప్పుడు జరిగింది. కాని బుద్ధుడు - రామరాజు మగవారు. సీత ఆడది. ఆడది ఇలా అన్నీవొదిలి, అర్ధరాత్రి గడపదిగిన సంఘటన చరిత్రలో లేదు. ఈ సంఘటన చరిత్రకే మేత.

ఈ సంఘటన వింటే చరిత్రకారుడెంత వుప్పొంగిపోతాడో, అంతకంటే ఎక్కువగా, ఆ చరిత్రకారుడికి, మీకూ, నాకూ, సీతకూ, రాజుకూ, బుద్ధుడికి, అందరికి అతీతమైనా, అందరినీ కన్న భారతదేవి మరీ వుప్పొంగిపోయింది.

అంతకంటె, అందరికంటె ముందుగానే వుప్పొంగిపోయిన, మన్యవీరుల దళం ఆ అర్ధరాత్రి ఒక నల్లత్రాచులా బుసలుకొడుతూ, నరసీపట్నం పొలిమేరల్లోకివచ్చి, ఆ పొలిమేరల గట్లపై వేయిపడగలు విప్పి, తేరిచూచింది, రాజు నెక్కడ దాచారోనని.

తెల్లవారిపోయిందప్పటికే. గంటం ఆ జనాన్నుద్దేశించి—

'పదండి! రాజును దిగ్బంధం చేసిందీవూళ్ళోనే. పదండి. మారువేషాల్లో వూళ్ళోకి.

'అంటే?' మల్లు ప్రశ్నించాడు.

'మోసానికి మోసం తమ్ముడూ! సన్యాసుల వేషం!' అన్నాడు గంటం.

అవును. చెప్పకుండా, చెయ్యకుండానే రాజును తెల్లదొరలు అరెస్టుచేసారు. నరసీపట్నంలో దిగ్బంధం చేసారు. అందుకే మోసం చేసినవారిని మోసంతోనే జయించాలన్న సిద్ధాంతానికి వచ్చాడు.

విచిత్రమేమిటంటే-గంటం, తనకు తెలియకుండానే రాజు సిద్ధాంతానికి రావడం.

అయితే రాజుసిద్ధాంతం మళ్ళీ గంటాన్ని భేదిస్తుంది. దౌర్జన్యాన్ని దౌర్జన్యంతోనే, కత్తిని కత్తితోనే, వజ్రాన్ని వజ్రంతోనే, ఆయుధాన్ని ఆయుధంతోనే, వీరునిలా బహిరంగంగా, ధైర్యంగా ఎదుర్కోవాలన్నది రాజు సిద్ధాంతం. అంతేగాని, దుర్మార్గాన్ని దుర్మార్గంతోనూ, మోసాన్ని మోసంతోనూ అనేది రాజు సిద్ధాంతంలో లేదు. కాని గంటం ఆ సిద్ధాంతానికి వచ్చాడు.

అయితే మోసానికి మోసమని సాధూవేషం వేయడ మేమిటనీ, అడుగుతారు-మీరు.

కాని ఒక్క విషయం మరచిపోకండి !

రాణి రుద్రమను శత్రువులు మాయోపాయాలతో చుట్టుముట్టాలని పన్నాగాలు పన్నారు. ఆ మాయోపాయంలో తీర్థయాత్రికులకు మల్లె శ్రీశైలంనుండి ఒక దండు బయలుదేరింది. వాళ్ళాపూట శ్రీశైల మల్లికార్జునుని గుడిలోనే మకాంచేసారు.

అది కనిపెట్టాడు-గోన గన్నారెడ్డి. చరిత్ర కప్పెట్టిన మహావీరుడు-గన్నారెడ్డి. ఆయన రాణి రుద్రమదేవి సేనాని కాదు. భృత్యుడు కాదు. ఒక తెలుగువాడు. తెలుగు రాణి సింహాసనం కూలిపోవడం అతని కిష్టంలేదు. రుద్రమకు తెలియకుండానే నిష్కాముడై, శత్రువుల మాయోపాయాలను కనిపెట్టి, తన అనుచరులతో ఒకరోజు సాధూవేషంలోనే వెళ్ళి, శ్రీశైలమల్లిఖార్జునుని పవిత్ర తీర్థమని వారికిచ్చి చంపివేసాడు. తరువాత ఓరుగల్లుకోటను చుట్టుముట్టినప్పుడు శతృవులకు దిగ్భ్రమ కలిగించి, పిడుగుల్లా మధ్యపడి శతృవులను ఓడించి, రాణి రుద్రమ రాజ్యాన్ని కాపాడినవాడు - ఆ గన్నారెడ్డే. విశేషమేమంటే, ప్రతిఫలాపేక్ష లేకుండా, దేశభక్తితో త్యాగం చేయడం. ఆ వీరుని చరిత్ర మీరే గ్రంథంలో చదివారు? ఏదో ఒక్క గ్రంథంలో మాత్రం చదవుంటారు. అలా ఎంతమంది

తెలుగుసామ్రాజ్య శోభను శోభింపచేసిన మూలపురుషులు చరిత్ర గర్భంలో యింకనూ దాగిపోతున్నారో, ఎంతమందికి తెలుసు? అందరిలో గన్నారెడ్డి ఒక్కడు మాత్రమే.

అలా దేశంకోసం. ఒక మంచికోసం ఒక చెడు. ఒక అబద్ధం. ఒక నేరం చేసినా తప్పులేదన్నారు - మా పెద్దలు. అబద్ధమాడైనా పెండ్లి చేయమన్నారు. అలాగే, అబద్ధమాడలేక రాజ్యభ్రష్టుడైన ధర్మనందనుడు - అజాతశత్రువే - క్షాత్రభూమిలో 'అశ్వత్థామ హతః కుంజరః అని అడ్డంగా అబద్ధమాడేసి, మహాభారతయుద్ధ దశనే మార్చేసాడు-మరో మార్గానికి.

కాన అటువంటప్పుడు తప్పులేదు-అబద్ధమాడినా.

అందుకే గంటంది-యీ విషయంలో తప్పుకాదు.

అలా మారువేషాలు వేయించి, ఆయుధాలు ఆ గట్టుపై ఓ జమ్మివృక్షం తొర్రలో పెట్టించి, తిన్నగా వూళ్ళోకి తీసుకు పోయాడు.

వూళ్ళో ఒక శివాలయముంది. ఆ శివాలయంలో గంటలు గణ-గణ మంటూ కొట్టుకుంటున్నాయ్. కాని తలుపులు మాత్రం మూసివున్నాయ్. అడ్డంగా విభూతిరేఖలు ధరించిన విప్రపూజారులు అడ్డంగా నిలిచి, ఆ ఆలయంలో ప్రవేశించబోతున్న ఒక హరిజన బృందాన్ని అడ్డగిస్తున్నారు.

వారి వాదన—

'పవిత్రమైన భగవత్సాన్నిధ్యం పొందడానికి మీ కడజాతికి హక్కు లేద'ని.

జనం, ఆ విప్రపూజారులు తమ మొర వినకపోతే, ఆ ఆరు బయటే నిలిచి, ఆలయంలోని భగవంతుడైన తమ మొర వింటాడన్న నమ్మకంతో చేతులు పైకెత్తి "హరహర మహాదేవశంభో!" అని ఓంకారనాదాలు చేస్తున్నారు.

'ఛీ! నోరుమూయండి! మీ పాపపు నాలుకలతో ఆ నామం వుచ్చరించడమే తప్పు!! అంటూ ఆ పూజారులు గెంటివేస్తున్నారు- హరిజనుల్ని.

ఇంతకంటే మోసమేముంది-చెప్పండి! ఆ హరిజనుల్నే అలా తగిలేస్తుంటే, యిక కోయవాళ్ళనుమాత్రం లోనికి ఆ పూజారులు రానిస్తారని నమ్మకం ఏంటి? రాజు ఆ గుడిలోనే వుంటాడన్న గంటం బృందం నమ్మకం నట్టేట కలసిపోవలసిందేనా?

ఇప్పుడు చెప్పండి! మోసంచేసే ఆ పూజారులను మోసం చెయ్యడం తప్పో కాదో?

తప్పు కాదనే గంటం సిద్ధాంతం.

అది తప్పుకాదని గంటం మోసంద్వారా రుజువు చేయగలిగాడు- కాని ప్రత్యక్షంగా రంగంలో కురికాడు-రాజు.

'ఆగండాగండం'టూ రాజు ప్రత్యక్షమయ్యా డక్కడికి. రాజు ప్రవేశించగానే. జనం రెండు పాయలుగా చీలిపోయారు. రాజు ముఖ వర్చస్సు ధవళకాంతుల వెదజల్లుతూ, శరశ్చంద్రధరుడైన పరమ శివుని లలాటాన్ని గుర్తుకు తెస్తోంది. పూజారులుకూడా ప్రక్కకు తప్పుకున్నారు.

కాని రాజు తనకు త్రోవ దొరికిందిగదా అని ఒక్కడే పొయ్యే వాడు కాదు. తనతోనున్న జనాన్నికూడా తనతోపాటు తీసుకుపోయే స్వభావం కలవాడు-వెంటనే—

'ఏమిటిది అన్యాయం! పవిత్రమైన పరమాత్ముని పేరుతో ఎంత దారుణం చేస్తున్నారు. రెక్కలు ముక్కలుచేసుకొని, కడుపెండబెట్టు కొని, ఏడ్చి, ఏడ్చి, కళ్ళళ్ళోనే కన్నీరింకిపోయి, నిరక్షురోదకులై శరీరంలో నెత్తురు బిగితగ్గిపోయి, రాళ్ళదిబ్బల్ని కొయ్యనాగళ్ళతో దున్ని దున్ని శక్తినశించి, నిస్తేజవర్చస్సులై, కృశించిపోయినా, లోకాలకన్నవస్త్రాలు ప్రసాదించిన యీ నిండుమానవులు కడజాతి

వారా ? లేక వారు నెత్తురు నీరుగామార్చి, శ్రమించి, పండించిన సశ్యాన్ని మెక్కి, అరక్క హరినామం జపించే మనం కడజాతి వారమా ? ఎంత అపచారం! ఎంత ఘోరం! పరమాత్ముడు మిమ్ము క్షమిస్తాడా ? క్షమించడు ! క్షమించడు ! హరహర మహదేవ్!' అంటూ రెండు చెవులూ మూసుకున్నాడు. ఒక ముఖాన్ని చూస్తే పెట్ట బుద్ధిపుడుతుంది. ఇంకో ముఖాన్ని చూస్తే కొట్ట బుద్ధి పుడుతుంది. అలాగే రాజు ముఖాన్ని చూడగానే ఆయన సందేశం, సుభాషితం వినగానే ఆ విప్రపూజారులు బుద్ధి తెచ్చుకొని, లెంపలేసుకుంటూ రాజుకాళ్ళపై పడ్డారు. అంతే తలుపులు తెరుచుకున్నాయ్. రాజుతో పాటు. ఆ హరిజనులుకూడా ఆలయప్రవేశం చేసారు. వారందరితోపాటు కపటసన్యాసులు కూడ తమ కుడిపాదాలను ఆలయంలో వేసారు. కుడిపాదం పెడితే జయమంటారుగా !

కాని అది అపజయంగా తోచిం దొకడికి. ఆలయం బయటనే దిగబడి, రాజుయొక్క సందేశాన్ని తన చిన్న నోటుబుక్కుపై రాసుకొంటున్న సి. ఐ. డీ. రాజును ఆ సి. ఐ డీ నిఘాలోనే వుంచింది-ప్రభుత్వం. రాజుయొక్క ప్రతీచర్యా వాడు నమోదుచేసి ప్రభుత్వానికి పంపించాలి.

లోపలకు జనం ప్రవేశించగానే, జనం మధ్యనున్న రాజును గంటం ప్రక్కకులాగి, దొంగ గెడ్డం తీసివేసి—

'పదండి, పోదాం ! యీ గెడ్డాలన్నీ మనవాళ్ళే !' తన చూపులతో అందరినీ చూపించాడు.

కపటసన్యాసులంతా 'హరహర మహదేవ్!' అంటూ బిగ్గరగా గానం చేసారు.

జనం పూజా పునఃస్కారాలతో నిమగ్నులై వొళ్లు మరచి పోయి వున్నారు. వెళ్ళిన సాధూలు వెళ్ళినట్టే వచ్చేస్తున్నారు.. బయట సింహద్వారం వద్దకు వచ్చాక-బయట లోకాన్ని చూచి—

'శివ గోవింద, గోవిందా !
లోకం - మాయకే మనసిచ్చు
మనసిచ్చి, మాయను హారతులు పట్టురా
శివ గోవింద, గోవిందా !
మోసమే, లోకంలో
బంగారు నాణెమురా !
నీతిగల జీవుడూ కడజాతివాడురా
శివ గోవింద, గోవిందా !'

అంటూ శివగోవింద పదం పాడుకుంటూ ముందుకుసాగారు. వారిలో తమ కార్యం నెరవేర్చుకున్న ఆనందం కనబడుతోంది. దానికితోడు రాజు ఆలయంలో లేడు. ఆయన అత్యంత ఆప్తులైన గామునోద రులు గైరాజరై పోయారు.

తన్మయంలోనున్న హరిజనులు తిరిగి వెనక్కి చూచి, తెల్ల బోయారు. బయటనున్న సి. ఐ. డీ. కి ఆ సాధువులను చూచి అను మానం తట్టి, ఆలయం లోపలకు వచ్చాడు. రాజు లేడు. బయట కొచ్చాడు. తుపాకి దెబ్బకు కూడా దొరక్కుండా అంతర్ధానమై పోయారా సాధూలు. సి. ఐ. డి. ఆశ్చర్యపోయాడు. వాడికి మతి పోయింది. ఒక్కడే అలా బయట శూన్యంలో నిలబడిపోయాడు.

కాని దేవాలయంవద్ద అంతర్ధానమైన ఆ కోయవీరులు, సరిగ్గా వూరి పొలిమేరలలోని గట్టుపైని జమ్మిచెట్టువద్ద అవతరించారు. ఆ జమ్మివృక్షం తొర్రలో తాము దాచిన ఆయుధాలు తీసుకున్నారు. అదంతా చూచి రాజు విభ్రాంతుడై చూస్తున్నాడు. అతని వొడలు పులకరించింది - ఆయనపట్టిన నోము పండింది.

వెంటనే ఆయుధాలు ధరించిన జనమంతా—

'జై అల్లూరి రామరాజుకీ జై !' అన్నారు.

"ఇక్కడకాదు - పదండాప్రక్క కొండ గుహలోకి!" అంటూ గంటం వారినందరినీ, ప్రక్క ఓ కొండగుహ వుంటే, దానిలోకి తీసుకుపోయాడు.

ఆ గుహలో, గుహామధ్య ఒక రాతిబండ వుంది. ఆ రాతి బండపై రాజు నిలిచాడు. జనమంతా చుట్టూ బరిగీసి నిలబడ్డట్టు నిలిచారు. ఆ మధ్య రాజు, వేయిగుర్రాల రథంపై నిలుచున్న సూర్యునిలా మెరుస్తూ, తను వుప్పొంగి వారిని వుత్తేజపరచబోయాడు.

అంతలో మరల "అల్లూరి రామరాజుకీ జై!" అని నినాదాలొచ్చాయ్. రాజుకు కోపం వచ్చింది. అంతకుముందున్న శౌర్యం మరింత చిందులు త్రొక్కింది - ఆయనలో. తోకత్రొక్కిన కోడె త్రాచులా లేచి—

"ఆపండిక నినాదాలు. మనకి కావలసినవి నినాదాలు కావు. చేతులు. ఈ తెల్ల కిరాతకీచకులకు వ్యతిరేకంగా మన్యంలో అణువణువునా, అణగిమణగివున్న ప్రతిశక్తి ఎదురు తిరిగిపోవాలి. నెత్తురు ధారబోసినా, కండలు తరిగినా, ఎముకలు అరిగినా, ఫలందక్కని ఈ బానిసబ్రతుకులు బ్రతికేకన్నా, స్వతంత్రపోరులో విజయఢక్కా మ్రోగించి, వీరస్వర్గ మలంకరించడమే మేలని అందరికీ చాటండి! ఇక మన శోకాలూ, తాపాలూ అంతం కావలసిందే. పట్టండి! ఆయుధాలు! ముట్టించండి - జ్వాలలతోరణం. పల్లెపల్లెనా శృంగ నాదం పూరించండి! గామికొండలోయలో మహాకాళి సన్నిధికి మరల్చండి, జనాన్ని! అక్కడ చేసుకుందాం! శపథం! అక్కడ తీసుకుందాం దీక్ష! అక్కడ పొందుదాం, మహాకాళీ దీవనలు!" అని గర్జించాడు.

ఆ గర్జనకు, పురివిప్పిన నెమళ్ళులా, ఆ జనం—

"జై అల్లూరి రామరాజుకీ జై!" అని మరొక్కసారి నినదించారు.

వాళ్ళలో అమృతం వర్షించినట్టయింది. సంజీవి పోసినట్టయింది.

రాజు తను అరెస్టు అయినప్పుడు 'ఇది సమయం కాద'ని వారించాడు.

బాస్టియన్ పిళ్ళలు చర్మాలు చీల్చి పంపించినప్పుడుకూడా మౌనం వహించాడు.

అక్కడేవుంది రాచకీయవిజ్ఞత. మంచి తెలివైనరైతు భూమి దున్ని, చదునుచేసినగాని విత్తనాలు జల్లడు. జల్లడా! తొలకరి కురిసిందా? ఇక విత్తనాలకు తిరుగులేదు. ఒక్కొక్క విత్తనంనుండి, చిలవలు పలవలైన మొక్క, మహావృక్షమై, బలిష్టమై పెకలించ వీలులేనిదై పోతుంది. మంచి తెలివైన రాజకీయవేత్తకూడా-అంతే. ప్రపంచంలో అంతవరకూ మహావిప్లవాలు నడిపిన వాషింగ్టన్ లగాయతూ, లెనిన్‌వరకూ అలాగే చేశారు. క్రితంరాత్రి సన్నద్ధమైన సాయుధవీరుల్ని ఆపుచేసి, ఆ మరునాడే క్రెమ్లిన్ కోటపైకి సాయుధ పోరాటం నడిపాడు - లెనిన్. కైవసం చేసుకున్నాడు కోట. ఛళ్లున బ్రద్దలైంది.—జారుచక్రవర్తి పాపం...అవతరించింది తొలి సోషలిస్టు ప్రథమ మహారాజ్యం.

అలాగే స్పార్టకస్ - అదునుచూచి కొట్టాడు - బానిస ప్రభువుల్ని. అదిరిపోయారు ప్రభువులు. బానిస సంకెళ్ళు ఛళ్ళున బ్రద్దలై పోయాయ్.

అలాగే ఝపాటా, టాంపియన్, అనేకమంది వీరులు, సమయముచూచి, వేడిచూచి, దెబ్బకొట్టారు. అదే సరైన రాజకీయ విజ్ఞత.

ఈ విజ్ఞతను సంపూర్ణముగా, సమగ్రంగా, ఉచ్ఛస్థాయిలో మూర్తీభవింప చేసుకున్న మహారాజకీయవేత్త - ఇంతవరకూ ప్రపంచంలో అటువంటివాడు పుట్టనివాడు - ముప్ఫయి శతాబ్దాలకు ముందే పవిత్ర భారతావనిలో, యమునాతటిపై, మధురానగరిలో పుట్టిన శ్రీకృష్ణపరమాత్ముడొక్కడే.

ఆ మహానిభావునులోనే, మున్మూర్తులా విజ్ఞతయొక్క పూర్ణ ప్రకాశం మనం చూడగలం.

ఆ మహానిభావుని లీలలకు మైమరచి - ఆ ఆనందంలో తనువునే మరచిపోయి యోగులైపోయిన చక్రవర్తు లెందరున్నారని.

యుద్ధసన్నద్ధులై తన సహాయసంపత్తి నర్థించడానికి ముందు వచ్చి శిరస్సువద్దనే కూర్చున్న దుర్యోధనుణ్ని ముందు చూడలేదు.

వెనుకవచ్చి తన పాదపద్మములవద్ద కూర్చున్న తన ముద్దుల మరదినే చూచాడట.

పైగా, తన చతురంగబలాలన్నీ దుర్యోధనునికి దత్తంచేసి, తాను మాత్రమే పార్థునివశమయ్యాడు. వశమై, చక్రం పట్టడట. ఒక్క రథసారథ్యం మాత్రమే చేస్తాడట. వైరిభాగుల అర్జునుకు వొప్పుకున్నాడు.

మహాభారత సంగ్రామం ప్రారంభమైంది.

తన బంధువుల్నే శత్రుపక్షంలో చూచి, భీతచిత్తుడై గాండీవం నేలపై పారేసాడు - పార్థుడు.

'పాపకూటంలో, బంధువులేకాదు, అన్నలూ, తండ్రులూ, తాతలున్నా, తల తురమవలసిందే' నన్న తారకమంత్రం వుపదేశించి వుత్తేజపరిచాడు - కృష్ణమూర్తి.

అభిమన్యుని సంహారానికి కారకుడు సైంధవుడుకాగా, వాని తల సూర్యోదయం గాకుండా నరుకుతానని పార్థుడు చేసిన శుష్క శపథాన్ని, చక్రంపట్టనన్న శ్రీనివాసుడు - పట్టి, సూర్యుని కడ్డు వేసి, అటు సైంధవ సంహారం ఇటు పార్థ శపథసంరక్షణా చేసాడు.

కర్ణుని చంపడం అర్జునునితరం కాకపోయింది. కర్మవశాత్తూ అతని రథం భూమిలో కూరుకుపోయింది - 'ఊ!' ఇదే అదను కొట్ట మన్నాడు - కొట్టాడు అర్జునుడు. అప్పుడు కొట్టకపోతే, మరి అర్జునుని తరంకాదు కదా! ఇది శ్రీకృష్ణుని చలవే.

రణరంగంలో చావనివాడు - భీష్ముడు. ఎవడూ భీష్మణ్ణి చంపలేడు. అతను చావకుండా భారతయుద్ధం జయించబడదు - అది ఆ పరమాత్మని కొక్కనికే తెలుసు. శిఖండి నడ్డు పెట్టాడు - భీష్ముడంతటివాడు - ఎగిరిపోయాడు.

ద్రోణుడు - అసాధారణుడు. కౌరవ, పాండవుల కందరికీ గురువు. ఆయనవద్దనే అభ్యసించారు - విలువిద్య. గురువును ధిక్కరించడం మాటలుకాదు - అందులోనూ ధనుర్విద్యాచార్యుడాయన. ఆయన కెదురులేదు.

వెంటనే ధర్మరాజు అంతటివానిచే అబద్ధమాడించి చంపించినాడు.

ఆయన చిద్విలాసం, మహాభారత రణరంగంలోని, అంచె అంచెకూ ప్రదర్శితమైంది. ఆయుధం పట్టలేదు. విజయునికి విజయం చేకూర్చాడు. ఆయన చతురుడు - శిశుపాలుని కంసుని సంహరించిన ధీరుడు. గోపాలుడు. రాధాలోలుడైనా అన్ని రంగాల్లోనూ, అన్ని ముఖాల్లోనూ ఆరితేరిన ఇంద్రజాలికు డాయన. పదివేలమంది గోపికలతోనే విహరించి అస్ఖలిత బ్రహ్మచారి ననిపించుకున్న గోపికాలోలు డాయన.

అటువంటి మహనీయమూర్తుల చరిత్రలు ఆమూలాగ్రంగా జీర్ణం చేసుకున్న రాజు - అదనులో వారిలో రగిల్చాడు - విప్లవాన్ని.

ఆ కోయవీరులందరూ, తమ ఆయుధాలను ఝళిపిస్తూ, ఒక్కొక్కరే ఒక్కొక్క కొదమ సింగంలా ఒక్కొక్క మదకరీంద్రంలా, బయటికొచ్చి, దూసుకుపోతున్నారు - రాజు ఆ జ్వాలతోరణాన్ని ముట్టిస్తే ధనధనమని ప్రేలే ఆ చిచ్చుల పిడుగుల్ని చూస్తూ తన్మయుడై పోతున్నాడు—

రత్తి ఓ కొండవంపుకుపై నిల్చి—

"వుప్పొంగి, పొంగరా! ఓ తెలుగు బిడ్డా!" అంటూ ఆ పితూరీ యాత్రను ప్రోత్సాహపరుస్తోంది.

ఆ వుద్వేగానికి వుప్పొంగ నాంధ్రు డెవడుంటాడు?

వుప్పొంగుతూ, ఆ పదాలకు పాదాలతోనే వంతకలుపుతూ, ఆ యాత్ర ముందుకు సాగిపోతోంది.

రత్తిలో ఆ వుద్రేకం చూచి, రాజు పట్టలేని ఆనందంతో—

'రత్తీ! రగిలింది పితూరీ, దీని తొలికాగడా పట్టిన ఘనత నీదే. తెలుగు దేశమే యిక నీ అడుగుల్లో అడుగు వేస్తుంది. రత్తీ!' అంటూ భుజం చరిచాడు - రాజు !

# 16

ఆ పితూరీ యాత్రికులు వాడవాడా పదయాత్రచేసి గాముకొండ చేరుకున్నారు.

చుట్టూ, అతి ధైర్యంగా కంచుగోడల్లా, నిటారుగా నిలబడ్డ కొండలమధ్య ఓ సమతల ప్రదేశంలో బారులుదీర్చి విన్యాసాలు జరుపుతున్నారా - వీరులు.

ఒకప్రక్క కొందరు యోధులు సాముచేస్తున్నారు. మరొక ప్రక్క కొందరు యోధులు గరిడీలు చేస్తున్నారు. కొందరు కతారులతో తర్ఫీదు పొందుతున్నారు. కొందరు బాకుపట్లలో వుత్తీర్ణులౌతున్నారు. మరికొందరు అస్త్రవిద్యా నైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్నారు. కొండపై భేరీ ఢంఢణా విజయధ్వానం చేసింది. మరో మూల కొండపై ఓ నిటారుగా నుంచున్న కోయ యువకుడు వుజ్వల విశ్వాసంతో శృంగనాదం చేశాడు

గాము సోదరులు వెంటరాగా, రాజు ఆ విన్యాసాలమధ్య ప్రత్యక్షమయ్యాడు తీర్చివున్న బారులు సగర్వంగా ఆయుధాలెత్తి రామరాజుకు జయజయనాదాల మధ్య, సుస్వాగత మిచ్చారు.

రాజు వొళ్లు పులకరించింది. ఆ ముఖంలో వీరత్వం నాట్యం చేసింది. ఆ వర్చస్సుధాలహరిలో సముజ్వల సముఖోపేత సముత్సాహం వెల్లవిరిసిది.

అనుకొన్నాడు—

నిస్తేజమైన జాతి కణకణమండుతూ, త్రేతాగ్నినిప్పులా రాజుకుందనీ—

నిద్రాణమైన జాతి బుసలుకొడుతూ, మిడిమేన త్రాచులా నిలువెత్తు లేచిందనీ—

నిద్రాణమైన జాతి నేలపైని పెనుజీకటులను, చెదరగొడుతూ చరచరా మెరిసిందనీ—

ఇక అంతవరకూ, తెలుగుతల్లి చెక్కిళ్ళనుండి, జాలువారిన కంటిజలము జాడ చెరిగిపోతుందనీ—

ఎవరైతే తన కండబలముతో కొండల్ని పిండిగొట్టి, లోకాల కన్నదానం చేస్తున్నాడో, ఆ కర్షకుడేగాని కన్నెఱ్ఱచేస్తే ఆ లోకాలే కరగిపోతాయనీ.

వుండబట్టలేక పైకనేసాడు—

'గంటం! యింతమంది వీరులు జూలు విదలించిన సింహాల్లా గర్జిస్తే రవి గ్రుంకని బ్రిటిషు సామ్రాజ్యమేకాదు. రవి ఏలే ఆభోంతరాళం మాత్రం బద్దలుగాక నిలుస్తుందంటావా?'

దానికి గంటం ఏం జబాబిస్తాడు?

రాజులోని ఆ వుద్రేకానికి, ఆ విశ్వాసానికి శిరస్సు వొంచాడంతే.

అలా ఆ మధ్య నడుస్తూ ఆ బారు కిటు చివరకురాగానే మరల ఒక్కసారిగా దిక్కులు పిక్కటిల్లేలా జయధ్వానాలు చెలరేగాయ్.

ఆ వీరుల్ని చూచి. రాజన్నాడు—

ఇక పదండి! శపథం. చేసుకుందాం, దీక్ష తీసుకుందాం. శత్రు సంహార, మిత్రసహాయీ అయిన దేవీపూజ కుపక్రమిందాం!'

అంతా బయిలు దేరారు.

రాజు కొండగుహలోకి అడుగుపెట్టగానే పెద్ద కోలాహలంతో ఘల్లుఘల్లున గజ్జెలశబ్దమైంది. మహాకాళి నిజంగా ప్రత్యక్షమైతే వెడలనంతటి మనోహరధ్వనులు అవి. అంతా అటు చూచారు-ఆశ్చర్యంగా.

రాజు, గంటం రెండడుగులు ముందుకేసి మరీ ఆశ్చర్యంగా చూసారు. రాజుకింకా బోధపడక గంటాన్ని అడిగాడు—

ఏంటీ కోలాహలం?'

మహోత్సాహం రాజా?'

'అనగా!'

'ఇదిగో! ఇటే వస్తోంది!'

'ఎవరు?'

'ఇంకెవరు... అని గోవిందు అంటూండగానే—

రావడం చూచిన గంటం—

'అదిగో! రత్తి! కాళీపూజకు కాలికి గజ్జ కట్టింది!' అన్నాడు.

'శభాష్! రత్తీ!' అని రాజు వుత్సాహం ఆపుకోలేక కరతాళ ధ్వనులు చేసాడు.

వెంటనే ఆ గుహ గుహంతా మ్రోతెక్కి పోయింది.

ఆ మ్రోతల మధ్య రత్తి చెంగున గంతేసి, గుహ మధ్యకొచ్చి, రాళ్ళుకూడ నాట్యం చేయగలిగిన అందెల, గజ్జల రవళితో కదం త్రొక్కింది. అలా తొక్కగానే ఒక్కసారిగా ఆ గుహంతా ఘల్లు ఘల్లున ప్రతిధ్వనించిది. ఆమె పాదాలు నేలపై నాట్యం చేస్తుంటే' ఆమె వెనుక ముడివేసిన సిగలోంచి, జడకుచ్చుల్లా వున్న సిగశిఖలూ ఆమె భుజాలపై బడి నాట్యం చేస్తున్నాయ్. ఆమె వెనుక పడాలూ, మల్లూ, గోవిందూ, మహాసంభ్రమాలతో చేతులు పెనవేసుకుంటూ, భుజాలు రాసుకుంటూ రత్తికి చుట్టూ దడికట్టి నాట్యం త్రొక్కు తున్నారు.

రత్తి మెడలోని పూసలపేర్లు, రాళ్ళసరాలు ఆమె వక్షోజాలపై బడి, ఆ నునుమెత్తని తీర్చిదిద్దిన గుబ్బలపై 'తదిగిణ తదిగిణ తదిగిణత గిణతోం తదిగిణత!' అంటూ గెంతుతున్నాయ్. ఆమె పైట మలయ మారుతపు హోరులో మింటనెగిరే కేతనం ధ్వజస్తంభానికి తగిలి కొట్టుకున్నట్టు, కొట్టమిట్టాడుతోంది. ఆమె బొంగరంలా తిరుగు తూంటే, ఆమె లంగా గొడుగులా తిరుగుతోంది.

అందరి కాళ్ళూ, చేతులూ, గొంతులూ ఒక్కసారిగా కలిసాయ్-

మన్యంకొండల్లో
భేరీ మ్రోగిందోయ్!
ఆ కొండల్లో గండుపులి
ఘాండ్రించిందోయ్!

ఘాడిగించ సీమకుక్క
"బొంయ్" మందండోయి!
'బొంయ్' మన్న సీమకుక్కని
పులి తరిమిందోయ్!
కాంగ్రు కాండు కాంగ్రు మంటూ
కంఠ మట్టిందోయ్!
కంఠమట్ట సీమకుక్క మట్టి కరిసిందోయ్!

అని.

వెంటనే ఆ జంటనుండి గోవిందు ముందుకొచ్చి, అభినయానుగుణంగా, భంగిమంలో అడిగాడు...

'రత్తీ?'

'ఏం?'

'బలేగా చెప్పావ్?'

'ఊఁ!'

'కానీ?'

కోపమొచ్చింది - రత్తికి. 'కానీ?'

'గండుపులీ - సీమకుక్క ఎవరెవరు?'

'అదామామా! గండుపులీ కోయదొరా. సీమకుక్క తెల్లదొరా!'

అంటూ రివ్వునొచ్చి, గిరున తిరుగుతూ, జడి, వడిలో పరుగెత్తుకుంటూ వచ్చిన సారంగంలా రాజుకాళ్ళను చుట్టుకుంది.

"రత్తీ! నీలాంటి వీరాంగనలే కొందరున్నా మనదేశానికి దురవస్థలుండక పోను!" అంటూ లేవనెత్తాడు రాజు.

"స్వామీ!" అంటూ, రత్తి తన బొడ్డునున్న కొడవలిలాగి, బొటనవ్రేలు దానిపై గీసి, చిందిన నెత్తుటివ్రేలితో రాజు నొసట నెత్తురుతిలకం పెట్టింది.

"మనకు విజయం తథ్యం రత్తీ!"

అంటూ ముందుకెళ్ళి, మహాకాళీ పాదాలు రెండూ పట్టుకొని కళ్ళ నద్దుకుంటూ—

'తల్లీ! మేమంతా నీ బిడ్డలం. పిండితే పాలుగారే మన్యాన్ని నెత్తురుచేరుల ముంచెత్తుతున్న తెల్ల ముష్కరులతో తలపడ్డాం. మన్యం పాడిపంటలు కొల్లగొట్టే బందిపోటుల నెదుర్కొంటున్నాం. పైశాచిక కృత్యాలతో మానవత్వాన్నే మంటగలుపుతున్న నర హంతకులతో పోరుతున్నాం. దీవించు తల్లీ!'

అంటూ, ప్రక్కనున్న పడాలు మొలనున్న బాకు బయటికి తీసి, తన అరచేయి కోసుకొని, ఆ నెత్తురుధారను మహాకాళి కభి షేకం చేసి—

"తల్లీ! యీ రుధిరం సాక్షిగా, నీ పాదముల సాక్షిగా, ప్రాణాన్ని తృణంగా బలిచ్చి, భారత స్వాతంత్ర్యంకోసం, తెలుగు దేశ సౌభాగ్యంకోసం పోరాడ్డానికి సిద్ధంగా వున్నాం. మాకు శక్తి నిచ్చి కాపాడు తల్లీ!"

అంటూ శపథం చేసాడు. ఆ శపథం చేసినప్పుడు పవిత్రధ్వనులతో, జేగంటలూ, శంఖారావాలూ మ్రోగాయ్.

రాజు ఒక్కొక్కరికీ, వారి బొటనవ్రేలిని తన బాకుతో చీరుతూ, ఆ వ్రేలినుండి చిందిన నెత్తురుతో మహాకాళీ నొసటికి రక్త తిలకం పెట్టిస్తున్నాడు. గంటం, పడాలు, మల్లు, ఎర్రేశు, అంతా ఐపోయారు. అంతా ఐపోయారనుకున్న సమయంలోనే, ఇంకొక చెయ్యివచ్చి ఆయన కళ్ళముందు చాపింది.

ఆ చేయి, ఒక స్త్రీ హస్తంలా వుంది. వెంటనే రాజు ముఖం చూచాడు. పురుషాకారం కనబడుతోంది. ఆ నెత్తిపై కాంగ్రెసు టోపీ, శరీరంపై ఖాదీదుస్తులూ, అన్నీ అచ్చంగా పురుషాకారంలోనే వున్నాయ్. రాజు అడిగాడు—

'ఎవరు నువ్వు?' అని

ఆ హస్తం చాచిన ఆకారం అంది—

"నే నెవరినైతే ఏం?"

"కాదు, చెప్పాలి!"

"ఎందుకు?"

"అనుమానంగా వుంది!"

'నాపైనా ? జలియన్‌వాలాబాగ్‌లో గర్భిణీస్త్రీలను మండు టెండలో పొట్టలపై ప్రాకించిన దురంతాలూ, శిశువులను చిత్రవధలు చేసిన ఘాతుకాలూ విని, వీటినుండి విముక్తి కలిగించు త్యాగ పురుషుడెవరా? అని వెదుక్కుంటూ వచ్చిన నాలాంటి స్వాతంత్రపి పాసిపైనా అనుమానం!'

"అవును. నీ ప్రతీమాటా నా కనుమానాస్పదంగానే వుంది. లేకపోతే, దేశంలో బ్రిటిషు కవచ శకట సాయుధబలాల కళ్ళ ముందు కరకుకత్తులు ఝళిపించి, భారత జానిసవిముక్తికోసం. తమ కవోష్ణరక్తం చిందించుతున్న యోధులను విడిచి, యీ మారు మూలల కొండకోనలకంటూ ఎందుకొచ్చావ్ ?"

ఆ ప్రశ్నకు ఆ రూపంలో నిర్వేదం ఆవరించింది—

"ఏమో స్వామీ ! ఎందుకొచ్చానో, ఎలా వచ్చానో నాకేమీ తెలీదు. నేనో తెగిన గాలిపటాన్ని. ఇక్కడ పడ్డా. మీ కాళ్ళకు చుట్టుకున్నా. పెద్దపులని తెలిసి దాని వాడికోరలకు నిస్సహాయంగా తన దేహాన్నందించే దేశాభిమానంకన్నా, దాన్ని వొరవిడిచిన బాకులా దూసుకుపోగలిగిన మీ వుద్వేగం నన్నుత్రూత లూగించి వేసింది - స్వామీ ! శతకోటి సముద్రఘోషై బ్రిటిషుసామ్రాజ్యాన్నే ముంచెత్తు మీ ప్రతాపం నన్నాకర్షించింది స్వామీ ! ఇక మిమ్మూ, మీ ఆశ్రమాన్ని విడిచిపెట్టను. నాకు మీ సేవాభాగ్యాన్ని కలుగ జేయండి, స్వామీ!" అంటూ కాళ్ళపై బడింది

చుట్టూవున్న కోయయోధులందరికీ ఆ సంఘటన అదో చిత్రాన్ని చూస్తున్నట్టుగా తోచింది. తనువే సమర్పించడానికొచ్చిన ఆయనను ఎందుకలా రాజు పరీక్షిస్తున్నాడో వారి కర్థంకాలేదు. తమలాగే ఆయనకు కూడా దీక్ష యివ్వడానికి ఎందుకు సందేహిస్తు న్నాడో వూహించుకోలేకపోయారు.

కాని రాజు వెంటనే సూటిగా అడిగాడు - ఆ రూపాన్ని మగవానిగానే భావించి—

'స్వతంత్ర సమరంలో చావుకు సిద్ధపడాలని తెల్సా?' అని అడిగాడు.

"మీ నీడలో ఏమైనా చేయగలను!"

రాజు మరల అనుమానాస్పదంగా—

'మగువలా మాట్లాడుతా వేంటి?'

సీత వులిక్కిపడింది - ఆమెకు త్యాగం ఆవేశించింది—

"మగువనా ? కాదు స్వామీ ! మీసమున్న మగోడ్ని. నా చర్మం వొలిచి మీ కాసనంగా వేయగలను. నా గుండె దొలిచి మీ అరచేతిలో పెట్టడానికి సిద్ధంగావున్నా ! ఇదిగో, యీ శరీరాన్నే మీకు సర్వాధికారాలతో అంకితమిస్తున్నా!" అంటూ శిరస్సు వొంచాడా యువకుడు.

"నా కెందుకు?" అని రాజనగానే. అందరూ రాజు అలా ఆయనను పరీక్షించడం ఇక సహించలేకపోయారు.

వెంటనే రత్తి—

"చేరదీయుడి స్వామీ!"

గంట —

"ఇటువంటి దేశభక్తుడ్ని విడిచిపెట్టకండి, స్వామీ!"

పడాలు—

ఆశ్రమంలో వుంచండి, స్వామీ!

గోవిందు—

'పోనీ మీకు పళ్ళూ, ఫలహారాలూ యిస్తుదు, నష్టవేంటి స్వామీ"

మల్లు—

"కత్తిలాంటి కుర్రోడ్ని వొద్దుల్తనంటరేంటి స్వామీ!" అంటూ, రాజు చెవుల కందిరీగల్లా మోగితెట్టారు.

అంతే. రాజు. ఆయన బొటనవ్రేలిని తన బాకుతో చీరాడు. ఆ వ్రేలినుండి చిందిన నెత్తురుతో మహాకాళి నుదుటికి నెత్తురు తిలకం పెట్టించాడు.

అలా నెత్తురు పెట్టగానే, ఆయన కానందం మితిమీరి ఒక్కసారిగా—

"అల్లూరి రామరాజుకీ" అనగానే, అంతా జేకొట్టారు.

ఇంతకీ ఆయనెవరో, ఏంటో ఏ ఒక్కరూ అడుగలేదు.

దీక్షా కార్యక్రమం పూర్తి అయింది-రాజు "మన్యం పితూరీకీ" అని పిడికిలి బిగించాడు. అంతా 'జై' అని నినదించారు. మహోద్రేకంగానున్న ఆ జన మధ్యనుండి రాజు ఓ పోటెత్తిన కెరటంలా ముందుకొచ్చాడు. ఆ రాజు ముఖాన్ని విశ్వరూపసందర్శనంగా భావించిన గంటం—

"అబ్బ! మీ ముఖంలో నెత్తురు విజృంభిస్తోంది రాజా!" అన్నాడు.

దీక్షపుచ్చుకున్న యువకుడన్నాడు—

"నెత్తురే కాదు జరాసంధుని చీల్చిననాటి భీముడు, హిరణ్యాక్షుని ప్రేగులు తోడిననాటి నారసింహుడు, లంకను దహించిననాటి వాయుపుత్రుడు—అంతా గుర్తుకొస్తున్నారు!"

మల్లుకు కూడా వుద్రేకం ఆగలేదు.

"అవును, పుట్టుకే రాజుపుట్టుక!" అన్నాడు.

పడాలు—

"నిజంగా మీరు యోగులు కాదు. మా విముక్తికి కంకణం కట్టుకున్న మహావీరులు..." అంటూండగానే, రాజు అడ్డుతగిలి—

"పడాలూ! మనజాతే వీరజాతి. వీరులుగా పుట్టాం. వీరులుగా చస్తాం!" అని గబగబా, అప్పుడే వస్తున్న అరుణోదయాన్ని చీల్చుకుంటూ, పరశురామునిలా ముందుకెళ్ళాడు.

అంతా వేడిలోనున్నప్పుడే వేడివేడిగా ఏదో ఒకటి చేయాలి. రాజుకంతా తెలుసు. ఆ పితూరీ జ్వాలాతోరణం ముందు ఏమూల నుండి కట్టాలో, ఏ మూల నుండి ప్రేల్చుకురావాలో, యే మూల కట్టినా, ఏ మూల ప్రేల్చినా ప్రేలడానికి సిద్ధంగా వుంది — మన్యం. ఇప్పుడు రాజుగా రగ్గిలో దూకమన్నా దూకడానికి సిద్ధంగా వుంది మన్యం.

అదంతా రాజుకు అర్థమైంది అయితే కొండలాంటి సామ్రాజ్యాన్ని ఎదిరి చాలన్న దృష్టినుండి అతను మరలలేదు. తుపాకితో, మరిఫిరంగితో ఎటువంటి వుద్యమాన్నయినా అణిచేయగలిగిన శక్తితోవున్న తెల్లవాడ్ని ఎదుర్కొంటున్నామని ఆయనకు తెలుసు. అంచేత 'తుపాకిని తుపాకితోనే ఎదుర్కోవాలి' అన్న సిద్ధాంతానికి వచ్చాడు రాజు. "చక్"మని వెనుదిరిగాడు. గంటాన్నుద్దేశించి—

"చింతపల్లి ఎన్నిమైళ్ళు?"

గంటం ఆ హఠాత్ప్రశ్నకు బిత్తరై అన్నాడు—

"అయిదుమైళ్ళు!"

అంతే. రాజు వూపిరి సలుపకుండా అన్నాడు—

"పదండి! అక్కడికే మన జనమంతా. ఆ బ్రిటిషు రాక్షస కోట చిహ్నంపైకి విరుచుకుపడాలి. ముందు తుపాకులు కావాలి తుపాకిని తుపాకితోనే జయించాలి!"

ఆ కోయయోధుల్లో "పదండంటూ, పదండ"న్న ధ్వనులు ముమ్మరంగా చెలరేగాయ్. అన్నివందల గొంతులూ ఒక్కటై పోయాయ్. ఒక్కసారి బిగ్గరగా "అల్లూరి రాజరాజుకీ జై!" అని నినదించాయ్.

ఆ నినాదానికి ఆకాశం చిల్లులుపడింది. ఆకాశంలోని మేఘాలు బెదిరి బెదిరి వురిమాయ్.

ఆ యోధులందరూ లెఖ్ఖకు మిక్కుటంగా నున్నప్పటికీ ఒక్కటిగా అయిపోయి, ఒక రాకెట్‌లా, ఒక టార్పెడోలా, ఒకే వేగంతో దూసుకుపోయారు.

# 17

సరిగా - పందొమ్మిదివందల ఇరవైరెండో సంవత్సరం ఆగస్టు ఇరవై రెండో తేదీని వుప్పెనలా విరుచుకుపడ్డారు చింతపల్లి పోలీసు స్టేషనుపై. అదే తొలి దాడి. జనం స్టేషన్ను చుట్టుముట్టాక రాజు లోనికెళ్ళి బల్ల గుద్దగానే సబ్‌ఇన్‌స్పెక్టరు హడలిపోయాడు. రాజు ఎవరినీ ఏమీ అనలేదు. అతని పగ తెల్లదొరలపైనే. కాని సబ్‌ఇన్‌స్పెక్టరువద్ద తాళాలు గుత్తి పుచ్చుకున్నాడు. లోపలవున్న పదకొండు తుపాకులు, పదమూడువందల తొంభై రౌండ్ల మందు గుండూ పది మందుసంచులు, పన్నెండు గొలుసులూ, అయిదు కత్తులూ, పద్నాలుగు బాయ్‌నెట్లూ, తొమ్మిది ఇనుపకడ్డీలు, ఇంకా అనేక వస్తువులూ తీసుకుపోయారు' వాటితోనే తెల్లదొరలు దేశాన్ని గుప్పెట్లో పెట్టుకోగలిగారని ఆయన వుద్దేశం. అంచేత వాటినే లాగుకున్నారు.

అది పితూరీకి ప్రథమ విజయం.

ఆ విజయానంతరం ఆ జగన్నాథరథం దడదడ లాడుతూ ఆ మరుసటిరోజునే క్రిష్ణదేవుపేట స్టేషనుపై దాడిచేసింది. అదో మెరుపు దాడి. భయపడి పోలీసులూ, సబ్‌యిన్‌స్పెక్టరు అంతా పారిపోయారు.

అప్పటివరకూ ఆకలితో బోనులో బంధించబడ్డ సింహం బయటికొస్తే ఏమవుతుంది. అసలు సామాన్యంగా సింహం అడవుల్లో వున్నప్పుడే ఆకలేసి లేళ్ళు విహరించే ప్రదేశానికొచ్చి, నేలానించి గర్జిస్తే

ఆ గర్జనకు చెవులు గింగురుఎత్తి నేలపై లేళ్ళు సొమ్మసిల్లి పడిపోతాయి. ఆ పడిపోయిన లేళ్ళను సింహాలు తమ గుహాలకు ఎత్తుకుపోయి తింటాయ్. అంతటి భయంకర గర్జనగల సింహం అంత వరకూ బోనులో బంధించబడి ఆవురావురుమన్న ఆకలితో బయట పడితే ఎలాగుంటుందో వూహించుకోండి.

అలాగే అంతవరకూ అణచుకున్న ఆవేశాన్ని రాజు ఒక్కొక్కసారి పొంగిస్తూంటే, ఆ పొంగులో ఒక్కొక్క స్టేషను కొట్టుకుపోంతోంది.

క్రిష్ణదేవుపేట స్టేషనుపై దాడిచేసి, అంతా పారిపోయాక, ఆ స్టేషనులో ఆరు తుపాకలూ, రెండువందల ఎనభై రౌండ్లమందుగుండు పదునాలుగు బాయ్‌నెట్లూ, అయిదు కత్తులూ, కొన్ని దుస్తులూ లాక్కుపోయారు.

ఇలా దుస్తులు లాక్కునే, వాళ్ళు పోలీసువేషాల్లో పోలీసులకే మస్కాలు కొట్టించేవారు. అలా కొట్టించడంలో అందెవేసిన రకాలు. ఆరితేరిన రకాలు. ఆ వీరుల్లో చాలామంది వున్నారు. అలా ఎప్పుడైతే పోలీసు దుస్తుల్లో కోయవీరులు వేషాలు వేసేవారో - ఆ కోయ ప్రజల్లో ఇదంతా రామరాజు మహిమే అని, అక్కడ రామరాజు అయితే ఇక్కడ పోలీసుఅయిపోయినాడని, ఆ విద్యతో ప్రతీవ్యక్తి పరకాయప్రవేశం చేయవచ్చుని - ఆ మన్యం నమ్మకం. ఆరకంగా రాజు శక్తికి దివ్యత్వం ఆ మన్యలో చేకూరుతోంది.

ఎప్పుడైతే ఒక్కరోజు తర్వాత ఒక్కరోజుకు, ఒక స్టేషన్ తర్వాత మరోస్టేషను కొడుతున్నాడో, పత్రికల్లో పెద్దపెద్ద శీర్షికలు వచ్చాయ్. ఆ పితూరిపోటును చూచి, పత్రికలన్నీ తమ నివ్వెర పాటును ప్రకటించాయ్.

కాని అంతకంటె నివ్వెరపాటు ఆ మరునాడు జరిగింది. అదో ఆశ్చర్యకరమైన సంఘటన. అది ఆశ్చర్యకరమైన సంఘటన అని అనుకోడానికి కారణం — అది అంతా అనుకోని విధంగా కావడమే.

చూడండి—

అది రాజవొమ్మంగి పోలీసు స్టేషను.

స్టేషన్ లాకప్‌లో వీరయ్యదొరున్నాడు. వీరయ్యదొర వెనుక లాగరాయి పితూరీలో పనిచేసాడు. ఆ పితూరీని యీ తెల్లదొరలు అణిచేసి, వీరయ్యదొరను మన్యంనుండి బహిష్కరించారు. అతనికి కుటుంబభత్యం యిస్తానన్నారు. ఎగ్గొట్టారు. ఇక ఆకలికి అల్లాడుతున్న తన కుటుంబానికి ఏదోరకంగా వుపాధి సంపాదిద్దామని తెల్లదొరల నిషేదాజ్ఞను ధిక్కరించి మరల మన్యంలో అడుగు పెట్టాడు. వెంటనే అరెస్టుచేసి, యీ లాకప్‌లో పారేసారు. అప్పటినుండీ లాకప్‌లో బ్రతకడంమాత్రం కష్టం; అనగా సెంట్రలుజైలులో ఖైదీ రోజూ స్నానం చెయ్యొచ్చు. ఇందులో వారానికొకసారే. అదైనాపది నిముషాలుకైమిచ్చి, లాకప్‌లోనున్న పాతికమందినీ స్నానంచేయ మంటారు. పైపు వుండదు. పెద్దనుయ్యి. పెద్దాపురం చాంతాడుకు తప్ప ఆ నూతి నీరు అందదు. ఆ నీరు ఒక చేదడు తోడేటప్పటికే పదునిముషాలవుతాయ్. మిగాతా మూడు నిముషాల్లో తోడిన చేదడులోపాతికమందీ స్నానం చేయాలి! చేయలేకపోతే వాడి ఖర్మ. ఆ మాత్రంలో స్నానం చేయడం, మట్టిలో వొలిగిన నూనెను పిండి కోవడంలాంటిది. అంతే తరువాత తిండి రెండుపూటలు పెడతారు. అదైనా వాడి ఆకలికి అరవైవంతుకూడా నిండదు. ఒక మట్టిచిప్పలో తినాలి. వండిన అన్నంలో రాళ్లూ, బెడ్డలూ, వొడ్లూ, వూకా, చచ్చిన పురుగులూ అన్నీ వుంటాయ్, ఒక పులుసు - అందులో చచ్చిపడిన బొజ్జింకలు మిరపకాయ ముక్కల్లా తేలుతూవుంటాయి. ఇక ఆ కాస్త భోజనం, కళ్ళుమూసుకొని, కడుపులో వేసుకున్నాడా - మరల లాకప్ కవాటాల్లో బిగిస్తారు. అందులో దుర్గంధం. వానికి దొడ్డి కొచ్చినా, ఒకటికొచ్చినా, ఓ చిల్లులుపడ్డ కుండ యిస్తారు. అందులోనే ఆ మలమూత్ర విసర్జన దాహమేస్తే, అటువంటి కుండలాంటిదే మరో చట్టి వుంటుంది. మట్టివాసన కొడుతున్న నీరు, ఆ దుర్గంధంతోపాటు త్రాగవలసిందే. ఇదీ ఆ లాకప్ బ్రతుకు. అటువంటి బ్రతుకు పగ

వానికైనా వొద్దు. పగవానికైనా వొద్దనికోరుకునే అ యేసు కూపంలో పిరయ్యా దొర గింజకొంటున్నాడు. ఆ స్టేషనులో బస యిన్స్పెక్టరు కూర్చునే సీటుపైని, గోడకు గార్ధభ వర్చస్సుతో వెలిగిపోతున్న రాజూ, రాణీబొమ్మ లున్నాయ్. టేబిలుపైనున్న పులితల, వారి పరిపాలనలోని క్రౌర్యాన్ని గుర్తుకుతెస్తోంది. ఆ టేబిలుపైనే ఓ మరఫిరంగి, వచ్చినవారిని బెదిరిస్తునట్లుగా వుంది. ప్రక్క రైఫిలు స్టాండూ, కఠారుల అర్రీ అమర్చివున్నాయ్. సబ్యిన్స్పెక్టర్ ఠీవిగా వచ్చి, సరిగ్గా స్టేషన్ గుమ్మంలో కాలుపెట్టగానే సెంట్రీజవాను 'టక్'మని కాలిమడమలు కొట్టి, శాల్యూట్ చేశాడు. ఆ శాల్యూట్ ముందుకు తిరిగి అందుకొంటుండగా, ఎదుట నోటీసు కనబడింది. అందులో యిలా వుంది—

'ది 24-8-22 పట్టపగలు యీ స్టేషను దాడిచేస్తున్నాం. తుపాకు లప్పగించుతారో; కాదని పోట్లాడుతారో, తేల్చుకోండి!

ఇట్లు

రామరాజు !!

ఆ నోటీసు చూడగానే సబ్యిన్స్పెక్టరుకు ముచ్చెమటలు గ్రమ్మాయ్. గుండె బాదుకొని కుర్చీలో అస్థిమితంగా పడిపోయాడు. అతని జవసత్వాలు భయంతో విసిగిపోయాయ్.

లాకప్లోనున్న పిరయ్యా దొర—

'కాస్ని మంచినీళ్ళు దాపోని కుచ్చుకోండి! సార్!' అని చమత్కారంగా ఓ చెణుకు విసిరాడు.

ఆ మాటకు ఎగిరిపడ్డాడు — సబ్యిన్స్పెక్టర్.

చెడా మడా నాలుగు తిట్టాడు. తన పోలీసుల్ని పిలిచాడు. ఎవ్వరూ పలుకలేదు. మరీ కంగారుపడిపోయాడు. ఏ నిముషంలో పితూరీదార్లు మీదపడతారో. రోజుకొక్క స్టేషను కొల్లగొడుతున్న రాజు అతనికి సింహస్వప్నంలా దృష్టిలో కొచ్చాడు. గింగురులెత్తి పోతు న్నాడు. కుర్చీలోంచి లేచి ముందుకెళ్ళి మరీ గట్టిగా అరిచాడు.

'ఏయ్! టూ నాట్ టూ!' అని.

'సార్!' అంటూ వచ్చాడు.

'ఏరీ మన వెధవలంతా!'

'ఏం సార్?'

'వేడిసారు లేదు చల్లసారు లేదు - ఇదుగో చూడు కళ్ళతో!' అంటూ ఆ నోటీసు ఆ పోలీసుల కందించాడు. ఆ వుత్తరం చూడగానే, భయంకరంగా కనబడ్డ 'రామరాజు!' అక్షరాలు చూచి 'రామరాజు! రామరాజు!' అంటూ నాలుక తడబడి, శరీరం దడపుట్టి నిట్టనిలువునా, చేతిలోనున్న తుపాకి వదిలేసి, నిలువుకాళ్ళమీదే, అలాకరిగిపోయాడు.

'ఏయ్ టూ నాట్ టూ!' అని గదమాయించాడు.

'ఇంకెక్కడి టూనాట్ టూ సార్! నా మాటవిని నీళ్ళు పట్టించండి సార్!' అంటూ పీరయ్య దొర మళ్ళీ ఎత్తిపొడిచాడు.

'నోరు ముయ్!' అని గద్దించాడు యస్. ఐ.

'మూయడానికిది మా లాగరాయిపితూరీ కాదులే. మన్యం మన్యాన్నే రగిలించిన రాజు పితూరీ. అగ్నిహోత్రం! జాగర్త!'

'Shut up!' అంటూ బూటు మడమ క్రిందకొట్టి, యీ లోపులో గ్రుక్కతిప్పుకున్న పోలీసుతో—

'త్వరగా నరసీపట్నం వెళ్ళి బాష్టియన్ దొరతో చెప్పి కొంత రిజర్వు పోర్సు పంపమను!'

'అలాగే, సార్!'

'వెళ్ళు!'

వెళ్ళపోయాడు పోలీసు.

అబ్బబ్బ! వుండనోయ్. అంత కంగారేంటి? కాస్త వుత్తరం తీసుకెళ్ళు. లేకపోతే అక్కడకెళ్ళి ముఖం వెళ్ళబెడతావ్!'

అంటూ గబగబా వుత్తరంరాసి, పోలీసువాసికిచ్చి, ముందు గుర్రమెక్కి దిగినోళ్ళని, వెంటనే సెంట్రల్‌చేయుమని చెప్పి మరీ వెళ్ళమని ఆజ్ఞాపించాడు.

'ముందు ఎక్కడకు వెళ్ళాలి సార్?'

'వల్లకాటికి!' అంటూ చిరాకుగా, వాడి టోపిపై ఒకటి కొట్టాడు. పోలీసు వెళ్ళిపోయాడు.

పోలీసు వెళ్ళిపోయాక మరలా నోటీసు చదువుకుంటూ ఖంగారుపడుతున్నాడు.

ఇంతలో ఓ గొల్లవాడు - గడ్డి మోపు నెత్తిన పెట్టుకొని సరాసరి స్టేషనులోకే వచ్చాడు. కాని చెవి వెనుక ఒక కాలి ఆరిపోయిన పొగాకు చుట్టా, ముక్కుకు కాడా, చెవులకు పోగులూ, చంకను ములుకర్ర పట్టుకొని వచ్చాడు - గెడ్డంమాత్రం బాగా మాసిపోయి వుంది.

'ఏం దొరా! అట్టా జెదురుతుండ్రు?' అన్నాడు గొల్లవాడు.

'ఎవడ్రా నువ్వు?'

'నే నెరికనేదేంటి దొరా! నేనే మీ బానిసోడి తమ్ముడ్ని.'

'ఆ గెడ్డం ఏంటిరా?'

'ఇదా భద్రాద్రిరామయ్య మొక్కు దొరా!'

'నీ అన్న రాలేదేం?'

ఆ ప్రశ్న సబ్ యినస్పెక్టరు వేయడానికి, తను గొల్లవానిగ అతన్ని నమ్మించగలిగినట్టు ధైర్యమొచ్చిందా-గొల్లవానికి. అన్నాడు.

'వా దొల్లు అగ్గిలా వుండాది దొరా!'

'మరి తేనెకుండ తెస్తానన్నాడు?'

'ఇచ్చిండు! నే నింటికి తీసుకుపోయి తమమ్మోరి కిచ్చిణ్ను!'

'అమ్మోరా Idiot?'

'నేదు దొరా - మా మన్నె పోళ్ళ మాటంతలే దొరా!'

'సరే, గాని అమ్మగారికి కంచెకోడి మాంసంపై పోయిందిరా!'

అని సబ్ యినస్పెకరు అనగానే, ఆ గొల్లవానికి వొల్లుమండింది. అతనికి తెలుసు. ఆ మన్యంలో యీ సబ్ యినస్పెక్టర్లు లంచాలు, దోపిడీలు ద్వారా, ఎంతమంది అమాయకులను హింసిస్తున్నారో? దానిపై విపిరాడు—

అమ్మోరికి మేకపోతుపై పోనేదూ?' అని.

సబ్‌యినస్పెక్టరుకు అరికాలమంట నెత్తికెక్కింది.

'Shut up!' అంటూ గద్దించాడు.

'షటప్పా! అదేంటి దొరా, తిడుతుంద్రు!'

'ఛీ పోరా! ముందు బయటికి పో! రాజు దాడికొస్తున్నాడు!' అన గానే ఆ గొల్లవాడు. ఆ సబ్‌యినస్పెక్టరు దడకు కారణాన్ని గ్రహిం చాడు. గ్రహించీ—

'అదేంటి దొరా! నే నిప్పుడు చూచిన్ను. వాగుదగ్గర నీళ్ళేసు కుంటుండూ! అదీగాక రాజు గుంటడులా వుంటడే. చేతికర్రకూడా నేదు. ఆ గుంటడుకోసం యీ కంగారేంటి? బయటందరు జవా న్లేంటి?'

ఇక సబ్‌ఇన్‌స్పెక్టరు మండిపోయి, ఆ గొల్లవానిని గెంటడానికి మెడపై చేయి వేయబోయాడు. నిప్పును తాకితే చల్లగా వుంటుందా? కాలుతుంది. కాలింది. వాడి ఎదుర్రొమ్ములపై ఒక బల్లెంవచ్చివెంటనే నిలిచింది. బయట జవాన్లను పిలువబోయాడు. 'సార్!' అనబోతున్న పోలీసు గొంతుక బయటో పితూరీదారుడు నొక్కాడు. అప్పటికే పితూరీదార్లంతా స్టేషను చుట్టుముట్టేసారు. వారంతా బయట ఏమేమి చేయాలో చేసేసారు. వారి గుండెలపై మోపిన బల్లెం దించి మల్లు ప్రత్యక్షమయ్యాడు. మల్లునుచూచే ముచ్చెమటలు పట్టాయ్ - వాడికి. దానిపై మల్లు—

'ఎవరనుకున్నావురా, వెధవనాయాలా!' అంటూ సబ్‌యిన స్పెక్టరును పొడవబోయాడు. ఆ గొల్లవాడు మల్లును ఆపుచేసాడు. మల్లుఆగిపోయాడు. వెంటనే బయటనుండి పితూరీదళం లోనికి ప్రవే శించిది—

'అల్లూరి రామరాజుకి జై!' అంటూ.

అప్పుడు తెలిసింది - సబ్‌యిన్‌స్పెక్టరుకు ఆ గొల్లవాడే రాజని. లేకపోతే త్రినేత్రుడు చెప్పితే వినని మల్లు ఆ గొల్లవాడు ఆపితే ఆగి

పోవడమేంటి? అంతేకాదు. రాజునుగురించి యింకా రకరకాల పుకార్లు వున్నాయ్. ఒకడు రాజు గొల్లవాడై పోవడమే కాదు. పులి కూడా ఐపోతాడనేవాడు. మరొకడు రాజు ఎన్ని అవతారాలైనా ఎత్తేస్తాడనేవాడు ఇంకొకడు రాజు ఒకేకాలంలో అనేకచోట్ల ప్రత్యక్షమయ్యే శక్తి గలవాడన్నాడు. ఇలా ఎన్నెన్నో సబ్ యిన్స్పెక్టరు విన్నాడు. కాని, నమ్మింది యిప్పుడే. నమ్మి—

'క్షమించండి!' అంటూ రాజు కాళ్ళపై బడ్డాడు.

'క్షమ! ప్రజలపైబడి తోడేలులా వేధించుకు తిన్నప్పుడులాగ లేదే ?' అని గంటం గసిరాడు.

'హు! పురిటినొప్పుల కబుర్లన్నా!' అని మల్లు యీసడించాడు.

'కాదు. నిజంగా అంటున్నా. బుద్ధివచ్చింది!' అని రాజుకాళ్ళు పట్టుకున్నాడు.

రాజుకు తెలుసు. వుల్లి మల్లికాదని, పంది బురదనొదిలి పన్నీట దొర్లదనీ, కుక్క చెప్పేగాని చెరుకుముక్క ముట్టదనీ, కాకి హంస కాదనీ, పిల్లి పులిగా, గాడిద గుర్రంగా ఎప్పుడూ మారదనీ కాని. ఆయన కవసరమైంది మాత్రం వాడినుండి తీసుకోవాలి. కనుక అడిగాడు—

'సరే, తుపాకులెక్కడ?'

ఆ మాట అనేటప్పటికి పడాలు కొన్ని ఆయుధాలతో అక్కడికి వచ్చాడు. పడాలిప్పుడు పూర్వపు పడాలులా లేడు యుద్ధ సన్నద్ధమైన ఒక సర్వసేనాని. యుద్ధంలో పోరుతున్న పౌరుషంగల ఒక సిపాయి ఎలా వుంటాడో అలా వున్నాడు చెవులకు అర్ధచంద్రాకార కుండలాలు, వీపున విల్లమ్ములు, మొలను విచ్చుకత్తి, మరో బాకు, వెడల్పాటి ద్వారబంధం తలుపుల్లాంటి ఛాతీపై పూసలు, చేతిలో తుపాకులూ వుండి, ఒక మహాయోధునిలా వున్నాడు.

వచ్చిరాగానే, అతనిచేతనున్న తుపాకులు రాజు కాళ్ళముందు వేసి—

'ఇవిగో, ఇవి యిక్కడెందుకుంటాయ్. మనలను కాల్చడానికి ముందే పోలీసుల చేతిలో పెట్టాడు! అనగానే—

'అన్న మడిగే అనాధులకు తుపాకు లాహారమా?' అంటూ గంటం నివ్వెరపోయాడు.

మల్లు గంధకంలా పొగలుగ్రక్కి—

'ముందు వీడ్ని పక్కలిరగదంతే?' అని ముందుకు దూకాడు.

రాజు అడ్డువచ్చి—

'మల్లూ! మన శత్రువు తెల్లోడు. ఈ కేతిగాళ్ళూ, యీతుపాకులూ లేకపోతే, వాళ్ళు మన దేశాన్నోక్షణం పాలించలేరు. తెల్సా'

సబ్ యినస్పెక్టరు రాజుమాటలకు ఆశ్చర్యపోయాడు వాడి కంతకుముందు రాజింత వుదారుడని తెలీదు. పశ్చాత్తప్తుడైనట్టుగా రాజును ప్రార్థించాడు—

'మీరన్నది యదార్థం రాజా! నన్నుక్షమించండి! మిమ్మల్నింత వరకూ అర్థం చేసుకోలేకపోయిన మూఢుడ్ని.

'హు! నన్నుకాదు. ముందునిన్ను నీవు తెలుసుకో, నీవాంధ్రుడివై వుండికూడా అరమరిక తెలియని అమాయికజాతిని అణగద్రొక్కుతావా ? తెల్లవాళ్ళకు తెలుగుసంపదను ధారాదత్తం చేస్తావా? మూర్ఖుడా!' అంటూ రాజు వానికి బుద్ధిచెప్పి మందలించి వొదిలాడు.

వెంటనే తుపాకులన్నీ వశపరచుకున్నారు. అక్కడనున్న రికార్డంతా తగులబెట్టారు. కోపమాగక మల్లు గోడనున్న రాజు, రాణీ బొమ్మ తునాతునకలు చేసివేసాడు.

రిమాండులోనున్న వీరయ్యను గంటం విడుదలచేసి, ఆలింగనం చేసుకున్నాడు వీరయ్యదొర ఆ ఆనందాన్ని, ఆ పితూరి వుత్సాహాన్ని చూచి తనూ వుత్సాహపడ్డాడు. అంతకు వీరయ్యదొరలో లాగరాయిపితూరీ నాటి వేడి చచ్చిపోయింది. కాని అతనిది గాయ

పడ్డ హృదయం. మరల రాజుపితూరీ కళ్ళారా చూడగానే ఆ గాయం రేగింది. రెచ్చాడు. 'చత్! ఏమైన సరే యీ తెల్లదొరల అంతు చూడాలనుకున్నాడు. వెంటనే రాజుకు వాగ్దానం చేసాడు—

'స్వామీ! నేను లాగరాయి పితూరీలో పని చేసినందుకు అరెస్టు చేసి, నా భార్యా బిడ్డలనుండి నన్ను వేరుచేసి విశాఖపట్నంలో దిగ్బంధం చేసారు. నా కుటుంబానికి భత్యం యిస్తానని ఎగ్గొట్టారు, వాళ్ళ కన్నీరు చూడలేక యీ మన్యంలో మరల నేను అడుగుపెడితే యిదిగో - యీ శిక్ష నాకు. స్వామీ! మీదయవల్ల, మీ పితూరీ చలవవల్ల నేను విముక్తుడనయ్యా. మీ ఋణం తీర్చుకుంటా. ఇక మీ పితూరిలో యీ క్షణంనుండి, నా శక్తినంతా ధారబోస్తా. నా కొనవూపిరి వున్నంతవరకూ, నా చివర రక్తంబొట్టు రాలునంత వరకూ యీ తెల్లవాళ్ళతో పోరాడితీరుతా!! అనగానే—

రాజు 'శభాష్! మనకు మరోసారథి దొరికాడ'ని వీపుతట్టాడు. అంతా ఒక్కసారిగా 'మన్యం పితూరీకిజై!' అంటూ నినాదాలు చేస్తూ బయటికొచ్చేసారు. ఆ నినాదాల ధాటికి ఆ స్టేషనుల్లో యింకా మిగిలివున్న ముక్కిపోయిన ఇటుకల గుండ రాలిపోయింది.

వెంటనే విజయచిహ్నంగా పడాలు గాలిలోకి తుపాకి కాల్చాడు. ఆ వెంట, ఆ కల్లోలిత జనతరంగం పడి దుముకుతూ పోతోంది. ఒక కొండపైనుండి క్రిందికి దుమికి, మరొక కొండపైకి ఎగబ్రాకే సెలయేటి ప్రవాహంలా.

ఆ పితూరీ హోమపు ఎర్రటి పొగలూ, వెచ్చటి సెగలూ, ఆంధ్రావని నంతా అలముకున్నాయ్ ఆంధ్రావనిలోని కోటలు, పేటలు, పట్టణాలూ, పల్లెల కన్నిటికీ పితూరీ అగ్నిజ్వాలలా ప్రాకింది. ఆంధ్రదేశం తూర్పుదిక్కు జేవురించినట్టు కనబడింది. విప్లవ సంజ కెంజాయలు ఆవరించినట్టు పొడగట్టింది. నారసింహునిలా మన్యం విజృంభించి, తూరుపు కొండలపై రక్తచందనం పూసి, గంగ సింధూరం కొట్టినట్టయింది.

అప్పటికే దేశంలో సహాయనిరాకరణోద్యమజ్వాలలు చల్లారిపోయి, నిరాశతో, నిస్పృహతో పూరవతల మాలపల్లి మాటుమణిగిపోయి నట్టుంది. అలా మాటుమణిగిన భారతదేశానికే రాజు వేగుచుక్కయ్యాడు. మన్యం ఎత్తినదివిటీ కాంతి-తన జ్వాజ్వలమానమైన అరుణకిరణాలను ఒక్కసారిగా దేశం నాలుగు మూలలకి వెదజల్లింది.

ఆ కాంతిలో—

'మూడు రోజుల్లో మూడు స్టేషన్లు కొట్టగల్గినమన్యం పితూరీ' అంటూ పెద్దపెద్ద శీర్షికలతో పత్రికలన్నీ ఆ పితూరీ గొప్పతనాన్నీ దాని విప్లవ తేజస్సునీ, కళ్ళకు కట్టినట్టు చిత్రించాయి.

అన్నిటికంటే స్పష్టంగా చిత్రించింది - అనుకోకుండా అసలు పితూరీకే తారు పూద్దామని తలంచిన తెల్లప్రభుత్వమే.

ప్రజల్లో అలజడి, అందోళన కనిపెట్టి, మన్యంపితూరీ స్వరూపాన్ని ప్రజలముందు చిన్నిగొంతుగా చూపుదామని ప్రయత్నించి, ఒక ప్రకటన చేసింది—

ఆ ప్రకటనలో చెప్పింది—'రాజవొమ్మంగి స్టేషనుపై దాడి జరిగిందనీ. ఎనిమిది తుపాకులూ, ఎనిమిదివందల యిరువైఅయిదు రౌండ్ల మందుగుండూ పోయిందని.'

అసలు ప్రభుత్వానికి తుపాకి పోవడమంత ప్రమాదకరమైందియింకొకటి లేదు. అందులో ఒక్కస్టేషనులో ఎనిమిది తుపాకులు. ఎనిమిదివందల ఇరవై అయిదు మందు గుళ్ళు. అదీగాక అంతకు ముందురోజు ఒక స్టేషను, దానికిముందురోజు మరోస్టేషను వరుసగా కొట్టేస్తోంటే, అర్థం చేసుకోలేనంత అమాయకులూ, మూర్ఖులూ అంధ్రులు కారు. అంధ్రులే అంత తెలివైనవాళ్ళయితే వీళ్ళు దేశాన్నెలా నమ్మించగలరు?

నయం! మన్యం పితూరీకి ప్రకటనన్నా చేశారు. అసలు ప్రక టనే చేయకుండా మాడ్చేసిన వుద్యమాలు ఎన్ని లేవు ?

సరిగ్గా అప్పటికి ఎనిమిదేండ్లకు ముందు భారతదేశమునుండి కెనడా తరలిపోయి, అక్కడ పంటపొలాలపై కష్టించి, కష్టించి విప్లవావేశం చావక, కానీ కానీ చొప్పున ప్రోగుచేసి 'కామాగ టామారా' అనే జపాను ఓడను కొని, కలకత్తాకు రాగలిగిన పంజా బుగదర్ వీరులనుబట్టి, నిలువునా కలకత్తా రేవులోనే మరఫిరంగులతో కాల్చివేసి, అనేకమందిని హత్యజేసిన యీ తెల్లముష్కరుల సంగతి భారతావనికి బాగా తెలుసు. అంతకంటె బాగా తెలుసు - మరొక్క విషయం. అదేసమయంలో ఆ గదర్ వీరులు తప్పించుకొని పరు గెడుతూ, ఆ మరఫిరంగులకూ, ఆ ముష్కర సైన్యాలకూ యిచ్చిన మెరుపుయుద్ధం! కొట్టిన పిడుగుదెబ్బ! భారతీయుడెవడూ లక్ష జన్మ లెత్తినా మరచిపోడు. వాళ్ళు దాయాలనుకున్నా దాచలేక పోయారు.

కాని వాళ్ళ గుండెలు మాత్రం దడదడ కొట్టుకుంటూనే వున్నాయ్. క్రూరత్వం గలిగినవాడే పిరికికి బానిస. శూరత్వం గలిగినవాడిలో ధైర్యం వుంటుంది, ఆ ధైర్యం వాళ్ళకు లేదు.

కాకినాడలో రాజమహేంద్రి స్టేషను కొట్టినరోజునే జిల్లా కలెక్టరు బ్రేకన్ కాలు కాలిన కోతిలా గంతులేస్తున్నాడు-పత్రికల వార్తలు విని.

ఫోనువద్దకొచ్చి, ప్రతివార్తను D.S.P.కి ఫోనులో చర్విత చర్వణంచేయ మొదలెట్టాడు. అంటాడూ—

"చూసార్, న్యూస్! మనకు Official ఇన్ఫర్మేషనులేదు. స్టేషన్లలోనున్న పోలీసు ఫోర్సు అంతా లొంగిపోతోందట. దారుణం! తక్షణం హుటాహుటిని రిజర్వుఫోర్సును పంపాలి. మొగ్గలోనే త్రుంచాలి తిరుగుబాటుని. ఇప్పటికే ప్రజలతో పెనవేసుకుపోయింది పితూరీ, యూ హారిబ్రియస్! హర్రియస్! అని.

వూపిరందక ఫోను దించేశాడు. ఇంకో క్షణానికి ఆఫీసు ముందు "జీప్" వచ్చి ఆగింది. దానినుండి చెమటలు గ్రక్కుతున్న బాస్టియన్ దిగాడు. ఆ దృశ్యాన్ని మేడపైనుండి చూచిన కలక్టరు వెనక్కి తిరిగి వెళ్ళి కుర్చీలో కూర్చున్నాడు. ఎదురుగా వొంగుకుతూ బాస్టియన్ ప్రత్యక్షమయ్యాడు.

"ఏమిటీ అజాగర్త! కళ్ళుపొరలు కమ్మాయా? లేక మత్తెక్కి వొళ్ళుమరచి చరిస్తున్నారా? బ్లడీషేమ్ ! బ్రిటిషు ఎంపైర్ కే సిగ్గు, సిగ్గు!" అంటూ లేచి, డాబా అంచుపైకి వెళ్ళాడు. మూడు రిజర్వు లారీలొచ్చి మేడక్రింద ఆగాయ్. కలక్టరు వుషారైపోయి, పెద్ద పెద్ద అంగలేస్తూ వెనక్కివచ్చి—

"బాస్టియన్! ముందు Spot కు వెళ్ళు ! ఆ రిజర్వు పోర్సు సాయంతో, తప్పించుకుపోయిన రామరాజును ఇరవైనాలుగు గంటల్లో పట్టి అప్పచెప్పడం, పితూరీగొడవ ఇక ప్రభుత్వం దృష్టికే రాకుండా చేయటం జరగాలి. లేదా-ఖబడ్దార్! Go at once!" అంటూ హుంకరించాడు.

బాస్టియన్ వెనక్కి వెళ్ళాడు. క్రిందికెళ్ళి జీపులో కూర్చున్నాడు. వెనుక లారీలు కదిలాయ్. కలక్టరు మేడమీదనుండి తీక్షణంగా, ఆతృతగా ఆ దృశ్యం తిలకించాడు.

అక్కడకు తెల్లదొరల అదనపు సిబ్బంది వెళ్ళింది.

ఇక్కడ మన్యంనుండి వెళ్ళిపోయిన తల్లి నారాయణమ్మ నర్సాపురం చేరుకుంది. చేరి బండిదిగి ఒగుర్పుతో రామకృష్ణంరాజుగారి గుమ్మంముందు స్పృహతప్పి పడిపోయింది. ఆఫీసులో రాసుకుంటున్న రాజుగారు బయటకొచ్చి, ఆమెనులేవదీస్తూ—

"వదినా?" కళ్ళ తడి పెట్టుకున్నాడు

"నేను చచ్చి నీ కడుపున పుడతా. నా బిడ్డను కాపాడవ్ ? ఆ సర్కారు చెరనుండి విడిపించవ్? అంటూ ఆమె పలవరించింది.

"నీ బిడ్డ నా బిడ్డగదా వొదినా'" అంటూ రామక్రిష్ణం రాజు గారు నీళ్ళు నమిలారు, బొడ్డుదగ్గరనుండి వచ్చినమాటకు విలువ, బరువు వుంటుంది. కాని రామక్రిష్ణంరాజుగారి మాటలో బరువులేదు.

నారాయణమ్మగారు లేచింది—

'అయితే నా బిడ్డడ్ని కాపాడతానన్నమాట నీ నాలుకనుండి ఎందుకు రాలేదు? నా బిడ్డడ్ని మీరంతా ఏకాకిని చేస్తారా? చెప్పు, రక్షించవ్? మీ సర్కారుకు నా గుండెకోసి, పువ్వుల్లోపెట్టి ఇచ్చు కుంటా. నా బాబును విడిచిపెట్టమనవ్?' అంటూ మాతృమమతతో ప్రాధేయపడింది.

'వదినా! నేనూ సర్కారు సేవకుడనే. కాని రాజు చేసిన పని...సర్కారుపై తిరుగుబాటు. క్షమించ వీలులేని పని...'

తల్లిక సహనంకోల్పోయింది.

'నీ బిడ్డే నీకు ఎదురుతిరిగితే తలకొడతావా? సంకెళ్ళు తగి లించి వూరూరా త్రిప్పుతావా? చెప్పు! నీ బిడ్డడని చెప్పుకుంటూ నా రాజు శిరస్సును జేతులారా కొట్టిస్తావా? అంత మహాపాపానికి వొడి గడతావా? చెప్పు! పలుక వేం?' అంటూ గింజాయించింది.

అతను మౌనంగా తన నిస్సహాయతను వెల్లడించాడు. ఆ తల్లి వుద్రేకపడింది—

'కానివ్వండి! నా కొడుకుపై మీరంతా కలసి కసిదీర్చుకోండి! దేముడున్నాడు, తల్లినున్నాను. నా శిరస్సు నేల పడ్డాకే నా బాబు శిరస్సుకూడా పడుతుంది.' అంటూ బయటికొచ్చేసింది. చుక్కానిలేని పడవలా ఆ గాఢాంధకారంలో ధైర్యంగా గడపదాటింది—తల్లి. ఆ తల్లికిక భయంలేదు. తెగించనంతవరకే భయం. మునగనంతవరకే చన్నీళ్ళు చలి. ఇక మునిగితే ఏముంది!—అంతే ఏదైనా.

ఇక్కడ కాకినాడనుండి బయలుదేరిన లారీలు మన్యాన్ని నెత్తురు టేరుల ముంచెత్తడానికి ఏలేశ్వరం రోడ్డుగుండా వాయు వేగంతో వస్తున్నాయ్.

ఆ వార్త వారికంటె ముందు వారికి శింగన్నద్వారా తెలిసి పోయింది.

అప్పటికే బాస్టియన్ ముందుగా తిరిగివచ్చి, మన్యం మన్య మంతా ఒక చాటింపు వేయించాడు. ఆ చాటింపులో చెప్పించాడు—

రాజును బ్రతికుండగాగాని; చచ్చిపోయినగాని శవాన్ని తెచ్చినా, రాజును తెచ్చినా, పదివేలరూపాయల బహూమానం అన్నారు. గంటం, పడాలు, మల్లులను పట్టుకుంటే అయిదువేలన్నారు. ఎగ్రేశు వగైరాలను పట్టుకుంటే వెయ్యన్నారు.

ఆ చాటింపుకు మన్యంలో అసలు స్థానమే దొరకలేదు.

ఎవ్వరూ పాటించలేదు.

అలా పాటించలేదన్న కోపం, బాస్టియన్‌కు నరనరాలకు ఎక్కి పోయింది. ఎలాగైనా రాజును పట్టుకోవాలని, పితూరీని అణిచి వేయాలని వాడి ప్లాను. అందుకే ఏలేశ్వరంగుండా వస్తున్న లారీల ముందు జీపుతో తనూ వస్తున్నాడు.

దానికి పైయెత్తు వేసారు పితూరీదార్లు.

ఏలేశ్వరం సెంటరుబీటులో నిలబడి ఒక పోలీసు దుస్తుల్లోవున్న పితూరీదారుడు, వస్తున్న లారీని తప్పుడైరక్షన్‌తో ప్రక్క కొండ కనుమల కానియున్న పొదలవైపుకు మళ్ళించాడు. ఆ లారీతోపాటు తతిమావన్నీ ఆ దారినేపోయాయ్. వెళ్ళివెళ్ళగానే పొదలమధ్య చిక్కుకున్నాయా లారీలు.

ఇంతలో శత్రువుల చెవులకే వినబడనంతటి, ఆఖరికి పాము చెవులకు కూడా వినబడనంతటి ఓ చిన్న రాతిశబ్దం ఆ పొదల వెనుక

నుండొచ్చింది. ఆ శబ్దంతోపాటు వరుసగా పంక్తులలో నిలచివున్న పొదలసందున కొన్నివందల రాళ్ళు అంతేశబ్దం చేసాయ్. వెంటనే ఒక మూలనుంచి అమ్ముమొచ్చి పడింది. ఆ అమ్ము తిన్నగా, ముందున్న లారీటైరుపై ప్రయోగించబడింది. కోయవాని శక్తికి తిరుగులేదు. లారీటైర్లు Burst అయిపోయాయ్ ఆ వెనుకవచ్చిన లారీలన్నీ ఆగిపోయాయ్.

పితూరీదార్లు ఒక్కుమ్మడిగా తలోకొమ్మనుండి, పలవనుండీ, ప్రతీ పొదనుండివచ్చి ఆ లారీలను చుట్టుముట్టారు. బిత్తరై బీభత్సం చెందిన పోలీసులు చేతులెత్తారు. 'Hands up' అని రాజు గర్జించ గానే హడలిపోయి, బ్రతుకు గుర్తుకొచ్చి మౌనం దాల్చేసారు.

రాజు పోలీసుల నుద్దేశించి అన్నాడు—

'తెలుగుగడ్డపై పుట్టి, తెలుగునెత్తురు పంచుకొని సాటిసోదరులైన తెలుగుబిడ్డలపైనే కత్తి కడతారా? స్వజాతి నీతి త్యజించి, పరజాతి అవినీతికి బానిసలౌతారా?' అని.

పితూరీదార్లు మాత్రం వాళ్ళ తుపాకులన్నీ లాక్కున్నారు. లాక్కున్న తుపాకులనే ఒక్కసారి గాలిలోకి ప్రేల్చగా భయపడి పోలీసులు పారిపోయారు. తుపాకులేగాక, పోలీసుల సామానులన్నీ పితూరీదార్ల వశమైపోయాయ్.

పలాయనమైన పోలీసులు, ఆ బాస్టియన్‌దొర కాకినాడ కలక్టరు కచ్చేరీ ముందుకువచ్చారు. కలక్టరు మేడపైనుండి వారిని చూచాడు. ప్రక్కనున్న D. S. P. తో సహా గబగబా క్రింద కొచ్చాడు. వాళ్ళ పడుపుముఖాలు, 'వోటమి తత్వాలు, వానికి అర్థమైపోయాయ్. వాళ్ళు అలా వస్తూంటే పోలీసులు మరి వొణికి పోతున్నారు.

'ఏం జరిగింది?' గద్దించాడు కలక్టరు.

'పితూరీదార్లు చుట్టిముట్టి...' అంటూ గడగడ వొణకడం మొదలు పెట్టారు.

D. S. P. ఆ మాటందుకొని—

'చుట్టుముడితే చవటల్లా కాల్చకుండా వొచ్చేసారా?'

'కాల్చాం సార్! తుపాకులు ప్రేలలేదు సార్?'

కలక్టరు ఆశ్చర్యపోయి—'What?' అని అత్యృతగా ప్రశ్నించాడు.

'అవునుసార్! మంత్రంవేసాడు సార్ - రాజు!'

Nonsense! ఇదంతా మోసం. మీరు వాడితో కలిసి కుట్ర పన్నిన విశ్వాసఘాతకులు, నమ్మకద్రోహులు. ఒక తెలుగు తిరుగుబాటును అణచడానికి తెలుగు పోర్సునే పంపడం మాది బుద్ధి తక్కువ..."

అంటూ D. S. P. తో—"వీళ్ళందర్నీ సస్పెండుచేసి వీళ్ళ ద్రోహాల్ని కోర్టుముందు పెట్టండి!"

అంటూ! బాస్టియన్‌తో—

"బాస్టియన్. జాగర్త! వొళ్లు దగ్గరపెట్టుకొని మసులుకో - పో! మన బృందాన్నంతటినీ గ్రామాలపైకి తోలు. తిరుగుబాటు వ్యతిరేక ప్రచారం చేయించు - ఆ పైని నేను చూసుకుంటా." అని గబగబా టకటకా నడుచుకుంటూ మేడపైకి వెళ్ళాడు. వెనుక D. S. P. కూడా మేడపైకి వెళ్ళాడు. అప్పుడు చూడాలి - ఆ కలక్టరు బ్రేకన్‌దొర అవస్థ. శరీరమంతా చెమటపట్టేసింది. ఆచెమటే గాని పడితే ఒక రిజర్వాయరే నిండిపోతుంది. ఆ చెమట పట్టడంతో పాటు, తెలుగు సైనికులు తనకేదో అన్యాయం చేసి వేసారని తలచుకుంటే చాలు వాడి గుండె బీటలు పడిపోతోంది.

వెంటనే ఫోనెత్తి—గవర్నర్ వెల్లింగ్డన్‌తో మాట్లాడుతున్నాడు—

"Yes Sir" నేను డిస్ట్రిక్టు కలక్టరు ఆఫ్ ఈస్టు గోదావరి సార్! ప్రజాసంరంభంతో కూడిన తిరుగుబాటు చెలరేగింది సార్! Special force అత్యవసరం సార్! ...Yes Sir...అలాగే సార్! ఇప్పుడే నేను జయపురం రాజాకు తాఖీదుపంపి, ఏనుగుల్ని రప్పిస్తా సార్! సార్! ... అవునుసార్! అడవుల్లో ఏనుగుల వుపయోగం మంచి Result యిస్తుంది సార్!... Yes Sir ... యిప్పుడే పంపుతా, అలాగే సార్! Special Train లో వచ్చేలా చూడండి సార్! Yes Sir! Thank You Sir!" అంటూ పెద్ద ఆయాస పడినవాడిలా ఫోను పెట్టేసి, ఏదో పెద్ద బరువు దించుకున్నవాడిలా, ఫోనులో గవర్నరుతో మాట్లాడిన సమాచారం D. S. P.కి తుణ్ణంగా చెప్పాడు. ఆ చెప్పడంలో వానికొక ఆనందం వుంది. ఎవడైనా వాడికి వాడన్నా ఆలోచించుకో లేకపోదే భూమిపై బ్రతకడమే దుర్లభం కదండీ!

# 18

ఆనాటి రాత్రే చెన్నపట్నంలో సెంట్రల్ స్టేషను టవర్ క్లాక్ "టంగ్ టంగ్" మంటూ ఏడుగంటలు కొట్టింది. అదే స్టేషన్నుండి ఒంటి కన్ను రాకాసిలా రైలు ధూమాన్నెగజిమ్ముతూ, రొప్పుతూ రొజుతూ బయలుదేరింది. ఆ రైలు పెట్టెల నిండా ఉక్కుటోపీల సైనికులు విచ్చుబాకుల తుపాకీలు ధరించి, ఉక్కు స్థంభాల్లా చెక్కు చెదరకుండా నిలుచున్నారు. కదిలింది రైలు. దడదడలాడుతూ భూతలం అదిరి పోయింది. అ అదురులో చెన్నపట్నంలో ప్రతీ యిటుకలోనూ తమ రక్తంనింపి, ఆంధ్రులు కట్టించి, నగరస్వరూపా నికి వన్నెచిన్నెలు తెచ్చిన అధుపాతన భవంతుల పునాదులన్నీ పెటపెట లాడిపోయాయ్.

అలా పెటపెటలాడిన భవంతుల్ని వాటిఖర్మకి వాటిని వొదిలి పెట్టి, రైలు నెల్లూరు చేరుకుంది. దౌష్ట్యాల్ని ధిక్కరించడంలో

గండపెండేరాలు తొడిగించుకున్న నెల్లూరు ఆ రాక్షసాధములు ఎక్కినరైలు చూచి కనులెఱ్ఱచేసింది.

ఒకనాడిచ్చటే తీవ్ర మతయుద్ధాలతో ఆంధ్రదేశం రక్తప్లావిత మౌతున్నప్పుడు కవిబ్రహ్మ తిక్కన తన కలంనుండి మత సామ రస్యాన్నీ, శాంతి తత్వాన్ని చింది, హరిహరి బేదం అర్ధరహితమని ఆంధ్రదేశానికి చాటడానికి "...వేదవ్యాసవచోవిభవలక్ష్మ హరిహర నాథా! అని వైష్ణవ, శైవమతసంఘర్షణను అంత మొందించే మహా తత్వాన్ని ప్రబోధించాడు.

యతియుంప్రాస లేని సంస్కృత కవిత్వారణ్యమందున్న మహా భారతంలోని పదిహేను పర్వాలను ఆంధ్రత్వం నేర్పి, భావగాంభీర్య తను, శ్లేషను, వాక్చమత్కృతిని, రణవరణ తోరణాల్లాంటి తెలుగు పదవిన్యాసంలో కేళి సల్పించిన దిక్కడే, ద్రౌపదిని చెరబట్టిన కీచకుని, తీరనిద్వేషంతో భీముని గదాఖండానికి బలిచేసి, నెత్తురు కక్కించి, సతుల పాతివ్రత్యాన్ని వేనోళ్ళచాటిన దిక్కడే.

ఈ నెల్లూరు సీమలోనే ఖడ్గతిక్కన అవతరించి, తన వీర శౌర్య ప్రతాపాలను ప్రదర్శించి, క్షాత్రవతేజస్సుతో కత్తి ఝులిపించి వీర స్వర్గమందిన పవిత్రస్థల ముంది.

అటువంటి మహామహుల రణస్థలినికూడా తొక్కుకుంటూ ఆ బండి, పెన్న వంతెనెక్కింది. పెన్నకు కోపమొచ్చింది. ఆ బండి ఎక్కి ఎక్కడంతోనే నిలువెత్తులేచి, దాని ముఖాన్ని వుమిసింది.

బండి ఆ వుమ్మును తుడిచేసుకుంటూ ముందుకెళ్ళిపోయింది. దుష్టుడన్నవాడికి సిగ్గేమిటి? పాపభీతి ఏమిటి ?

కాని ఆ నెల్లూరిసీమకు అనుకునే వుంది - రాయలసీమ. సిరికి పరదా పద్ధతిని తొలగించిన రత్నాలసీమ యిది. ఇప్పుడుకాదు. ఇప్పుడు రత్నాలసీమ అన్నదానికి విరుద్ధమైన రాళ్ళసీమ. కాని ఒకప్పుడు యీ రాయలసీమలో - అనగా శిలలు ద్రవించి ఏడ్చిన తుంగభద్రలో రాయలు కళింగాన్ని జయించి, కత్తి కడిగిన కాలంలో

చాని నడివీధులలో మాణిక్యాలు కుప్పలువోసి అమ్మేవారట. ఆంధ్ర కవితకు పచ్చని పందిళ్ళువేసి, మంగళహారతులిచ్చిన కాలమది. తెలుగుకైత బంగారుగజ్జెలతో గళ్ళుగళ్ళున శృంగారనాట్యంచేసి, రాయలంతటి మహారాజరాజుని, దక్షిణాధీశుని మదకరీంద్ర మాపి కేయూతతో అంబారీలెక్కిన కాలమది. అప్పుడు దాని రాజధాని హంపీ. రండి, చూడండి! ఇదిగో ఇది హోస్పేట. ఇక్కడకు సరిగ్గా ఎనిమిదిమైళ్ళదూరంలోనే వుంది-హంపి. హోస్పేటనుండి హంపివరకూనున్న దారిపొడుగున యిప్పుడు జీర్ణమై, కరకుతురకల ధాకాలధాటికి బ్రద్దలై కొల్లగొట్టబడి, శిథిలమైన చిహ్నాలు కనబడుతున్నాయ్. బ్రిటిషువాళ్ళు పీడించి, పీడించి పిండిచేసిన చెరకుపిప్పిలా వుందికదా-ఆ బాట.

కాని యీ బాటలోనే అప్పుడు దారికి రెండువైపులా ఎనిమిది మైళ్ళ పొడుగునా రత్నాల అంగళ్ళు వుండేవి ప్రపంచంలోని అయిదు ఖండాల వర్తకులు యిక్కడకొచ్చి వర్తకం చేసేవారప్పుడు. దిక్కులేక మన అంగళ్ళనుండే వైఢూర్యాలను కొనుక్కుపోయేవారు.

హోస్పేట వెళ్ళిపోయి హంపి వచ్చింది.

"ఒక పర్వతాగ్రమెక్కి నలుదిక్కులా చూచినప్పుడు యీ వూరు జగత్ప్రసిద్ధమైన రోమనగరాన్ని మరిపిస్తున్నదని ఒక పోర్చుగీసు దేశస్థుడే అన్నాడంటే వూహించండి-దీనిసౌందర్యం.

చూడండి! విరూపాక్ష దేవాలయం. ఇది రాయల కులదేవతా మందిరం. దీని స్తంభాలు మ్రోయిస్తే సప్తస్వరాలు పల్కుతయ్. ఆ సప్తస్వరాలూ పల్కించినవానికి సరస్వతి ప్రసన్నమయ్యేదట.

ఇది హేమకూటం. దీని ముందున్న విగ్రహం ఒక రాతిబండను దొలిచి చెక్కిన చక్కని శిలావిగ్రహం. ఆ వినాయకుని బొడ్డులో వ్రేలుపెట్టి చూడండి-ఎంత నునుపుగా వుంటుందో-శిల్పం తెలిసిపోతుంది.

ఇక ఆనాటి విజయనగర వైదిగ్ధ్యాన్ని దిగ్దిగంతాలకు చాటి చెప్పిన గజశాల చూడండి. గజశాలకు కూడా శిల్పం పొదివించిన మొదటి రాజు రాయలేనంటే మరచిపోలేం.

ఇంకొక శిల్పవిశేషం-విఠలస్వామి మందిరంలోని రాతిరథం. వీరభోగ వసంతరాయలు అవతరిస్తే యీ రాతికోడి కూసి, ఈ రాతి రథం కదలుతుందని-జననమ్మకం.

అలా జనానికి నమ్మకం కలిగించగలిగిన విశేషాలు అనేక మున్నాయ్-అక్కడ!

అష్టదిగ్గజాలన్న ఖ్యాతినందిన మహాకవులు కవితావిన్యాసం చేసిన రంగవల్లి అది. తెలుగు విన్నాణసులు రాణచెంది, అన్ని ఖండాల్లోనూ మెరపించగలిగిన విద్వత్కర్మాగార మది.

ఇక దాని నానుకొని వున్నదే-అదే గుంటూరుసీమ. పదిహేడు తరాల క్రిందనే తెలుగు శాతకర్ణుల శిల్పకళకు చిహ్నమై నిలచింది-అమరావతి.

ఈ అమరావతిలో దొరికిన జాతివజ్రం - కోహినూరు. తమ బాబుసొమ్మల్లే యీ అమూల్య వజ్రాన్ని బ్రిటిషు రాణి తన సువర్ణ కిరీటంలో స్థాపనం చేసుకొంది. ఆ వజ్రం లేనిదే ఆ కిరీటానికి కాంతి లేదు విలువ లేదు.

అయినా యీ బ్రిటిషు ధృతరాష్ట్రులు వజ్రాల్నీ, ధనాన్నీ, శ్రమజీవుల శ్రమనూ కొల్లకొట్టడమేగాక, అమరావతి స్థూప కళా ఖండికలను బ్రిటిషు వస్తుప్రదర్శనశాలలో దాచేసుకున్నారు.

ఈ అమరావతి కొలది దూరంలోనే నాగార్జునుని బౌద్ధమత చిహ్నముంది.

సకలశాస్త్ర పారంగతుడైన నొక బౌద్ధపండితుడు జ్ఞాపక చిహ్నమది.

అదే నాగార్జునం.

ఇక్కడో బ్రహ్మాండమైన ఆరామం. అందులో ఒక విశ్వ విఖ్యాతమైన నలందాలాంటి విశ్వవిద్యాలయముండేది.

ఇక్కడనుండే బౌద్ధం సముద్రాంతర ప్రయాణంచేసి, జపాను వరకూ విస్తరించి వేళ్ళూనుకుందీ. ఆ శిల్పఖండాలు - చూసారూ ! ఇవిగో, ఇవే చెదలుపట్టి, పుట్టలుపెరిగినా వాటి శిల్పకళ జీవకళను, వెక్కిరిస్తూనే వుందింకా. ఇది కృష్ణానది కావలముఖాన వుంది.

ఈవల ముఖానికి ముఖద్వారమైన బెజవాడ దాటిపోయింది- బండి. క్రిష్ణవేణి సొమ్మసిల్లి తన కురులసందున తన సుందరవదనాన్ని దాచేసుకుంది- ఆ బండిని చూసి.

అయినా నిర్లక్ష్యంగా ఆ రైలు దూసుకుంటూ వచ్చేస్తోంది. తన రాక్షసబలంతో దారి దారికడ్డుగా నిలచిన అనేక స్టేషన్లను దూరంగా విసిరివేసి, మరీ పోతోంది.

ఆ పోతున్న రైలుబండినుండి ఓ గొంతుకు వినబడుతోంది. ఆ గొంతుకో భిక్షుకిది. ఆమె వొడిలో ఒక పసిబిడ్డ వున్నాడు - ఆ పసి బిడ్డ పాలకోసమే - ఆమె యాచన.

"నిదురలో నున్నావో
నిష్టలో నున్నావో
కన్నెత్తిచూడుమో - దేవా ?
నరులు శత్రువులైర దేవా ?"

అంటూ ఆలపిస్తోంది - భిక్షుకి, ఆ గొంతు ఆగింది. రైలు గోదావరి వంతెనెక్కింది. ఒక సైనికుడు ఆభిక్షుకిని బలాత్కరించాడు. రాక్షస రతికి బలవంత పెట్టాడు. ఆమె అంగీకరించలేదు. గొంతు నొక్కాడు రెండుకాళ్లు ఆ రైలుపెట్టెలో తన్నుకున్నాయ్. వంతెన మధ్యకొచ్చిన బండిలోనుండి, రెండు శవాలు నదిలోకి తోసి వేయబడ్డాయ్. పేపరుమిల్లుమాత్రం ఆ దురంతాన్ని గమనించింది. "బోయ్" మంటూ కూసింది.

విశాఖ జిల్లాను త్రొక్కింది రైలు. ఈ విశాఖజిల్లాలోనే వుంది మరో విజయనగరం. రాయలేలిన విజయనగరం కాదిది. ఈ విజయనగరానికి ప్రక్కనే బొబ్బిలి వుంది.

ఆ! ఇప్పుడర్థమైవుంటుంది - మీకు బొబ్బిలనగానే.

విజయనగర రాజులకీ - బొబ్బిలి వెలమదొరలకి యుద్ధం జరిగిందొకప్పుడు. ఆ యిరువురూ తెలుగురాజులే.

అయితే ఏం. వున్నాయిగా కొన్ని ధాతువులు.

తెలుగుదేశంపై తొలి ఆధిపత్యం చేసిన ఫ్రెంచిమ్లేచ్ఛులు. ఆ మ్లేచ్ఛులే ఆ ఇరువురి తెలుగు రాజులమధ్యా పొరపులు పెట్టి, మహా సంగ్రమాన్ని రెచ్చగొట్టారు. అంతే. పౌరుషాలను చంపుకోలేక, ఆ వుచ్చులోపడి అటు బొబ్బిలి రావువాహూ, ఇటు విజయనగరం రాజావారూ కత్తులుదూసి, పీకలు కోసుకున్నారు.

అయితే అల్లూరి రామరాజంటే, మన్యంలో గాలిలో గడ్డిపరకలు కూడా ఎలా పోట్లాడుతాయో, అలాగే నేటికి బొబ్బిలి వీరుల పేరు చెబితే, అక్కడ శిలాపెంకులు, కత్తులునూరి పైకిలేస్తాయ్.

అంతవరకూ వెళ్ళకుండానే, విశాఖజిల్లాలకు మొదటిలోనే వుంది నర్సీపట్నం.

సరిగ్గా యీ నర్సీపట్నం వచ్చే బండి ఆగింది. ఇక్కడే ఆ రాకసులు దిగాలి. అప్పటికే జీపులపై, మోటారులపై ఆ దిగబోయే సైన్యానికి సుస్వాగతం చెప్పడానికి అనేకమంది ఆఫీసర్లు స్టేషన్కు వచ్చేసారు. దిగా రా సైనికులు. స్టేషన్నుండీ పటాటోపంగా శకటాలన్నీ బయలుదేరాయ్.

ప్రక్కనేవున్న శింగన్న ఆ సరాంజామాను కనిపెట్టాడు. అతని కళ్ళు తిరిగాయ్. ఇక భరించలేకపోయాడు. ఎవ్వరికీ కనబడకుండా ప్రక్కద్రోవను అక్కడనుండి మాయమైపోయాడు.

అలా మాయమైన శింగన్న ధారుకొండ కానుకొనివున్న గాము కొండకు వచ్చేస్తున్నాడు. ఆ గాముకొండలో పితూరీ రహస్య స్థావరముంది. నిరారుగానున్న ఆ కొండపై పితూరీదారుడు కాపలా కాస్తున్నాడు. అలా కాపలా కాస్తున్నప్పుడు అతని కంటినిగాని, చెవినిగాని తప్పించుకోగలవాడెవడూ వుండడం చాలా కష్టం. క్రింద శబ్దమైంది. అతనికి అనుమానం తట్టింది. అమ్ము సంధించి వెన్వెంటనే ఆ శబ్దంవచ్చిన వైపుకు విడిచిపెట్టాడు. ఆ అమ్ము శింగన్న ఎగ బ్రాగుతూ వస్తున్న ప్రక్కచెట్టుకు అతని శిరస్సుపైనుండి దూసుకు పోయింది. శింగన్న పైకిచూచాడు. ఆ పితూరీదారు అతని కన్నులకో మహామానవునిలా కనబడ్డాడు. ఆ పితూరీ ఆయువుపట్లన్నీ అతని చేతిలో వున్నట్టు కనబడ్డాయ్. అతను అంత నిశితంగా, భద్రతగా వున్నందుకు లోలోన ఎంతో సంతోషించాడు. వెంటనే తనెవ్వరో చెప్పడానికి ఒక ఆకుతీసి, తన మొలనున్న బాకుతో ఆ ఆకుపై 'శింగన్న' అని రాసి, ఆ బాకును ఆకు గుచ్చి విసిరాడు. అది ఆ కాపలయోధుని ప్రక్కచెట్టుకు తగులుకుంది. పితూరీదారు ఆశ్చర్యంతో బాకుతీసి, ఆకుపైనున్న పేరు చూచాడు: తను అమ్ము వేసినందుకు బాధపడ్డాడు. అంతలోకే శింగన్న ఆ కొండ అంచుపైకి ఎక్కాడు. ఆఖరి పణుకుపై కాలేసి ఆ పితూరీదారు, శింగన్నకు చేయూతనిచ్చి పైకిలాగి కౌగలించుకొని—

"క్షమించు శింగన్నా! నిష్కారణంగా ఎగిరిపోయివుండె వాడివి. పొరపాటున ప్రమాదమైన తప్పుచేసా!"

"మరేం ఫర్వాలేదు. అంతకంటే ప్రమాదమైనది జరగబో తోంది. చెన్నపట్నంనుండి ఒక స్పెషల్ రైలునిండా సైన్యాలొచ్చే సాయ్. ఏ క్షణంలోనన్నా విరుచుకుపడతాయ్. ఈ కబురు తక్షణం రాజుగారి కందియ్. లేకపోతే ప్రమాదం. నే వెళ్ళిపోతా!" అని ఆ కొండ పణుకునుండి చరచర జారిపోయాడు. ఆ మరుక్షణం క్రిందనున్నాడు. శింగన్న, అలా జారిపోవడం, ఎక్కడం వాళ్ళకు

వెన్నతో పెట్టిన విద్య. మీరు నేనూ అయితే, క్రింద కొచ్చేటప్పటికి ఎముకలుతప్ప చర్మం వుండదు.

పితూరీదారు వెంటనే చంకనున్న కొమ్ముబూరా వూదాడు. ఆ బూరాధ్వని వినగానే, ఆ కొండలోయలో ఒక గుహ ద్వారంవద్ద కాపలా కాస్తున్న పితూరీదారు ఒక త్రాడు లాగాడు. అలా లాగ గానే నటరాజు ఢమారంలా గణగణ మంటూ - ఒక గంట గుహ గర్భంలో మ్రోగింది.

యోగ నిద్రలోనున్న రాజు ఒక్కసారిగా త్రుళ్ళి చూచాడు. అతను అలాచూస్తున్న కాలంలోనే నాలుగు వైపులనుండీ నాలు గయిదు వందలమంది పితూరీదార్లు ఆయుధపాణులై చుట్టూ ప్రత్యక్ష మయ్యారు.

ఒక కొత్తగా దీక్షపుచ్చుకున్న యువకుడుమాత్రం రావడం ఆలస్యమైంది—కారణం—

ఆయన ఆ కొండిగృహంలో స్నానం చేస్తున్నాడు.

పొరపాటు—ఆయనకాదు. ఆమె.

ఆమె అనగానే ఆశ్చర్యపడుతున్నారు కదూ! మరి అర్ధరాత్రి తండ్రి పాదాలకు ప్రణమిల్లి గడపదాటిన సీత ఏమైందని? గడప దాటినవరకే ఆమె సీత. గడప దాటాక ఆమెలో ఓ దేశభక్తుడు, త్యాగ, సాహసోపేతమైన ఒక త్రివిక్రముడు ఆవిర్భవించాడు. తిన్నగా ఆ మన్యానికి వచ్చేసింది. తెలుసుకుంది-రాజు రహస్యస్థావరం అంతకన్నా రహస్యంగా వచ్చి అక్కడ చేరుకుంది. తను అదృష్ట వంతురాలు. ఆమె నోము పండింది. ఆమె చేరుకున్న సమయం లోనే రాజు దీక్ష యిస్తున్నాడు. ఇక యీషణ్మాత్రం సందేహించ కుండా చేయిచాపింది. చిక్కని తన నెత్తురుతో మహాకాళికి తిలకం దిద్ది ప్రమాణం చేసింది.

అయినా స్త్రీత్వం ఎలాపోతుంది. రాజును చూచిన ఆనందం. ఆ ప్రజలపై రాజుకున్న పట్టు, రాజుపైని ఆ మన్యం జనానికున్న గౌరవం, ఆమెలో విపరీతమైన వుత్సాహాన్నించ్చింది. చాటుగా తను ఆనందం పొందింది. ఆ కొండ గుహలోనేఉన్న ఓ సెలలో స్నానం చేస్తూ, తను కూడా తెచ్చుకున్న నీలికాంతులు వెలిగ్రక్కే సిల్కు చీర కట్టుకొని, కురులు విరియబోసుకుంటూ, తను అనుభవిస్తున్న ఆనందాన్ని ప్రకటించుకుంది—

పురివిప్పిన నెమలిలా నాట్యం చేసింది. అలా తను పురివిప్ప డానికి వుషారు నిచ్చింది—రాజులోని ధగధగా మెరిసి వురిమిన రోషా వేశ మెయిలు తిన్నెలు - అవి వురమగానే యీామె పాదం 'చణం' అంటూ కొండచరియ తిన్నపై మ్రోగింది.

వందేమాతరం, మందే భారతం
శ్రమైక జీవన సుజన
విలసితం - సస్యశ్యామలాం
వందే, వందే, వందే, మాతరం!
స్వతంత్ర యోధుల రుధిర
తర్పణం - పావన చరితం
భారతం - వందేమాతరం!
మగువల సాహస జీవి
తాంకితం - సదావందితం
మాతరం, వందే భారతం!
నిరంతరం, చలదుత్తేజం,
త్యాగ పూరితం, స్తవనీయం
వందే మాతరం, వందే భారతం!"

-అంటూ, తన శరీరాన్నే మరచిపోయి—

"ప్రభూ! సిద్ధించింది - నా మధుర వాంఛ! కారుమేఘాలు క్రమ్ముకుని కారుచీకటావరించిన-భారతావనిలో మెరిసిందో-కాంతి రేఖ! ప్రభూ! స్వతంత్ర సమరంలో చెన్ను మీరిన వెన్నుచూపని నీ ధగద్ధగాయమాన దివ్యమూర్తి నన్నుద్రేకతరంగడోలికల నూపి వేస్తోంది-ప్రభూ! ధన్యను! నీ సాంగత్యం నాకు లభించకపోయినా, సాన్నిధ్యభాగ్యమైనా లభించింది-జన్మ తరించింది. ఇక నీకిప్పుడు నా కథ చెప్పడం, రూపు చూపడం మహాద్రోహం ప్రభూ! పీడిత ప్రజాగాథ - నీ బాధ, నీ బాధనే నాలో ఆవేశించుకుంటూ. చేతికి కత్తినందించి, మగని కదనరంగాని కంపిన మగువ మాంచాలి మంగళశాసవాలు నాకుంటే చాలు. ప్రభూ! నా కాళశక్తి ప్రసాధించు ప్రభూ!" అంటూ వుద్ఘోషించుకుంది.

అంతలోనే, గంటధ్వని వినిపించింది. గబగబా తన అబల స్వరూపాన్ని వీడి, మగవాని బొందిలో పరకాయప్రవేశం చేసి, వచ్చేసింది.

ఆమె వచ్చేటప్పటికే అక్కడి జనమంతా ఆయుధపాణులై వచ్చి సిద్ధమయ్యారు. కాస్త తడబడింది. తన రహస్యం ఎవరికైనా తెలిసిందేమోనని, కాని అలా జరుగలేదు.

ఆ జనాన్ని ఒక్కసారిగా చూచి, రాజు యోగనిద్రనుండి లేచి—

"ఏం జరిగిందని ప్రశ్నించాడు.

అంతా తెలీదన్నారు.

గబగబా రాజు ఆ గుహ తొలిద్వారం వద్దకొచ్చి ప్రక్కనున్న గుఱ్ఱమెక్కి రెండో ద్వారం వద్దకు దూకించాడు-గుఱ్ఱాన్ని. కాని ఆ ద్వారంవద్దనున్న పితూరీదారునికి తెలీదు విషయం. "చక్" మని ఆ గుర్రానికి సుడులున్న డొక్కల్లో తన్ని ఒక్క గంతులో ఆ కొండ శిఖరాగ్రంపైకి వచ్చేసాడు.

"స్వామీ!" అంటూ ఆ కావలదారు రాజుకు ప్రణమిల్లాడు—

"ఏం జరిగింది?"

"సైన్యాలు దిగాయట - శింగన్న కబురు తెచ్చాడు—"

రాజు ఒక్కసారి, ఆ కొండపైనుండి బయట ప్రపంచంపైకి తన తీక్ష్ణదృష్టిని సారించాడు.

ఆయన దృష్టి, ఆయన వీనులుకూడా అయస్కాంత శక్తిగలవి. ఆయన దృష్టికన్నా ముందు, ఆయన చెవులకో ఏనుగు ఘీంకారం వినబడింది. గుర్రం కళ్ళెంలాగి మరికాస్త ముందుకెళ్ళాడు. దూరంగా చూచాడు. ఇప్పుడా కన్నులు ఒక దృశ్యాన్ని చూసాయ్. ఆ ఘీంకెత్తిన ఏనుగు వెనుక చీమలబారులా వందలాది సైన్యం ముందుకు సాగుతోంది. వెంటనే రాజు పితూరీదారి చంకనున్న శృంగం తీసుకున్నాడు. పూరించి, పూరించాడు: పితూరీదారుని "భద్రం!" అని హెచ్చరించి, కొండ గుహలోకి వచ్చేసాడు.

శృంగనాదం విన్న పితూరీదార్లు నిటలాక్షుల్లా వరుసగా ఆజ్ఞ కోసం ఎదురుచూస్తూ నుంచున్నారు.

రాజు మహోగ్రంగా వచ్చి—

"మీరంతా వెంటనే రెండు దళాలుగా చీలిపోండి! ఒక దళం కొండచుట్టూ చెట్లవెనుక మాటేసి, పులుల్లా ఘాండ్రించి, సైన్యాన్ని హడలగొట్టండి. వారు బెదరగానే, మీ కోందడపాండిత్యాన్ని ప్రదర్శించండి, రెండోదళం, మనం యింతకుముందే త్రవ్వివుంచిన కందకాలపై, ఆ కందకాలు కనబడకుండా, పైన దేనితోనో మూయండి. ఆ పారిపోయిన సైన్యాలు కందకాల్లో పడతాయ్. పడగానే వాటి పని పట్టండి!" అంటూ ఆజ్ఞాపించాడు. తమకు జయాన్ని కలిగించమని మహాకాళిని ప్రార్థించాడు. పితూరీ యోధులందరూ వెళ్ళిపోయారు.

బయట శత్రుదళాలు దగ్గరపడ్డాయ్. మొదటి ఏనుగుపై తెల్లసేనానులు టాల్బర్టు, సాండర్సు వున్నారు. వారికి ముందు కూర్చుని బాస్టియన్ త్రోవ చూపుతున్నాడు. చెన్నపట్నంనుండొచ్చిన సేనానాయకులు వారే.

వెంటనే శృంగనాదం కొండపై పూరించబడింది. రాజు గుర్రంపై బయిటికొచ్చాడు. కొండదిగువ ఏనుగులు ఘీంకొత్తాయ్. వెంటనే చెట్ల ప్రక్క పొంచివున్న పితూరీదార్లు ఘాంద్రించారు. ఏనుగు తనకు సింహం కలలోకొస్తే చాలు తావుమని చచ్చి వూరు కుంటుంది. ఇక పులులే ఎదుటపడి ఘాంద్రిస్తే ఏమౌతాయ్. తొండాలెత్తి భయకంపిత స్వరాలతో వాళ్ళ సైన్యాల్ని కలద్రొక్కి వేస్తున్నాయ్

ఆ సైన్యంలో కలవరం పుట్టింది.

అనేకమైన శర పరంపర ఏకధారగా వచ్చి దూసుకుపోతోంది. వ్రేటుపడ్డ సైనికులు నేల కొరుగుతున్నారు. వాళ్ళ హాహాకారాలు మిన్నుముట్టాయ్.

"ఏనుగుపైనున్న టాల్బర్టుకు, బాస్టియన్—

"రాజు పులిలాకూడా ఐపోతాడు - ఆతనివద్ద ఆ విద్య వుంది అన్నాడు.

"Nonsense" అని గ్రుడ్లురిమాడు టాల్బర్టు.

వాడలా వురిమిన తక్షణం - ఓ పులి వాడిపైకి ఎగబ్రాకింది. హడలిపోయిన ఏనుగు వెనక్కి పరుగెత్తి ఓ కందకంలో పడి పోయింది. బ్రతుకుపై ఆశున్నవాళ్ళు, నేలపై నూకలున్నవాళ్ళు పరుగెత్తుకు పారిపోతున్నారు.

పితూరీదార్ల రొట్టె నేతిలో పడింది.

- మీసాలు దువ్విన తెల్లసేనానుల ఏనుగులు కందకాల్లో పడ్డాయ్ పడినవాళ్ళను రక్షించడానికి ఓ రౌతు అశ్వాన్ని తెచ్చాడు. తెల్ల

వాళ్ళు యీ విషయంలో అప్రమత్తంగానే వుంటారు. ఆ గుర్రంపై వాళ్ళు పితూరీదార్లచే దెబ్బలుతిని పారిపోయారు.

తుఫానుతో కూడిన వర్షం వచ్చి వెలిసిపోయింది. పితూరీదార్లు దొరికిన మోయనంత సామాను తమ స్థావరాలకు చేరవేసుకుంటున్నారు. ఆనాటి విజయం పితూరీదార్లలో తిరుగులేని విశ్వాసాన్ని చేకూర్చింది. ప్రభుత్వానికి మాత్రం తిరుగుపట్టే పాపభీతిని ప్రవేశపెట్టింది.

ఆ మరునాడే "నాఫ్" అనే ఒక వుద్దండపండితుడు మాయాజాలం పన్నడంలో, మహేంద్రజాలం ప్రయోగించడంలో దిట్ట, మిలటరీ తంత్రజ్ఞుని నాయకత్వం క్రింద మిలటరీ సమావేశం జరుగుతోంది.

ఆ సమావేశంలో పితూరీదార్లచే తాపులుతిని గాయాలుపడ్డ సేనానులందరూ పరివేష్టించారు.

ఆ సమావేశంలో యింకొక విశేషం. సరిగ్గా ఆరోజే అక్కడకు ట్రాన్సుఫరు ఆయన యింకో జిల్లాకలక్టరు కూడా పాల్గొన్నాడు. వాడిపేరు రూథర్ ఫర్డ్. పలనాటి వుద్యమాన్ని కుట్రతో అణచి, ఆ వుద్యమాన్ని నడిపిన వీరహనుమంతుని, రాజీ మర్మంపెట్టి చాటుకు పిలిపించి హత్యచేసిన దొర - వీడే. ఆ దురంతంచేయగానే, తెల్లప్రభుత్వం మదరాసు గవర్నరైన వెల్లింగ్టన్ దొర రామరాజు పితూరీని అణచడానికి రూథర్ ఫర్డ్ ఒక్కడే మగవాడనుకొని, గుంటూరు జిల్లానుండి యిక్కడకు ట్రాన్సుఫరు చేసింది.

నిజంగా తను మొగాడిననే వాని నమ్మకం. అందుకే ఆ సభలో గంభీరంగా వుపన్యాసమిచ్చాడు. మాటమాటకు బల్లగుద్ది మాట్లాడేడు. బల్ల గుద్దితేగాని మాట్లాడలేని వాని మాటల్లో ఏం సరుకుంటుందో మనకు తెలుసు. కాని వాని అధీనంలోనున్న ఆ ఆఫీసర్లకేం తెల్సు. వాడు మాట్లాడుతుంటే, వాని ముక్కు రెమ్మలు పొంగాయ్. ముఖం ఎర్రబడిపోయేది. మాటి మాటికి రెండేసి బ్రాందీచుక్కలు

గొంతులో పోసుకుంటేనే తప్ప, వాడు అనుకున్నదంతా మాటాడ లేక పోయాడు.

"తెలుగుజాతి చాలా తెలివైన, చురుకైన, శౌర్యమైన జాతి. అటువంటి జాతి సాహసానికి ఆటపట్టయిన మన్యంలో రేగింది తుఫాన్! దీన్ని తేలిగ్గా అంచనాచేయడం అవివేకం!" అంటూ తను కొత్త సత్యాన్ని పట్టుకున్నట్టు ఒక్కసారి భుజాలు పొంగించు కున్నాడు.

కాని ఆ సమావేశంలో ఆ మాటకు పూర్తిగా వ్యతిరేకత ప్రదర్శించబడింది.

కేకలు బయలుదేరాయి.

ఆ కేకలమధ్య, బయట ఒక కారువచ్చి ఆగిన శబ్దమైంది. 'గుడాల్, గుడాల్!' అంటూ ధ్వనులా ఆఫీసులో పైకప్పుముట్టాయ్. కారు దిగి తిన్నగా 'టక్, టక్' మంటూ వచ్చేసాడు – గుడాల్. అంతా ఒక్కసారి లేచి "Good Morning" కొట్టారు. రూధర్ ఫర్డ్ గుడాలకు అందరినీ పరిచయం చేసాడు. గుడాల్ అందరికీ షేక్‌హాండ్ యిచ్చాడు.

రూథర్‌ఫర్డ్ గుడాల్ గురించి వుపోద్ఘాతమిచ్చాడు.

"మొదటి ప్రపంచయుద్ధంలో బ్రిటిషు సామ్రాజ్య పక్షంగా విజయాన్ని చేబట్టి, పితూరి నిర్మూలనానికి యిప్పుడే సారథ్యం వహించడానికి హుటాహుటిని His Excellancy గవర్నరు పంపిన వీరశూర ధీర శిఖామణి - శ్రీమన Chief commander గుడాల్." అంటూ కూర్చున్నాడు.

రూథర్‌ఫర్డ్ మాటలైనా పూర్తిగాకుండానే నిర్లక్ష్యంగా, సొంపరుగా కరతాళధ్వనుల మధ్య, Neck tie సర్దుకుంటూ లేచాడు గుడాల్. రూథర్‌ఫర్డుపై రోత, గుడాల్‌పై ప్రోత ఏర్పడింది సమావేశానికి.

మొదలెట్టాడు – గుడాల్ —

"మహావిప్లవాన్నే పునాదుల్లోంచి పెరికి పారేసిన బ్రిటిషు సామ్రాజ్యానికి యీ పితూరీ లెక్కగాదు. ప్రపంచ మహాయుద్ధంలో శత్రు దుర్భేధ్యమైన విజయపతాకాన్నెగురవేసిన బ్రిటిషు క్రౌన్ ముందు యీ బోడితలలు లెక్కగాదు!" అంటూ ఒక ప్రణాళికను ప్రతిపాదించాడు.

ఆ ప్రణాళికలోని ముఖ్యాంశాలు—

ఎవడ్ని త్రోవడిగినా ముక్కుకు సూటిగా పొమ్మంటున్నారట. అందుకు నేరుగా ప్రజలపై ప్రయోగించాలట - హింస! లేక ప్రజల్లో పలుకుబడివున్న పితూరీ నణచడం కష్టమట.

రహస్యాలు పొక్కకుండా, ఎక్కడ చూచినా వారై కీకకీక లెత్తిస్తున్నారట - అందుకు వాళ్ళ రహస్యాలన్నీ అరచేతిలోకి రావడానికి వైరులెస్ సెట్లు ఆరెంజి చేస్తారట.

పితూరీ నాయకుల్ని పట్టి అప్పచెప్పినవారికి ఇనాంలిస్తారట! పితూరీ నణచడానికి తోడ్పడ్డవాడ్ని ముఠాదారు చేస్తారట.

పితూరీ తెలుగుప్రాంతంలో జరుగుతోంది కాబట్టి, తెలుగువాడన్నవాడిని సైన్యంలో లేకుండా పరిహారేయాలట - అలా చేయకపోతే, రాజే ఏదో మంత్రం వేశాడని కాల్చడం మానేస్తున్నారట. తెలుగువాళ్ళు ఆ సైన్యంలో లేకుండాచేసి రాయల్ ఆర్మీ దించాలట. భారతదేశంలోనే మరోజాతి సైన్యం దించి, యీ జాతిని నాశనం చేస్తారట!

మూకమ్మడిగా ప్రజల్ని బంధించి, శిక్షించి, కారాగారాల్లో త్రోసి వేయడానికి అవసరమైన కోర్టులూ, జైళ్ళు తెరవాలట!

ఆ ప్లాను చెప్పుతూ, వుద్రేకంతో మూడుసార్లు బల్లగుద్దుతూ, ఆ ఆఫీసర్లపై నిప్పులు చెరిగాడు—

"Nonsense" ఇంత అంగ ఆయుధబలం మనకుంటే, కుక్కల్లా పారిపోయివచ్చే పిరికిపందలు మీరు!" అని గద్దించాడు.

వెంటనే బాస్టియన్ లేచి—

"వాళ్ళు ఎక్కడ, ఎప్పుడు పంచేస్తారో తెలియడంలేదు సార్!" అన్నాడు,

"Nonsense" అంటూ, గుడాంగ్ బూటుమడమ "టక్"మని త్రొక్కాడు.

"ధనా"మని ఆ టేబిలుపైకి ఒక బాణం రివ్వునొచ్చి గ్రుచ్చుకుంది. అంతా భీతచిత్తులై పోయారు.

రూథర్ఫర్డు ఆ గ్రుచ్చుకున్న బాణాన్ని గింజాయించి, బలంగా పైకిలాగి దాని మొననున్న వుత్తరంవిప్పి పైకి చదివాడు.

"రేపు వుదయం పట్టపగలు అన్నవరంపై దాడిచేస్తున్నాం. ధైర్యముంటే ప్రత్యక్షంగావొచ్చి, ఎదిర్చండి లేదా లొంగిపోయి ఆయుధాలప్పగించండి! ఇట్లు అల్లూరి వెంకటరామరాజు!"

ఆ మాటలువినగానే అందరికీ చిరుచెమట్లు పట్టాయ్. భీతావహ ధ్వనులు గుప్పున పైకిలేచాయ్.

దానికితోడు అంతకుముంధు చోడవరంపై ఆ దళాలు దాడి చేసినప్పుడు పితూరీదళాల నెదుర్కొని కన్నులొట్టపోయి, కాలుపోయి పలాయనం చిత్తగించిన "జాన్" అక్కడే వున్నాడు.

తర్వాత అడ్డతీగెల స్టేషనుపై దాడి ధాటికి ఆగలేక హడలిపోయి చెప్పకుండానే స్టేషను కాళీచేసి, పారిపోయొచ్చిన మొనగాళ్ళంతా అక్కడే కూర్చున్నారు.

ఇక ఆ పాపతు జెర్రిగొడ్ల దడకు అంతులేదు. ఇంతలోకే బయట మోటారుసైకిలు శబ్దమైంది. అంతా ఓ దీర్ఘ విశ్వాసంతో

అటు చూశారు. ఆ సైకిలుపై ఒక పైలట్ వచ్చి, ఒక వుత్తరం యిచ్చాడు.

వుత్తరం చూచుకున్న గుడాల్ వికటాట్టహాసం చేసి—

"రామరాజు! హే! ఇక గుండ పిండిచేస్తాం. దిగ్గజాలు, మేరు పర్వతాలు, ఆఫ్రికా, ఏడిన్, ఆఫ్ఘన్ ఎడారియుద్ధాల్లో కాకలు దీరిన కవర్టు, హైటరులుకూడా వచ్చేస్తున్నారు. ఊ! Push on! ఇక పితూరీ, గితూరీ అంతా Smash" అంటూ ఆ బల్లపైని బ్రాందీ కాయకాయా గడగడలాడుతు త్రాగేసాడు.

అంతా లేచారు. బాస్టియన్‌కు మాత్రం ఓ సందేహం పీడించింది.

"కవర్టు" హైటరులు ఎడారియుద్ధాల్లో ఆరితేరితే, ఇవి అడవులు కదా సార్!" అని గుర్తుచేసాడు. నిషాలో, కైపులో నున్న గుడాల్ తను త్రాగిన బ్రాందికాయతో వాడిని కొట్టాడు. అది ఖర్మకాలి గురి తప్పి, వాని ఇనుపబూటుపై పడి పగిలింది గాని లేకపోతే బుర్ర బ్రద్దలు కావలసిందే.

రూథర్‌ఫర్డుకు మాత్రం బాస్టియన్ మాట వినగానే, గుండె క్రిందికి లాగింది. దిగాలు పడిపోయాడు. ఎంత పిరికిరకం, కుట్రదారుడూ అయినప్పటికీ రూథర్‌ఫర్డు విషయాన్ని వున్నదున్నట్లు గ్రహించడంలో మేటిరకం! దానిని ఇతరులవద్ద తారుమారు చేయడంలోకూడా గడితేరిన రకమే.

అయినప్పటికీ మన్యంలో ఆ మరునాడు సైనికశాసనం ప్రకటించారు. బయట మనుషులు గుమిగూడితే కాల్చపారెయ్యొచ్చు. పితూరీ నాయకుల్ని పట్టుకున్నవారికి తరతరస్థాయిలో యాభై వేలు, పాతిక వేలు, పదివేలు, అయిదు వేలు, వెయ్యి రూపాయలు వరకూ ఇనాంలు ప్రకటించారు. మన్యానికి బయట వ్రపంచంనుండి ఆహార పదార్థాలు రాకుండా బంద్ చేసేసారు. వాళ్ళకు సావకాశం లేక

పోయింది గాని వున్నట్టయితే, వీళ్లైతే గాలిని నీటినికూడా బంధిం చేయ్ గలరు.

అదిమాత్రం వాళ్ళచేత కాలేదు.

ఏదీ వాళ్ళచేత కాదు అన్నట్టుగా, పితూరీ మహారథం జగన్నాథ రథంలా, కదిలిన సింహాచలంలా, జ్ఞానేశ్వరుని తనపై ఎక్కించుకొని పరుగెత్తిన మహాగోడలా, వొంపులు తిరిగిన కారడవిబాట పడి, విజయధ్వానాలతో కదిలిపోతోంది.

ఆ కారడవిలో, యిరుప్రక్కలానున్న వెల్లుదుబ్బులు గాలికి శిరస్సులొంచి, పాయలుగా చీలి, హృదయాన్ని విప్పి, సుస్వాగత మిస్తున్నాయ్. ఆ మన్యంలో మనుషులే కాదు. ప్రకృతి, భూదేవి అంతా ఆ మన్యం మానవులు నడుపుతున్న మహోద్యమానికి సానుభూతిపరులే. భూదేవిలాంటి దేవత ఆశీస్సులనే పొందగలిగిన పితూరీని అణచడం ఏ మానవుడి తరం? ఏ రాక్షసుడి తరం?

ఎవ్వడితరమూ కాదు—

అదొక మహాగ్నిజ్వాల.

ఆ జ్వాలను రాజగోడుతూ, రత్తి ఆలాపన చేస్తోంది—

"ఆకలిమంటల మల మల మాడే
అనాధులంతా, అభాగ్యులంతా కదలండోయ్!"

అంటూ.

అవును. అనాధులూ, అభాగ్యులూ, ఆర్తులూ, మర్త్యులూ కలిసి, పల్లవిస్తే, ఆ నాలుకలూ, ప్రేగులూ, అన్నీ కలిసి ఆవులిస్తే, అరిస్తే ఎనభై లక్షల మేరువులు ఎగిరి ఎగిరి పడతాయ్. తిరిగి తిరిగి సముద్రాలే జలప్రళయం చేస్తాయ్. అంతే, పాపపులోకం దుమ్మొగిరిపోతుంది. పుణ్యపులోకం అవిర్భవిస్తుంది-ఓంకారంతో.

అనుకున్న ప్రకారం ఆ జ్వాల అలా పాకుకుంటూ - పవిత్రమైన అన్నవరం క్షేత్రానికి చెప్పినప్రకారం సరిగ్గా చీకటి పారపారలుగా కోసుకుపోయి, వహ్ని కిరీటధారుడు ఆకాశంపైకి అవతరించిన శుభసమయంలో చేరుకుంది.

అసలు రాజు తన వుపనాయకులతో, తన పితూరీదళాలతో, ఆ పవిత్రక్షేత్ర సందర్శనానికి వస్తున్నాడన్నవార్త ముందే ప్రజలకు తెలిసిపోయింది.

ఒక్కొక్కసారి బాహాటమైన సత్యమే - శత్రువుకు తెలీదు. ప్రజలకు తెలిసినా చెప్పరు. తమ్ము వుద్ధరించే నాయకులపై వారి కంత ప్రేమ.

అందుకే.తండోపతండాలుగా వచ్చి అన్నవరం చేరుకున్నారు. కొందరు ప్రభలు కట్టుకొని వచ్చారు. మరి కొందరు చంకను చంటి బిడ్డలతోనే వచ్చేసారు. మూలనున్న ముసలమ్మలనుకూడా ఆవేడి కదిపింది.

రాజు సరాసరి అన్నవరం స్టేషనుపై దాడిచేసాడు. ఒక్కడూ ఆయన్ను ఎదురించలేదు. తాముగా లొంగిపోయి, పోలీసులు ఆయుధాల్ని అప్పగింతలు పెట్టారు.

తరువాత రాజు అన్నవరం సత్రంలో ప్రవేశించాడు. ప్రవేశిస్తుండగానే ఒక తల్లి తన బిడ్డను రాజు కాళ్ళముందు పడవేసింది. రాజు అప్యాయంగా ఆ బిడ్డను ఎత్తుకొని, ముద్దుపెట్టుకొని చిరుమందహాసంతో ఆ బిడ్డను దీవించి, మరల ఆ తల్లి చంకకిచ్చాడు "అదృష్టవంతుడు తల్లీ, నీ బిడ్డ! అంటూ. ఆ తల్లి ఆనందానికి మేర లేదు.

రాజు ముందుకు నడుస్తున్న కొద్దీ, త్రోవ పొడుగునా పూలహారలూ, పండ్లు సమర్పించుకున్నారు - ప్రజలు.

జనం సమర్పించిన పండ్లూ, ఫలహారాల్ని వెనుకనున్న మల్లు అందుకుంటున్నాడు. ఆ వెనుక గంటం అందరినీ పలుకరించుకుంటూ

వస్తున్నాడు. రాజు అలా సానుభూతి సహకారాభి వందనాలందు కుంటూ సత్రం లోపలికి వెళ్ళిపోయాడు. ఆయన లోనికెళ్ళిన తరువాత, సింహద్వారంవద్ద గంటం, మల్లులు సనకసనందనాదుల్లా రెండువైపులా నిలబడ్డారు. రాజులోపలికెళ్ళి చాలాసేపటివరకూ బయటకు రాలేదు. ఈ లోపు యింకా తండోపతండలుగా వస్తున్న జనంలో దర్శనాపేక్ష అతిశయించింది. గంటం రాజువైపుచూచాడు. రాజు యోగముద్రలో నిమగ్నుడైపోయాడు. ఆయన యోగంలో వున్నప్పుడు ఎవ్వరూ మాట్లాడ సాహసించలేరు. కారణం ఆయనది మహాకాళీ వుపాసన. మహోగ్రమైనది కాని ప్రజల ఆతురితను గమనించి రాజే ఒక్కొక్కరినీ లోనికి పంపమన్నాడు - గంటాన్ని.

గంటం బయటకొచ్చాడు. రాజు దర్శనంకోసం వేచివున్న జనంలో మొదటివాడుగా నిలబడ్డ ఒకాయన్ను లోనికి పంపాడు. ఆయన ఖద్దరు దుస్తుల్లో వున్నాడు. ఆ వ్యక్తి లోనికెళ్ళగానే రాజుగారికి—

"నమస్కారం స్వామీ?" అని నమస్కారం చేసాడు.

"నేను స్వామిని కాను - మీలాంటి ఒక దేశభక్తుడ్నే!" అని సమాధాన మిచ్చాడు - రాజు.

రాజు అలా అన్నప్పుడు ఆయన అహంభావిగా కనపడలేదు. దేశభక్తి మూర్తీభవించిన వ్యక్తిలా తొణక్కుండా మాట్లాడాడు.

ఆ మాటకు సిగ్గుపడ్డాడా-వ్యక్తి.

"నేను దేశభక్తుడ్ని కాను - ప్రజాద్రోహిని. బ్రిటిషు కీచకులు భారతావనిని ఎన్ని హింసలు పెట్టినా, పెడుతున్నా "అహింస" అంటూ జపమాలికలు త్రిప్పి, ప్రజాపోరాట సంరంభాన్ని అణచివేసిన నిరంకుశుడ్ని!"

"మీ పేరు?"

"వేగిరాజు నారాయణరాజు!"

"వూరు?"

"కుముదవల్లి, పశ్చిమ గోదావరిజిల్లా!"

అనగానే, రాజుకు ఒక మమకారం కలిగింది. కారణం. తనూ పశ్చిమగోదావరి జిల్లావాడే. అక్కడే పుట్టాడు. త్రాగినవి ఆ నీళ్ళే గోదావరి నీళ్ళు. అవి తల్లిపాలతో సమానమైనవి. శరీర సౌష్టవానికి జీవామృతంలాంటివి. ఆనీళ్ళు త్రాగినవానిలో ఆవేశ నిర్ఝరీ, ఝరీ ధారలు శరీరంలో నఖశిఖ పర్యంతం. మగ్గంపలకలో నాడిలా నిత్యం పరుగెడుతుంటాయ్. "గంగోదకం సర్వ పాప నివారణం!" అన్నారు పెద్దలు. అంతకంటేకూడా శ్రేష్టమైనవి - గోదావరీ జలాలు. అవి సేవించినవాడు పునీతుడు కావడమేగాక. అతన్ని చూచినవాడు కూడా పునీతుడై పోతాడు. అందుకే ఆ జలాలను గౌతముడు వెయ్యేళ్ళు తపస్సుచేసి మరీ సాధించాడు. ఎంత మహత్తు. ఎంత శక్తి ఆ జలాల్లో లేకపోతే ఆ జలం సేవించిన రాజు అంతటి సర్వశక్తి సమన్వితుడూ, సకల మహాత్సంపన్నుడూ అవుతాడు? వెంటనే అడిగాడు—

"అయితే యిప్పుడేమంటావ్?"

"మీరు నడుపుతున్న పితూరీలో పాల్గొనే భాగ్యాన్ని కలుగ జేయండి!"

"కఠినాతి కఠినమైన మా పోరులో వెన్నివ్వనని ఒప్పుకో గలవా?

"తప్పకుండా!" అన్నాడంతే - ఆ వ్యక్తి

వెంటనే రాజు గంటానికి ఆజ్ఞాపించాడు - అతన్ని నిస్సంకోచంగా నేటినుండి తమ దళంలో కలుపుకోమని.

తరువాత అక్కడకు పడాలొచ్చి. ఎవరో పత్రికావిలేఖరి రాజుకోసం వేచివున్నట్టు చెప్పాడు. ఆయన్నికూడా ప్రవేశపెట్టమన్నాడు

రాజు. పడాలు వెళ్ళి ఆయన్ని తీసుకొొచ్చాడు. ఆ విలేఖరివచ్చి, మామూలు మర్యాదనుగూడా మరచి, నాలువైపులా పరిశీలించడం మొదలు పెట్టాడు.

"ఏమిటలా చూస్తున్నారు?" రాజు గంభీరంగా ప్రశ్నించాడు.

ఆ విలేఖరి త్రుళ్ళాడు.

ఏమి మాట్లాడటానికి జంకిపోయాడు. రాజతని నైజాన్ని వెంటనే కనిపెట్టాడు—

"ఏమీ మీరు పరిశీలించనక్కరలేదు, మీ నాడుల్లో ప్రవహించే నెత్తురేశబ్దం చేస్తుందో, ఆ మాటల్నే మీ నాలుక పలుకుతుంది. చెప్పేదొకటి, చేసేదొకటి, చూసేదొకటి మా పితూరీకి లేదు!" అనగానే, ఆ విలేఖరి, తన నైజాన్నే, స్వరూపాన్నే చీల్చి చెండాడుతున్నట్టుగా భావించాడు.

'సరే మీదేపత్రిక?' రాజు కటువుగానే ప్రశ్నించాడు.

'ఆంధ్ర పత్రిక!'

'మీ పేరు?

'చెరుకూరి నరశింహమూర్తి!'

'ఊరు?'

'దంగేరు. రామచంద్రపురం తాలూకా!'

'ఏమిటడుగుతారు?'

చెప్పడానికి ధైర్యం రాలేదు. కాని తన వుద్యోగధర్మాన్ని నిర్వర్తించాలి. పత్రికకు వార్త పంపాలి. నెమ్మదిగా అడిగాడు—

'ఎందుకీ పితూరీ?'

కర్రె విరిచినట్టు ఫెళ్ళున జబాబిచ్చాడు - రాజు—

'ప్రజాస్వతంత్రకోస'మని.

'ఏ సాధనంవల్ల?'

'ఏ సాధనంవల్ల తెల్లవాళ్ళు మనజాతిని పారతంత్ర్యంలో అణగ దొక్కారు?'

ఆ ప్రశ్నకు విలేఖరి వుక్కిరిబిక్కిరై పోయాడు.

ఆయనో గాంధీభక్తుడు, పత్రికారచయిత, రాజకీయాలకు అతీతుడై రాజకీయాలను పరిశీలించాన్న జ్ఞానాన్ని కూడా కోల్పోయి అడిగాడు—

'గాంధీగారి దౌర్జన్యరాహిత్య సిద్ధాంతపై' మీకు నమ్మకం లేదా?'

రాజు కోపంతో సూటిగా చెప్పాడు—

'లేదు! ముమ్మాటికీ లేదు. వుద్రేకంలో ప్రజలు ఒక్కపోలీసును చంపినారన్న నెపంతో బ్రిటిషుకిరాతకా లన్నింటినీ మరచిపోయి, భారతదేశం మొత్తంమీదే సహాయనిరాకరణోద్యమాన్ని నిలిపివేసిన ఆ సిద్ధాంతంపై నాకు నమ్మకంలేదు. అదొక ఓటమిసిద్ధాంతం. తిరోగమన సిద్ధాంతం.' అంటూ వుద్రేకంలో మాట్లాడుతుండగానే-బయట పెద్ద గొడవ బయలుదేరింది. ఆ విలేఖరి భయపడి—

'అయితే నాకు సెలవిప్పించండి!' అన్నాడు.

'వెళ్ళొచ్చు! నా మాటలు అక్షరాలా మీరు పత్రికల కెక్కించొచ్చు. ప్రజలపక్షాన నిలబడే ప్రజాసేవకులను, ప్రజాహృదయాల నుండి విడదీయడం అసాధ్యమని మీరే గుర్తించగలరు!'

బయట మరీ గొడవెక్కువైంది. ఆ విలేఖరి వెళ్ళిపోయాడు. రాజు బయటకొచ్చాడు. పడాలు ఆయనకెదురొచ్చి—

"పోలీసులొస్తున్నార"ని ఎవడో పిరికిమందేశాడు, జనం భయపడి చెదురుతున్నారు. వారినిచూచి రాజు—

"అదే మన బలహీనత. దీనినే తెల్లోళ్ళు గుర్తించి మనలను దెయ్యాల్లా పీడిస్తున్నారు. దొంగవాడు దొంగతనానికి చీకట్లో వస్తాడు గాని పగలు రాడు. అందులోనూ ఆయుధపాణులైన పితూరీదార్లొక ప్రక్క, అజేయులైన ప్రజాళందోహ మొకప్రక్క నిలబడివుండగా, శత్రువు తెగించగలడా? మన కంగారు గాని!"

అనగానే ఆ జనంలో 'అల్లూరి రామరాజుకీ జై!' అని బిగ్గరగా హర్ష ధ్వానాలు చెలరేగాయి.

ఆ హర్షధ్వానాల నందుకొని రాజు కొండపైని సత్యనారాయణ స్వామి ఆలయాన్ని సందర్శించాడు. ఆలయంలో అర్చకుడు జై గంట వాయించి, రాజుచే హారతి కళ్ళనద్దించి, శిరస్సుపై శఠగోపం పెట్టి దీవించాడు.

'విజయీ భవ!' అని.

అలా విజయాశీస్సులు అందుకొని, ప్రజలవద్ద సెలవునందుకొని తన దళాలతో రాజు అంతర్ధానమయ్యాడు. ఒక మహా తిరుణాళ్ళు సమాప్తమయ్యాయ్. జనం తమ ప్రియతమనాయకుడ్ని చూడగలిగి నందుకు పట్టలేని ఆనందంతో తమ తమ స్వగ్రామాలకు, స్వగృహాలకు తరలిపోయారు.

మిగిలంది - శూన్యం.

ఆ శూన్యాన్ని సాక్షాత్కరించింది - సైనికదళ మొచ్చి. తమకు సాక్షాత్కరించిన శూన్యాన్ని చూచి ఖిన్నులైపోయారు - దొరలు వారి సైన్యమూనూ. గుడాల్ మాత్రం గాడిదలా అరిచాడు.

"వెతకండి! గుట్టా, పుట్టా, చెట్టునూ, ఏమైనా పట్టండి!" అంటూ.

... ... ...

అది కారడవి. కారుచీకటి, ఆ చీకటిలో కిటకిటలాడుతున్న మిణుగురు పురుగులు కాంతిచూపిస్తున్నాయ్. ఓ గుడ్లగూబ కళ్ళు

టార్చిలైట్లలా మెరిసాయి. ఆ మెరుపునుండి భీతావహమైన అరుపు వచ్చింది.

పితూరిదార్లు ఆ అరుపు విని చూచారు. దూరంగా ఓ త్రోవను పెడద్రోవపట్టి బెదిరివస్తున్న ఓ సైనికదళాన్ని చూచారు.

వెంటనే రాజు ఆజ్ఞప్రకారం ఆయుధాలు ఆ ప్రక్క ఓ పెద్ద వట వృక్షం మానుతొర్రలో పెట్టి కూలీలుగా మారిపోయారంతా.

"పదండా సైనికుల కెదురు!" అని రాజన్నాడు.

"ఎదురుగానే?" ఎర్రేశు ప్రశ్నించాడు.

"అదుగో రాజుగారి మాటకు..." అని గంటం అంటూండగానే మధ్యలో అందుకొని - నారాయణరాజు—

"మహాశక్తి మనకు ముందుండగా మనకు భయమెందుకు?" అన్నాడు.

"పదండహే!" అని మల్లు అన్న తరువాత అంతా ముందుకు నడిచారు.

సైనికులు ఎదురుపడ్డారు. రాజు వెంటనే దళాన్ని ప్రక్క మార్గం పట్టించాడు.

సైనికుల్లో ఒక ఆఫీసరు—

"ఏయ్ - మీరెవరు?" అని ప్రశ్నించాడు.

"కూలోళ్ళం బాబూ!" రాజు సమాధానమిచ్చాడు.

"అయితే యీ సామాన్లు ఎత్తుకోండిరా!"

ఆ ఆఫీసరన్న ఆ మాటకు మల్లుకు అరికాలు కెక్కింది-మంట! అది కనిపెట్టి రాజు అతని కాలు నొక్కి ఆఫీసరుతో అన్నాడు—

"అదేంటి బాబు! పొద్దుపొడిచాక నడక మొదలెట్టిమి. ఇంకో జాముకాక్కాని ఇంటిముఖం చూడమే. మధ్య మళ్ళీ పనేంటి బాబు?"

"ఏయ్!" అని ఆఫీసరు గద్దించి, తన సైన్యానికి "ఎత్తండి వెధవలకు!" అని ఆజ్ఞాపించాడు. అలా ఆజ్ఞాపించగానే, ఆ సైనికులు తమ సామానేగాక తుపాకులు కూడా వాళ్ళ నెత్తినెట్టారు. ఆ కూలీలను తోలుతూ, ఆ ప్రక్కనే ఆ పితూరీదార్లు ఆయుధాలు దాచిన వట వృక్షంవద్ద కొచ్చారు. అక్కడే ఆ కూలీల సాయంతో, సైనికులు ఓ గుడారం వేసుకోని, హాయిగా, మోకాళ్ళు పట్టుకొని నడిచిన నెప్పులన్నీ తీర్చుకుంటూ, కంటిపై కునుకుపడుతుండగా - ఆ ఆఫీసరు—

'ఇక మీరు పోండిరా!' అన్నాడు.

'ఇంత పొద్దుపోయాక పోడం మా చెడ్డ కట్టం దొరా! యిక్కడే మేను వాల్చి పొద్దుపొడిచాక పోతము దొరా!'

అని రాజే సమాధానమిచ్చాడు.

ఆఫీసరు మెత్తబడ్డాడు.

అప్పటికే సైనికులు గుర్రుపెట్టారు. పితూరీదార్లు ఆ ప్రక్కనే గుర్రుపెట్టారు. వాళ్ళు నిజంగా గుర్రుపెడుతోంటే, వీళ్లు గుర్రుపెడుతున్నట్టు నటించారంతే. నటిస్తూ అర్థంచేసుకున్నారు. ఇక తమ పని తాము ముగించుకోవచ్చని.

తుపాకులూ, సామాన్లూ సమస్తం మూటలు కట్టారు. ఒక్కొక్క డొక్కొక్క మూట ఎత్తుకుపోయారు. కాస్త దూరం వెళ్ళగానే వాళ్ళకు వెనుక పెద్ద వెలుతురు కనబడింది. ఏహో కాగడాల కాంతిలో శత్రువులు ఒకుమ్మడిగా మీదపడుతున్నారేమోనని భావించి, తుపాకులు పొజిషన్‌లో పెట్టుకున్నారు. యీ లోపులో గోవిందు అన్నాడు—

'అది డేరాలు తగులొడుతున్న కాంతి స్వామీ?'

'ఎవరా చేసింది?' అంటూ కళ్ళెర్రచేసాడు - రాజు. అలా ఆ మాటన్నదే తడవుగా, నారాయణరాజు, మల్లుదొర దూరంనుండి వస్తూ ఎదుట ప్రత్యక్షమయ్యారు.

వెంటనే ఎర్రేశు, నారాయణరాజు భుజంతట్టి - 'యీాయ నిక నారాయణరాజు కాదు - అగ్గిరాజు!' అన్నాడు.

రాజుకు కోప మెక్కువైంది—

'ఆపుచేయండి! మీ ముఖస్తుతులూ, వేషాలూనూ, మనం చేయ వలసింది విధ్వంసంకాదు. విధ్వంసుకులపై విజయం! దౌర్జన్యంపై విప్లవం. అంతేకాని మన విజయానికీ, విప్లవానికీ, అపఖ్యాతి తెచ్చి, శత్రువులకు వుపయోగపడే ఇటువంటి పిచ్చి పిచ్చి పనులు కాదు - తెలుసా!'

వెంటనే అగ్గిరాజు రాజు కాళ్ళపై బడ్డాడు.

'క్షమించండి!' అంటూ.

"ఇక్కడేంటీ రాద్ధాంత, సిద్ధాంతాలూ, శత్రువు దగ్గరలోనే వున్నాడు - మీద పడొచ్చు!" అంటూ గంటం వారిని హెచ్చరించాడు.

"సరే! ఇకముందు మాత్రం జాగ్రత్త!" రామరాజు వెనుక అంతా బయలుదేరారు. వెనుక డేరాలు తగులబడుతున్న కాంతులు పితూరీ యోధుల వెనుక, అగ్నికిరీటం పెట్టబోతున్నట్టు కనబడుతోంది.

# 19

అది నడింపాలెం. మాటుమణిగివున్న ఆ పల్లెలో ఓ తెల్లవారు ఝామున తలుపు కొట్టినశబ్దం వినబడింది. ఆ కొట్టినవాడు ఆ తలుపుపై అంటించబడ్డ ఓ కాగితం చూడలేదు.

ఆ కాగితంపై—

'పితూరీ నాయకులను పట్టి అప్పగించినవారికి సర్కారు యినాం' అన్న అక్షరా లున్నాయ్.

ఆ తలుపుకొట్టిన శబ్దం విన్నంతనే ఒక యౌవ్వనంలోనున్న స్త్రీ తలుపు తెరచింది. ఆ స్త్రీ నిద్రకళ్ళపై తన వొంటిపై ఏము న్నదీ గ్రహించకుండా వచ్చింది కాబట్టి, తన వక్షంపై పైట లేదని గాని, ఆ వక్షోజాలు, ఎదుటవ్యక్తి కళ్ళు మెరిపించి, మూయించగల స్థితిలో వున్నాయనిగాని ఆమెకు తెలీదు అలా తీసీ తీయగానే, నిద్ర మైకం వొదిలి ఒక్కసారిగా గుండె బాదుకొని—

"అదేంటి మన్యమంతా సర్కారోడు మీకోసం గాలిస్తుంటే నీ విక్కడేంటీ?" అని మొత్తుకుంది.

"ఊరుకో, పెట్టా. రాజుగారికి తెలీకుండా యీ గంటుండి పోదామని వస్తే అల్లదేంటవే! తియ్యవే తలుపు!" అని త్రోసాడా, వ్యక్తి.

"వొద్దు మామా! నాకు భయమేస్తుంటిది. వూళ్ళో మిమ్మల్ని పట్టుకునోళ్ళకు యినాంలిత్తరంటి దొరలు—!" అంటూ అంటూండ గానే, అసలే కైపులోవచ్చిన ఆ వ్యక్తి. ఆమె ఉబుకుతున్న రొమ్ము లను చూచి మరీ కావరమెక్కి కన్నులు కానకుండా బలవంతంగా లోపలికి గెంటుకుపోయాడు.

సరిగ్గా ఆ దృశ్యం బయటనుండి ఒకడు కనిపెట్టాడు. గోడలకు చెవులుండడమే విన్నాంగాని కన్నులుండడం ఎక్కడా వినలేదు మనం. కాని ఎక్కడనుండొచ్చాడో. ఎక్కడ చూచాడో, ఆ గోడలు చూచినట్టే చూచి, ఒకటే పరుగు లంఘించుకున్నాడా యువకుడు-వాడిని ఆపుచేసి—

"ఒరేయ్ అన్నేయంరా! కడుపు కక్కుర్తికోసమని మనకోసం బ్రతుకే ధారోస్తున్న మహానుబాగుల్ని పట్టించకూడదురా! అది జయ కరం కాదురా!" అని బ్రతిమాలాడు.

ఆ యువకుడు వినలేదు. గింజాయించుకు పోయాడు. వెంటనే రెండో యువకుడు, అ యింటికొచ్చి తలుపు కొట్టాడు. లోపల నుండి జవాబులేదు.

"మామా! మల్లుమామా! ప్రమాదం!" అని అరిచాడు. వెంటనే తలుపు తెరిచాడు - మల్లు.

"నీవిక్కడుంటివని, దొరలకు చెప్పడానికి పెంటిగాడు పోతుండు-నీ విక్కడనుండి వెళ్ళిపో మామా!"

"అదేంటిరా! అడ్ని పట్టుకొని చావదన్నవ్?" అంటూ ఎదురు ప్రశ్నించాడు - మల్లు!

"మాటలు కట్టిపెట్టి వెళ్ళిపో మామా! బ్రతికుంటే మరోసారి సరదా తీర్చుకుందువు!" అని ఆమె అన్నదో లేదో, యీ లోపులో సైనికులు చుట్టుముట్టారు. హడలిపోయింది - భార్య. మల్లు తప్పించు కోడానికి ప్రయత్నించాడు. సాధ్యం కాకపోయింది. ఎదుట చూచాడు.

కొల్లలుగా కనబడుతున్నారు - సైనికులు. అందులోనూ, ఆ సైన్యంతో పట్టుకోడానికి కొచ్చినాడు - తెల్ల సేనాని, కరన్సు.

ఇక లాభంలేదని తిరుగబడ్డాడు - మల్లు. ప్రక్క భార్య, వుట్టిపై కారం పిడత తెచ్చి, సైనికుల కళ్ళల్లో జల్లింది. కారంపడ్డ సైనికులు కొందరే. ఎందరి కళ్ళల్లో ఆమె కొట్టగలదు. సైనికులు రెచ్చారు—హోరాహోరిగా పోట్లాట జరిగింది. చేతికందిన ప్రతీ దానితోనూ మల్లు ఎదుర్కొన్నాడు. కాని తప్పించుకోడం మాత్రం సాధ్యంకాలేదు. కడకు పట్టుపడిపోయాడు. "మామా!" అని భార్య గోడకు జేరబడిపోయింది - మల్లు చేతికి బేడీలువేసి, బయటకు యీడ్చుకెళ్ళారు.

మల్లును అప్పగించిన యువకుడు "ఇనాం దొరా!" అని దొరను యినాం అడిగాడు.

"క్యాంపుకు రా! అక్కడా యినాం!" అన్నా డాఫీసరు.

ఇంకొక ఆఫీసరు—

"వీడిద్వారా మిగతావాళ్ళ ఆచూకీలు దొరకొచ్చ"న్నాడు.

"Yes you are Right!" అంటూ ఆ ఆఫీసరు - ఆ విష యాన్ని గుర్తించి, ఆ పట్టించినవాడికి కూడా బేడీలు వేసాడు. చేతికి పడ్డ బేడీలు, పులినోటనుండి తల వెనక్కి తీసుకోవాలంటే కష్టం. ఇకా యువకుడు, వారి బేడీలను తప్పించుకోలేకపోయాడు. మల్లుతోపాటు, వానినికూడా ఆ సైనికులు యీడ్చుకుపోయారు. అదంతా శింగన్న మాత్రం గమనించాడు. చేసి అతనేం చేయగలడో చూద్దాం.

అలా మల్లును తీసుకుపోయిన వార్త నందించడానికి శింగన్న గాముకొండ గుహకు వస్తున్నాడు.

గాముకొండ గుహలో మహా సంరంభంగా వుంది. పితూరీ దార్లకు రాజు ఓ కొత్త అస్త్రవైదుష్యాన్ని నేర్పుతున్నాడు. ఆ గుహలోనే ఓ గోడకు "యూనియన్ జాక్" పతాకం చిత్రించబడ్డ ఒక చెక్క పలకానికి కొన్ని అమ్ములు ఒక్కసారిగా ఏకకాలంలో "టక్" మని పెద్దధ్వనితో గ్రుచ్చుకున్నాయ్.

ఆ ధ్వనికి ఆ కొండ కొండంతా అదిరిపోయింది. ఆ అదురు- ఆ ధ్వని, కొండబయట ఆచూకీకోసం తిరుగుతున్న ఇరువురు సి. ఐ. డీల చెవుల పడింది. ఆ యిద్దరిలో ఒకడు అన్నాడు—

"ఇది అమ్ములశబ్దం. యీ గుహలో పితూరీదార్లు వుండి తీరాలి. మన్యంలో ఆయుధాలు ముట్టడం నిషేధించినా, దానిని ధిక్కరించి ముట్టినవాళ్ళు, పితూరీదార్లు తప్ప మరెవ్వరూ ఐవుండరు. పద! క్యాంపుకు. అక్కడ యీ కొండ సమాచారం సంగతి ఆఫీసర్లకు రిపోర్టు చేద్దాం."

అలా అనుకుటూ వారిరువురూ వెళ్ళిపోయారు,

గుహలో మరల పితూరీదార్లు ద్వితీయ పాటవ ప్రదర్శనకు విల్లమ్ములు ఒక్కవరుసలో ఎక్కుపెట్టారు.

రాజు —

"ఒకటీ..." అన్నాడు.

బయటనుండి లీలగా "రాజా!" అంటూ ఓ కేక వినిపించింది.

రాజు—

"రెండు..." అనగానే అమ్ములు దూసెళ్ళడానికి బదులు, ఒగుర్చుకుంటూ, శింగన్న దూసుకుంటూవచ్చి "రాజా!" అని పిలుస్తూ గుహ ముందు పడ్డాడు.

రాజు ఒక్కసారిగా వెనుదిరిగాడు. పితూరీదార్లంతా ఒక్కసారిగా విల్లులు వాల్చేసారు.

శింగన్న "రాజా!" అంటూ రాజుముందు వాలిపోయాడు శింగన్నను రాజు ఆప్యాయంగా కౌగలించుకున్నాడు.

"రాజా! మల్లు నిష్కారణంగా పట్టుబడిపోయాడు."

ఆ మాట వినేసరికి పితూరీదార్లంతా ఒక్కసారిగా—

"అరెస్టా?" అని ఆశ్చర్యంగా ప్రశ్నించారు.

శింగన్న వొణుకుతుఉన్న పెదవులతోనే అవునని మరోసారి! అన్నాడు.

రాజుకు వుద్రేకం హెచ్చింది—

"అవును. ఇది మన్యానికో మచ్చ. మన్యం మాతృగర్భంలో దాగి వున్న ఒక యోధుడ్ని ఎక్కడో మహాసముద్రాంతర ద్వీపాల్లో నుండి వచ్చిన ఇంగ్లండు దొరొచ్చి పట్టుకోడం. హు! శింగన్నా. కరకు కత్తులపై నడకలాంటి స్వతంత్ర పోరాటంలో అకారణంగా పట్టుబడ్డం ఎంతటి తలవొంపు శింగన్నా?"

అసలు కారణమేమిటో?" అని గంటం ప్రశ్నించాడు- శింగన్నని.

"కారణంకాదు. ప్రధానం - దాని ఫలితమే గంటం!" అని రాజు జవాబు చెప్పాడు.

అసలు కారణమేమిటో తెలుసుకున్న వాడక్కడున్నాడు. అతను అంతవరకూ నోరు విప్పలేదు. విప్పితే ఏమౌతారేమోనని కాని విప్పకపోతే వచ్చే నష్టంకంటే, విప్పితే వచ్చే లాభాన్ని గుర్తించి గోవిందు అన్నాడు—

"ఓసారి పెళ్ళాన్ని చూసొస్తానంటిడే!" అని.

రాజు మండిపోయాడు.

"పెళ్ళాం! ఒక చావుబ్రతుకుల పోరాటంలో ఒక స్త్రీ ప్రణయం ప్రధానం కావచ్చునా? దారుణం! శౌర్యంతో చిందులు త్రొక్కుతూ సమయనిస మరోత్సాహంతో జూలువిదలించిన సింహాల్లా పోరుతున్న మీలాంటివారి కిది ప్రక్కపోటు కాదా! పితూరీకే యిది పిడుగుపాటు కాదా?" అంటూ ఆక్రోసించాడు.

ఆ మాటలకు ప్రక్కనే మారువేషంలోనున్న సీత కన్నులు చెమ్మగిల్లాయ్. ఆయన కళ్ళకు దేశభక్తిముందు, అన్ని విషయాలు అవి యిహపరాలకు సంబంధించినవైనా యిసుక రేణువులతో సమానం అనుకుందామె.

అసలు శింగన్న తనెందుకొచ్చాడో యింకనూ చెప్పనేలేదు. అదెంత త్వరగా చెబుదామనే ఆతురత అతనిలో తీవ్రమైంది. చెప్పడం మొదలు పెట్టాడు.

"రాజా! మల్లు గొడవలా వుంచండి! మొన్న పెదవలసలో దెబ్బతిన్న తర్వాత తెల్లదొరలు రెచ్చారు. చాలా సైన్యాన్ని దించేసారు. యీ దఫా దిగినవారిలో అనేక యుద్ధాల్లో ఆరితేరి, క్రౌర్యానికి తల దన్నిన క్రూరులు, మారణహోమానికి మొనగాళ్ళనిపించుకున్న నర భక్షకులు, కవర్టు, హైటరులు ఆ సేనలకు సేనానులు, వారి సేనానాయకుడు - మహా రాక్షసుడు - గుడాల్."

రాజు యిక అక్కడ శింగన్నను ఒక్కక్షణం వుంచడం కూడా ప్రమాదమే అనుకున్నాడు వెంటనే శింగన్నను పంపించివేశాడు.

శింగన్న వెళ్ళిపోయిన తరువాత అనుకున్నారంతా—

నిజంగా, శింగన్న, చినుకూ చినుకూ, చీల్చుకుపోగలిగిన సహదేవుని కత్తిలాంటోడని, మన్యానికే అతను గుండెలాంటివాడనీ.

ఎటువంటివాడైతేనేం, శింగన్న అటు వెళ్ళాడు. ఇటు గాము కొండ చుట్టూ నోళ్ళు తెరచుకున్న నాలుగు ఫిరంగులు ఒక్కసారిగా ప్రేలేయ్.

ఆ ధ్వనికి హడలిపోయిన సీత, రాజును జెబ్బ పట్టుకొని, ప్రక్కకు లాగింది.

దారికానని చీకటిలో గతుకుల రోడ్డుపై ఓ రెండెడ్ల బండిపై వస్తున్న నారాయణమ్మగారి బండి వెనుక "క్రక్" మంటూ బ్రేకువేసి ఒక్క లారీ ఆగింది. ఆ లారీ ఫోకస్ "చక్"మని ఆమె కళ్ళ కొట్టింది. "కెవ్వు"న అరచిందా తల్లి. ప్రక్కమూటలోని, రామరాజు యొక్క బాల్యచిత్రాన్ని, తన భర్త చనిపోడానికి ముందు తీసిన ఫోటోను, పైకితీసి, గుండెల కత్తుకొని.

"నా బిడ్డకే ఆపదా రాకుండా రక్షించు ప్రభూ!" అంటూ పరమాత్మని ప్రార్థించింది.

గుహ చుట్టూ మ్రోగిన ఫిరంగి మ్రోతల ధ్వనికి, పితూరీ వాళ్ళంతా ఒక్కసారి పైకిచూచారు. ప్రక్క గుర్రం సకిలించింది. "చక్"మని క్షణకాలంలో రాజు ఆ గుర్రంపై కొండ శిఖరాగ్రానికి వచ్చి, తన విస్ఫులింగ నేత్రాలతో ఆ దృశ్యాన్ని చూచాడు.

ఒక వైపునుండి కవర్టు హైటరుల నాయకత్వాన ఓ దళం. కొండ ఎక్కుతుండడం చూచాడు. అదే గుర్రంపై మరో కొండ శిఖరాగ్రానికి వచ్చాడు. అటువైపునుండో శత్రుదళం, కొండను ఎగబాకుతోంది. మళ్ళీ ఆ గుర్రాన్ని వెనక్కి దూకించి, మరో పొదలతో

కూడిన, సానువు పైకివచ్చాడు. అక్కడనుండి ఆయనకు, మొత్తం సైన్యాలన్నీ అర్ధచంద్రాకారంగా, ప్లాను ప్రకారం ఆ కొండను. ఆ కొండ గుహలోని తమను చుట్టుముట్టడానికి స్పష్టంగా ముంచుకొస్తు న్నట్టు చూచాడు. కొండను చుట్టుముట్టినా, ఆ కొండలోని గుహాను పట్టుకోవడమంటే; సూర్యుని పట్టుకోడానికి ప్రయత్నం చేయడం లాంటిది. అలా పట్టుకోడానికి ప్రయత్నం చేసిన వరపుత్రుడైన హనుమంతునిలాంటి వాడికే మూతి కాలింది. యిక యీ తుచ్ఛుల తరమా ?

ఏమైనా అప్రమత్తత పనికిరాదు. తమ సర్వశస్త్రాలను వొడ్డి పోరాడవలసిన సమయమది. తన తనువుల్నే తృణప్రాయంగా ఫణ మొడ్డవలసిన తరుణం అది. శింగన్న చెప్పిన ప్రకారం వస్తున్న నర భక్షకుల్ని కూల్చగలిగామా? శత్రు సైన్యాలను తరమి కొట్టామా, ఆకాశంలో అర్క చంద్ర పసిరాజులు రాజ్యం చేయగలిగినంత వరకూ, "పితూరీ" నామాన్ని ప్రజలు స్మరణచేస్తారు. లేదా? పితూరీ అంతా పటాపంచలైపోతుంది, పితూరీని చూచి, విని, వూపిరి పోసు కుంటున్న దేశం, ఒక్కసారి నిస్తబ్దమైపోతుంది ఆ రోజుపై కొన్ని తరాల భవిష్యత్తు ఆధారపడివుంటుంది. అదంతా రాజు బుర్రలో విద్యుత్కాంతిలా మెరిసింది.

వెంటనే గుర్రాన్ని వెనుదిప్పాడు. తిన్నగా, కొండగుహలోని తొలి ముఖద్వారంవద్ద గుర్రాన్ని ఆపుచేసాడు. చర్రున దిగి పితూరీ దార్ల మధ్యకు, ఆకాశంనుండి, భూమిపైకి, అందులోనూ వారి మధ్య కొచ్చి ప్రకాశించిన, బాల సూర్యునిలా ప్రత్యక్షమయ్యాడు.

వచ్చీ, రాగనే అప్పటికే జేవురించివున్న పితూరీదార్లను గంభీ రంగా చూచి అన్నాడు—

"సోదరులారా! కొండ ముట్టడించారు-శత్రువులు. మన్యం సంపదలు, తెగ మెక్కి, కైపెక్కి, మనల్ని హతమార్చాలన్న దుష్ట పన్నాగంతో బయిలుదేరింది - తెల్లదండు! ఏమైనా సరే! సూర్య

చంద్రులు గతులు తప్పినా, దిశలు తెలివితప్పినా, కాలం దారితప్పినా, మన మహోక్రోధానలజ్వాలలకు, శత్రువు భగ్గున మండి మాడిపోవలసిందే. మన్యం ప్రజల జీవిత సాక్షిగా, కొనప్రాణం వున్నంతవరకూ, యీరోజు మహాపోరాటంచేసి, శత్రునిశ్శేషం చేయవలసిందే. తెల్లవాళ్ళను తెలుగువాళ్ళు ఓడించగలిగారన్న ఘనకీర్తి, తర తరాల బానిస సంకెళ్ళు త్రెంచబడ్డాయన్న మహానందం, తెలుగు జాతి, భారతజాతి పొందగలగాలి. తెలుగుజాతి చరిత్రలోనే, భారత చరిత సంపూర్ణపుటల్లోనే, యీరోజొక సువర్ణ ఘట్టంకావాలి. తెలుగు తల్లి మెడలోని ముత్యాలహారం కావాలి. తీసుకోండి - ధనుస్సులు, ఎత్తండి - కత్తులు - కాల్చండి తుపాకులు - ఊ! రగులుకున్న రాక్షసి బొగ్గులా రగిలిపోండి! ఘూటెక్కిన గంధక ధూమంలా ఘాటెక్కిపోండి! పదండి! ముందుకు!" అని సింహనాదం చేసాడు.

రాజు నాదానికి ఆ గుహంతా—

'మన్యం పితూరీకి జై!' అంటూ ప్రతిధ్వానం చేసింది.

అంతలో ఎక్కడనుండో వీరయ్యదొరొచ్చాడు—

'చాలా సైన్యముంది రాజా! మహా ప్రవాహంలా ముందుకొస్తోంది!' అని హెచ్చరించాడు.

ఆ హెచ్చరికకంటే వేగంగా. పితూరీదార్లు ఆయుధపాణులైపోయారు. ఆ ఆయుధాలు అంతకముందే ఆ కొండగుహలోని గరుకురాళ్ళపై సానబెట్టి సిద్ధంగా వుంచుకున్నారు. ఆ ఆయుధం తగిలిందా - వజ్రాయుధానికైనా దెబ్బతగలకపోవచ్చు - దీనికి ఎవ్వడైనా హతమైపోవలసిందే.

ఆయుధపాణులై పితూరీదార్లు ఏనుగుల బారుగా, బయలుదేరారు. వారంతా గుహ ముఖద్వారం కడకు వచ్చాక, రాజు ఆగమని ఆజ్ఞాపించాడు. అంతా ఆగారు.

"సమయస్ఫూర్తిని, తెలివితేటల్ని ప్రదర్శించడం మాత్రం మరిచి పోకండి! చేతులూ, బుర్రా సమానంగా పనిచేయాలి మనకు.

శత్రువులకు మాత్రం చేతులే పనిచేస్తాయ్. మనకు బుర్ర పనిచేసి నప్పుడు ఆ చేతు లాగిపోతాయ్. ఏమైనా శత్రువును ముఖాముఖీ ఎన్నడూ ఎదిరించవద్దు. వెనుక భాగాలనుండే వెన్నుపోటు పొడాలి." అని రాజనేటప్పటిక్కి, అగ్గిరాజుకు పౌరుష మొచ్చింది—

"కాదు, బాహా, బాహీ ఎదిరిస్తేనే తెలుగుజాతి సత్తా తెలుస్తుంది - నీచులకంటూ!" మీసాలు మెలిపెట్టాడు.

"పౌరుషానికి లక్షణం, మీసాలు మెలిపెట్టటం, ప్రాణత్యాగం కాకూడదు రాజూ!" అని రాజనగానే—

"అవును. కూర్చున్న కొమ్మనే కొట్టుకోవడమంత మూర్ఖం మరొక టుండదు!" అని గంటం వూతవేసాడు.

ఫిరంగి శబ్దాలు మిన్నుముట్టుతున్నాయ్. ఆ ధాటికి కొండ అదురుతోంది.

"రాజా! త్వరగా ప్లానుచెప్పు!" అని పడాలు తొందరపెట్టాడు.

"అవును. యిక చెదిరిపోండి! ప్రతీ గుట్టకీ, పుట్టకీ, చెట్టుకీ ఒక్కొక్కళ్లైపోండి! అన్నింటినీ, అవసరమైతే ఆకాశాన్ని కూడా ఆవరించండి! మీ విశాల బాహువులను ఆ విశాలాంతం చాపి, ఆ బాహువుల్లో శత్రువులను నొక్కివేయండి! పదండి!" అంటూ నడిపించాడా వాహినిని రాజు.

కొండ వుపరీతలంపైకి వచ్చారు. కొండ దిగువనుండి అప్పుడే కొండను ప్రాకటం మొదలుపెట్టారు. గోవిందుకు వాళ్ళు పితూరీ స్థావరంపైకి కాకుండా, మరోవైపు పోతున్నట్టుగా కనబడింది. "వాళ్ళటు పోతున్నారుగా?" అని రాజు నడిగాడు.

"ఎటుపోతున్నా, పోనివ్వడంలేదు. పిలిచి, దెబ్బకొట్టాలి!"

వీరయ్యా దొరందుకున్నాడు—

"వాళ్ళెక్కడికి పోతారు?" అంటూ కొండ కట్టుప్రక్క పొదల్ని చూపించాడు. అంతా ఆశ్చర్యపోయారు.

రాజు, గర్వం చెందాడు——

"సెబాష్ వీరయ్యా దొరా! మొనగాడి వనిపించుకున్నావ్! చతురతలో శివాజీని మరిపిస్తున్నావ్, ఆనాడు కూడా యిలాగే శివాజీ పొదలకు పాగాలు చుట్టి, ఒక గెరిల్లా దళంగా మభ్యపెట్టి శత్రువులను హాత మార్చాడు. శివాజీగాని బ్రతికుంటే, నిన్నుచూచి రొమ్ము విరుచుకొని వుండేవాడు—వీరయ్యా దొరా!"

గంటం-అబ్బురంతో——

"ఇంతటి ఘటికుడ వనుకోలేదు మామా!"

"ఘటికుడే కాదు. తన ప్రతిభద్వారా ఇప్పుడు మనకో కొత్త మార్గం తెరిచాడు. ఇక వినండి! జాగర్తగా వినండి! ప్రతీ చిన్న విషయమూ అర్థంచేసుకోండి! చిన్న విషయాలే, పెద్దపెద్ద చరిత్ర లను నిర్మించాయ్. వినండి! ఆ పాగాలను చూడగానే ఆ సైన్యాలు ఖంగారుగా వెనక్కి వస్తాయ్. ఆ వచ్చిన సైన్యాలను నేనీ కొండ వాగులోకి మళ్ళిస్తా!" అంటూ చూపాడు. అలా చూపగానే-ఇద్దరు రాక్షసుల్లా, దొంగచూపులుచూస్తూ, సైన్యానికి ముందు వస్తున్నారు.

"అదుగో, శింగన్న చెప్పిన కవర్టు, హైటరులు వాళ్ళే అయి వుంటారు. వాళ్ళపని, పడాలూ! నీవూ, గంటం పట్టండి! అలా ఎప్పు డైతే జరిగిందో, వాళ్ళలో ముసలం పుడుతుంది. సైన్యాలు, చెదిరి బెదిరిపోతాయ్...ఇదిగో ఇలా రండి!" అంటూ వారిని ఒక కొండ పణుకు పక్కకు తీసుకెళ్ళి చెప్పడం మొదలు పెట్టాడు.

"వీరయ్యా దొరా, అగ్గిరాజా!...మీరా కొండ పణుకు ప్రక్క పొదల్లో మాటేసి కాల్చండి! మీకు మన నవయువకులు, వుషారుతో చిందులుత్రొక్కే మన కోయ, చెంచు రేచులు, అంత దండలుగా వుంటాయ్. వాళ్ళు తిరుగుముఖం పట్టే త్రోవలో నేను కాసి, వాళ్ళను తిన్నగా, ఇళ్ళకు గాకుండా, యమపురికి ప్రయాణం చేయిస్తా! అంతకూ దాటిపోయినవారుండొచ్చు! గోవిందూ...! అంటూ గోవిందు జెబ్బచరిచి——

"ఆ చివరి కొండలపై నువు కాయ్. ఆ కొండపైనుండి క్రింద పరుగెత్తి పారిపోతున్న సైన్యాలపైకి, బండలను దొర్లించు ! వాళ్ళ పుర్రెలు పుచ్చకాయల్లా-పగిలిపోతాయ్! అంతే జాగర్త! ఏది ఏమైనా సరే, మాతృదేశ విముక్తికి, మన శిరస్సులను త్రుంచి పుష్పాలుగా, సమర్పించండి! మన నెత్తురు చింది యీ మహాయజ్ఞంలో అజ్యంగా ధారబోయండి! మాతృగడ్డకోసం, ఆత్మబలిదాన మిచ్చిన బెంగాలు బెబ్బులులు, పటానీ పోటరులు, మహారాష్ట్ర మత్తేభాలు, పంజాబు సింహాలు, తెలుగు వీరతురంగాలు, అంతా తలపుకొచ్చి తీరాలి!" అని పిడికిలి బిగించాడు-రాజు.

ఆ పితూరీ యోధులు శరీరాలపై ఆ పిడికిలి, సింధూరం కొట్టినట్టయింది. వాళ్ళ శరీరాలు పులకరించాయ్. మగరూపంలో నున్న సీత, తన బొటనవ్రేలు కోసుకొని. ఆ చిమ్మిన నెత్తుటి బొటన వ్రేలు రాజు నొసట నుంచింది—

అంతా ఒక్కసారిగా, "అల్లూరి రామరాజుకీ! జై!" అంటూ భువనఘోష చేసారు.

సీత, ఆప్యాయంగా ఆ వీరుని హస్తం పట్టుకుంది - అలా పట్టుకున్నప్పుడు ఆమెలో స్త్రీత్వం రూపుదాల్చింది. క్షణకాలం అంతా నిస్తబ్ధులయ్యారు.

ఆమె ఆకాశమంత ఎత్తుగా, నరాలు పొంగుతూ, ఎర్రబారిన ఆ అరుణహస్తాన్ని బలంగా, రెండుచేతులా నొక్కి—

"జయం! మన్యం పితూరీకి జయం!" అంటూ నిస్తబ్ధమైన వీరులొక్కసారి ముష్టి ఝాడించి, జయధ్వానం చేసారు. చటుక్కున వొదిలేసింది - సీత - ఆ చేతిని తను ఏదేదో వూహించుకొని, ఆఖరి కలయికగా భావించి, మనసారా, తన వేడిహృదయంతో, సింహబలుడైన రాజు ఛాతీని గాఢంగా హత్తుకున్నంతగా ఆమె పరవశం చెందింది.

వీరులు కదిలిపోయారు.

కదిలిపోతున్న వీరులకు రాజు, ఆ కొండద్వారానికి, తన మోచేతిని ఆని తుది హెచ్చరికచేస్తున్నాడు—

"వృథాగా ఒక్క తూటా, ఒక్క తూపు ఖర్చు పెట్టొద్దు. మనకవి ఒక్కొక్కటే ఒక్కొక్క వీరునితో సమానం. జాగర్త! జాగర్త! అటూ, ఇటూ, ఎటు చూచినా మనమే కనబడాలి. తెల్ల వాళ్ళ కళ్ళు చెదిరిపోవాలి. మెరుపుయుద్ధంచేయాలి!" అంటూ ఆ మోచేతిని చటుక్కున లాక్కొని, వెనుదిరిగాడు. ఆయ నెందుకు తిరిగాడో, తెలుసుకున్న సీత, అప్పటికే, రాజుయొక్క దివ్యాస్త్రాలతో, ఇంద్రధనస్సుతో ముందు నిల్చింది.

"సెబాష్ వీరుడా! అంటూ, ఆమె శిరస్సును ముద్దాడాడు.

అంతటి భాగ్యం పొందినందుకు ఆమె శరీరం జలదరించింది. వేడి విశ్వాసం వొదిలిపెట్టి, విల్లమ్ములు రాజు కందించింది. కాని శిలాప్రతిమైపోయింది. తను మొదటాయన హస్తాన్ని స్పృశించి నప్పటికంటే ఇప్పుడామె తన మనోవాంఛ సఫలమైనట్టుగానే భావించి, వూపిరాడని ఆనందంతో ఆలా నిలిచిపోయింది. రాజు కామె సీతని తెలీదు, ఒక విశ్వాసపూరితమైన, భవిష్యత్తులో అచంచల విశ్వాసమున్న, పితూరీని, తననూ, గాఢంగా ప్రేమిస్తూ జయం కోరు కుంటున్న ఒక సిపాయిగానే భావించి, ఆమెకు మనసిచ్చి, ఆమె చిరుబుగ్గలపై చేయి రాసి—

"జాగర్త! నీకు పని యివ్వలేదని బాధపడుతున్నావనుకుంటా. అన్నిటికన్నా కంటికి రెప్పలా కాపాడవలసిన పని నీ కప్పగిస్తు న్నాను. యీ రహస్య ప్రదేశాన్ని మాత్రం అతి భద్రంగా కాపాడు. యిక్కడ కొచ్చిన వార్తలు ఎప్పటి కప్పుడు అందించు! జాగర్త! వొళ్లంతా కళ్లున్న దేవేంద్రునిక్కూడా, మన యీ రహస్య స్థావరం ఆచూకీ తెలియకూడదు!" అంటూ వెళ్ళిపోయాడు.

పంచకళ్యాణి అనదగ్గ గుర్రాన్ని ఎక్కాడు. రివ్వుమంటూ, చూస్తుండగానే అదృశ్యమైపోయాడు. అత నలా వెళ్ళగానే, మొల

నున్న వరలోని కత్తిదూసి, సీతా గుహను పహారాయిస్తూ కావలి కాస్తోంది. ఆమె కా ఘడియలోనున్న వేడి, నరకాసురునిపై విల్లెక్కుపెట్టిన సత్యకుగాని, తన నాధుని తరుంతున్నప్పుడు రధ సారధ్యం చేసిన సుభద్రకుగాని, వుండి వుండదు.

రాజు ఓ కొండ శిఖరంపైకి గుర్రంపై ప్రత్యక్షమయ్యాడు. మధ్యభాగంపైకి అప్పుడే శత్రువులు వచ్చేసారు. చుట్టూ ఫెళఫెళా ర్భాటాలతో భీకర తుపాకి కాల్పులు, ఫిరంగి మ్రోతలు, మ్రోగిపో తున్నాయ్. ఒక పెనుతుఫాను వచ్చినప్పుడు, ఆ వెంటనే ఓ భూకంపం పుట్టినప్పుడూ, అడవిలోని మృగాలన్నీ కలిసి, చిందర వందరై ఒక్క పెట్టున చేసే భీకరధ్వనులూ, ఫెళ్లు ఫెళ్లున విరిగిపడే వృక్షాల ధ్వనులూ, అగ్నిపర్వతాలు పగిలినప్పుడు పుట్టినప్పటి భీభత్స ధ్వనులూ, అన్నీ ఏకమై ఒక్క పూవులో ఒక్క ధాటిలో వినబడు తున్నాయక్కడ.

ఆ ధ్వనులన్నింటినీ మించి, ప్రళయం సంభవించినప్పటి మహా శంఖారావంలా, ఓ పెద్దరావం ఆ ధ్వనులను కప్పేసి ఆవరించింది.

ఆ రావంనుండి, ఒక బలసిన గుర్రంపై - ఎర్రటి కాంతులు వెళ్ళగక్కుతున్న రాజు, ఆ గుర్రంపైనే నిల్చి, పితూరీ యోధులను మహోద్రేకంతో పురిగొల్పుతున్నాడు.

"పోరుడో, చిచ్చుల పిడుగులై బ్రిటిషు
　　దొరల గుండియల శతఘ్ని మ్రోగ
పోటెత్తుడో, పెనుపొంగిన పెన్నిధై
　　ముష్కర నివహముల్ ముంచివేయ;
కుప్పించి దూకుడో, కుంభి కుంభములపై
　　సింహాలుగా యాంగ్లసీమ వొణక;
చెలగుడో, చండప్రచండమౌ మీదు కో
　　దండ పాండితిని దిగ్దిక్కులదర;

తెలుగు విజ్ఞాన మన్ని ఖండముల మెరయ;
తెగువ శతపోరి మన తెల్గుతల్లి ముక్తి
తెరలి సాధించ పోరరా, తెలుగుబిడ్డ!
తెలుగు పేరిన్న చత్తురు దొరలు, గిరలు!"

అంటూన్న ఆ శబ్దాలు, మధ్య అడ్డుగానున్న ధ్వనుల పొరలను కోసేసుకుంటూ తిన్నగా పితూరీదార్లు ఎక్కడెక్కడున్నా, అందరి చెవులు తాకాయ్.

సముద్రంలా పొంగారు. ఒక్కసారిగా, రివ్వురివ్వున అమ్ముల వర్షం, తుపాకిగుండ్ల వర్షం కురిసింది.

అదిరిపోయా—రుదొరలు. దడదడ వొణికిపోయారు. వొణికి పోతూ కవర్టు, హైటరులు మధ్యలో కాళ్ళకు తగిలిన ఓ కొండ పణుకు తగిలి ముందుకు తూలారు. అలా తూలి, కాస్త తేరి చూడ గానే, "రయ్!" అంటూ వచ్చి, ఓ అమ్మ్మ వాళ్ళ కాళ్ళముందు భూమిలో దిగబడింది. అలా దిగబడగానే ఒక బెల్లు లేచిపోయింద్బి హడలిపోయారు. వాళ్ళెన్నెన్నో యుద్ధాలు జయించవచ్చు. కాని జీవితం, దేశం, జనంపై విశ్వాసమున్నవాళ్ళతో పోరియెరుగరు. వాళ్ళలో నరనరాలు కంపించిపోయాయ్. కంపించిపోతున్న చేతుల్తో అమ్ము తీసారు. దాని మొనకో మిరపకాయ కట్టివుంది. ఆ మిరప కాయ మొనను ఒక చీటీ వుంది. ఆ చీటీపై—

"జాగ్రత్త! యీ రోజుతో మీ ఆయుష్షు సరి!" అని వుంది. వాళ్ళకు రోషమొచ్చి. గబగబా తుపాకులు అటూ, ఇటూ కాలు కుంటూ, తడబడుతూ వస్తున్నారు.

వాళ్ళకో పదిగజాల ముందు ఓ మద్దిచెట్టు వుంది. ఆ చెట్టుకు ఇటువైపుకు ఒక అమ్ము రివ్వునొచ్చి గుచ్చుకుంది. ఆ చెట్టుక్రింద రాతివెనుక రెండు తుపాకులు బారుచేసి, కాల్చాయ్.

అంతే, "టపీ"మని ఆ రెండు శవాలూ, ఆ వాగులోపడి దొర్లి పోయాయ్. తెల్లరాజు సింహాసనం జెణికింది.

గంటం, పడాలులు తమతమ తుపాకుల్ని గాఢంగా ముద్దు పెట్టుకున్నారు.

"కూలిపోయాయన్నా - రెండు తెల్లపందులు!" అన్నాడు— పడాలు!

వాళ్ళెప్పుడైతే కూలిపోయారో, రాజు ఇక అన్నివైపులకు తన శరపరంపరలను కురిపించాడు. ఒకవైపు తను, మరోవైపు అగ్గిరాజు, వీరయ్యదొర, ఎర్రేశు, యింకా అనేకమంది వీరులు ఒక్కొక్కడూ ఒక్కో పులైపోయారు. చేవతరగని దృఢత్వంతో పోరుతున్నారు.

సైనికులు పిచ్చికుక్కలై పారిపోతున్నారు. వాళ్ళకా ధ్వనులు స్టెన్, బ్రెన్, గన్‌లను మరపిస్తున్నంతటి వేగంగా వస్తున్నాయ్. కళ్ళు తిరిగిపోయి, ఎటూ పాలిపోక పరుగెడుతున్నారు. హాహాకారాలు, శవారవాలు మిన్ను ముడుతున్నాయ్. ఇంకొకప్రక్క కొండ శిఖరాన్నుండి ఆ పారిపోతున్న సైనికులపైకి పెద్దపెద్ద బండలు దొరులుతున్నాయ్. అబ్బ! ఆ సైనికులకు, ఇంగ్లండులోని బ్రిటిషు రాజు ఎముకల సింహాసనం దడదడ లాడుతునట్టు, యమలోకంలోని యముడు దిగివచ్చి, తమ గిట్టలతో తమ శిరస్సులను కల ద్రొక్కుతున్నట్టుగా కనబడి ది. వాళ్ళకిప్పుడు తెలుస్తుంది - తెలుగువాళ్ళ తడాఖా, స్వతంత్ర కాముకుల సత్తా.

చావుదెబ్బ కొట్టేవరకూ ధనస్సు క్రింద పెట్టకూడదన్నంత పట్టుదలతో, రాజు ఎటుచూచినా తానై, ప్రళయకాల రుద్రునిలా కాలుస్తున్నాడు. భీకర సంగ్రామం - అక్షౌహిని సేనా పోరాటం జరిగిన కురుక్షేత్ర సంగ్రామాన్ని మించి, సముద్రంపై రాక్షస బలాలతో పోరిన రామచంద్రుని మరపించి జరుగుతోం దక్కడ

యుద్ధం! ఆ తుపాకి కాల్పులకు, ఆ నారి మ్రోతలకు, వియత్తలం రుద్రవీణలా ప్రళయనాదాలు పలికింది.

యుద్ధం చల్లబడిపోయింది. అంతా గుహలోకి చేరుకున్నారు. అమిత సంతోషంతో. కాని శత్రుశవాలే కుప్పలుగా కూలిపోయి, పితూరీదారు డొక్కడూ ఖీరుపోలేదనుకున్నవారి హృదంతరాళం దద్దరిల్లినంతగా పడాలు, వీరయ్యదొర శవాన్ని మోసుకొచ్చి, ఆ గుహలో ఆ వీరులముందు పెట్టాడు.

రాజు ఒక్కసారి రెప్పలు బిగించి, రెండు కన్నీటిబిందువులు వొదిలాడు—బరువుగా—

అవును మరి! శత్రువులపాలిటి పిడుగుపాటు వీరయ్యదొర, మధ్యలోనే కలుపుకొని, మధ్యలోనే ఒక సారధిని పోగొట్టుకున్న ఆ వీరులు ఎంతటి వీరులైనా దురదృష్టవంతులే కదా!

కాని ఆ వీరుని మరణాన్ని తమకొక నూతన ఆవేశంగా తీసుకున్నారా—యోధులు.

ఆ యోధుల్ని చూచి రాజన్నాడు—

"వీరయ్యదొర వజ్రసంకల్పం, పటుతర దీక్షా మనకు సదా కంచు కాగడాలు!" అని.

అంతా శిరస్సులు వొంచారు—ఓ క్షణం.

వీరయ్యదొర ఆత్మ బలిదానానికి పితూరీయోధులు శిరస్సులు మోడ్చితే, ఆ పితూరీ యోధుల సాహసపరాక్రమ విక్రమాలకు ఆంధ్ర దేశమే నివ్వాళులెత్తింది.

పత్రికలన్నీ పతాక శీర్షికలు పెట్టాయ్.

"మన్యం వీరుల ప్రచండ సమరం, తెల్లసేనానుల వధ!" అంటూ శీర్షికగల పత్రికను కుర్రవాళ్ళు అమ్ముతోంటే, జనం కొత్త గోదావరికి ఎదురెక్కే చేపల్లా ఎగబడుతున్నారు.

ఈ పత్రికల్లోనూ కొన్ని రకాలున్నాయ్. వాటికి అమృతాంజనం ఘూటు కళ్ళకు కొట్టి, మన్యం వీరుల పరాక్రమ విక్రమాలకు బదులు కవర్టు, హైటరుల పరాక్రమ విక్రమాలు మాత్రమే చూడగలిగాయ్. అవి జాతీయ పత్రికలని యిప్పటికీ రొమ్ములు బాదుకుంటూనే వుంటాయ్.

కాని ఆ నాడు ఆ పత్రిక కుర్రవాడు - తన పత్రికా సంపాదకుని దేశద్రోహానికి తలొంచుకొని, పత్రికలు అమ్మకానికి చూపితే, వీపుమీద మన్ను రాలుతుందని భయపడ్డాడు. ఆ సంపాదకునికంటే యీ కుర్రవాడే లక్షరెట్లు దేశభక్తుడు.

పత్రికలే గాదు. ఆ రోజున ఆంధ్రదేశంలోని ప పల్లెలో, ప పట్నంలో, ప వీధిలో, ప మూలలో చూచినా జనం గ్రూపు గ్రూపులుగా పర్పడి, తెలుగుదేశం అటువంటి మహావిప్లవ సారథులను కన్నందుకు గర్వంతో వుప్పొంగిపోయారు.

అంతకంటే ఘనమైనదా మరునాడింకొకటి జరిగింది. ఆ గాము కొండ లోయలోకి దొర్లిపోయిన కవర్టు, హైటరుల శవాల్ని తెచ్చుకోడానికి మరికొన్ని సైన్యాలొచ్చాయ్. ఆ సైన్యాలకు మహా మొనగాళ్ళనుకున్న ఆనాడు చెన్నరాష్ట్ర పోలీసుశాఖకే ఏకైక అధిపతియైన ఇన్‌స్పెక్టరు జనరలు ఆర్మిటేజి, ఎ. ఎస్. పి, 'కేన్' సహాయంతో నాయకత్వం వహించి, పితూరీదార్ల ధాటికి ఆగలేక ఆ శవాలకోసం, ఇంకొందర్ని బలిచ్చి, వెన్నిచ్చి వెళ్ళిపోయారు. దానితో పితూరీదార్ల దయా దాక్షిణ్యంపైన తప్ప మరోవిధంగా ఆ శవాలను తీసుకు వెళ్ళడం సాధ్యంగాదని తేలిపోయింది. ఆ శవాలకోసం వెళ్ళి వెన్నిచ్చి వచ్చిన ఆ పోలీసు వున్నతాధికారే - ఆనాటి పితూరీదార్లు ప్రదర్శించిన శౌర్యాన్ని ప్రస్తుతిస్తూ గవర్నర్‌కు నివేదిక సమర్పించాడంటే, తెలుగువాడన్నవానికి ఎంత గర్వకారణం?

తరువాత, ఇంకో తెల్లసైనికాధికారి "స్టీపర్డ్" వచ్చి తెల్ల జండా ఎత్తి, రామరాజు మానవతా ప్రదర్శనపై మాత్రం ఆ శవాలను తీసుకెళ్ళగలిగాడు.

అలా తీసుకువెళ్ళారే గాని, లోపల కుతకుతలాడిపోతోంది ప్రభుత్వం. అందితే జుట్టు, లేకపోతే కాళ్ళు పట్టుకునే రూధర్‌ఫర్డు ఆ రోజు నాలుగుసార్లు Wireless Contact లో గవర్నరుతో మాట్లాడాడు.

ఆ నాటి గవర్నరు వెల్లింగ్టన్, పక్కా రాజకీయవేత్త. ఆలోచించాడు.

బంతి వెంత గట్టిగా నేలకొడితే అంత గట్టిగా తిరిగివచ్చి నుదుటికి కొట్టుకుంటుందని వానికి తెలుసు - అయినా, ఫోను సందేశంలో రూధర్‌ఫర్డును చాలా గట్టిగా ఆజ్ఞాపించాడు—

"ముందు రామరాజును బంధించండి! నాయకుడు లేనిదే నడవలేని మొ-డిజాతి మన్యం, ఒక్క క్షణంకూడా జాగుచేయకుండా ముందా పని చెయ్యండి! అవసరమైతే మన్యంపై నిప్పులు కురిపించండి!" అని.

"All Right Sir!" అంటూ రూధర్‌ఫర్డు ఫోను దింపేసాడు.

అంతే.

మరు క్షణంలోనే మన్యంలో రహదార్లన్నీ బంద్ చేయించాడు - రూధర్‌ఫర్డు. ఈసారి పకడ్బందీగా ఆహారధాన్యాలు నిలుపు చేసాడు. ఎక్కడ ప్రజలు బయటకొచ్చినా వెంటనే అరెస్టుచేసి చీకటికొట్టుల్లో బంధించేస్తున్నారు. అలా బంధించినవాళ్ళను తక్షణ తక్షణం విచారించడానికి ఎక్కడికక్కడే కోర్టులు పెట్టేసారు, స్వయంమంత్రీ, స్వయంప్రభువు' పరిపాలనలాగుంది - వాళ్ళే ప్రభువులు వాళ్ళే న్యాయాధికారులు, వాళ్ళే దండధరులు. "అరెంట్" అనే ముష్కర మిలిటరీ న్యాయాధికారి నాయకత్వాన ఇంకొక పెద్దకోర్టు వాల్తేరులో పెట్టారు.

ఆ కోర్టుల్లోని పై ఆకారం - ఏదో న్యాయం చేకూరుస్తామని ప్రజలను నమ్మించి నాటకమాడ్డం. లోగుట్టుమాత్రం మన్యాం జీవితానికి వుచ్చులు బిగించి, ద్వీపాంతరాలు, యావజ్జీవతాంతర శిక్షలు విధించి కసిదీర్చుకోడం.

అంతటితో వూరుకోలేదు - ఆ వీరులు!

చేతి కందిన ప్రతివాణ్ని చేతికందినంత దెబ్బకూడా తన్నారు. చేరువలోనున్న ప్రతీ గ్రామం తగలెడుతున్నారు. మనం రామాయణ కాలంలో విన్నాం - మారీచ, సుబాహుల్ని, ఖరదూషణాదుల్ని, రావణ, కుంభకర్ణుల్ని, మాయల మరాఠీ యింద్రజిత్తునీ, వారి నందరినీ మించిపోయారీ రాక్షసులు.

ఆ రాక్షసులు, ఎన్నడూ ప్రజలను హింసించినట్టు మనం వినలేదు - ఒక్క తాపసుల్ని తప్ప. కాని యీ రాక్షసులు, అమాయకులైన జనాన్ని చిత్రహింసలు చేస్తున్నారు.

అదిగో! రాక్షసులు కొండపల్లి అనే ఒక గ్రామాన్ని పూర్తిగా తగులబెట్టేసారు. అలా తగులబడుతున్న ఓ కొండలో ఓ ముదుసలి అవ్వ, తన పడాది బిడ్డడ్ని వొడిలో అదుంకుంటూ కెవ్వున అరచింది.

వీధిలో ఆ గుడిసె కెదురుగా ఓ సైనికుడు నిల్చి, వికటాట్టహాసం చేస్తున్నాడు.

ఆ దృశ్యాన్ని ఓ పితూరీదారుడు, ఓ వటవృక్షం కొనగొమ్మ నుండి చూచాడు. వెంటనే ఆ వటవృక్షం వూడను, పట్టి వూడతో సైతం వూగుతూ, ఓ కొండపై దిగాడు. ఆ కొండ పణుకుల నాధారంగా, ఆ గెరిల్లా ఓ గొరిల్లాలా, ప్రాకుకుంటూ, అతివేగంగా క్రిందికి దిగ బ్రాకుతూ, కాళికాలయంలోకి నేరుగా ఒగర్చుకుంటూ వచ్చేసాడు. రాజు ఆ వీరునిచూచి గబగబా వచ్చి, అప్యాయంగా కౌగలించుకుని, శీతలోదకంపట్టి సేదదీర్చి అడిగాడు.

ఆ పితూరీదారు, కొట్టుకుంటున్న గుండెను కుదుటపెట్టుకుని చెప్పాడు—

"రాజా! తెల్లనాయాళ్ళు గ్రామాలకు గ్రామాలే తగులబెడుతున్నారు. మీరుగాని ఆదుకోపోతే చెట్టుకో పక్షిగా బెదిరి చెదిరి పోతారు రాజా!"

రాజు కండ్లెర్రజేసి—

"ఎంత రాక్షసత్వం..." అంటూ లోనికెళ్ళి, గంటన్ని, పడాలును, గోవిందను, అగ్గిరాజును ఒక్కొక్కరినే పిలిచి, అంతా వచ్చాక ఇక వీళ్ళతో మరింత గట్టిగా తేల్చుకోవాలని, మన జనంపై వాళ్ళ నీడకూడా వాలకుండా చేయాలని, గ్రామాలకు పదండ'ని వారిని వుత్తేజపరిచాడు.

అసలు సంగతులన్నీ తెలుసుకున్నాక, వాళ్ళ హృదయాలు పగతో భగ్గుమన్నాయ్. ఆస్థితిలో వారిలో రగిలిన పగ, ద్వేషం అసహజం కాదుగదా!

# 20

అసహజం కానిది చరిత్రేకాదు—రండీ! చూడండీ! ఇదిగో యీ దృశ్యం చూడండి! హింస హింసనేవారు, శాంతి, శాంతి అనేవారు. యీదృశ్యంచూచి, గుండెలపై చెయ్యేసుకు చెప్పమనండి!-హింసను ఎదుర్కోడం హింసో, యుద్ధాన్ని ప్రేరేపిస్తున్నవారిది శాంతో చెప్పమనండి! మనిషిని మ్రింగివేయడానికి ఆవలించుకుంటూ వచ్చే పెద్దపులిని చంపడం హింసంటారా?

అదే హింసయితే, వాళ్ళ గుండెలు కఠిక పాషాణాలన్నమాట వారి హృదయం ఓ పాపపు ముద్దన్నమాట. వాళ్ళను తెలియకుండా వాళ్ళే ద్రోహం చేసుకుంటున్నారన్నమాట, తెలిసికూడా, అసలు హింసను సమర్ధిస్తున్నారన్న మాట.

చెప్పండి! అలా హింసతో, పెనంలో చేపలా వేగిపోతున్న ఆ జనాన్ని రక్షించే ఒక్క యోధుడు మీవద్దకొచ్చి, మీసహాయాన్నర్థిస్తే మీరేమంటారు?

చేతనైతే చేస్తారు, చేవచస్తే మానస్తారు.

కాని రెండూ వుండికూడా, తద్విరుద్ధంగా చేసిన పెద్ద లున్నారు.

దేశ భక్తియుత తత్వంలో తీసుకోండి - పేరు చెబుతా.

సరిగ్గా ఆనాడు నేను మిమ్ములను అడిగినట్టే, కొందరు పితూరీదార్లు పెద్దాపురం కాంగ్రెసువారిని సహాయ మర్ధించారు.

అక్కడివారు నిజాయితీపరులు, దేశభక్తులు తమ పెద్ద నడి గారు-వెంటనే.

నమ్మండి! ఇది యదార్థం.

అది పందొమ్మిది వందల ఇరవై రెండో సంవత్సరం, ఆగష్టు ముప్పయ్యో తేదీ—

ఆ పెద్దనుండి పెద్దాపురం కాంగ్రెసువారో తంతి నందు కున్నారు. వాళ్ళ చేతులు వోణికాయ్.

ఆ తంతిలో ఆ పెద్ద—

పితూరీదార్లు "దోపిడీదారు" లన్నారు. వారికి దూరంగా వుండమన్నారు.

మీకు అర్థమయ్యేవుంటుంది-ఆ రోజుల్లో కాంగ్రెసు సేవకు లకు పెద్దలు తెల్లవాళ్ళుమాత్రం కాదని.

కాని తెల్లవానిలా యీ జవాబేంటని తెల్లబోతారు. అదే తమాషా!

ఆయన మామూలు పెద్ద కాదు. ఆ రోజున, ఆంధ్ర కాంగ్రెసు సంఘానికి అధ్యక్షుడాయన - పేరెందు కిక - అయినా చెవులు మూసుకొని వినండి - ఆయనే - ప్రకాశంగారు.

అయితే ప్రకాశంగారిలో సత్యం లేకపోతుందా, అన్న సందేహం మీకు కలగొచ్చు. ఆ సందేహం తీర్చేది నేను కాదు - ఇదిగో చూడండి!

చెప్పండి!

అదే రత్తి యిల్లు.

రత్తి ఎవరో మీకు తెలుసుకదూ! అన్నెం పున్నెం ఎరుగని మగువ. ఆమె అప్పుడు నిండు గర్భవతి.

ఆ నిండు గర్భంలో ఒక నూతన మానవుడు జనించబోతున్నాడు.

ఆ యింటిలో ఒక వుట్టిపైన వంటసామానూ, ఇంకో ప్రక్క బట్టలేసుకునే దండెం. దానిపై ఒక లంగా వ్రేలబడుతున్నాయ్, గోడకు రామ పట్టాభిషేకం బొమ్మవుంది.

ఆ రామపట్టాభిషేకం బొమ్మకు దణ్ణం పెట్టుకుంది - రత్తి. బరువుగా అడుగులేస్తూ పంచపాళీలో కొచ్చి, ఒక చేటలోని చోళ్ళు ఏరుకుంటోంది. ఆమె గర్భవతి చిహ్నాలు, ఆమె ముఖంలో స్పష్టంగా కనబడుతున్నాయ్. చెక్కిళ్ళు తెల్లబడ్డాయ్. చను మొనలు నల్లబడ్డాయ్.

ఇంతలో గోవిందు వచ్చాడు.

"మామా!" అని తలవంచింది.

"ఏంటీవేళింత సిగ్గుపడుతున్నావ్?" అంటూ ఆమె బుగ్గలపై చేయి ఇలా అని కితకితలు పెట్టి, కిలకిలలాడుతూ లోనికి తీసుకెళ్ళి-

"ఏంటి చెప్పవ్?" అని అడిగాడు.

చెప్పలేదు - రత్తి!

ఎలా చెబుతుంది. కాని చూపించిందో దృశ్యం. దొడ్డిలో ఆ చింతల తోపులో, ఆ తోపులో గుబురు గుబురుగా పెరిగిన ఓ చింత చెట్టు రెండు పలవల మధ్య జాబిల్లి - ఆ జాబిల్లి చలవలా, మహా నందంతో, ఆ పలవల్లో ఓ పక్షి గూడు, ఆ గూటిలో ఓ పక్షి, పిల్లను సాకుతోంది - తన వేడి రెక్కలతో.

గోవిందు - తన వేడి బాహువుల మధ్య రత్తిని, నొక్కి- "అయితే నారత్తి, తల్లి కాబోతుందన్న మాట! అయితే మన బుజ్జోడికి రాజుగారి పేరు పెట్టేద్దాం!"

"ఊ! ఆబూ లేదూ, సూలూ లేదూ, పేరువరకూ వచ్చిందే?" అంటూ ఆ బాహువుల మధ్యనుండి జారిపోయింది-రత్తి!

అంతలోకే గంటం-వచ్చాడు. ఆ దృశ్యం చూసి "టపీ"మని ఆగిపోయాడు.

గంటాన్ని చూచి. రత్తీ, గోవిందులు తలలు వొంచారు. గంటం గోవిందును మందలించాడు—

"గోవిందూ! నీ ప్రేమకలాపాల కిదా సమయం? మన్యం మన్యమంతా వుడుకెత్తిపోతోందని విన్నామే, చావు బ్రతుకుల పోరాటంలో మన్యమే సతమతమవుతోంటే. నీ కిక్కడ ప్రేమకలా పాలా? పిచ్చోడా? ప్రేమ వుండకూడదని కాదు. రాజుగారిలాంటి వీరుడే ప్రేమించాడో అమ్మాయిని...?"

"నాకు తెలదే?" అని రత్తీ, గోవిందు లిద్దరూ ఒకేసారి ఆశ్చ ర్యంతో అన్నారు.

"అవును - తెలీదు. కాని నిజమది. ఆయన చదువుకుంటున్న రోజుల్లో జరిగిందది. ఆ కన్య యీాయన్ను మనసారా ప్రేమించింది. కాని రాజు దేశానికి, జనానానికి పది ప్రధానమో, తనకూ అదే ప్రధానం కాకూడదనుకున్నారు. రంగంలో కురికారు. మరెన్నడూ ఆ మాటే తలపెట్టలేదు".

"నిజంగా ఆయనో అగ్ని కణం!"

"ఇప్పుడొక అగ్నికణం చాలదు. అనేకం కావాలి. జ్వాలగా మారిపోవాలి. పద, వెంటనే!"

అంటూ ఎప్పుడూ తొణికి ఎరుగని గంటం కంగారుగా మాట్లాడేడు.

గంటం భూమినీ, ఆస్థినీ బాస్టియన్ స్వాధీనం చేసుకున్నాడు - గంటం చలించలేదు. భార్యనూ, కూతుర్నీ అడవులపాల్జేసి, హింసించారు - తెల్లదొరలు, చలించలేదు గంటం - కాని నేడు జనం నరక యాతనలు ఆ యన్ని కలత పెట్టాయ్.

ఇక గోవిందు మారు మాట్లాడలేదు. గంటం వెనుకనే వెళ్ళి పోయాడు.

వాళ్ళలా వెళ్ళిపోగానే, గెడపెట్టి రత్తిలోనికి అడుగు పెట్టిందో లేదో, మరల బయట ఎవరో తలుపుకొట్టారు. రత్తి వెళ్ళి తలుపు తీసింది.

రాజు, దూసుకుంటూ వచ్చాడు - 'గంటం వచ్చాడా రత్తీ అని.

"ఇప్పుడిప్పుడే వెళ్ళిపోతిరే?" అంది రత్తి.

"సరే! నే నాయనకోసమే వచ్చా జాగర్త! ఒకవేళ శత్రువులు పైబడితే ఆత్మరక్షణ చేసుకోండి - మీ కండగా మేము శివారుల్లోనే వుంటాం!" అని వెళ్ళబోతున్నాడు - రాజు.

రత్తిది మాయలేని మనసు. ఏసందేహమొచ్చినా దాచుకోలేదు. ఆ కంగారులో రాజును అడిగింది. రాజు తత్వం ఆమెకు తెలుసు. ప్రజల సందేహాలన్నా, కోర్కెలన్నా తీర్చిగాని మరొకపని చూడడని.

"మీగో కామందుల పిల్లకు మనసిచ్చిరటే?" అని అడిగింది.

"రత్తీ!" అని ఆపుచేసాడు-రాజు.

ఆ సమయంలో ఆ సమస్య రాజును కలచేసింది. అతని కత్యంత ప్రియమైన విషయాన్ని బలవంతంగా, లోలోన అణిచేసు

కున్న విషయాన్ని తడిమింది రత్తి! ఆ విషయ మెంత ప్రబలమైందో, ఆమెకేం తెల్సు? అదిరింది.

వీధిగుమ్మాన్నెవరో కొట్టారు. రాజు ముందుకెళ్ళాడు. అది పగవాని చప్పుడై వుంటుందన్న వుద్దేశంతో రత్తి అపుచేసింది. "కాదు!" అంటూ ముందుకెళ్ళాడు రాజు. రాజంటే ఆమెకి విపరీతమైన ప్రేమ. "వొద్దు!" అంటూ తలుపునానుకునే, ఆయన మొకాళ్ళపైకి ప్రాధేయపడింది.

"నీ కాళ్ళకు మొక్కుతా స్వామీ! నాకు బిడ్డపుడితే మీ పేరు పెట్టుకుంమను సోమీ! తలుపు తీయకు! నీవు బ్రతికుంటే మాకవే వరాలు...దొడ్డిద్రోవను వెళ్ళిపో, సోమీ!" అని.

మరల శబ్దం తీవ్రమై ఆ శబ్దంతోపాటు మాటలు వినిపించాయ్. ఆ మాటలు పగోడివి కాదని తేలిపోయాయ్. రత్తి తలుపు తెరచింది. మగవేషంలోని సీత ప్రతక్షమైయ్యింది. రాజుకు కోపమొచ్చింది - ఆ యువకునికి ఇచ్చిన పని - రహస్యస్థావర రక్షణ, కాని యిక్కడికొచ్చాడు.

కాని రత్తికి ఆ రోజు కన్నులపండువుగా వుంది. కారణం ఆమె యీ సితూరీవుద్యమంలో ప్రత్యక్షంగా కలుగజేసుకొని నెలలు గడిచి పోయాయ్. నిండుగర్భిణీ అయినందువల్ల ఇంట్లోనే వుండి పోయింది. తను ఎక్కడుంటే అక్కడికేవచ్చి, దర్శనమిస్తున్న వీరులందరినీ చూస్తూ మురిసిపోతోంది.

"నీవొచ్చావేం?" అడిగాడు - సీతను రాజు.

"వుండలేకపోయాను, మీరెక్కడుంటే అక్కడే వుంటానిక!"

మన వుద్యమం ఎక్కడుండమంటే అక్కడుండాలోయ్! అదీ గాక, మన రహస్యస్థావర రక్షణబాధ్యత ఏం చేసావ్?"

"అది ఇంకొకరి కప్పగించే వచ్చాను!" చల్లబడ్డాడు - రాజు.

"సరే, మన దళాల వునికి తెల్సా?"

"ఈపాటికి పొలిమేరకూడా దాటుంటాయ్!"

"అయితే పద, పోదాం!" అంటూ, వెళ్ళబోయాడు.

రత్తి—

"నా మాట సెప్పండి - సోమీ!" అని అపుచేసింది.

"ఏమిటీ?" అని సీత ప్రశ్నించింది.

"సామి ఓరికో పిల్ల మనసిచ్చిందట!" అంటూ రత్తి అనగానే రాజుకు ఆ పిల్లపై ఆయనకున్న ప్రేమ తెలుసుకోడానికి మరోతరుణం లభించినందుక్కా ఎంతో సంతోషించి - అంది—

"అమాయకురాలు! మగువకుండే మన స్తత్వాన్ని దాచుకోలేక పోయింది!" అని.

"నువ్వూర్కో!" అని గసిరాడు - రాజు.

"కష్టమైతే సెప్పకు సోమీ!" అని రత్తి దీనంగా అంది.

"కష్టంగాదు రత్తీ! నీవేసిందొక ప్రశ్న, అది లేపింది - ఒక సుడి గుండం...అయినా రత్తీ! నీ ద్వారా మరొక్కసారి ఆ దివ్య మూర్తిని తలచుకునే భాగ్యం లభించింది..."

అలా అంటూంటే ఆయన కనుకొలకల కన్నీటిచుక్కలు నిలిచాయ్, అందుకు విరుద్ధంగా, సీతకు ఆనందబాష్పాలు నిలిచాయ్

రాజు చెప్పడం మొదలెట్టాడు—

'ఆమె నాకు మనసేకాదు. అన్నీ యిచ్చింది. తన నవనీత లలిత కోమల హృదయంతో కరిగి, నన్ను కరిగించింది. మల్లెపూవు లాంటి మనసుతో, నా మనస్సులోని మాలిన్యాన్ని కడిగేసి, ఆమె కనుల దివ్యకాంతులతో, నా కనులముందు కంచు దివిటీని వెలిగించి, స్వతంత్రపోరాట పథాన్ని సుస్పష్టం చేసింది..."

సీత అడ్డుగావచ్చింది - ఆమెకామాటలు, గిలిగింతలు పెట్టినట్లున్నాయ్. ప్రేళ్ళలా అవి తన హృదయాన్ని, శరీరాన్ని తాకుతున్నట్టున్నాయ్. ఆ మాటల్ని పొడిగింపచేసి మరింత ఆనందాన్ననుభవించాలనుకుంది - అడిగింది—

'గాలిని నమ్మమంటూరా, చపలచిత్తమైన స్త్రీలో అంతటి దేశ భక్తి, దీక్షనూ విశ్వసించమంటూరా?'

'అదా పిచ్చోడా! మట్టిలోంచే మాణిక్యాలు పుడతాయ్. ప్రజల్లోంచే మహావీరులు పుడతారు. వట్టి నిరక్షరాస్యుల్లో చరిత్ర ప్రసిద్ధికెక్కిన వీరవనిత లెందరు లేరోయ్ - అమాయకుడా! ఎక్కడి వరకో ఎందుకు? రత్తి ఎవరంటూవ్? మట్టిలోంచి పుట్టిన మాణిక్యం కాదంటూవా?'

'మా మీదకు దొర్లిస్తుంటిరే, బండి!' అని రత్తి చమత్కరించింది. చమత్కరించడం స్త్రీలకు సహజమేగా.

'కాదు రత్తీ!' అంటూ, తన్మయంలో—

మాతృ విముక్తి సాధించేవరకూ, భారతయువకుని విధి - నెత్తురు చిందించడమే' నన్న అమరసందేశమిచ్చిన విద్యుల్లత - నా సీత...'

అనగానే. అలా తన్మయత్వంలో నిమీలిత నేత్రమైన సీత - కాదు, కాదు - ఆ యువకుడు - 'ప్రభూ!' అంటూ హృదయం ద్రవించేలా అరిచాడు.

వాళ్ళిరువురూ ఆశ్చర్య చకితులై పోయారు.

'ప్రభూ!' అన్నమాట విని.

రాజు - ఆ యువకుని భుజం తట్టాడు, తేరుకుంది సీత. ఆ తేరుకున్నది సీత అని గుర్తించలేదు - రాజు! స్త్రీ పురుష భేదం తెలియని అమాయకుడు - రాజు - కదిపాడు.

మాట త్రిప్పేసింది - సీత.

'మరచిపోయాను. బాస్టియన్ బృందంకూడా వచ్చేస్తోందని తెలిసింది. మనం యిక్కడకుండ వెళ్ళిపోవాలి!' అంది.

మమతకొలదీ అన్నమాట "ప్రభూ!" అని అనుకొని.

"సరే! నేనొస్తా! నీవిక్కడే వుండు స్త్రీల రక్షణబాధ్యత నీది!" అంటూ వెళ్ళి పోయాడు. రాజును సాగనంపుతూ, సీతకూడా రాజు కూడా వెళ్ళిపోయింది.

వాళ్ళు అలా వీధిత్రోవను వెళ్ళిపోయారు. రత్తి వారి పోకను గమనిస్తూ, ఆదమరపుగా ఆ గుమ్మంలోనే నిలుచుండిపోయింది.

దొడ్డిత్రోవను పెద్ద తలుపు శబ్దమైంది.

రత్తి హడలింది.

ఆ తలుపులు విరగ్గొట్టి, ఆ తలుపుల పైనుండే తన దుష్ట కూటమితో ప్రత్యక్షమయ్యాడు - బాస్టియన్. అతని వెనుక వచ్చిన సబ్ యిన్‌స్పెక్టరు, పిళ్ళె, పోలీసులు ఇల్లంతా కలియజూస్తూ అడ్డున్నదల్లా పగులగొడుతున్నారు. బాస్టియన్ రత్తిని ఎదుర్కొన్నాడు.

"ఏంటే కంగారు పడుతున్నావ్?"

"ఏముంది దొరా?"

"మరెందుకే కంగారు?"

"ఏంనేదు దొర!"

"చెబుతావా, చెప్పవా?

"ఏంటి దొరా?"

"రాజిలా రాలేదూ?"

"ఏ రాజు దొరా?"

అంతే యిక లాభం లేదనుకున్నాడు -బాస్టియన్. 'నంగనాచీ!' అంటూ ఛెళ్ళున కొట్టాడు. ఆ ఒక్క దెబ్బకూ యిద్దరు కెవ్వుమన్నారు ఒకటి రత్తి! రెండోది ఆమెకడుపులో బిడ్డ. ఇకంతటితో ఆగలేదా దుష్టుడు - వుట్టిపైన అన్నంకుండపై చెయ్యేసేడు.

'నోటికాడ కూడు మట్టిపాలు చేస్తురా!' అని అడ్డువెళ్ళింది. ఆమె చేతులూ, ఆ కుండకూడా పగులగొట్టాడు. ఆమె చేతులకు

తగిలిన దెబ్బకు ఆమె ముంజేతి నల్లగాజులు బ్రద్దలయ్యాయ్. ఆమె కళ్ళు అపశకునాన్ని చూచి, కంట తడిపెట్టాయ్.

కలకంఠి కంటినీరూ, లేపడుచు ముంజేతి గాజుముక్కలూ, కళ్ళ జూచిన ఎవడికైనా వాడిజీవితం యిక కాలదోషం పట్టిపోయి నట్టేనన్న సంగతి వాడికి తెలీదు.

'ఈ Dogs కిలా కాదు. బట్టలూడ పీకండి!' అని హుంకరిం చాడు. ఆడదాని వొంటిపైని చీర లాగమంటే, నల్లత్రాచు పడగపై మణిని లాగడంవంటిదని కూడా వాడికి తెలీదు.

ఆ సంగతి తెలుసున్న సబ్ యిన్స్పెక్టరు గాని, పోలీసులుగాని ఆ పనికి సాహసించలేక పోయారు. వారు ఆంధ్రులు కాబట్టి.

కాని అరవోడు, పిళ్ళె—

'నేనుదా ఆ పని చేస్తును!' అంటూ, రత్తి రొదత్తిపోతున్నా లక్ష్య పెట్టకుండా బరిసిన లాగేసాడు.

ఒక్కసారిగ తన మానం, వక్షం రెండుచేతుల్లో దాచుకొని అరచింది.

ఆ అరపుకు వికట్టహాసం చేసారు-నీచులు. పైగా 'ఖబడ్దార్!' అని హెచ్చరించి ముందుకు తూలుతూ వెళ్ళిపోతున్నారు. అలా హెచ్చరించి నప్పుడు వెళ్ళా రత్తిముఖం చూడలేదు.

అలా కెవ్వుమన్న మరుక్షణంలోనే ఆమెలో కలకత్తా కాళీ, బెజవాడ కనకదుర్గ ఆవహించారు. ఆమె కళ్ళు వహ్నిగుళికల్లా వున్నాయి. దండెంపై లంగా కట్టుకుని, చూరునున్న గండ్రిగొడ్డలి లాగి, 'ఆగరా అరవోడా!' అంటూ విరుచుకు పడి ఒక్కవ్రేటు వేసింది. ఆ వ్రేటుకు తప్పుకోగలిగిన పిళ్ళ 'దొరోయ్!' అని కేక పెట్టాతు. ఆ కేకకు వెనుదిరిగిన బాస్టియన్, మహాకాళిలా పైబకు తున్న రత్తిని కాల్చాడు, ఆ కాల్పు మధ్యకు రాజును సాగనంపి

వచ్చిన సీతవచ్చి నిల్చింది. ఆ గుండు సీత శిరస్సులో దూరిపోయింది. ఆమె శిరస్సుపైని ఖద్దరుటోపీ జారిపోయి, సిగముడి వీడింది. 'రాజా!' అంటూ నేల నొరిగిపోయింది.

రత్తికి ఆశ్చర్యం, విచారం ఒక్కసారిగా మబ్బుల్లా కమ్ము కున్నాయ్.

"రత్తీ! నేను... రాజుగారికి మనసిచ్చి మగవేషంలోనున్న సీ...త...ను...!" అంటూ చేతులు జారవిడిచి, కొనవూపిరితో చెప్పింది - సీత.

"అమ్మ!" అంటూ ఆమెపైపడింది - నిండు చూలాలు రత్తి.

"ఏడవకు రత్తీ! ఆడదాని విధి మగవానివెంటుండం...ఆయన తోడేదే ఆమె జీవనం, ఆయన చరణసేవే, ఆమె ఐదవతనం... అందుకే మన్యం వచ్చాను ... నా ప్రభువును కలుసుకున్నాను... నాలో వెన్నెల విరిసింది...నా విధి నిర్వహించాను ...ఆయన కనుల ముందే, ఆయన బ్రతికుండగానే నాకు మోక్షం సిద్ధించింది...చెల్లీ! ఆడదాని కంతకన్నా ఏం కావాలి?"

ఆమె సర్వం క్షీణించింది. తేజస్సు గ్రుమ్మరించిన ఆమె కళ్ళు గాజు పెంకుల్లా మారిపోతున్నాయ్. దబ్బపండులాంటి శరీరకాంతి మారి పోతూంది. శరీరం చల్లబడిపోతోంది.

ఎంతలో ఎంత విచిత్రం?

ఎంత విచిత్రం - యీ సృష్టి ?

క్షణకాలం తర్వాత, నలనల్లనైన - శవం !

భీభత్సం! ఇదే సృష్టి రహస్యమైతే - బ్రహ్మనేంచేస్తే పాప ముంది ?

కాకపోతే ఓ నిముషానికి ముందు, నిర్ఝర ఝరీప్రవాహంలా పుబికిన, చిక్కని క్రొన్నెత్తుటి శరీరమేంటి ?

ఆ నిముషం దాటాక, మంచులా గడ్డ కట్టుకుపోయి, జీవ కణాలు చచ్చి, శరీరం చల్లబడిపోయి శవంలా బిగుసుకుపోడమేమిటి?

భయంకరం! ఇదే బ్రహ్మబుద్ధియైతే, ఆ బుద్ధిని పుటం పెట్టేయడమే మంచిది—

లేకపోతే, కాస్తముందు, నవరసా లొలికించిన నాలుక, నవ్య కాంతు లెదజల్లిన కళ్ళు, అంతలోనే, నాలుకో గట్టిపడ్డ మంచు ముక్క, కళ్ళో కరుడుగట్టి గాజుముక్కగా మారిపోడ మేటి? ఎంత కఠిన హృదయుడు బ్రహ్మ!

అందుకే అందరి దేవుళ్ళకీ గుళ్లుకట్టి పూజా పునఃస్కారాలు జరుగుతున్నాయ్‌గాని బ్రహ్మ కట్టి సంస్కారంలే దందుకే. మానవులకు మృత్యువును "రాసిపెట్టిన బ్రహ్మను బహిష్కరించారు— మానవులందుకే.

అలా మృత్యువును రాసిన బ్రహ్మను బహిష్కరించిన మానవుడు, మృత్యువును మాత్రం ఎందుకు ఎదుర్కోలేడు?

ఎదుర్కొంది-సీత.

"ఏడవకు చెల్లీ నేను చావను. నా కోరిక తీరాకే యముడు నా దరి దాపుల్లోకి వస్తాడు. నా ప్రభువుతో నేను మాట్లాడాలి. నా ప్రభువు నన్ను క్షమించాలి!"

ఆ మాటలు విని హృదయం తరుక్కుపోయి—

"అక్కా" అని ఏడ్చింది.

ఆ యేడ్పు విన్నాడా? అన్నట్టుగా – రాజు చటుక్కునొచ్చాడు.

'ఎవరది?'

"ఇంకెవరు?...స్వామీ!" అంటూ భోరున ఏడ్చి, సీతపై వాలిపోయింది,

చూచాడు రాజు. ఆ కర్మవీరుడు, ధర్మవీరుడు చలించి పోయాడు.

'సీతా?' అంటూ, తన రెండుచేతుల్లోకి ఆమె శిరస్సును తీసుకున్నాడు.

బాధాదగ్ధహృదయంతో, కరిగిపోయి, సీతమ్మ చెవిలో అంటున్నాడు—

'ఎంత సాహసం చేశావ్ సీతా! యిందుకా, నాన్నను కాదని అడవులబడి మారురూపంలో వచ్చావ్? నీ సుకుమార కోమల సుమ శరీరాన్ని యీ కరకు తుపాకుల కాహుతి చేయవలసిన ఖర్మ నీకేల సీతా...సీతా! యిక మన యిరువురికీ ఋణం తీరిపోయిందా?" అంటూ ఏడ్చాడు.

రామరాజే ఏడ్చాడంటే, ఎక్కడో మహాసముద్రములో తుఫాను పట్టివుండాలి.

రాజు ఏడ్పు తొలిసారిగా సీత చెవినిబడింది.

'ప్రభూ! మన ఋణం తీరిపోలేదు ప్రభూ ! జన్మ జన్మాలకి నీవే నా ప్రభువు న—న్ను—మరచిపోకు ప్రభూ!' అంటూ కడసారిగా తన శిరస్సు వాల్చేసింది.

'అక్కా?' అంటూ రత్తి.

'సీత!' అంటూ రాజు.

భోరుమన్నారు.

అంతే. ఇక రాజు విద్యుద్ఘాతుడై పోయాడు. సీత రాలిపోయిన చోట ఆమె పాదాలు తాకి—

'సీత! నే నెల్లప్పుడూ, నీ చరణ చారణమూర్తినే. నిన్నక మరచి పోడం అసంభవం! నేనే కాదు, ఎవ్వరూ మరువలేరు. వినీల నీలాకాశంలో వినూత్న వెలుగులు చిందే, రజిత నక్షత్రాన్ని మరచే

దేవడు? భారతమాతాంకితంగా నేలరాలిన నవమల్లికా కుసుమాన్ని పవిత్ర సుమంగా సిగముడువని తెలుగువని తుంటుందా?...ఇదిగో! తెలుగుజాతి బ్రతికియున్నంతవరకూ యీ పీడిత పితూరీ మహా రథానికి తొలికుంకుమద్దిన నీపేరు చిరస్థాయిగా, సువర్ణాక్షరాలతో లభిస్తున్నదీ - తెలుగు దేశం! ఇక నీ పేరు ఎవడు చెరపాలన్నా సాధ్యంకాని విధంగా నిన్ను నాలో కలిపేసుకొంటున్నా. ఇక నా పేరు రామరాజు కాదు - సీతారామరాజు!'

'స్వామీ!' అంటూ రాజు కాళ్ళపై వాలిపోయిందా - నిండు గర్భవతి రత్తి!

తన్ను ఆ కొంపవరకూ వెంటాడిన ఒక సి ఐ. డీని గమనించ కుండానే ఆతృతగా శింగన్న వచ్చాడు—

'రాజా'

'శింగన్నా?' అంటూ పడుపుకళ్ళతో శింగన్నను కౌగలించు కున్నాడు. అప్పుడు శింగన్నముందు రాజు చంటిబిడ్డలా ఐపోయాడు.

ఆ మృతకళేబరాన్ని చూచిన, శింగన్న—

'యీ వీరు డెవరు?' అని రాజు నడిగాడు.

రాజు పలుకలేదు. రాయయిపోయాడు.

'రాజా! రాజా!' అని గింజాయించాడు - క్షోభతో - శింగన్న. రాజు పలుకలేదు.

రత్తి విషయమంతా చెప్పింది.

'అయ్యో తల్లీ! ఇంతటి సౌందర్యాన్ని, సుగుణాన్నీ, శౌర్యాన్నీ నీలో కుప్పపోసి, స్త్రీలోకానికే మచ్చుతునకగా సృష్టించిన బ్రహ్మకు నీ నొసట అల్పాయిష్షు రాయడానికి చేతు లెలావచ్చాయమ్మా!...తల్లీ! నీతోనే యిక మా మన్యం మంచి ముత్యాలదండ తెగిపోయింది ... తల్లి...మల్లు దొరికిపోయాడు.

అగ్గిరాజూ దొరికిపోయాడు...ఇక...ఇక...' అని ఏడ్చాడు సింగన్న. రాజు కంగారు పడ్డాడు."

"శింగన్నా! అగ్గిరాజుకూడా దొరికిపోయాడా?"

"అవును రాజా! అగ్గిరాజును అండమానే తీసుకుపోయారు— ఆ పోరులోనే ఎర్రేశూ హతమైపోయాడు..."

అనేటప్పటికి రాజు చలించిపోయి - 'శింగన్నా!' అంటూ వెనక్కి విరిగి, నొసటిపై అరచేయి నొక్కాడు.

"ఎంత ఘోరం జరిగిపోయింది - శింగన్నా! నా గుండెలో పిడుగు ప్రేలింది!"

"రాజా! అంతకంటే ఘోరం జరిగిపోతుంది-పడాలూ ఆ పోరులోనే వున్నాడు. మీరెంటనే వెళ్ళండి!"

"వెడతా! చెప్పు శింగన్నా! వాళ్ళు బ్రతుకుతారా? బ్రతుకుతారంటే సప్తసముద్రాలైనా క్షణంలో దాటేస్తా!"

"రాజా! ఇకిప్పుడు విచారానికి ఆస్కారంలేదు-గంటం కూడా బాస్టియన్‌ను తరుంతూ, పడాలును కలుసుకోడానికి వెడుతున్నాడు-మీరు వెళ్ళండి!"

"వెడుతున్నా! సీత భౌతిక దేహాన్ని మాత్రం భద్రంగా దాయ్ - శింగన్నా!"

అంటూ తూలిపోతూ వెళ్ళిపోయాడు.

శింగన్న సీతమ్మను భుజాన వేసుకున్నాడు - రత్తి వెనువెంట నడిచింది.

"ఏదో విషాద గొంతు, ఆ వెంట నడిచింది,
వొరిగిపోతివా - భూదేవి వొడిలోనే;
తెలుగు లోకపుకళ్ళ కన్నీరు నింపి;
పయనించి పోతివా - స్వర్గాంత సీమలకు,
మమ్మీ నిషాధ, విషాద, విష్కంభమునవీడి..."

అలా తప్పటడుగులు వేసుకుంటూ, బాధగా, భారంగా, దీనంగా ఆ శిఃగన్న సీతమ్మను భుజానవేసుకుని నడిచివెళ్ళాడు. ఆ వెంట రత్తి...మెల్లగా...కృంగుబాటులోకూడా వెళ్ళిపోయింది.

ఆ దృశ్యం శింగన్న చెబుతుండగా, చెబుతుండగా అశ్రురుద్ధ కంఠంతోనే మధ్యలో ఆగిపోయాడు. శశి—

'తాతా! ఆగిపోయావా?! అంటూ కళ్ళ నీలాలు నింపింది.

ఆ నీలాలు తుడుస్తూ—

'అమ్మా! అలా మన్యం మంచి ముత్యాలదండ తెగిపోయి, ఒక్కొక్క ముత్యమే నేల దొర్లిపోతోంది...పితూరీలో పట్టు గొమ్మలు తెగిపోతున్నాయ్ - తల్లీ!' అన్నాడా తాత.

"తాతా! అగ్గిరాజు అండమానులో వున్నాడా, తాతా?"

'ఇంకెక్కడి అగ్గిరాజు! యీ తెల్లకిరాతకుల హింసలకు గురై జైలులోనే చచ్చిపోయాడా - పదేండ్లు పోయాక...'

'గుండె తరుక్కుపోతోంది - తాతా?'

'అంతే నా తల్లి గుండె బ్రద్దలై పోతుందమ్మా? వింటూంచే? ఇంకా చాలా చాలా జరిగిపోయాయమ్మా!...పల్లె పట్టులన్నీ మట్టి పాలయ్యాయ్. మారణహోమం మింటనంటింది-తెల్లోళ్ళ దౌష్ట్యాలు పరాకష్టనందాయ్..."

"తాతా! భయమేస్తోంది - తాతా!"

"ఫర్వాలేదమ్మా! తాతసంగతి తెల్సుకోవూ?"

"చెప్పు తాతా! నీకేం జరిగింది...రాజేమయ్యాడు?" అంటూ కవి ఆతృతగా అడిగాడు.

"నేను ఖర్మకాలి దొరికిపోయాను బాబూ!"

శశి గుండె పగిలిపోయింది.

"తాతా" అంటూ తాతపై వాలిపోయి, కళ్ళు మూసుకుంది.

'పిచ్చితల్లి...అదిగో చూడమ్మా!' అంటూ ఆ ముసలోడు చూపుతున్నాడు.

## 21

అదో పెద్ద బహిరంగ ప్రదేశం. చుట్టూ చింతలతోపు. ఆ తోపులో మధ్య గుడారాలున్నాయ్. ఆ గుడారాల్లో ఒకదానిలో రూథర్‌ఫర్డు, గుడాల్ ఇంకా కొందరు తెల్లాఫీసర్లున్నారు. మధ్య బాస్టియన్ చేతులు కట్టుకొని మాత్రమే నిల్చున్నాడు. రూథర్‌ఫర్డు బాస్టియన్‌ను కుళ్ళు మాటలతో చంపివేస్తున్నాడు.

ఆ మాటలైనా ఆ బాస్టియన్‌ను సరైనమార్గంలో పెట్టడానికి మాత్రమే వుద్దేశించబడ్డాయ్.

సరైన మార్గమనగా—

కళింగ యుద్ధానంతరం రక్తపాతం కళ్ళచూచి, బుద్ధుని ధర్మపథాన్ని దేశదేశాల చాటిన అశోకచక్రివర్తి మార్గమనుకునేరు. పొరపాటు-

జాగర్త! కలలోనైనా అలా అనుకుంటే నడిబావిలో పడి కూరుకు పోతాం - కాదు, కాదు.

ఆ రోడ్డు కంట్రాక్టు బాస్టియన్‌చేసి, అనవసరంగా ప్రజల ఆగ్రహావేశాలు కొనితెచ్చుకున్నందుకూ కాదు. ఆ కంట్రాక్టు ప పెద్దల నెత్తిపైనో పెడితే, వాళ్ళలో వాళ్ళకే తగవులొచ్చి, ఒకరి కొకరు పీకలు కోసుకొని వుండేవారని.

అటువంటి తెలివితేటలు బాస్టియన్‌వద్ద లేవని White administration కు తగదని మాత్రమే తిడుతున్నాడు.

'జాగర్త! నీకు వార్నింగ్ యిస్తున్నాం. ఇప్పుడుగాని నిన్ను Dismiss చేస్తే అసలు పితూరీకే లోకువని వొదిలిపెడుతున్నాం. జాగర్త!'

అంటూ క్షమించాడు - బాస్టియన్‌ను

అంతలోకే పిళ్ళై, భాస్కర్రావుగారిని వెంటబెట్టుకొచ్చాడు.

భాస్కరరావుగారో పెద్దమనిషి, కల్ల కపటం తెలియని వ్యక్తి. రామరాజుకు ఆ మన్యంలో మొదట స్థానం కల్పించినాయన యీాయనేనని తెలుసుకున్నారా - దొరలు. అందుకే కబురు పంపించారు.

భాస్కర్రావుగారు రాగానే, ఆయనపై ప్రేమాభిమానాలు వెల్లి విరిసినట్టు ఒక్కసారిగా ఆయన్ను కౌగలించుకున్నాడు-రూథర్ ఫర్డు. ఆయనకు పశ్చాత్తాపుడైనట్టు చెప్పుకున్నాడు.

ఏవేవో ఘోరమైన అన్యాయాలు ఎవరితప్పువల్లనైతేనేం జరిగిపోయాయని, గవర్నరునుండి ఇక ప్రజలపై ఏవిధమైన దాడులకూ పూనుకోవద్దని ఆర్డర్లు వచ్చాయనీ, అయితే రామరాజునుండి తానూ, దీన్ని ఆపివేస్తున్నట్టు తమముందు ఒప్పించాలనీ, ఏవేవో కల్లబొల్లి కబుర్లు చెప్పాడు.

ఆ మాయలోపడి మంచుముక్కయిపోయాడు - భాస్కర్రావుగారు. దొరల వుదారబుద్ధికి ఎంతో సంతోషించి. ఆ సంతోషాన్ని బాహాటంగా బయటకు చెప్పాడు.

ఆ దొరలకు కోతికి కొబ్బరికాయ దొరికినట్టయింది.

కాని భాస్కర్రావుగారు—

'అయితే రాజు దొరకడం బహుదుర్లభం దొరా!' అని మాత్రం అన్నాడు.

దొరికితే తీసుకురావడానికి ఆయనకు అభ్యంతరం లేదు.

"క్లైం తీసుకోనండి."

"క్లైం తీసుకున్నా దొరకడు దొరా!"

"మీకు దొరికిన తర్వాతనే తీసుకురండి!" అంటూ భాస్కర్రావును సాగనంపారు,

ఆయనకూడా రూథర్‌ఫర్డు కూపీలు లాగడంలో దిట్ట అనుకునే ఒక సి. ఐ. డీని మాత్రం కూడా పంపించాడు.

కుతంత్రంలో చిక్కి, భాస్కర్రావుగారు వెళ్ళిపోయారు,

వాళ్ళలా వెళ్ళిపోయాక, ఒక సి. ఐ. డీ గబగబా వచ్చి, రూథర్‌ఫర్డు చెవిలో ఏదో వూదాడు.

వూది—

"అదుగో వస్తున్నాడు సార్!" అని ఆ తోపులోకి చూపించాడు.

శింగన్న చెమటలు క్రక్కుతూ వస్తున్నాడు,

అతనింకా దగ్గరకు రాకుండానే, హడలిపోయేటట్టు

"పట్టుకోండి! పట్టుకోండ"ని పెద్ద గావుకేకలేసి, నలుగురు ఆఫీసరుల్ని శింగన్నపైకి పురిగొల్పాడు.

శింగన్న హడలెత్తిపోయాడు. ఏదో మోసం జరిగిపోయిందని కంగారు పడిపోయాడు.

బాస్టియన్‌పై ఎగిరాడు—రూథర్‌ఫర్డు—

"చూచావా! ఇంతకాలం పిల్లిని చంకనెట్టుకు తిరిగావ్!"

"అమ్మ దుర్మార్గుడు!" అంటూ బాస్టియన్ ఒక్క గెంతున దూకి, శింగన్న జుట్టు పట్టుకొని—

"ద్రోహీ! చెప్పు! ఎక్కడకెళ్ళావ్? ఎప్పుడెళ్ళావ్? ఎందుకెళ్ళావ్?" అంటూ అతని తలకాయ నేలకేసి కొట్టాడు.

"అమ్మ!" అని నేలను పడిపోయాడు—శింగన్న.

"ఇదంతా దొంగవేషం!" అంటూ పిళ్ళె కాలికొచ్చిన తన్నూ చేతికొచ్చిన దెబ్బా, గబగబా ఓపికున్నంతవరకూ దబదబా బాదాడు.

"హు! మన్యానికి రాజులై పోదామనుకున్నారే!" అంటూ అక్కడే వున్న వెంకప్ప చేతికర్రతో పొడిచాడు.

"అమ్మ కాదురా! అమ్మమ్మను తలచుకో!" అంటూ సబ్ యిన్‌స్పెక్టరు మోకాలితో డొక్కల్లో తన్ని, మోచేతితో వెన్నుపై గుద్దాడు.

ఆ గుద్దుకు, శింగన్న ఎదుర్రొమ్ములు గొంతుకలో కొచ్చాపాయ్. ఒక్కమాట రాలేదు. అలా డొక్కలు పట్టుకొని వెల్లకితలా పడిపోయాడా - నేలపై.

ఇక ఆ భూదేవితప్ప. శింగన్నను ఆదుకునేదెవరూ అక్కడ లేరు.

దానిపై 'ద్రోహి అనీ, Bandit!' అనీ, తలకోతాపూ తన్నారు. దాంతో శింగన్న ఏడవడానిక్కూడా ఓపికలేకుండా పడిపోయాడు.

బోర్లపడిపోయిన శింగన్నను కాలితో తిరగేస్తూ, పిళ్ళె—

'వీడొట్టి మరాటీముండాకొడుకు సార్!' అంటూ మరింత వుసి గొల్పాడు.

దానిపై బాస్టియన్ బలంకొద్దీ ఒక త్రొక్కు తొక్కాడు.

బలవంతంగా అతని గుండెలనుండొ నిరశ్రురోదనం వెలువడింది.

రూథర్ ఫర్డు ఏమీ తెలియనివాడివల్లె గబగబా—

"కొట్టకండి! కొట్టకండి! చెప్పేస్తాడు!' అంటూ వచ్చాడు.

వాడి వుద్దేశం శింగన్నచే కొంత సమాచారం రాబట్టాలని, పూర్ణ విషకుంభంలా—

"ఏంరా? నిన్నేమీ చేయరు! సర్కారు యినాంకూడా యిప్పింపగలను. చెప్పు?"

"ఏంటి దొరా?"

"రామరాజెక్కడ?"

"నాకు తెలీదు దొరా?"

దాంతో బాస్టియన్ విసుగెత్తి-అన్నాడు—

"వీడిలా చెప్పడు సార్!" అని.

"వుడండి శుద్ధిచేయాలి సార్!" అంటూ పిళ్ళె వంత పాడాడు.

దాంతో రూథర్‌ఫర్డు రెచ్చాడు—

"Take care" నీవు చెప్పకపోయినా అడుగడుక్కీ సి. ఐ. డీ. లున్న Empire లో రాజుజాడ తెలీదనుకోకు!" అంటూ ఛాతీవిరిచి—

"బాస్టియన్-నా Tent లో సంచితెమ్ము!" అని ఆర్డరేసాడు.

వెంటనే బాస్టియన్ రూపాయల సంచి ఒకటి తెచ్చాడు—

"ఇవిగో రూపాయలు, యిప్పుడు-చెప్పు!" అంటూ ఆ సంచిని శింగన్న ఛాతీపైకి విసిరాడు.

శింగన్నన్నాడు—

'రూపాయలు నాలుకడ్డం త్రిప్పుతాయా దొరా?' అని.

అంతే మరల ధఖీ దఖీ మంటూ, శింగన్నపై, ఆ నిండు మానవునిపై రాళ్ళతో బాదినట్లు బూట్లతో తన్నారు. పగవాడైనా పడని బాధది. మానవుని ఓర్పుకు పరాకష్టచెందిన పరీక్ష అది. ఆ పరీక్షలో ఆ మానవుడు నెగ్గాడా? ప్రపంచమే ఆ మానవుని చరిత్రను డైరీలో రాసుకొని నిత్యం పారాయణ చేసుకోవచ్చు.

ప్రపంచంలోని మానవులంతా శింగన్ననుండి వూపిరి పోసుకో వచ్చు. ధైర్యం ఇనుమడింప చేసుకోవచ్చు.

దానిపై వెంటనే రూఫర్ ఫర్డు సూదులపొట్లం తెప్పించాడు.

కాలయముల్లా బాస్టియన్ ఒకప్రక్క, పిళ్ళె ఒకప్రక్క రెండు చేతులూ గట్టిగా పట్టకొని, బలవంతంగా శింగన్న గోళ్ళ సందుల సూదులు గ్రుచ్చడం మొదలెట్టారు.

శింగన్న 'అమ్మా! అమ్మా!' అంటూ మాతృనామం జపిస్తు న్నాడు. అతని ప్రాణం విల విల కొట్టుకుపోతోంది. శరీరం మెల తిరిగిపోతోంది.

రూథర్ ఫర్డు వికటాట్టహాసం చేస్తున్నాడు.

గోళ్ళనుండి శింగన్నకు నెత్తురుధార కారుతోంది. లొంగ లేదు. అలా లొంగకుండా మానత్వం, నిజాయితీ, సత్యం, శీలం దేనికి లొంగదని నిరూపించగలిగాడు.

విసుగెత్తాడు - రూథర్ ఫర్డు వికటాట్టహాసం చేస్తూ వాడి దవటిలు పీకాయ్.

అతన్ని వేధించినదానికన్నా భయంకరదృశ్యం ఒకటి చూసి, భీతావహం కలిగించాలనుకున్నాడు—

'జాగర్త! చెప్పకపోయావా?...అదిగో! అటుచూడు!" అంటూ చూపించాడు.

చూచాడు - శింగన్న. భయపడ్డాడు. కన్నులు మూసేసుకు న్నాడు. ఆ దృశ్యం ధ్వనిమాత్రం వినబడుతోంది. చెవులుకూడా మూసేసుకుందా మనుకున్నాడు - కాని ఇరువైపులా ఇనుపకారుల్లా పట్టుకున్నాడు.

దూరంగా ఓ పెద్ద వటవృక్షం వుంది. ఆ వటవృక్షంయొక్క రెండు పలవలనూ, రెండు తాళ్ళున్నాయ్. అ రెండు తాళ్ళనూ, కటు త్రాడు ఆటు ఒక ఏనుగుతొండానికీ, అటు త్రాడు ఇటు ఒక

ఏనుగు తొండానికి కట్టి, కొందరు సైనికులు భీకరధ్వనులతో ఆ ఏనుగులను కొట్టి లాగించారు. ఘీంకారాలు పెడుతూ, ఆ పలవలను ఏనుగులు దగ్గరకు లాగాయ్. అలా దగ్గరకు లాగబడ్డ రెండు పలవలకూ, ఆ వటవృక్షం మానుకు బంధించబడ్డ ఓ కోయవానిని విప్పి, తల్లక్రిందలు చేసి, ఆ రెండుకాళ్ళూ రెండు పలవలకూ కట్టారు. ఏనుగులవద్దనున్న తెల్లాఫీసర్లు "ధనధన" మని, ఆ రెండు పలవల కున్న త్రాళ్ళనూ పిస్టల్స్‌తో కాల్చేసారు. రెండు త్రాళ్ళూ ఒక్కసారిగా తెగిపోయాయ్. రెండు పలవలూ ఒక్కసారిగా పటపటాలుమని దూరంగా తన్నుకున్నాయ్. ఒక నిండు జీవం-రెండు చక్కలై చెళ్ళునవిడిపోయి మధ్య నేలపైకుండపోతగా నెత్తురుధార కురిసింది.

ఆ దృశ్యం ధ్వని వినే శింగన్న కెవ్వుమన్నాడు.

రూథర్ ఫర్డు రాక్షసునిలా విరగబడి నవ్వాడు.

* * *

"తాతా!" అంటూ శశి శింగన్నను గట్టిగా నొక్కేసింది.

"ఇంకెన్ని చిత్రహింసలు పెడతారో చూడమ్మా! నేను మాత్రం గుండె రాయి చేసేసుకున్నా. రోటిలో తలపెట్టి, రోకలి పోటు కెరవడ మెందుకని.

'ఎంత గుండెనిబ్బరం, తాతా!' అని ఓ పెద్ద నిట్టూర్పు వొదిలాడు-కవి.

* * *

రూథర్ ఫర్డు శింగన్నపై వురిమాడు—

"ఇప్పుడు చెప్పు! లేదా, నీకూ అదే గతి..."

శింగన్న నోరు మెరుపలేదు.

నిర్ణయించుకున్నాడు - తనకూ అదే గతని. అందుకే యిక నోరు మెదపడంకూడా మానేసాడు.

"ఊఁ! తగిలించు త్రాడు!" అని రూధర్ ఫర్డు ఆజ్ఞాపించగానే, బాస్టియన్ శింగన్న కంఠానికి వురిత్రాడు తగిలించి, క్రింద రాయి తొలగించారు. అది కంఠానికి బిగిసిపోయింది.

"చచ్చాడు - వెధవ!" అని వెంకప్పా.

"చచ్చిండు - సార్!" అని పిళ్ళే అన్నతరువాత

"Renegade" అంటూ ఆ త్రాడును పిస్టల్‌తో కాల్చి వేసాడు - రూధర్ ఫర్డు.

శింగన్న క్రిందపడ్డాడు. వెంటనే యిరువురు సైనికులు శింగన్నను డొంకల్లోకి యీడ్చేస్తున్నారు.

* * *

"తాతా?" అన్నాడు - కవి.

"గట్టిపిండాన్ని బాబూ! చావలేదు. స్వప్రహాతప్పేనంతే!"

"నీవు చిరంజీవి మానవుడివి, తాతా?"

"అదిగో! మన వీరులు కనిపెట్టారీ దుర్మార్గం?" అని శింగన్నన గానే, శశీ రాముంల కంట నీరు ఆనందబాష్పాలుగా మారిపోయాయ్.

"నిజం?" ఇరువురూ ఒక్క.సారిగా అడిగారు.

"నిజం, చూడండి!"

చూపిస్తున్నాడు శింగన్న. వారిరువురూ చూస్తున్నారు.

* * *

రెండు అమ్ములు రివ్వునొచ్చి, శింగన్నను లాక్కెడుతున్న ఇద్దరి సైనికుల్ని అమాంతంగా ఎత్తుకుపోయాయ్. తేరుకున్న శింగన్న నేలను కరుచుకుంటూ, ప్రాకుకుంటూ పాములా పొట్టపైనే సాగిపోయాడు.

అలా అమ్ములువేసి, పితూరీదార్లు గుడారాలపై మెరుపు కాల్పులు సాగించారు. సైనికులు ఎదురు కాల్పులు చేసారు.

అది హఠాత్సంఘటనగా జరుగతున్న పోరు. అనుకోకుండా, ప్లాను లేకుండా జరుగుతున్న సమరం. జయాపజయాలు చెప్పడం కష్టం. పితూరీదార్ల బాహుబలమే జయిస్తుందో లేక వారిలోని ఆవేశాగ్ని శక్తే జయిస్తుందో, అవి రెండుగాక ఏదైనా దైవబలం అటో, ఇటో నిర్ణయిస్తుందో మనం చెప్పలేం.

ఆ సైనికులను రెండు ముఖాలుగా గంటం, పడాలులు ఎదుర్కొంటున్నారు. పోరు ముమ్మరంగా సాగింది. ఆసైనికులకిప్పుడు గుడాల్ సేనాపతి. తనో చెట్టుచాటునుండి, కాలుస్తూ, సైనికులచే కాల్పిస్తున్నాడు.

నిజం చెప్పుకోవలసి వస్తే అదొక భీషణసమరం. శత్రుదాటి తీవ్రంగా వుంది. పడాలులో అదురు పుట్టింది.

"మూకుమ్మడి పోట్లాట లాభంలేదు. చెదిరిపోండి పొదల్లోకి' అని తన దళానికి ఆజ్ఞాపించాడు.

పితూరీదార్లు పొదల్లో ప్రాకుతున్నారు. గెరిల్లాపోరు ప్రారంభిద్దామని.

శత్రువులు వాళ్ళలా వెనుదిరగడంలో టపటపలాడుతూ కాల్చారు.

వరుసగా పక్షుల్లా పితూరీదార్లా గుండ్లకు అరడజనుమంది రాలి పోయారు. పడాలో పణుకుచాటుకు పోయాడు.

అసలా ప్రమాదానికి కారణం - పితూరీదార్ల తప్పుడు నడక. పడాలు ఆజ్ఞలో బిగివుంది. అలాచేసివుంటే, శత్రువులను ఎంతసేపైనా నిలువరించి పోట్లాడొచ్చు. కాని అలా వెనక్కి పొదల్లోకి వెళ్ళే నడకలో దెబ్బతిన్నారు. పితూరీదార్లకు ఆధునిక యుద్ధరీతుల్లో తర్ఫీదు లేదు. ఎప్పటికప్పుడు మారుతున్న కొత్త పద్ధతులవల్ల ఎదు

రొక్కనే అప్పటికప్పటి ఎత్తుగడలకు అలవాటు పడలేదు. గుడాల్ ఆ విషయంలో దిట్ట.

అసలు యుద్ధంలో ప్రక్కకు వెళ్ళినా, తాత్కాలిక తిరోగమనానిక పూనుకున్నా, శత్రువుపై గుండ్లవర్షం కురిపిస్తూనే వెనక్కి ప్రాకాలి తప్ప, కాల్చకుండా ప్రాకితే శత్రువుపైబడి హాత మార్చి వేయగలడు. ఆ సంగతి వాళ్ళకు తెలీదు. అంతవరకూ ఏ యుద్ధంలోనూ తిననంత దెబ్బ, ఆ పితూరీదళాలు తిన్నాయ్.

ఆ ఘటనకు చలించని పడాలు, పణుకు ప్రక్కనుండి ధణధణమంటూ కాల్చాడు. పడాలు కాల్పులకు ఎదురు కాల్పులు విపరీతంగా రాకపోయినా, గుడాలు సమయం కనిపెట్టి, కొద్ది సేనను పడాలు నెదుర్కోడంపై కేంద్రీకరింపజేసి, తమ కొద్ది సేనతో గంటాన్ని ఎదుర్కొన్నాడు.

మరల గంటం బృందంపై స్టెన్‌గన్‌లు టక టక లాడుతూ ప్రేలేయి. శత్రువుల్లో యీసారి ఒక్కడు భీరుపోడం లేదు. పితూరీదార్లు మాత్రం ఒక్కొక్కడే నేలకొరిగిపోతున్నారు. పడాలు ఆశ్చర్యపడిపోయాడు. గంటంపై అన్ని బలాలు కేంద్రీకరించ బడ్డాయ్. తాను గంటం సహాయానికి నేలను కరచుకుంటూ, తుపాకి కాల్చుకుంటూ వెళ్ళాడు.

ఈలోపులో గుడాల్ ప్రేల్చిన గుండు, గంటానికి తగిలింది. "అమ్మా!" అంటూ పడిపోయాడు. అప్పటికి అక్కడకు చేరిన పడాలు, గంటాన్ని ఒక సందిట పెట్టుకొని తను పోరు ప్రారంభించాడు. ఇప్పుడు పడాలు సవ్యసాచి - అటు, ఇటూ, అన్నివైపులకు వుక్కిరి బిక్కిరి చేసేటట్లు శత్రువులపై గుండ్లవర్షం కురిపించాడు, ఇక శత్రువులలో ఒక్కొక్కడే నేలకూలుతున్నారు. పడాలు వారి కంటికో ప్రచండ భానుడులా కనబడుతున్నాడు. పడాలు ముఖాన్ని వాళ్ళు కన్నెత్తి చూడలేకపోతున్నారు. అలా ప్రళయాగ్నులు, బడబాగ్నులు, దావాగ్నులు ప్రజ్వరిల్లుతున్నాయి. ఆ భీకరసమరం

రెండు నిముషాలు ఏకధాటిగా జరిగింది. పడాలు తుపాకిలో గుండ్లయిపోయాయ్. అంతకుముందే పితూరీదార్ల పక్షంనుండి కాల్పులు మందగించాయ్. ఇక గుడాల్ చక్రబంధం చేయడానికి తన సైనికుల్ని చెదరగొట్టాడు. ముందుకొస్తున్నారు. కాల్చుకుంటూ పడాలు ఇక లాభంలేదనుకున్నాడు. గంటంను భుజానవేసుకొని, భూమిని కరుచుకుంటూ, గుండెలపై, ప్రాకుకుంటూ, శత్రువుకంట పడకుండా తిన్నగా ఓ కొండ కలువలోకి తప్పుకున్నాడు.

శత్రువులు ఆ కొండను చుట్టుముట్టారు. కాని వాళ్ళకా కలువ కనబడ్డంలేదు. ఎక్కడనుంచో వచ్చినవాళ్ళకు ఆ మన్యంలో ఏ పుట్టలో ఏ పాముందో ఏం తెలుస్తుంది? అది బుసగొట్టి కాటేస్తే వాళ్ళ గతేంకాను? పితూరీదార్లుకూడా ఒక్కడూ కనబడ్డంలేదు, వాళ్ళకంతా అగమ్యగోచరంగా వుంది. ఆ చుట్టూనే తిరుగుతున్నారు. చుట్టూతిరిగి ఒకరి ముఖాలు ఒకరు చూచుకుంటున్నారు.

గుడాల్ ఆర్డరు వేసాడు—

"ఊ! శతఘ్నులూ, ఫిరంగులూ బారుచేయండి! కొండను పిండి చేయండి!" అని.

ఎలుకను పట్టడానికి కొండ త్రవ్వినట్టు, అదేంటా ప్రయత్నం అని మీరనొచ్చు.

అ కొండలో వున్నది-మామూలు ఎలుక కాదు, "కొండ ఎలుక!" "కొండ ఎలుకని" ఎవరు ఎవరికి పేరుపెట్టారో తెల్సా?" ఒక్క శివాజీకి - తురుష్కులు పెట్టిన పేరది.

అటువంటివాడు పడాలు. పడాలును తాకడం అంటే నిప్పుల్లో పిక్కలేరడం లాంటిది.

ఆ కలువలోకి అడుగుపెట్టిన పడాలు, గంటానికి గాయం తుడిచి కట్టుకట్టి వుపచర్యా చేస్తున్నాడు. కొండలాంటి గంటం కూలిపోయాక ఎందుకో అతనికి అధైర్యం తోచింది.

తుది క్షణాల్లోనున్న గంటం, తుదిమాటలు పలుకుతున్నాడు. పాపం! ఆయన సంసారమంతా చిక్కులు పెట్టి ప్రోగు పెట్టారా తెల్లదొరలు. ఆ ప్రోగులైనా కనబడ్డంలేదు. ఇకాయన కెవరున్నారు. తలచుకోడానికి, ఇకాయన చెప్పవలసి దేముంది? ఆ వున్నదే, ఆయన కన్నింటికంటే, అందరికంటే, ఆఖరికి దేవుడికంటే - ప్రియతమైనివిషయం – చెబుతున్నాడు.

"పడాలూ! ఇంకెందుకు వుపచర్య చేస్తావ్. నే నెలాగు బ్రతకను. బ్రతుకవలసినవాడు బ్రతికి తీరవలసినవాడు - రాజు! వెళ్ళు! తప్పించుకుపో! ఆయన్ని మాత్రం కంటికి రెప్పలా కాపాడు...ఇదే నా తుదికోరిక!" ప్రాణం విడిచేసాడా, ఆ జన్మత్యాగి, ఆ విశాలాంత తేజస్వి, ఆ వుదారహృదయుడు.

పడాలు "గంటం!" అంటూ అతని శిరస్సుకు తన శిరస్సు హత్తుకున్నాడు. తన శరీరంపైని కబ్బాతీసి, ఆ గంటం మృతుకళేకరంపై ఇదే నీ ఋణానికి నా కానుక!" అంటూ ఏడుస్తూ కప్పాడు.

బయట కొండచుట్టూ తిరుగుతూ కలువ ముఖంవద్దనే ఆ కలువ తెలియకుండా తచ్చాడుతున్న ఓ సైనికుడు ఆ అలజడి విని, కలువ ముఖంలోకి వచ్చాడు. అది చూచాడు పడాలు. వెంటనే తన మొలనున్న బ్రాకు త్రిప్పి విసిరాడు. ఆ సైనికుడు "కెవ్వు" మంటూ కూలిపోయడు, ఆ శబ్దంపైన ఉన్న సైనికుల కందరికీ వినబడిపోయింది. బిలబిలమంటూ ఆ కొండ కలువలోకి ప్రవేశించారు. శతఘ్నులు పేర్పిస్తున్న గుడాల్ ఆ వార్త విని పరుగు పరుగున వచ్చాడు.

వాడు వచ్చేటప్పటికే, పడాలు తన తుపాకిలో గుండ్లయిపోయినా, "రండిరా!" నా కండబలమింకా చావలేదు. మీ నిత్యహత్యలూ, మారణహోమం, బీభత్సం, అన్నీ తేలిపోతాయ్! రండి!" అంటూ గండ్రగొడ్డలి ఎత్తి పరశురామునిలా పోరుతున్నాడు ఒక్కొకక్క ఆ గండ్రగొడ్డలి వ్రేటున ఒక్కొకక్క శత్రు శిరం చర్రున

త్రెగి త్రుళ్ళి పోతోంది. ఆ గండ్రగొడ్డలి మడెమ వెనుకనున్న వాళ్ళకు తగిలి వాళ్ళ శిరస్సులు పటపటా పగిలిపోతున్నాయి.

ఒక్కడ్ని, ఏకాకిని, అందరు శత్రువులు చుట్టుముట్టినా, పడాలుకు లెఖ్ఖకనబడలేదు శత్రువులకు గ్రుక్క తిరగడంలేదు—

కలువలోకి ప్రవేసించిన గుడాల్, పడాలు తన శరీరం, శిరస్సు సమస్తం రక్తసిక్తమైనా తెగించి పోరాడ్డం చూచి, ఆ మధ్య తను వెళ్ళితే తక్షణం, తల తెగితీరుతుందని గుర్తించి ఆ వెనుకవాటుగానే "ధన్"మని కాల్చాడు.

అంతే. పడాలు బరినొరిగిపోయాడు.

ఆకాశంలో ఎర్రకాంతితో మెరిసిన ఆంధ్ర నక్షత్రం రాలిపోయింది.

అలా రాలిపోయినప్పుడు - పడాలు జపించిన తారకనామం "రాజా!" అని.

అదే అతనికంత ప్రియం!

గుడాల్ మాత్రం వికటాట్టహాసం చేసాడు. వాడి అట్టహాసానికి అవధుల్లేవ్-ఆనాడు. రాజుకు కుడి ఎడమ భుజాలు, రెండు దిగ్గజాలు, దిగ్దంతాలు, రెండు ప్రబలశక్తుల్ని అంతం చేయగలిగానన్న అహంకారం వాడి మిట్టుపాటుకు కారణమైంది.

## 22

పడాలు నేలరాలగానే, కాళికాలయంలో నిష్టలోనున్న సీతారామరాజు గుండెలు గుభిల్లుమన్నంతగా అతని ఎదుట ఓ గంట మ్రోగింది.

వెనక్కి చూచాడు. గుహ ముఖద్వారంలో రక్తసిక్తమై వచ్చిన శింగన్న కనపడ్డాడు.

"శింగన్నా !" అంటూ చర్రున లేచి, రాజు శింగన్నను కౌగలించుకున్నాడు,

"రాజా !" అంటూ ఏడవలేక, గ్రుక్కతిరక్కుండా, బిగబెట్టి, బిగబెట్టి ఏడ్చాడు - శింగన్న.

"రాజా ! ఏటివద్ద చింతతోపులో మన దళాలకు తెల్లోళ్ళకూ భీకర యుద్ధం ప్రజ్వరిల్లిపోయింది. ఎందరు మనవాళ్ళు కూలిపోయారో, అదో తుదిఘట్టంలా వుంది. నీవు త్వరగా వెళ్ళు రాజా!"

"శింగన్న! ఎంతపని జరిగిపోయింది!" అంటూ కాళీ ముఖంలోకి తీక్షణంగా చూచాడు తన మనస్సులో మహాకాళిని సాక్షాత్కరించుకున్నాడు. ఆమె పాదాలకు శిరస్సు స్పృశించాడు. ఆమె పాదాల వద్దనే వున్న చంద్రహాసాన్ని చేబూనాడు. గోడకున్న విల్లమ్ములను ధరించాడు. చంద్రహాసాన్ని ముద్దుపెట్టుకొని.

"అమ్మా! సెలవ్!" అంటూ చంద్రహాసాన్ని ఝుళిపిస్తూ, చివాలున వెనక్కు తిరిగి—

"శింగన్నా! నీ దిక్కు దేవుండు, వస్తా!" అంటూ, ఆ కన్నుల గుండా, విస్ఫులింగాలు చిందుతుండగా, చేతిలో చంద్రహాసం తళతళ మెరుస్తుండగా, తిన్నగా ఏకాదృష్టితో గాలిని దూసుకుంటూ బయటికి వెళ్ళిపోయాడు.

రాజలా వెళ్ళగానే, తల్లి నారాయణమ్మ వెదుక్కుంటూ, వెదుక్కుంటూ, ఆఖరికి అంతు తెలుసుకుని ఆ గుహ గర్భగుడిలోకి ప్రవేశించింది. ఆమె ప్రవేశించడం రాజుకి తెలీదు శింగన్నకూ తెలీదు - ఒక్క ఆ మహాకాళికి తప్ప.

తిన్నగా నున్న మహాకాళీ విగ్రహానికి ప్రణమిల్లింది. మహాకాళీ ముఖంలోకి చూచింది.

ఆ తల్లిని స్తుతించింది.

'అమ్మా! నీ వెందరినో దేవతలనే కాపాడావట. బాధలలో మూలుగుతున్న మానవుల్నే ఆదుకున్నావట. అనాథుల, అభాగ్యుల దీనుల, దరిద్రుల ననేకుల రక్షించావట. త్రిపురాసురుడ్ని, మహిషాసురుడ్ని నీ పదఘట్టనలచే మర్దించావట. ఆది శక్తివట. చరాచర ప్రపంచంలోని ఎనుభై లక్షల జీవులకు తల్లివట...' అంటూ.

ఆ తల్లిని కోరుకుంది—

ఒక్క గానొక్క బిడ్డ నాకు. వాడే నా వరాలమూట, తరాల కోట, తనువుకురాట. అన్నీ, నా కన్నీ వాడే తల్లి! రక్షించవ్?' అంటూ.

అంతే, ఆ తల్లి స్పృహతప్పి పడిపోయింది. ఆమె ఆందోళన ఆక్రందన విన్నట్టుగా జగజ్జనని తనకంట కన్నీటిచుక్క నిలిపింది,

తల్లి అక్కడ తెలివి తప్పింది.

రాజు తన త్రినేత్రం విప్పాడు.

ఖడ్గం పట్టి కోడెత్రాచులా బుసలు కొట్టుకుంటూ వచ్చాడు.

చూచాడు, రెండు పలవలకు రెండు చెక్కలై భూమిపై నెత్తురు మడుగైన స్థలాన్ని.

మోర పైకెత్తి - 'అమ్మా!' అంటూ రెండు కన్నులూ మూసుకున్నాడు.

ఓ క్షణానికి కళ్ళు తెరిచాడు. ఆ నెత్తుటి మడుగులోని నెత్తురులో ముద్దయిన మట్టిముద్ద పట్టుకున్నాడు - అతనిలో సుడిగుండం కెరలింది.

"'రక్తం! నులు వెచ్చని రక్తం! ఇంకా గడ్డకట్టని రక్తం! అరమరికలేని అమాయక మానవుల రక్తం! అంటూ శిరస్సుపైకెత్తి మబ్బులతో నిండిన ఆకాశంలోకి చూచాడు.

అతని కన్నుల్లో ప్రజ్వరిల్లిన అరుణకాంతి, ఆ మబ్బులను చెదర గొట్టింది.

"మానవ రుధిర ప్రవాహంలో క్రీడించే కిరాతకుల రక్త దాహం మరెంతకాలం తీరాలి?" అని ప్రశ్నించాడు.

ఆ గర్జించిన మేఘాల్లో ఓ ఎర్రచార వురిమింది.

చెదిరిపోయిన మేఘాలు గర్జించాయ్.

"మారణహోమం చేసే ముష్కర కృత్యాలు మరెంతకాలం సాగాలి!' అని ప్రశ్నించాడు.

'సాగరాదు! సాగనివ్వదు! మన్యం పునర్జాగృతం కావాలి పునర్వి జృంభణ చేయాలి. పునః పునః పురోగమనం చేయాలి!' అంటూ తల పంకించాడు. ఆ పంకించడంలో అతని వుంగరాల జుట్టు చెదిరిపోయింది. ఒక్కుమ్మడిగా నభోతలంలోని మేఘపటలం వద్ద రిల్లింది. వెంటనే రాజు చంకనున్న శృంగం చేతబట్టి, గబగబా ఓ కొండ శిఖరమెక్కాడు. రాజలా వుంకించి అడుగు వేయగానే ఆ శిఖరం అడుక్కు అణిగింది. గ్రుక్కపట్టి, దక్షయజ్ఞ ధ్వంసకునిలా శృంగనాదం చేసాడు. జడలు క్రిందకొట్టి వీరభద్రుని పుట్టించిన మహేశ్వరునిలా విజయతాండవం చేసాడు. వెనక్కి వచ్చాడు. ఆ వస్తున్నదారిలో గుట్టలప్రక్క మిట్టలప్రక్క తన సహచరుల శవాలు దొర్లాడుతున్నాయ్. దిగ్గజాలైన పడాలు, గంటల మృతకళేబరాలు చూచాడు. చలించిపోయాడు.

'గంటం, పడాలూ! ఎంతపని జరిగిపోయింది. ఒక మహా భారత సంగ్రామంలో భీమార్జునులే వొరిగిపోతే ఇక జరిగేదేముంది? ఇక యీ పితూరీ నౌక నట్టేట మునిగిపోయినట్లేనా? ఆదిలోనే నౌకకు లంగరెత్తి, మధ్యలోనే మిమ్మల్లను పోగొట్టుకున్న నేనెంతటి దురదృష్టవంతుణ్ని? ఇటు ఆరవిడిచిన అమ్మల్లా స్వతంత్ర పోరాటంలో దుమికిన కుడిభుజాల్ని పోగొట్టుకున్నా. అటు సీతలాంటి పవిత్ర వీరయువతు లనేకుల్ని కాలగర్భంలో కలిపివేసా. మల్లు అగ్గిరాజులాంటి అగ్నిపిడుగుల్నే జైలు కవాటాల యినుపకోరల కప్పగించా, ఎందుకీ జన్మ? ఎందుకీ బతుకు? తల్లీ! ఆదిశక్తీ! అంటూ

ప్రక్కనున్న చెట్టు పలవకు రెండుచేతులూ ఆన్చి, శిరస్సు గొట్టుకొని కుమిలిపోయాడు. రుద్రమూర్తి ధమారంలా తల ఝూడించాడు. కత్తి దూసాడు—

ఏమైనా సరే, మన్నూ మిన్నూ ఏకమైనా, ముష్కరతరం గాలు పోశెత్తి కెరలినా, సర్వసత్తాక స్వతంత్ర సమరాగ్నిలో దూకి, అటో ఇటో, ప్రళయమో, ప్రశాంతమో తేలిపోవలసిందే! సెలవ్, యోధుల్లారా!' అంటూ ఆ మృతవీరు లందరికీ చేయెత్తి జోహారు లర్పించి, కాళీగుహాకు తొలి సెలవు తాంబూలం కోసం, తుది వీర కుంకుమ తిలకం కోసం చండ ప్రచండుడై బయలు దేరాడు.

# 23

ఆకాశమంత ఎత్తుగా పెరిగి, ప్రాక్పశ్చిమాల తాకుతూ, తొండ మాడిస్తూ, ఘీంకెత్తు మత్తేభంలా వస్తున్న రాజును కొండ గుహ ముందు ఆర్తత్రాణులైన జనసందోహం చుట్టుముట్టింది.

ఆ జన సందోహంలో కొందరి తల్లుల చంకనున్న పిల్లల్ని ఒక్కొక్కరినే ఎత్తుకొని మనసారా ముద్దుపెట్టుకున్నాడు. ఆమధ్య మన్న ఓ ముసలి అవ్వ పాదాలను, తన మాతృమూర్తి పాదాలుగా భావించి సృజించి ఆ మన్ను శిరస్సుపై వుంచుకున్నాడు. ఆ ప్రక్కనే మరో రెండు పాదాలను సృజించాడు. ఆ పాదాలో పురుషునివి. అలాగే పైకి లేస్తూ ముఖం చూచాడు. ఆ ముఖంలో కరిగిపోయిన కళ్ళలో, కన్నీరు చూచాడు. ఒక్కసారిగా—

'భాస్కర్రావుగారూ?' అని కౌగలించుకున్నాడు,

ఆయనేగాని తనకు ఆశ్రమివ్వకపోతే యింతటి వుప్పెనలాంటి స్వతంత్ర సమరాన్ని సాగించివుండేవాడు కాదు-రాజు. రాజుకు పెద్దలంటే, ప్రజలంటే, పిల్లలంటే, తల్లులంటే అంతటి ప్రేమ అది గుడ్డిది కాదు. మూర్ఖత్వానిది కాదు. అచంచల విశ్వాసంతో

కూడినది, అందుకే రాజుకు వాళ్ళు దివ్యమానవులు. వాళ్ళ ఆశీస్సులుంటే చాలు. వాళ్ళనలా కౌగలించుకుంటే చాలు - వాళ్ళనుండి, భీముడు హనుమంతుడ్ని కౌగలించుకుంటే వచ్చినంతటి పదహారు వేల భద్రగజాల బలం అతనికొచ్చేస్తుంది.

అలా కౌగలించుకొని, ఆయన ముఖాన్ని చూచి, అడిగాడు—

'అదేంటా కంట తడి? మీరు నాకాశ్రయమిచ్చిన తొలిరోజున మీ కను కొలకులకు నిలచిన ఆనందబాష్పాలు, యింతలోనే విషాద బాష్పాలుగా ఎందుకు మారిపోయాయ్?'

'నాకే కాదు బాబూ! మన్యానికే మారిపోయాయ్. మన్యం జనులంతా అనాథులైపోయారు. ఇక నీవు పూనుకోపోతే మన్యానికి నాథుడే లేడు!'

ఆ మాటకు సీతారామరాజు హృదయం జ్వలించింది.

'పూనుకోడమే కాదు రావుగారూ! ఇదిగో మరొక్కసారి మీ పాదాలు పట్టి ప్రమాణం చేస్తున్నా! నా ప్రాణాన్ని బలివ్వడాని క్కూడా వెనుదీయను!' అని శపదం చేసాడు.

'బలివ్వడం కాదు నాయనా - కావలసింది!'

'కాపాడ్డంకోసమే బలివ్వాలి!"

"కాదు-నీ కత్తి ముందు క్రింద పెట్టాలి!'

ఆ మాట విని రాజు త్రుళ్ళాడు. అర్థం చేసుకులేక పోయాడా మాటల్ని.

'ఏమన్నారు? మాట్లాడుతున్నది - రావుగారేనా?'

"ఆ! రావుగారే! కళింగయుద్ధంలో రక్తపాతాన్ని సహించ లేక గౌతమబుద్ధుని పాదపద్మంముందు తన కత్తిని ఫెళ్ళున విరిచేసిన మహాభారత చక్రవర్తి అశోకుడ్నకుగు, ఇదే అంటాడు.

రాజు మాట్లాడలేకపోయాడు అతనింకా ఆ మాటలు అర్థం చేసుకోలేకపోయాడు.

"రాజా! నీవంటేమాకు ప్రేమ లేదనుకోకు. నీవు చిన్నవాడి వైనా మా హృదయాధిష్ఠాన దేవతవు. కాని నీ వేమన్యంకోసం కత్తి పట్టావో. ఆ మన్యమే నేడు ఆ కత్తినిక్రింద పెట్టమంటోంది. లేదా తెల్లవాళ్ళ దుష్కృత్యాలకు మన్యం మరింత ఆహుతైపోతుంది-తరువాత మనం చేసేది - శూన్యం!"

ఆ మాటలు రాజును కలిచేసాయ్—

"అని లొంగిపోమంటూరా? ఇంతవరకూ బలినొరిగిన వీరులకు ద్రోహం చేయమంటూరా?" అని తీక్షణంగా చూచాడు - రాజు - రావుగారి ముఖంలోకి.

"పిచ్చోడా! నాగులేట నెత్తురుపారిన పలనాటి యుద్ధాన్ని ఆపుచేయడానికి అస్త్రసన్యాసం చేసిన బ్రహ్మనాయన లొంగిపోయాడంటావా? తెలుగుదేశంచే నేటికి ఆరాధించబడ్డం లేదంటావా? లేక బాలచంద్రుడూ, కన్నమదాసులాంటి వీరకిశోరాల్ని పోగొట్టుకొని కూడా శాంతి సాధించడం ద్రోహమంటావా? ఆలోచించు నాయనా! కత్తిక్రింద పారెయ్యడం పిరికితనం కాదు. లొంగుబాటూ కాదు!"

"ఖచ్చితంగా లొంగుబాటే!" అని అరిచాడు - రాజు.

అప్పుడతని దృష్టిలో నిల్చినదొక్క రాణాప్రతాపుడు.

రాణాప్రతాపుడు రామభద్రుడు జనించిన సూర్య వంశపు రాజు. మేవాడ రాజ్యాధిపతి. అప్పుడు మహాభారతానికే చక్రవర్తి అక్బరు. చతురంగ తురంగ గజబల సంపన్నుడు. అటువంటి అక్బరు చక్రవర్తినే పద్దెనిమిది సంవత్సరాలు ఏకధాటిగా ఎదుర్కొన్న వీరుడాయన. రాజ్యం గోల్పోయి, ఆలుపిల్లలతో కారడవిలో చరించినా భారత ప్రతిష్ఠకోసం భిల్లులను కూడగట్టి, కొండను ఢీకొన్నట్టు ఒక చక్రవర్తిని ఢీకొనడం మాటలు కాదు. పద్దెనిమిదేండ్లు అంతటి సర్వశక్తి సంపన్నమైన చక్రవర్తినే ఢీకొన్న ఇంకొక రాజపుత్ర వీరుడేడి?

"లేదు. అటువంటివాడు పుట్టబోడు!" అనుకున్నాడు-రాజు. అతనినినే అనుసరించా లనుకున్నాడు. రాజు ఆ మాట అనగానే, భాస్కరరావుగారు అశలు రహస్యాన్నికూడా చెప్పేసారు,

నేనంతా మాట్లాడాను. రూథర్ ఫర్డు దొర, రాజీకి సిద్ధమన్నాడు-వెళ్ళు. నామాట విను!" అని.

దాంతో మరీ రెచ్చాడు - రాజు.

రూథర్ ఫర్డు వట్టి కుటిలాత్ముడు. పలనాటి హనుమంతును హత్యజేసిన కుట్రదారుడు - వాడో రాక్షసుడన్న సంగతి రాజుకు తెలుసు. రామచంద్రరావుగారికి రాజు వినయపూర్వకంగానే చెప్పాడు, కాని రావుగారూ తను పట్టిన పట్టు వీడనూలేదు.

అంతలోకే, గోవిందు క్షతగాత్రుడై నెమ్మదిగా అక్కడకు చేరుకున్నాడు. రాజును చూచి—

"...రా...జూ!" అంటూ డొక్కలెగరేస్తూ పిలిచాడు.

"అంతా ఐపోయాక మనం ఏం చేయగలం రాజా! పెద్దలు చెప్పినదే బాట!"

"గోవిందూ!" అని గర్జించాడు - రాజు ఆ వుద్రేకంలో గోవిందుకు చేయవలసిన వుపచారాన్నే మరచిపోయాడు. కాని ఆ ప్రక్కనే వున్న శింగన్న గోవిందును తన వొడిలోకి లాక్కొని వుపచారం చేస్తూ—

"రాజా!" అని అరిచాడు. శింగన్న అంతకుముందెన్నడూ అలా రాజును ఎదురించి ఎరగడు. రాజులో ఏదో కరుకుదనాన్ని చూచాడు. శింగన్న! లొంగిపోవడం తప్ప వేరుమార్గం లేదన్న అభిప్రాయానికి శింగన్న వచ్చే అలా అరిచాడు. ఆ విషయాన్ని రాజు అర్థం చేసుకున్నాడు. అతనికి పిచ్చెక్కిపోయింది. పిచ్చెక్కిన భద్రగజం వట వృక్షాల్ని విరిచేస్తున్నంతటి, అడవులను, కొండలను పిండి పిండి చేయునంతటి మనో విభ్రమం రాజులో తలెత్తింది.

"లొంగను. నా కంఠంలో కొనవూపి రున్నంతవరకూ, నా హస్తంలో కృపాణమున్నంతవరకూ, నా ప్రజలను నేను అనాథుల్ని కానివ్వను. ఆహుతి కానివ్వను. తెల్లవారలను నీళ్ళు ముట్టనివ్వను." అంటూ 'చక్' మని ఎవ్వరినీ లక్ష్యపెట్టక ఒక్క విసురులో గుహ గర్భంలో మహాకాళి ముందుకెళ్ళి—

"అమ్మా!" అంటూ ఆదిశక్తి కాళ్ళపై బడ్డాడు.

ఆ కేకకు 'బాబూ!' అని గుహ ప్రతిధ్వనించింది.

రాజు తెల్లబోయి—

'అమ్మా!' అని అరిచాడు.

"బాబూ!" అని ఆ మూల శోషిల్లిపడిన మాతృమూర్తి లేచి నిల్చింది.

'అమ్మా!' అంటూ రాజు, ఆ తల్లిని గాఢంగా కౌగలించుకున్నాడు.

'అమ్మా! నాకు చనుబాలు పట్టవ్!' అని తన చిన్నతనంలో తల్లి వక్షాన్ని ప్రాకినట్టు, ఇప్పుడామె భుజాలు పట్టి - రాజు—

"అమ్మా! నాకు శక్తి నిమ్మని మహాకాళిని ప్రార్థించమ్మా! నా సహచరులు పోయారమ్మా! నా ప్రజలు అనాథులై పోయారమ్మా! అమ్మా! ప్రార్థించవ్! నాకిప్పుడు శక్తి కావాలి!" అంటూ బ్రతిమాలి, ఆమె కాళ్ళపై జారాడు.

"బాబూ!" అంటూ ఆమెకూడా చతికిలబడిపోయింది.

ఆమె ముఖంకూడా అశ్రుతప్తమైంది.

'నీవూ కన్నీరు పెడుతున్నావా? అమ్మా?' అంటూ తెల్లబోయి అడిగాడు - రాజు.

'అవును. నాయనా! నిద్రాహారాలు మాని, కళ్ళల్లో జ్యోతులు వెలిగించుకొని నీ కోసం భరించలేని ఆవేదనతో తిరిగి కడకు కలుసు

కున్నా, కడుపుతీపి నాయనా! ఆ కడుపులో కార్చిచ్చు రగులుతోంది. ఆ కార్చిచ్చు నా కళ్ళల్లో కన్నీరు నిలిపింది...బాబూ! నా కడుపున పుట్టిన పుణ్యానికి కని పెంచిన నీ తల్లి ఋణానుబంధం తీర్చ నిరాకరిస్తావా?'

రాజుకు అంతా శత్రువులై పోయి, మీదకురికినట్టు కనబడ్డారు. కడకు తల్లయినా ఆశీర్వదిస్తుం దనుకున్నాడు. ఆమెకూడా తన తిరోగమనాన్నే కోరుతోంది.

కోప మొచ్చింది—

'అమ్మా! నీ విప్పుడు నీ కన్నకొడుకుతో మాట్లాడ్డంలేదు. వీరకంకణం ధరించిన ఒక స్వతంత్ర యోధునితో మాట్లాడుతున్నావ్?'

ఆ తల్లికీ ఆవేశమొచ్చింది—

'స్వతంత్రయోధుడికి తల్లి వుండదా? కన్నతల్లుల కన్నీరు చూడ గలిగిన కఠిన పాషాణమా నీ హృదయం?'

"అవును. ఇక నా కెవ్వరూ లేరు. నా ప్రజలకోసం ఏమైనా త్యజిస్తా. ఒక బిడ్డని ఆశీర్వదించని తల్లి నా కక్కరలేదు. వెళ్ళిపో! అదిగో నా తల్లి. ఆమే నన్ను దీవిస్తుంది. రక్షిస్తుంది. శక్తినిస్తుంది, అమ్మా!" అంటూ మహాకాళి పాదాలపై పడ్డాడు.

దేవి కంట నెత్తుటిధార కారింది. తలెత్తి చూచాడు రాజు.

'తల్లీ! ఆనందబాష్పాలొలికించవలసిన నీ కంట నెత్తురా?' అంటూ ఆ నెత్తురు తుడవబోయాడు.

నారాయణమ్మగారు అస్తిమితంతో, అనూహ్య సంఘర్షణతో చలించిపోతున్న తన బిడ్డ భుజం నొక్కింది.

'అవును బాబూ! నిన్ను ఒక్కడ్నే కన్నతల్లిని కాబట్టి, నా కంట కన్నీరు చూచావ్! ఆ తల్లి లోకైకజనని. లోకాన్నే కన్నతల్లి కంట నెత్తురు కార్చింది. బాబూ! నా మాట విను నాయనా!'

"అమ్మా!" అంటూ రాజు తల్లిని ఆలింగనం చేసుకున్నాడు.

ఆ దృశ్యం తిలకించిన ప్రజల వదనాలలో ఆనందరేఖలు తొణికిన లాడాయ్. శింగన్న, గోవిందు ఏదో బరువుదొలిగిన సుఖాన్ని తన్మయత్వంలో అనుభవించారు.

'అమ్మా! అదే నిజమైతే, ఇదిగో! ఏ మన్యం ప్రజల ఆకలి ఘోషలు, బాధాక్రందనాలు నన్నీ కత్తి పట్టించాయో, ఆ కత్తి, ఆ మన్యం ప్రజలనే గనుక ఘోరహింసాకాండనుండి రక్షించగల దంటే - యిదిగో యీ కత్తినే నీ ఎదుట సన్యశిస్తున్నా!'

అంటూ టపీమని మోకాలికి దాపుపెట్టి, ఖడ్గాన్ని రెండు ముక్కలుగా విరిచివేసి మహాకాళి ముందు పారవేశాడు. భుజా నున్న ధనస్సు, అమ్ములు అన్నీ క్షణకాలంలో పటపట పిటపిట లాడుతూ ధ్వనించాయ్. ఆ కాళీ విగ్రహంముందు ముక్క ముక్క లుగా కుప్పబడ్డాయ్.

బయట శింగన్న, వూపిరాడని సంతోషంతో—

'అల్లూరి సీతారామరాజుకి జై!' అని నినదించాడు.

అంతే. తను ఎవరికోసం ఖడ్గం, ధనస్సూ, అమ్ములూ అన్నీ విరిచిపారేసాడో ఆ ఆర్తుల రక్షణకు-ఎవ్వరితో చెప్పకుండా కిన్నగా నడిచి వెళ్ళిపోతున్నాడు. ఒక హిమాచలంలా, సింహాచలంలా వింధ్యా చలంలా తొణక్కుండా, నిబ్బరంగా నిశ్చలంగా సాగిపోతున్నాడు.

ఎక్కడికో, ఎందుకో అనూహ్యాం.

ఆయనలో వేడి, వాడీ అనన్యం.

అలా సాగిపోతుండడం చూచి, శింగన్న నిస్తబ్ధుడై పోయాడు. శింగన్నకు తెలుసు. రాజులో నడుస్తున్న హిమాచలం' ప్రళయధ్వనులతో పగిలిపోతుందని.

"బాబూ!" అంటూ నారాయణమ్మగారు బిడ్డని వెనుకపడి పోతోంది.

జనం ముఖాలన్నీ వెలవెలబోయాయ్.

గోవిందు—

"పదండి! ఆయనెక్కడికో మనమూ అక్కడికే!" అంటూ పురిగొల్పాడు.

జనంలో మహాసంచలనం పుట్టింది. మరల మరొక్కసారి రాజును రక్షించుకోవాలన్నంత దృఢదీక్ష వాళ్ళలో కలిగింది. కదిలారు.

## 24

ఆయుధం చేతలేదు. అంగబలం వెనుకలేదు. రక్షిస్తాడట - ప్రజలను.

అని తలచుకున్న ప్రతి అ ఆంధ్రుడికీ ఏదో బాధ నిలువెల్లా దహించేస్తున్నట్టుగా ఆందోళన చెందడం సహజం!

రండి! చూడండి!

ఆ నిరస్త్రుడు, అస్త్రసన్యాశి రాజు. యీ ప్రపంచంలో నిమిత్తం లేని మానవునిగా, అజాత శత్రువులా, ఏకాగ్రచిత్తంతో గుట్టలు, మిట్టలు, పుట్టలు త్రొక్కుకుంటూ పోతున్నాడు. అతని నడకను ఆ వెనుక వస్తున్నవారెవరూ అందుకోలేకపోతున్నారు. ఆయన పాదం పెట్టిన పుట్టలనుండి బుసలుకొడుతూ, పైకి వచ్చిన ఫణిఫణాలు కూడా, ఆయనకూడానే వెంటబడ్డ సంగతికూడా ఆ క్షాత్రవ మూర్తికి కానరావడంలేదు. ఆయనతో, ఆయనదాటిన ప్రతీవస్తువూ, ఆయన వెంటే నడిచివస్తోందన్న సంగతి ఆయనకు తెలీదు.

ముఖమంతా కందిపోయింది. చెమటెక్కిపోయింది. యీదర గాలికి ముంగురులు ముఖానికి కొట్టుకుంటున్నాయ్.

ఆయన నడుస్తున్న పథం ఆయన కొక్కడికే తెలుసు—

ప్రజలను ఆ హింసలనుండి, ఆ నరకయాతననుండి రక్షించా లంటే కత్తి క్రింద పెట్టినంతమాత్రాన చాలదని.

ఆయన చెవిని పడకుండా కొన్ని పొలికేకలు ఎంతో దూరమై పోయాయ్.

"రాజా! రాజా! అంటూ ఆ పొలికేకలు తను బాధకొద్దీ, కొండలను-మాత్రం ప్రతిధ్వనిచేస్తున్నాయంతే.

రాజు తిన్నగా అతి భయంకరమైన ఒక మిలిటరీ క్యాంపు ముఖంలోకి వచ్చేస్తున్నాడు.

ఆ క్యాంపులో చలి కాగుతున్న సైనికులు, త్రాగి కైపెక్కిన తెల్ల ఆఫీసర్లు కేరింతలు కొడుతున్నారు.

ఆ క్యాంపుకు వెనుకతట్టున కొండ అంచుపై ఓపెద్ద వట వృక్షం వుంది. ఆ వటవృక్షం చుట్టూ ఇనుపకంచె వేసారు. దూరా నికి ఆ కొండ అంచు ఆకాశానికి అంటుకున్నట్టుంది. ఆ కంచెవద్ద నలుగురు సైనికులు ఓ మంటలో బ్రతికున్న కోడిని కాల్చి, బలవం తంగా దారుణంగా ఆ జీవి చర్మంపై వెంట్రుకలు దూసుకొని రాక్ష సుల్లా మాంసం తింటున్నారు. ఎదుట ఓ గుడారంలో రూథర్‌ఫర్డు, గుడాల్ కొందరు ఆఫీసర్లతో రేడియో ట్యూనువేసి ఒకడు త్రాగి గెంతు తుండగా, మరొకడు కెవ్వుతున్నాడు.

బాగా ముందు బాస్టియన్, పిళ్ళె, సబ్ ఇన్‌స్పెక్టరులు చీట్ల పేక వేసుకొన్నారు. ఒక ముక్క ఎత్తి పిళ్ళె బెకబెకలాడుతూ నవ్వుతున్నాడు.

అప్పటికే రాజు ఆ గుడారాలకు కనుచూపు దూరంలోకి వచ్చేసాడు.

పిళ్ళె బెకబెక నవ్వడంలో మోర పైకెత్తాడు.

రాజు కళ్ళబడ్డాడు.

"సార్!" అంటూ బిగ్గరగా కేకేసి పిళ్ళె శవంలా బిర్రబిగిసి పోయాడు.

ఆ కేకకు చుట్టూవున్న సైనికుల్లో భీభత్సం కలిగింది. మరు క్షణంలో వాడిచుట్టూ చేరుకున్నారు.

రూథర్‌ఫర్డు—

'What' పిళ్ళె!" అంటూ బిగిసిపోయిన ఆ జీవచ్ఛవాన్ని గింజాయించాడు.

కాని పిళ్ళె "రాం...రాం...రాం" అని గుటకలు మ్రింగాడు.

అర్థం కాలేదా - దొరలకి.

"వం...వం...వం" అంటూ మళ్ళీ పిళ్ళె డొక్క ఎగరేసాడు.

"ఏంటి నీ ముఖం - రాం...వం...

"రాం...వందొచ్చి సార్!" అంటూ వ్రేలెత్తి కళ్ళు మూసు కొని చూపించాడు.

రివ్వుని కత్తిలావచ్చి ప్రత్యక్షమైన రాజును ఒక్కసారిగా అంతా చూచారు.

"సీతారామరాజు!" అంటూ సబ్ యిన్‌స్పెక్టరు ప్రక్క కెళ్ళి పోయాడు.

అందరి గుండెల్లో పిడుగులు ప్రేలేయ్. రూథర్‌ఫర్డు చేతిలోని బ్రాంది బాటిల్, గుడాల్ చేతిలోని పిస్టల్ జారిపోయాయ్. కాళ్ళు వొణుకు పుట్టాయి, ఒక్కడుగు అంతా వెనక్కి తూలారు.

హడలుపుట్టి దడెత్తిపోయారు.

వాళ్ళకు తెలుసు - తాము యింతవరకూ రాజు సహచరుల తోనే పోట్లాడారు. వాళ్ళ చేతుల్లోనే అనేకమందిని హతం చేసుకు

న్నారు. గడగడ లాడిపోయారు. దినదిన గండమై బ్రతికారు. నిప్పుల్లో పిక్కలేరేరు. అటువంటి వీరుల నాయకుడాయన. హడలి పోయారు. వారి నోట మాట రాలేదు భీభత్సం. భీతావహం వాళ్ళ నావరించింది. ఒక్కసారి రాజు ముఖం చూచారు.

కత్తుల్లాంటి కాంతులు వాళ్ళ కళ్ళ కొట్టాయ్.

ఆ చూపులు కరకుకత్తుల్లా వాళ్ళ ముఖాలముందు తళతళ లాడాయ్.

చేయి తాకారా-భగ్గున మండిపోతారు. కాస్త ముందుకు అడుగు వేసారా? రాజు హృదయపు లోతుల్నుండి చెలరేగిన సుడి దుండం వాళ్ళను లాక్కుపోతుంది.

చేతిలో ఆయుధమన్నా లేకుండా, తోణక్కుండా, బెణక్కుండా, నేరుగావచ్చి నిలిచిన ఆయన ధైర్య సాహస త్రివిక్రమం వాళ్ళను రాళ్ళుగా మార్చేసింది.

ఇక కమవశం కాదనుకున్నారు.

తమ తాబేదారులకు ఆర్డరేసాడు - రూథర్ ఫర్డు—

"ఊఁ! బాస్టియన్! బంధించు!" అని.

బాస్టియన్‌కు ప్రాణాలెగిరిపోయాయ్.

రాజుకు కోపమొచ్చింది.

"కుట్ర! కుటిలరాజనీతి. రాజీ మర్మం పెట్టి రప్పించి, నిరాయుధైన ప్రతికక్షిని బంధిస్తావా? నీచుడా?" అంటూ వురిమాడు.

గుడాల్ - ఒకడుగు వెనక్కి వేసి అన్నాడు—

"లేకపోతే దొరకవని! బందిపోటు దొంగవని!"

"ఏమన్నావ్? దేశదేశాల్ని కొల్లగొట్టే గజబందిపోట్లు మీరు. దేశం కాని దేశంలో పుట్టి, దేశం కాని దేశం మెట్టి, ధర్మపన్నాలు

చెప్పి దోచుకుతినే పయోముఖ విషకుంభాలు మీరు. జాగర్త! కొడితే ఏనుగు కుంభస్థలాన్నే కొట్టాలన్న జాతి బిడ్డడ్ని తాకారా!...? అంటూ పళ్ళు కొరికాడు, ఆ కొరికిన ధ్వనికి దిక్కులు పిక్కటిల్లేయ్. వాళ్ళ జీవాల్లో జెర్రులు! తేళ్ళు, పాములూ ప్రాకాయ్.

ఇక లాభం లేదనుకున్నారు. వెంటనే మిలటరినీ సమాయిత్తం చేసారు. ఫిరంగులను చుట్టూ పేర్పించారు. పశుబలం చుట్టు ముడుకోంది. అదంతా వాళ్ళు పైకి అనకుండానే ప్లాను ప్రకారం చేసేస్తున్నారు. రాజు గ్రహించాడు.

"హు! ఒకానొక స్వచ్ఛంద మానవుని, అరక్షణీయుని బంధించడానికి మిలటరి ఆర్భాట, హార్భాటాలు!"

"పారిపోతావు కాబట్టి!" అన్నాడు-దొర.

"నేనా? కుటిలుడా! ఎదుటపడితే పారిపోడం. చాటుపడితే చాతీ విరవడం నీలాంటి పిరికిజాతికే చెల్లింది. మా జాతటువంటిది కాదు"—

అభ్రంకష హిమన్న గాదులే ఢీకొన్న
మర ఫిరంగులై పేలు మాదుజాతి
ప్రళయుగ్రద భంగ పెన్నిధే పొంగిన
మండించు బడబాగ్ని మాదుజాతి.
ప్రచండ పవన తుఫానులే చెలగిన
మెరపు కత్తై దుళెళ్ళు మాదుజాతి,
కదనమున్నెత్తురు కాల్వలే పారినన్
మృగేంద్రములుగా పోరు మాదుజాతి!
శిరము నగ్ని కిరీటమున్ జేత నిశిత
కత్తియుందాల్చి, వైరుల నుత్తరించి
వినుతికెక్కిన బొబ్బిలి వెలమదొరలు
ఎవ్వరనుకుంటివి? తెలుగువారు గాక!" అని

బయట మిలటరీ మార్చయింది. 'Set back, Fire on!' అన్న రణగొణ ధ్వనులు మిన్ను ముట్టాయ్.

రాజులో ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లాయ్.

శివసముద్రం పొంగింది.

ఫెళ ఫెళా విజృంభించాడు.

"భీరుడా! రమ్మను శక్తుంటే కాల్చమను..." అంటూ. అలా చూస్తుండగానే. హనుమంతుడు మహాసముద్రాన్ని దాటినప్పుడు పెంచిన మహోగ్రరూపంలా, పెరిగిపోయి—

"రండి! మీ కళ్ళెదుటే పగిలే మహోష్ణ భీకర జ్వాలాజ్వలిత మహాగ్ని పర్వతాన్ని తట్టుకోగల శక్తుంటే కాల్చమను!

అంటూ ఎదురు తిరిగాడు.

కుప్పించాడు. భూమి వొణికింది.

"ధంధణా" ఫిరంగి మ్రోగింది.

"అబ్బ! అంటూ, గుండు దూసుకుపోయిన కడుపు పట్టుకొని. ఒక్కడుగు తూలి తమాయించుకుని నిల్చి - కళ్ళను అగ్ని కణాల్లా మండించి—

"కిరాతకులారా! నన్నొక్కడ్ని మీరు కాల్చొచ్చు, కాని రేపు ముక్కోటి సీతారామరాజులు, ఎన్నఖై కోట్ల కళ్ళతో మిమ్మి కాల్చి వేస్తారు. పగ సాధిస్తారు. రక్తానికి రక్తం, ప్రాణానికి ప్రాణం తీసుకొని తీరుతారు..."

మళ్ళీ ఓ శతఘ్ని ప్రేలింది.

"నేను చావనురా! మీ అంతాన్ని ప్రభోదిస్తూనే నా అంత రాత్మ నిరాకారమై తిరుగుతుంది. మీ గుండెల్ని లాగుతుంది..."

మళ్ళీ మళ్ళీ తుపాకులు, ఫిరంగులు, శతఘ్నులు రాక్షసుల్లా ఆవులించాయ్. ధంధణ ప్రేలేయ్.

"కాల్చండి! కాని... మీరు అచిరకాలంలోనే, మీ నాశనాన్ని చూస్తారు! భారతగడ్డనుండి సమూలంగా మిమ్మ తుడిచేస్తుంది - భారతజనం! అప్పుడు నా దేశం... నా.. మాతృభూమి స్వతంత్ర మవుతుంది..."

ఇక ఒక్కుమ్మడిగా, మూకుమ్మడిగా ।మోగాయ్. యముని దున్నపోతు యినుపగిట్టల చణంచణలు! భగ్గున మంటొచ్చింది.

"అమ్మా! అంటూ వొరిగిపోయాడా - ధర్మవీరుడు.

ఫెళ ఫెళార్భాటాలతో భువి దద్దరిల్లిపోయింది. ఆ మంట నభస్సు నంటింది. పక్షులు "కావు కావు" మంటూ మింట కెగసిపోయాయి. నీలకంఠేశ్వరుని గుడిలోని గంట గణ-గణా మ్రోగింది కొండ గుహలోని కాళికావిగ్రహం. భళ్ళున నేలపడి బ్రద్దలైపోయింది. మేఘాలు వురిమాయ్.

బ్రహ్మరాక్షసుల పొట్టను పడిపోయాడో అచ్చపు తెలుగుబిడ్డ.

ఆ బ్రహ్మరాక్షసులు అంతకు ముందుశేడే పలనాటి హనుమంతుని బలిగొన్నారు. ఇప్పుడో మాతృదేశ విముక్తికోసం, దారి పొడుగునా గుండె నెత్తురులు తర్పణచేసిన ఒక దేశభక్తుడ్ని పొట్ట పెట్టుకున్నారు.

ఈ దుర్మార్గుడే, యీ రాక్షసుడే, యీ రూథర్ ఫర్డు మరునాటి సంవత్సరం గంజాం కలక్టరుగా వెళ్ళి బరంపురంలో నడిబజారులో, మరొక్క ఆంధ్రరత్నాన్ని, దుగ్గిరాల గోపాలక్రిష్ణుని, రామదండు నడిపిన కర్మయోగిని అరెస్టుచేసి, జైలులోపెట్టి హింసించి చంపి వేసాడు-పాతకుడు.

ఆ కిరాతకుని కోరలకు మరొక్క. తెలుగుబిడ్డ హతమైపోయాడు.

ఆయన పడిపోయిన హస్తం - పిడికిలి బిగించి చెప్పింది - తరువాత బాధ్యత మీదేనని - ఆంధ్రదేశానికి.

రాజలా క్రిందపడగానే, ఆ నెత్తురు మడుగులోపడ్డ తన బాబును భూదేవి తన వొడిలోకి లాక్కొని, గాఢంగా హత్తుకుంది.

"బాబూ! యిక నీ మధురపలుకులు వినిపించవ్ నాన్నా?" అంటూ కరుణార్ద్రి చూపులతో తన బాబును ముద్దుపెట్టుకొంది.

అలా రాజు - తెలుగుతమ్ముల ముద్దుల అన్న "ఆంధ్రశ్రీ" నేల నొరిగిపోగానే, జ్వాజ్వల్యమానంగా ప్రకాశిస్తున్న ఓ శక్తి అంబర పథంలోని అశేష అమరవీరుల జ్యోతుల్లో కలిసిపోయింది. అవన్నీ కలిసి ఒక మహాజ్యోతిలా, పీడిత ప్రజాకోటి కాశాజ్యోతిలా, భావి భారత సౌభాగ్యాన్ని రూపురేఖలు దిద్దే నవయువకుల కది ఆదర్శ జ్యోతిలా ధగధగ లాడిపోయింది.

# 25

అప్పటికి చేరిందక్కడికి తల్లి "బాబూ! బాబూ!" అంటూ శింగన్న గోవిందు, రత్తి, ఆమె చిన్నబిడ్డడూ, భాస్కర్రావు. ఆ పీడితప్రజా అంతా వచ్చి చేరింది. ఇంకేముంది, ఇక మిగిలింది - బూడిద. ఆ తల్లి భోరుభోరున ఏడుస్తూ ఆ బూడిద ఎగురబోసింది, ఘొల్లున ఘొల్లున జనమంతా రోదించారు.

"గోవిందూ! మన రాటిక వల్లకాటిలో కలిసిపోయినట్టేనా?" అంటూ గుండెపగిలి, ఆ బూడిద కుప్పపై కుప్పగా కూలిపోయింది. రత్తి.

ఆమె బిడ్డడు 'కెవ్వు'మని ఏడ్చాడు.

శశీ రామంలకు ఆదృశ్యం చూపుతున్న శింగన్న కంఠం గతుక్కు మంది. తనూ మళ్ళీ అక్కడకు వచ్చినట్టుగా ముందు కదిలాడు. తన ప్రక్కనున్న శశినే, ఆ బూడిదరాసిపై కూలబడ్డ రత్తిగా భ్రమించి-జెబ్బ పట్టుకొని—

"పిచ్చిదానా! రాజొక్కడే కాదమ్మా! మరెందరో మహాను భావులు, మానవోత్తములు మట్టికలిసి పోయారిచ్చట—

"ఇచ్చోటనేగదా! వెచ్చటి కన్నీటి
కుండలై పేదల గుండెలెన్నొ;
ఇచ్చోటనే జాతి నుత్తేజపరచిన
యమృత కవి హృదయమ్ములెన్నొ;
ఇచ్చోట యానందవీచిక ల్దేలించి,
కోయిలారవముల్ గొంతులెన్నొ;
ఇచ్చోటనేగదా, యచ్చముగ నెమలులై
నాట్యమాడిన చరణమ్ము లెన్నొ
శశిర శశికాంతులే సోకి శాశ్వతముగ
చల్లబడి పోయెనమ్మ నీ వల్లకాట
బద్ధలై పోయె - తీయని బ్రతుకులెన్నొ;
కనికరము లేనిదీ కఠికాత్మురాలు!

అంటూ పలవరించింది.

కవి పడ్చాడు; తల్లి పడ్చింది; జనమేడ్చారు; శింగన్న రొమ్ము బాదుకున్నాడు,

ఆ వార్త విన్న ఆంధ్రదేశమే జలజలా కన్నీరు రాల్చి విలపించింది. ఆ రోజు ఏ యింటనూ అగ్గి వేసుకోలేదు. గుండెలు పట్టుకొని వాకిటలో కూర్చొని పడ్చారు - తెలుగు జనం!

జాతికి తండ్రిలాంటివాడే ఆ వార్త విని కంపించిపోయి, పత్రికలకు ప్రకటనిచ్చాడు - రామరాజు కుమారునిలాంటి ధైర్య సాహస పరాక్రమాల్ని కొనియాడాడు.

జవహర్ దేశభక్తుల మణిమకుటమన్నాడు.

బోసుబాబు దుఃఖించాడు—

"శ్రీరామరాజు యింకేదేశమందు పుట్టినా, యింతకన్నెక్కువగా స్వదేశమన్ననల నందుకుని వుండేవాడని!"

ఎవరు విలపిస్తే ఏం లాభం—

మన్యం ఋణం, రాజు ఋణం తీర్చేవారెవరు?

అందుకే శింగన్న అశ్రుపూరముల రాలుస్తూ ఆలపించాడు.

"వృథారా! మీ కన్నీటి ధారా!
"దేశ మనియెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తు" దాకా
వృథారా! కన్నీటి ధారా!" అంటూ.

ఆ రాజు ఋణం తీర్చుకున్న దొక్కతే ఒకామె, అదిగో! ఆమె. తన బిడ్డడికి "సీతారామరాజు" పేరు పెట్టుకుంది. ఆ బూడిదపై కుప్పలోని చిటికెడు భస్మం తీసి, తన ముద్దుబిడ్డ లలాట ఫలకానికి దిద్దింది.

"బాబూ!" సీతారామరాజు ఋణం తీర్చుకో!" అని.

అంతే.

చుట్టూవున్న వృక్షజాలమంతా అమృతబిందువులు రాల్చాయ్. ఆశీస్సులిస్తూ తమ వటదళ పత్రాలను రాల్చాయ్. ఆ అనాథులంతా అశ్రుపూరిత నయనాలతో శిరస్సులు మోడ్చారు.

ఆ చిత భస్మంనుండి, ఓ దివ్యనామం నీలకంఠేశ్వర గుడి గర్భంలోని జేగంటలతో ధ్వనించింది.

అదే "ఆంధ్రశ్రీ!"

సంపూర్ణం

— * —

